విజ్ఞాన చంద్రికా గ్రంథమాల—౧

# విమలాదేవి

రచన
శ్రీ భోగరాజు నారాయణమూర్తి

ప్రకాశకులు
కాళహస్తి తమ్మారావు అండ్ సన్సు
సంస్కృతాంధ్ర బుక్‌డిపో (స్థా.1882) రాజమండ్రి.

పునర్ముద్రణ
1 మే 1956
ముఖచిత్రం
శ్రీ వడ్డాది పాపయ్య
అచ్చు : : : : :
రాజేశ్వరి ప్రెస్.
రాజమంద్రి.

వెండి రేకువలెఁ జూచువారికిఁ గానిపించి యెన్నఁడును గరఁగకయుండు నట్టి విశాలమైన మంచుగడ్డలును, అరణ్యజనులు నివాసము లుండుటకై వందలకొలఁదిఁ గట్టుకొన్నిన యిండ్లతోడను, పసుల మందలతోడను, సస్యములతోడను శోభితములైన గొప్పగొప్ప భూభాగములును, ఆ పర్వతమం దెచ్చటం జూచినను విచ్చలవిడిఁ గానవచ్చు. చూచువారి కీ పర్వతరాజమే సమగ్రసృష్టి యనియు, ఇంతకు మేలు వస్తువులు మఱి యెందును లేవనియు దోఁపక మానదు.

హిందూదేశమున కుత్తరమున స్పష్టపడుచున్న 1500 మైళ్లు పొడవుగను ఆఱుమైళ్లు ఎత్తుగను మూఁడునూఱుమైళ్లుగను పెట్టఁబడిన బ్రహ్మాండతుల్యమైన యీ రాతిగోడకు నచ్చటచ్చట నాదేవుఁడే త్రోవలు పెట్టియుండని యెడల, దానిని దాఁటుటకు మనుష్యమాత్రులకే కాక దేవతలకుఁ గూడ సాధ్యమై యుండదు. హిందూదేశమున వాయువ్యమూలనున్న యీ పర్వతభాగమునకుఁ బెక్కు త్రోవలు గలవు. అందుత్తరమున కైబరను పేరుగలదియు, దక్షిణమున బోలన్ అను పేరుగలదియు ముఖ్యములు. ఈ రెండుత్రోవలకే కనుమలని పేరు. కైబరుకనుమ చరిత్రగ్రంథములయందు పలువిధముల ఖ్యాతిఁ జెందియున్నది. హిందూదేశమునుండి కాబూలు దేశమునకుఁ బోవుటకిది యొకత్రోవ. ఇది ముప్పదిమైళ్లకంటె నెక్కుడు పొడవుగలిగియున్నది. వాయవ్యపుఁ బొలిమేరపరగణాల (**North - West Frontier Provinces**) యొక్క రాజధానియగు పెషావరు పట్టణమునకు పశ్చిమమున పదిమైళ్లదూరములోనుండ నున్న జమ్రూదు అనుపట్టణము మొదలుకొని కాబూలు పట్టణమునకు సమీపమున నున్న జలాలాబాదను దుర్గము వఱకును ఈ కనుమ వ్యాపించియున్నది. ఈకనుమ నచ్చటచ్చట చిన్న గ్రామములును పల్లెలును గలవు. వానిలో జమ్రూదునకు పదిమైళ్ల దూరమున నున్న అలీమస్జిద్ దుర్గమును దానికి పదిమైళ్ల దూరమునుండి

కనుమలో నెక్కునలో నెక్కున యెత్తయిన లండీకోటాల్ అను గ్రామమును ముఖ్యమైనవి.

ఇరుప్రక్కల భయంకరములైన పర్వతములును, క్రూరమృగ సంకీర్ణములైన యరణ్యములును, పుష్య మాఘమాసములలో పొంగి ప్రవహించెడు సెలయేరులును, మేకలైనను చక్కగ నడచుటకు వీలులేని నిమ్నోన్నత శిలామయములగు త్రోవలును, ఆకనుమయందు నెక్కు లున్నందున బాటసారుల కామార్గమున నడచుట మిక్కిలి కష్టసాధ్యము. అట్లగుటచే నా పర్వతప్రాంతమునందు మానవ నివాస మెచ్చటను గాన రాదని మాత్రము మా చదువరులు తలంపరాదు. మానవబుద్ధికి సాధ్యముగాని స్థలమున్నదా ? ఇరుప్రక్కలను కొండల మీఁద మానవ నివాసమునకుఁ దగిన సమభూమి యున్నదున నారణ్య జను లచ్చటచ్చట గ్రామములను నిర్మించియున్నారు. ఇంతియకాక పశువులను సంపాదించి వ్యవసాయములను చేసికొనుచు కొండమీఁదను గూడ నెన్నియో ధాన్యములను పండించుచున్నారు. మెట్లుకట్టినట్లు ఒక కొండమీఁద నుఱియొక కొండయుండి యెచ్చట జను లచ్చట వ్యవసాయములు చేయుచున్నందున నా త్రోవనుబోవు క్రొత్తవాఁడు పంటలదినములలోఁదలయెత్తి కొండమీఁదికిఁ దనదృష్టి సారించెనేని, స్వర్గమునకుఁ బోవుటకుఁ బచ్చని తివాసీలతో శృంగారింపఁబడిన సోపానపరంపరలు సృష్టింపఁబడెనా యని ఫలవంతములైన ఆ సస్యములు వానికి సంశయము పుట్టింపక మానవు.

ఇట్లు సకలవిధముల నలరారు నా ఖైబరు కనుమనుండి నాఁడుద యమున బోవుచుండిన బాటసారి మాటిమాటికిఁ దనలో నిట్టూర్పులు కొన నారంభించెను. "అయ్యయ్యో ! ఏమి యీ యన్యాయము! ఇట్టి విపరీతము లెన్నఁడును కనివినియుండ లేదు.! ఎంతదారుణ మెంతదారు ణము! పసిపిల్లలను జంపవానికి చేతు లెట్లువచ్చెను? మహమ్మదీయులైన నేమి హిందువులైననేమి?ఎవ్వరికైనను మంచైనను దయాదాక్షిణ్యములు

ఇట్లు ఆ ముసలిబాటసారి గడగడవ[illegible] యొక్క- మహాత్మునకు
[illegible]గియుం గట్టుకొని చలివలన బాధపడుచు కొనారాతనికి నమస్కరించిరి.
గ[illegible] కొన్ని బిగ్గరగను అనుకొనుచుం బోవుచుం ఇక్కలి పెద్దమనుష్యుల
చలెనుగదా! అలప్పిూరు
[illegible]ప్పది సంవత్సరములుండిన నుండవచ్చును. చే[illegible]సిగే యున్నాసను
న[illegible] తలచుట్టును జుట్టుకొనిన వస్త్రములోనుం[illegible] [illegible]ంప నలయు
[illegible] నొకకుచ్చుతోం గాన్పించుచున్న పొడుగుపాటి [illegible] నెలప్రచీటి
యును, తెల్లగ నున్న మూరెడుగడ్డమును, కంఠమునంగల [illegible]
ప్రాసలును, మెడ మొదలుకొని పాదములవఱకు వ్యాపించియున్న
నీమ్మాజామా యను నంగరఖాయును, తెల్లని పాయిజమాయును,
పాదములకుం దొడిగిన డిల్లీపాపూసులును, నడుమనడుమ నుగ్గడించు
“అల్లా! యాఖుదా!” యను నామస్మరణములు జూడ నాతండు
మతాభిమానము గల మహమ్మదీయుండని చెప్పవలసియున్నది.
అప్పుడప్పు డాతండు సంస్కృత శ్లోకములు గూడం జదువుచుండినందున
హిందువేమో యని సంశయము గలుగుచున్నది. కాని, ఆకాలమందు
మహమ్మదీయులు కొందఱు సంస్కృతము నేర్చుకొనుచుండిరి. అక్బరు
చక్రవర్తికాలమందు “అబుల్ ఫైజీ” యనువాండు సంస్కృతమందు
పాండిత్యము సంపాదించి యనేక కావ్యములు రచియించెనని మనము
వినియుండలేదా? ఈతండును అట్టివానివలెనే కనంబడుచున్నవాండు.
పాప మా వృద్ధుండు చలి నాపుకొనుటకై తనయంగరఖాలోపల
వెచ్చని యంగీ లనేకములు తొడిగియుండెను. కాని హిమాలయము
లోని చలికాదుస్తు లోకలెక్కయా? అందుచే నడుమనడుమ నాతండు
విసిగికొనుచు “అయినను చూచెదంగాక. నేనే గెలిచెదనో చలియే
గెలుచునో? ఈ చలి నన్ను ముసలివాండని యనుకొనుచున్నది
కాంబోలు! ప్రాణము పోయినను సరే! అంగీకృతకార్యము చేయక
మరలుదునా? రాజభక్తిని మించిన కార్యముగలదా! ఆహా!

వారికి వినఁబడుచున్నందున నాతఁడెవఁడో యొక్క మహాత్ముఁడనియు, నసామాన్యపండితుఁడనియు నెంచి వారాతనికి నమస్కరించిరి. పిదప వారిలో నొకఁడు "స్వామీ ! మీరు మిక్కిలి పెద్దమనుష్యుల వలె నున్నారు. అయినను మాపని మేము చేయవలెనుగదా! ఆలమ్గీరు పాదుషాహాగారి యాజ్ఞ ప్రకారము సెలవుచీటి లేనిదే యెవ్వరును నీత్రోవను పోఁగూడదు. అట్లు పోవువారిని కఠినముగ శిక్షింప వలయునని మాకు పాదుషాహాగారి యుత్తరవుగలదు. మీయొద్ద సెలవుచీటి యున్నదా ? ఉన్నయెడలఁ జూపుఁడు. లేనియెడలఁ దిరిగి పొండు. మీరు సర్వమును దెలిసిన ముసల్మానులు గావున మిమ్ము బాధింప నొల్లము. కఠినముగాఁ బల్కినందులకు క్షమింపుఁడు" అని గట్టిగ నొక్కి చెప్ప మనబాటసారి తనయొద్దనున్న సెలవుచీటిదీసి విప్పి వారికిఁ జూపి "అరే ! బచ్చా ! నీవా నాముసలిగడ్డమునకు రాజభక్తి నేర్పెదవు ? రాజభక్తియందు పుట్టి, రాజభక్తియందే పెరిగ కడకు రాజభక్తియందే యీ నల్లగడ్డము తెల్లఁబడ్డది. ఆలమ్గీరుపాదుషాహా యన్నను, అల్లాయన్నను భేదముగలదా ? ఒకవేళ నల్లాయాజ్ఞను మీరినను మీరవచ్చునుగాని పాదుషాహా యాజ్ఞను మీరవచ్చునా ? మీరు మొన్న మొన్న పుట్టిన పిల్లకాయలు. నేను ఆలమ్గీరుపాదుషాహా యను బిరుదు గల యౌరంగజేబునే కాదు, అతని తండ్రి షాహజహానును, తాత యగు జహంగీరును గూడజూచితిని. పాదుషాహా యన్న జహంగీరు పాదుషాహాయే పాదుషాహా ! నేను నడివయస్సులో నుండినప్పుడు సైన్యములలో సుబేదారుగ నుండిదక్కనునకు, చాందు బీబీపైకి యుద్ధమున కేగియుంటిని. అక్కడ దేవఘుడ్ యుద్ధములో నాయిష్టము వచ్చినట్లు కాఫరులను ఖత్తల్ చేసినాను. అబ్బా జ్ఞాపకము వచ్చిన భయము పుట్టును. ఎంతటి యన్యాయమైన యాఁడుది యా చాందుబీబీ ! ఆ యుద్ధములో గెలిచి వచ్చినందులకు పాదుషాహా బంగారుపు పిడి వేసిన కత్తి తనచేతితో నాకు బహుమాన మిచ్చినాఁడు"

అని అంగీలోపల జేబుల నిమిడ్చిన కత్తిపైకిఁ దీసి వారికిఁ జూపెను. కాని యా రాజభటు లితఁడు చెప్పు వాని మాటలాలకించుచు సంతోషించుచుండిరే కాని, అక్బరుకాలములో నుండిన చాందుబీబీ జహాంగీరు కాలములోని దెట్లగునో యని యోచింపఁ జాలకుండిరి. ఇంతియ కాక మన భాటసారి యెన్నెన్నియో పూర్వకాలపుఁ గథలను జెప్పి "నాకాలమంతయుఁ గడచి పోయినది. భార్యాపుత్త్రులు గతించిరి. ఇఁక నాకు అల్లా తప్ప మరి యెవ్వరును లేరు. మన యిస్లామ్మతము నభివృద్ధి చేసిన పైగంబరుల గోరీలన్నియు దర్శించుటకై పోవుచున్నాను. లక్షల కొలఁది కాఫరులను ఖతల్ చేసినాఁడను. ఘుజనీమహమ్మదు యొక్క గోరీ చూచుటకై గజినీ పట్టణమునకుఁ బోవుచున్నాను. పాదుషాహా యాజ్ఞ నాకుఁ దెలిసియే నేను స్వయముగఁ బోయి యాతని యొద్దనుండి సెలవుచీటి తీసికొని వచ్చినాఁడను" అని పలికెను.

పాసు వృత్తాంతమును, పూర్వవృత్తాంతము ననియు యాతఁడు చెప్పిన చిత్ర విచిత్రములైన కథానకములను విని, యాశ్చర్యమగ్న మానసులై, యతఁడొక యద్వితీయ పురుషుఁ డని యెంచి వంగి సలాములు చేసి సెలవుచీటి యడిగినందులకు తమ్ము మన్నింపుమని వేఁడుకొనిరి. అంత నాతఁడు వారు తనకు సంపూర్ణముగ వశులైరని తలంచి "బేటా ! మీపని మీరు చేసితిరి. అందు తప్పేమున్నది ?" అని పలికెను. ఇట్లు ఆ భాటసారి వారితోఁ బలువిధములగు మాటలాడుచున్నను, అతనిదృష్టి వారికిఁ దెలియకుండ నేక పర్యాయములు, ఆ రాజభటులు వెంటఁబెట్టుకొని వచ్చిన పురుషునిపైఁ బోవుచు నాతఁ డెవఁడా యని సూక్ష్మముగఁ బరీక్షించుచున్నట్లుండెను. కొంతసేపటి కా భాటసారి,

"ఈ పురుషుఁ డెవఁడు ? వీఁడు కాఫరువలె నున్నాఁడే !

"వీఁడెవఁడో మాకుఁ దెలియదు. కాని పాదుషాహాగారికిఁగుట్టు లన్నియుఁ దీసికొని పోయి, ప్రస్తుతము కాబూలు నైపున నున్న యశోవంతసింహునకుఁ జెప్పఁ బోవుచున్నాఁడు. సెలవుచీటి లేకుండ వీఁడేగుండెతో నీత్రోవను బోవుచున్నాఁడో ?"

"అట్లా ? దుర్మార్గుఁడు. దుర్మార్గుఁడు. వీని కేమిశిక్ష విధించినను బాపములేదు. రాజద్రోహికి ఖురాన్‌లోఁ గఠినశిక్ష విధింపుమని యున్నది. సరే ! మీరీతని నేమి చేయఁ దలంచితిరి ?"

"పాదుషాహాయెదుటకు వీనిని గొనిపోయెదము. ఆపయిన వీనిని ఖండ ఖండములుగఁ గోయించి యాతఁడే గ్రద్దలకు వేయించును."

"అహాహాహాహా."

అనినవ్వి బాటసారి నవ్వుముఖమును వెంటనే మార్చుకొని గంభీరమైన యాలోచన చేసి తనచుట్టును కొంతదూరము వఱకు నిరీక్షించి చూచి తలయూఁపెను. ఇదంతయు నాతఁడా రాజభటులకుఁ దెలియకుండఁగనే చేసెను.

అంతట నా బాటసారి యొకచెట్టు నీడను దాను గూర్చుండి వారి నందఱను గూర్చుండ నియమించి కొంతసేపటికి వారిని జూచి "పాపము మీరిరువురు నలసి నట్లున్నారే ! మీ మొగములు కసువాడి యున్నవి. కావున, నీ సమీపముననే యొక తాటిచెట్టుగలదు, దాని కల్లు ద్రాగిన నమృతమైన నంతరుచిగలదిగాదా. మీవలెఁ గష్టఁబడలి నందున నేనుగూడ నిప్పుడే త్రాగి వచ్చితిని. ఆహా ! దాని మాధుర్య మెంతయని కొనియాడఁ గలను? త్రాగినంతమాత్రమున నాకెక్కుడలేని బలమును హెచ్చరికయుఁ గలిగి నాయాయాసమంతయు తగ్గిపోయెను. వలయునేని నే నొక పాత్ర మీకిచ్చెదను. కడుపునిండ నింత కల్లు త్రాగి రండు. పిదప మాటలాడుకొందము. నేను వృద్ధుఁడనయ్యు

నితరుల కుపకారము చేయవలయు ననియే కోరుచుందును. పోనిమ్ము. ఈ ప్రయాస గూడ మీకేల కలిగింపవలయు? నేనే కొనివచ్చి మీకిచ్చెదను. అంతవఱకు మీరింపుండుడు" అని చెప్పి తనభుజము నకుఁ దగిలించుకొనిన మూటలోని చెంబుదీసి బావినుండి నింతనీళ్లు గొనివచ్చి వారిరువురకుఁ బట్టెను. కడుపార నాకళ్లు ద్రాగి యామహమ్మదీయు లిరువురును గొంతసేపటికి చిలుక పలుకులవలె పలుకసాగిరి. పిమ్మట బకధ్యానము సేయుచు దప్పవాల్పక మాటాడఁదొడఁగిరి. క్రమక్రమముగా వారిరువురు కుంభకర్ణునిపాత్రఁ దగ్గికొని భూమిపైఁబడి గాఢనిద్ర నవహించిరి. అప్పుడు బాటసారి ఆపురుషుని యొద్దకుఁబోయి వాని వెన్నుపై చఱచుచు "అచ్చా! భయము లేదు, భయములేదు" అని వాని రెండుచేతులును విప్పెను. ఆ పురుషుడు తోడనే యమందానంద మొంది:

"అయ్యా! నీవు నాపాలిదైవమువలె నున్నావు. ఈదుర్మార్గులు నన్నుఁబట్టి బంధించి బాధింప సాగిరి. నీయనుగ్రహముండిన నేడు నాప్రాణములు దక్కనచ్చెను. నీవు మహమ్మదీయ వంశములోఁ బుట్టఁదగినవాఁడవుకావు."

"బాబా భయపడకుము. నీవెవ్వఁడవు? ఎచ్చటికిఁ బోవుచున్నావో చెప్పుము."

అని యడిగెను. కాని యాపురుషుఁడు మొగము వ్రేలవైచి తనలో నేమేమో దీర్ఘాలోచనము సేయఁ దొడఁగెను. ఇదంతయు నా బాటసారి కనిపట్టి చిఱునవ్వు నవ్వుచు అరే బాబా! నీకెంత భీతియున్నది? అని, ఇటునటుఁ జూచి రహస్యముగ వాని చెవిలో నేమేమో చెప్పెను. ఆ మాటలు విన్నతోడనే యాపురుషుఁడు

సంతోషాతిశయమున నిర్ఘాంతపడి వాని యాకార మెల్ల నా పాద మస్తకముఁ జూడ నారంభించెను. పిదప నా బాటసారి,

"ఇంక నాలస్యము చేయక ఆ యుత్తరము నాకిమ్ము. వీరిరువురును లేచిన నిన్ను విడువరుసుమా; జాగ్రత్త - నేనిప్పుడు కాబూలునకే పోవుచున్నాను. అప్పుడు యశవంతసింహున కీ యుత్తర మిచ్చెదను!"

అని పలికెను. వెంటనే యాతఁడు తనయొద్దనున్న యుత్తరము దీసి వానికిచ్చి సెలవుగైకొని తనదారిని బోయెను. పిదప మన బాట సారియు నుత్తరము తన జేబులోనుంచుకొని నేలపైఁ బడియున్న పాత్ర తనమూటలోఁ గట్టుకొని పరుగుపరుగునఁ బోవసాగెను.

# రెండవ ప్రకరణము

## విజయసింహుఁడు—విమల

"తండ్రీ! ఆడుదానను విశేషించి చిన్నదానను నగు నేను మీమాట్ల కెదురాడఁజాలను గాని యుక్తాయుక్తములు మీరే విచారించి మా యన్నను రక్షింపవలయును."

"అమ్మాయీ! విమలా! నే నెన్ని మారులు బోధించినను వినక ఆ దుర్మార్గుఁడు శివసింగు మేరమీరి నాయాజ్ఞ నుల్లంఘించుటచే వానికి ఈ శిక్ష విధించితిని. ఎందఱు చెప్పినను వినక రాజపుత్రులకు విరోధియైన యౌరంగజేబును సేవించుచున్న యశవంతసింహునితోఁ గలసి తా నేల యుద్ధములకుఁ దగుదునని బయలుదేఱవలయును? నా మాటయందు వాని కింత నిర్లక్ష్యమా?"

"నాన్నగారూ! మీ రాగ్రహ మొందిన నేను మాఱు పలుకఁజాలను గాని అది నిర్లక్ష్యత యెంతమాత్రమును గాదుసుండీ! నాటి సంబంధముచే కాక యశ్వంత సింహుఁడు మనకు దగ్గఱిచుట్టమే కదా? ఆ కారణమున వానియెడలఁ గల చనవు చేతను, యుద్ధమునందు మా యన్నకు నిరుపమాన పాండిత్యముండుట చేతను, ఉత్సాహము కొలఁదిఁ దానుఁ గూడ బయలుదేఱెను గాని యింతమాత్రమున మీ రన్యథా తలంచి వానిని పట్టణములోనికి రానీయకుండ శిక్ష విధించుట కేవలము న్యాయము గాదు. కావున నన్ను మన్నించి మా యన్నగారిని మరల కాబూలులో యశవంతసింహుని వద్దనుండి రక్షింపుఁడు ఇదియే నా ప్రార్థనము."

"విమలా ! నీ మాట లింక గట్టిపెట్టుము. క్షత్రియధర్మమును విడిచి తురకలకు విధేయుఁడై చరించువాఁడెంతటి దగ్గఱ చుట్టమైన నేమి ? ఈ కారణముననే కదా యిదివఱకును యశవంతసింహుఁడన్న రాజలోకమంతయు నించుక యసూయఁ జూపుచుండును ? వలదు అని యెంత బ్రతిమాలినను వినక మాటిమాటికి శివసింగు అతనినే చేరి యుద్ధమునకు బయలుదేఱుచుండును. యుద్ధమునఁ దన కెంత కౌశల్య ముండినను, ఇంతమాత్ర మాలోచింప నలదా ? చిన్ననాఁట నుండియు మీ యిరువురకును సమముగా బాణవిద్య నేర్పించితిని. ఇందు నీవుమాత్ర మాతనికిఁ దక్కువ యగుదువా ! ఘోరారణ్యము లకు వేఁటకు నీవు గూడ నాతో బయలుదేఱి నీ బాణ విద్యాప్రభావము వెల్లడి యగునట్లు భయంకరఘాతుకమృగముల నీ వెన్నిమాఁగులు వధింపలేదు ? ఈ కారణముననే కదా మనరాజపుత్రస్థానమునం దంతటను నీ పేరు వ్యాపించినది. రాజులందఱకు నీపై మెండుగ నభిమాన ముండుటకుఁ గూడ నిదియే కదా కారణము ? అట్టి దుర్మార్గుఁడు చెంత నుండినంతవరకును, సాటి రాజులచే గౌరవమొందుచున్న యీ విజయసింహుఁ డపఖ్యాతిఁ జెందఁడా ? అందుచేత నీ కన్న కుమారుఁడైనను పాటింపక వానిని విడిచితిని. "

"నాన్నగారూ ! ఇంతమాత్రమున మీ గౌరవంబునకుఁ గోరంతయుఁ గొఱంత గలుగదు. తనయులు తప్పు చేసిన తలిదండ్రులు క్షమింపవలయును గదా ? మా తల్లి గతించి నప్పటినుండియు నా కొఱంత లేకుండ మీ రెన్నివిధముల మమ్ముఁ బెంచు చుండ లేదు ? ఒకొక్కప్పుడు సాయంకాలమున నేను మా యన్నయు బాణపాణులమై వినోదార్థము పందెములువేసి యాడుకొను చుండఁగా మీ రచ్చటికి వచ్చి మా మాటలకు సంతోషమొంది మాలో నొకొక్కరిని చేరఁ బిలిచి "నాయనా ! శివసింగూ ! ఆ దూరమున నున్న రసాలవృక్షమున శిఖరమునఁ గల ఫలమును బడఁగొట్టఁ గలవా ? అట్లైన నీకు

నాలుగు వరహాల బహుమానమిచ్చెదను" అని హెచ్చరింప, మా యన్న తత్‌క్షణము తన విద్య గనఁబఱుచుచు రసాలఫలమును బడనేసి మీ వలన మన్ననఁ బొందలేదా! అట్టి పుత్రునిపై ప్రేమ యంతయు నేమాయెను? ఇంతటి చిన్న తప్పిదమున కింతటిశిక్ష తగునా?"

"విమలా! సరి సరి! వాని చేఁతలన్నియుఁ గొనియాడి నంత మాత్రమున సమ్మతించుట కింతటి ప్రయోజనములు నాకు లేకపోలేదు. మీ రిరువురును గలసి యాడుకొనువేళల నిన్నుమాత్రము నే నెన్ని మారులు పరీక్షింపలేదు? తురంగము నధివసించి వలయాకారముగ నా హయము వాయువేగమునఁ బరుఁగిడుచుండ నీ బాణములచేత నేను పెట్టిన గుఱుతుల నీవు పత్రము గూల్పలేదా? తనకు విద్య యున్నదని దుష్టమార్గమున వినియోగింప వచ్చునా? ఇదిగాక నాకు క్రమక్రమముగా వృద్ధత్వము చేకూఱుచున్నది. శిరోజములు పండి పోయినవి. దేహమంతయు ముడుతలు పడుచున్నది. ఇట్టి సమయమున నిరువదియేండ్ల ప్రాయము గల్గి రాజ్యాభిషేకమునకు సమర్థుఁడగు కుమారునితో వైరమేటి కని యెంతో దూరగ మాలోచించితిని గాని యందువలన నేమియుఁ గార్యము లేకపోయెను. నాకింక కుమారుఁడును కుమారికయు నీవే! నాయనంతరమున రాజ్యమంతయు నీవే భరించెదవు"

అని విజయసింహుఁ డోకనాఁడు తన ముద్దుగూఁతురగు విమలా దేవితో సంభాషించుచుండెను. ఆతఁడు ధర్మపరుఁడై రాజపుత్ర స్థానమునఁ గల సామంత రాజధానులలోనిదగు రూపనగరమును పాలించుచుండెను. రాజ్యకార్య నిర్వాహణకౌశలంబునను శేముషీవిశే షంబునను ఆతనికి సమానులు లేరు. క్షత్రియ ధర్మాచరణమునందు వాని పూనిక మిక్కిలి వర్ణనీయము. వాని గుణగౌరవంబు లెల్ల వారల కర్ణంబులనిండ్లు గట్టుకొని కాఁపుర ముండుటం జేసి, యందఱకన్నను చిన్న సంస్థానమున కధిపతియై యుండియు రాజులెల్లరు వాని యెడల విధేయులై

మన్ననఁ జూపుచుండెడివారు. ప్రాయమునందే కాక యారాజవీరుఁడు శాస్త్రావలోకమునందును యుక్తాయుక్తవివేచనయందును గూడఁ గడు వృద్ధుఁడు. విజయసింహుఁడు కొంతకాల మనపత్యుఁడై యుండి కడకొక పుత్రుని పుత్రికను బడసెను కాని తనబిడ్డలిరువురును బాల్యమున నుండఁగనే వానియిల్లాలు పరలోకగతు రాలయ్యెను. నాఁటనుండియుఁ దనపిల్లల గారాబమునఁ బెంచుచు, తల్లియుఁ దండ్రియు దానయై యెల్ల విద్యల నేర్పుచుండెను.

కుమారుఁడగు శివసింగును కుమారిత యగు విమలయు, తమ సాటివారల ధిక్కరించుచు బాణవిద్యయు, రథగజతురగారోహణంబు లును నాదిగాఁగల పెక్కు విద్యల నభ్యసించి జనకునకుఁ బ్రమోద దాయకులై కాలము గడుపుచుండిరి. శివసింగు బాణవిద్యయందు నిరుపమాన కౌశల్యము సంపాదించినవాఁ డగుటచేతను, సహజశౌర్య ధైర్యాలంకృతుం డగుటచేతను శత్రువులతోఁ బోరుట యన్న వానికొక విందుగ నుండెను. తనకుఁ గల నుత్సాహమంతయుఁ దీర సమరరంగమున నరాతివీరవారమును నోడించి తన నిరుపమాన భుజాప్రావీణ్యమును లోకంబున వెల్లడించు కాల మేనాఁటికైనఁ జేకూరునేమో యని యాతఁ డెదురు చూచుచుండెను కానియాతని కట్టి యవకాశ మెంతమాత్రమును జిక్కలేదు. అయినను నిందులకుఁ గారణము లేకపోలేదు. ఆకాలమున రాజపుత్రవంశజులకుశత్రువులు మహమ్మదీయులు గాక వేఱెవ్వరుకలరు ? కాని భీతచిత్తులై కొందఱు నృపాలురు మహమ్మదీయ ప్రభువైన ఔరంగజేబునకు విధేయులై యుండుటచేతను స్వబలంబుకన్న పరబలము మితి మీఱి యుండుట చేతను, మనశివసింగు తన పరాక్రమమంతయు నొకమూల నుంప వలసి వచ్చెను. కానియెంతోకాల మాతఁ డట్లుండ లేదు. ఔరంగజేబునకు సామంతులలో నొకఁడగు జోధపుర నాధుఁడు యశవంతసింహుఁడు

పరాక్రమశాలియై పాదుషా సెలవుప్రకారము తఱుచుగ దిగ్విజయమునకు బయలుదేఱుచుండెను. ఆతఁడు తనకు బంధువుఁడైనందున శివసింగప్పుడప్పుడు యశవంతసింహునితోఁ దానుఁ గూడఁ గలసి దండయాత్రలకై బయలుదేఱుచుండెడివాఁడు. యశవంతసింహుఁడు క్షత్రియవీరుఁడయ్యు, ఔరంగజేబునకు విధేయుఁడై వానిని సేవించుచుండుటచే రాజులందఱకు నసహ్యకరుఁడయ్యెను. కావున వానితోఁ గలసి మెలఁగుచుండఁదగదని సార్థకనాముఁడగు విజయసింహుఁడు తన కుమారుని పలుమాఱు వారించెను. కాని శివసింగుని రణోత్సాహము తండ్రిమాటలఁ బాటింప నీయలేదు. కడకు విజయసింహుఁడు కుమారునిపై నమితాగ్రహమొంది ఔరంగజేబునకు దాసుఁడైన యశవంతసింహునిఁ గూడి యుండుట తన కెంతమాత్రమును సమ్మతము కాదనియు, సందు మూలమున క్షత్రియధర్మమునకుఁ గళంకము వచ్చుననియు, తనకుమారుఁడు పాదుషాకు దాసానుదాసుఁడగుచుండెననియుఁ దలంచి శివసింగును రూపనగరమందు కాలు పెట్టనీయకుండ కఠిన దండన విధించెను. అప్పటినుండియు శివసింగు యశవంత సింహునిఁ గొల్చుచు వానికిఁ గుడిభుజమై యనేకయుద్ధములలో సహాయపరుఁడై తనచతురవర్తనమునఁ గొన్నాళ్లకు ఆరావళీ పర్వతప్రాంత నివాసులగు భిల్లులకెల్ల నాయకుఁడై కాలము గడుపుచుండెను.

తరుణీమరణంబును తనయ వియోగంబును, తనకు విచారదాయకంబులయ్యు నారాజవీరుఁడు ధైర్యయుతుఁడు గాన, రాకుమారుఁడును, కుమారితయు, తనకు విమలయే యొక కూఁతును పెంచుకొనుచుండెను. అతిప్రేమచేత క్షణమైనను దానిని విడఁబోయలేక తా నెచ్చటికైనఁ బోవునెడ క్షత్రియోచితధర్మంబగు ఘోషా నవలంబించక విమలను గూడ వెంటఁ బెట్టుకొనియే పోవుచుండెను. ఇంతియకాక ఒకరాజవీరున కామె నిచ్చి వివాహముజేసి యల్లునిఁ గూఁతును గూడఁ దనయింటనే యుంచుకొన వలయు నని యాతఁడు నిశ్చయించుకొనెను.

తన తదనంతరమున రాజ్యమంతయుఁ దన కూఁతునకుఁ బట్టము కట్టవలయుననియే వాని యభిప్రాయము. తానొక చిన్న సంస్థానమునకు రాజయ్యు విజయసింహుఁడు తనకన్న గొప్ప సంస్థానాధిపతుల గౌరవమునకుఁ బాత్రుఁడయ్యెను. ఆకాలంబున రాజులకెల్ల మేటియు నుదయపుర నాధుండును నగు రాజసింహుఁడు, తనకన్న స్వల్పసంస్థానాధిపుఁడని యెన్నక అందఱికన్న నెక్కుడుగ విజయసింహునితో మైత్రిఁ జేసి వాని ననేకవిధములఁ గొనియాడుచుండెను.

సుగుణాలయ యగు విమలయు మాతృసోదరవియోగదుఃఖము కొంతవఱకు నివారించుకొని నిరంతరము సత్కాలక్షేప మొనరించుచుండెను. ఆమె చిన్నప్పటినుండియు, తన యన్నతోపాటు పెక్కు విద్యల నభ్యసించి శాస్త్రజ్ఞానము గలిగినదయ్యెను. ఒక్కొక్కప్పుడామె తనతండ్రితోఁగూడ కొల్వుకూటమున కేగి యాతఁడు విచారింపవలసిన రాజ్యాంగవిషయములను తానే చర్చించి న్యాయాన్యాయముల చక్కఁగ వేఱు పఱుచుచుండెను. ఆమె బుద్ధి చాతుర్యమున కెల్లవారు ముక్కుపై వ్రేలిడికొని యాశ్చర్యస్వాంతు లగుచుండిరి. మఱియు నామె తనతండ్రితోఁగూడ వేటకై బయలుదేఱి అనేక మృగములను వధించుచుండఁజూచి విజయసింహుఁ డమందానంద మొందుచుండెను. తన చెలిమికత్తియ లగు కుందపద్మలతో నాకన్యకామణి పూలతోఁటల యందు విహరించుచు నప్పుడప్పుడు వారికి ముచ్చటలగు కథలుగా మతాచారములును, అప్పటి దేశదుఃస్థితులును, క్షత్రియధర్మమును నాదిగ నెన్నియో బోధించుచు పూర్వుల సచ్చరిత్రలు తార్కాణంబులు సేయుచు కాలము గడుపుచుండెను. ఇంతియకాక తనచెలులకు భారతభాగవతాది మహాపురాణములుపఠించి అర్థము చెప్పుచుండెను. చతురంగబలంబులు నడుపును చదరంగమాడు వేళ నెదుటనున్న వా[illegible] [illegible]డించి [illegible]మామెయే జ[illegible] [illegible]చుండెను. ఒక్కొక్క[illegible]

తన ప్రాణసఖి యగు పద్మను గూడి యశ్వముపైఁ గూర్చుండి యిరువురును పందెములవేసి తమ గుఱ్ఱములఁ బరుగెత్తించుచుండిరి. పద్మకుఁగూడ నశ్వారోహణమున మిక్కిలి నేర్పు గల్గి యుండెను.

ఇట్లుండ, పాపము ! తనసోదరుఁడు తండ్రితో జగడమాడిపోయి నప్పటినుండియు నామె హృదయపద్మ మించుక వాడియుండుట నిజము. ఆమె నిరక్షరకుక్షి గాక పెక్కువిద్యల నభ్యసించిన దగుటచే తన యన్నయగు శివసింగుయొక్క పరాక్రమాతిశయంబులు గ్రహించి యాతఁడు జగదేకవీరుఁడై క్షత్రియవంశమెల్ల నుద్ధరింపఁ గల నేటి మగఁడగు నని వానియెడల ననురాగము వహించి మెలఁగుచుండెను. ఆమెకు జననీమరణము కన్న సోదరవియోగమే యామె హృదయమును బాధింపఁ జొచ్చెను. ఇంతియకాక ఆమె విచారమున కింకొక కారణము గూడ గలదు. తన చెలికత్తె లిరువురిలో పద్మ తనకు మేనత్త కుమార్తె. చిన్నప్పుడే పద్మ తలిదండ్రులు పరలోకగతులగుటచే విజయసింహుఁ డామెను గొనివచ్చి తనయింటనే యుంచుకొని ప్రేమతోఁ బెంచుచుండెను. విమలయు, పద్మయు నాఁటనుండి కడు మైత్రి వహించి క్షణమైన నిరువురు నెడఁబాసి యుండక యొండొరులపై యనురాగముఁ జూపుచు మెలఁగుచుండుటచేఁ గొంతకాలమునకు శరీరములు వేర్వేఱుగ నుండినను హృదయములు మాత్ర మొక్కటిగ నేకీభవించెను. అట్టి తన ప్రాణసమానురాలగు పద్మకును శివసింగునకును నెట్టులైనఁ బెండ్లి చేయింపవలెనని ఆమెయెంతో మక్కువ గల్గియుండెను. ఆకారణమున శివసింగు వెడలి పోయినప్పటినుండియు నామె విచారము మఱింత బలమైనది. అప్పుడప్పుడు తనయన్నను క్షమించి రప్పింపవలయు నని విజయసింహు నామె వేడుకొనుచుండెను గాని అందువలన కార్యము లేక పోయెను.

ఆనాఁ డట్లు విమల విజయసింహునితో శివసింగు విషయము ప్రసంగించుచుండ నొక చారుఁ డరుదెంచి " దేవా ! [illegible]పకదర్శనార్థమై

మన నగరద్వారమున నొక మహమ్మదీయుఁడు ఢిల్లీ నగరమునుండి వచ్చి వేచియున్నాఁడు" అని వినయపూర్వకముగ వచియింప నన్నేల జేఁసు తత్క్షణము వానిని లోనికిఁ బంపుమని యాజ్ఞాపించి పంపెను. ఢిల్లీనగరమునుండి మహమ్మదీయుఁడు వచ్చె నన్న మాట విన్నతోడనే వాని చిత్తమనేకవిధముల నాలోచింపఁదొడంగెను. కాని కారణము మాత్ర మగ్రాహ్య మయ్యెను. ఇంతలో నానూతనపురుషుఁ డరుదెంచి విజయసింహునకు నమస్కరించి, తన చొక్కాయ జేబులో నున్న యొక యుత్తరమును దీసి వానిచేతి కందిచ్చెను. ఆందోళన మధికమగుటచే నా విజయసింహుఁడు తటాలున నాయుత్తరము విప్పి కడముట్టఁ జదివి కన్నులనుండి దుఃఖాబాష్పములఁ గార్చుచు నొక్కింత తడవు మాటాడ లేక నిశ్శ్వసితుఁడై యూరకుండెను. వాని వికారములన్నియుఁ జూచుచున్న మహమ్మదీయుఁడు "రాజేంద్రా! విచారించిన నేమి కార్యమున్నది? ఈ తురకలవలన మనకింక నెట్టికష్టములున్నవో తెలియదు. ఈ ఘోరకృత్యము జరిగిన మఱునాఁడే తమ మిత్రుఁడగు జ్యేష్ఠమల్లు నన్నుఁ బిలిచి యీయుత్తరము వ్రాసి తమ కిమ్మని పంపెను.

ఉత్తమబ్రాహ్మణుఁడ నయ్యు మహమ్మదీయులు మార్గమధ్యమున నేమిచేసెదరో యని యిట్లు తురకవానివలె వేషము వేసికొని బయలుదేఱినాఁడ. అప్పటికి నన్ను విడువక నడిత్రోవలో నెన్నియో బాధలు పెట్టిరి. వాని నన్నిటిని సహించి యిచ్చటికి వచ్చి గండము గడచితిని" అని పలికి నంతనే విజయసింహుఁడు నిరర్థకమైన దుఃఖమ్మును బాసి సహజమైన పౌరుషము వహించెను. తన తండ్రి చేష్టలన్నియుఁ గనిపెట్టి, మాయావేషధరుఁడైన యా బ్రాహ్మణునిపలుకు లాలకించి అయుత్తరములో నేదో యొక యాశ్చర్యకరమగు గొప్పసంగతి యుండి వచ్చునని విమల గ్రహించి అయుత్తరమునందుకొనఁ దలంచెను గాని,

విజయసింహుఁడు రక్తాననుఁడై భయంకరుఁడై యుండుటచే నించుక వెనుకఁదీసి యూరకుండెను. అప్పుడు విజయసింహుఁడు బ్రాహ్మణుని దిలకించుచు "ఔరా! ఎంతటి దారుణకర్మము! యశవంతసింహుఁడు చెంత లేనిసమయంబున నాతని కుమారుఁడగు పృథివిసింగును జంప ఔరంగజేబునకుఁ జేతు లెట్లాడెనో? సహజపరాక్రమవంతులగు రాజపుత్రులఁ బాటింపక క్షత్రియవంశమున కింతటిద్రోహ మొనర్చిన యాదుర్మార్గుఁ డింకెట్లు రాజ్య మేలుకొనగలఁడో చూచెదఁ గాక. అయ్యయో; యశవంతసింహుఁ డీవార్త విని యెట్లు విలపించునో కదా? సరే మొగలాయిప్రభుత్వనాశమున కిదియే కారణము గాఁబోలు' అని పలువిధముల నుగ్గడించుచుండ విమల తనహృదయమును బట్టఁజాలక లటాలున తండ్రిచేతిలోనున్న యుత్తరము గ్రహించి యాతఁడు వినుచుండ నిట్లు ప్రకాశముగాఁ జదువ నారంభించెను.

రూపనగరాధీశుఁడైన విజయసింహ మహారాజునకు.—

ఢిల్లీపురవాసి యగు జ్యేష్ఠమల్లు వ్రాసికొనిన విజ్ఞాపన మేమనఁగా.—దేవా! నిన్న సాయంకాలమున దర్బారులో నొక దారుణకర్మము జరిగినది. అట్టిద్రోహము మన మీవఱకెన్నఁడు విని కని యెఱుఁగము. అలంగీరు పాదుషాయొక్క యాజ్ఞ గైకొని యశవంతసింహుఁడు కాబూలు దేశములో జరుగుచున్న ప్రజాకలహము నివారించుటకై తనపుత్రుఁడగు పృథివిసింగును, సింహాసనముపైఁ గూర్చుండఁ బెట్టి సేనల వెంటఁ బెట్టుకొని సకుటుంబముగా బయలుదేఱిన సంగతి మీ రెఱిఁగినదియే కదా! ఔరంగజేబు మొన్న దనసేనలను కొన్నిటిని, నొకబంగారుపల్లకిని బంపి, చాలదినములక్రిందటఁ జూచియుండుటచే వాని నొకసారి తాను జూడఁ గోరుచుండె నని తనభటులచేఁ జెప్పించి పృథివిసింగును రప్పించెను. ఔరంగజేబు వాని [illegible] కౌఁగిలించుకొని సగౌరవంబుగ నాదరించి తేనలొలుకు

పలుకుల నాతనికి సంతసముఁ గల్గించి యెన్నియో ముచ్చటలాడి, వేయేల ? కన్నకుమారుని కన్న నెక్కుడుగఁ లాలించి, "కుమారా, నీవు గూడ నీతండ్రియైన యశవంతసింహునివలె పరాక్రమవంతుఁడవై మారాజ్యమునకు ముఖ్యాధారమవై కీర్తిఁబొందెదవు సుమా" యని పొగడ నారంభించెను. పృథివిసింగు వానిమాటలకు సంతసించి యేకర్మ మెఱుఁగఁడు గావున తన్ను నిక్కముగ ప్రేమతోఁ జూచుచుండెనని భావించెను. పిదప ఔరంగజేబు వానికాదినమున విందుఁ జేయించి తనదర్బారులోనికిఁ గొనివచ్చి తనప్రక్కనే కూర్చుండఁ బెట్టుకొని సభాసదులందరు వినుచుండ "ఓపృథివిసింగూ ! నీవు నాకుమారుఁడవు గాని యశవంతసింహుని కుమారుఁడవు గావు, నిన్నుఁ జూడఁగల్గినందు లకుఁ జాల సంతసించితిని. కొలఁదికాలములోనే నీవు మారాజ్యమునకు మేలొనర్చెద వని మేము నమ్ముచున్నాము. సంతోషపూర్వకముగ నీయొసంగు బహుమానముఁ గైకొని జోధపురంబునకు భద్రముగఁ బొమ్ము" అని పలికి వానికంఠమునఁ గొన్ని భూషణములు హారములు వైచి విషవస్త్రములు వానికిఁ గట్టించి తిరుగఁ బంపివేసెను. పాపమా సుకుమారుఁ డిలుసేరినంతనే విషవస్త్రములచేతఁ గొంతవఱకు గిజగిజ గింజుకొని ప్రాణములఁబాసి పరలోకగతుఁడయ్యెను. ఈవార్త తెలిసి నంతనే ఔరంగజేబు లోలోన సంతసించుచుఁ బైకి నెంతో విచార మున్నటుల నటించి "అయ్యో ! నేనెంత తెలివిహీనుఁడనైతిని. ఆబాలుని సభలో నందఱు రాజులయెదుటఁ గూర్చుండఁ బెట్టితిని. పాపము వానికి దృష్టిదోషము తగిలినందునఁ జనిపోయె. ఆతఁడు నాకెంతో యుపకారి యగు నని సంతసించుచుంటిని గాని నాయాశ లన్నియు నిరాశలైనవి" అని వగవఁ దొడఁగెను. ఇట్టి ఘోరకృత్య మొనర్చినందున నెట్టియాపద సంభవించునో యను భయము లేక రస[illegible]లక్షింపక ఔరంగజేబు సఫలీకృత మనోరథుఁ డయ్యెను.

ఈవార్త వినిన వారలలో నాతనిఁదిట్టని వారు లేరు. రసపుత్రవీరులగు తమ కీవృత్తాంతము విచారకర మయ్యె నెఱింగించుట విశేషగాథను నిట్లు వ్రాయ సాహసించితిని.

ఇట్లీయుత్తరమంతయుఁ జదువుకొని విమలాదేవి తాను గూడ బొటబొట కన్నీరుఁ గార్చుచు నేడువఁ దొడఁగెను. కాని ధైర్యశాలి యగు విజయసింహుఁడు పలుగతుల నామె నోదార్పఁ బ్రయత్నించెను. ఏకవంశమే కాక యశవంతసింహునకును విజయసింహునకును బంధుత్వము గూడఁగలదు. తత్కారణమున విమలవిచారమున కంతము లేకుండెను. "అమ్మా ! విచారించిన నేమిఫలమున్నది ? దైవఘటన మెట్టివారికిఁ దప్పదుకదా !" అని విజయసింహుఁడు మరల నామెను నోదార్చెను. కాని విమల వెక్కి వెక్కి యేడ్చి కొంతసేపటికిఁ దండ్రి మాటలవలన ధైర్యము వహించి "తండ్రీ, క్షత్రియవంశమున కెట్టిదుర్గతి సంభవించినదో చూచితివికదా? ఎన్నాళ్లని యీ దుఃఖమునెల్ల మనము భరింపఁగలము ? ఇంతింతఘోరకృత్యములఁ జేయు నౌరంగ జేబువిషయ మాలోచింపక రసపుత్రు లెల్లరుగాజులఁ దాల్చి యేల యూరకుండిరి ?" అనెను.

"విమలా ! నీ వన్నది నిక్కమే. ప్రస్తుతపు దుర్దశఁ జూడఁగ మన రసపుత్రవంశమెల్లఁ ద్వరలోనే నాశన మగునని తోఁచుచున్నది. భీతచిత్తులై కొందఱు రాజులు ఔరంగజేబునకు విధేయులై క్రూర కృత్యముల వానికిఁ దోడగుచుండుటచే నిట్టి దారుణకృత్యములు జరుగు చున్నవి. ఇంతకుఁ గానున్నది కాక మానదు కదా. ఎవ రేమి సేయఁ గలరు ? నా సాధ్యమైనంతవట్టు పనిచేసి చూచెద. పిదప దైవయత్న మెట్లున్నదో తెలియదు. ఏమి చేయుద మన్నను మనక్షత్రియవంశమున నైకమత్య మేమూలనో డాఁగియున్నది."

"తండ్రీ ! కుమారుని మరణవార్తవినినంతనే మాపినతల్లి యైన చంద్రావతి యెట్లు ప్రాణములు భరించియుండునో తెలియకున్నది.

జిక్ట్రి నుహాసాధ్వి కిట్టిసంకటము చేకూఱు నని కలలోనైన నేనెఱుంగ జాలనైతిని. ఇట్టిసమయమున నూరకుండుట పాడిగాదు కావున మీకు సమ్మతమైనచో నేనామెకొక యుత్తరమును వ్రాసి యంపెదను."

"అమ్మా! సమ్మతించుట కేమున్నది. నేను గూడ యశవంత సింహునిపేర నొక జాబు వ్రాసెద. మనయుత్తరములు రెండు నొక్క-సారిగఁ బంపుదము. ఆపత్సమయముననే కదా బంధువులైనను మిత్రు లైనను తమవిశ్వాసముఁ జూపవలయు? బంధుత్వమేకాక యశవంత సింహునకును నాకును చిన్నప్పటినుండియు నధికమగు మైత్రి గలదు. అయినను నేనొక విషయమును గూర్చి యించుక సందేహించుచుంటిని. ఈకాలమెచ్చటఁ జూచినను శత్రుమయమైయున్నది, శత్రువులకుఁ జిక్క-కుండ మనయుత్తరములు వారికందుట దుర్లభమని తలంచెదను. అయినను తగినప్రయత్నములు చేసి యేర్పాటు చేసెదను. నీవుగూడ వ్రాయవలసిన దేదియో వ్రాసిసిద్ధముగనుంపుము. చాకచక్యముగల్గి మాయలునేర్చిన సేనకునొకని నెంచి వానిద్వారా మనయుత్తరములు కాబూలుదేశమున కంపెదను" అని విజయసింహుఁడు తనకూఁతును వెంటఁబెట్టుకొని లోనికిఁబోయెను. ఆ యుత్తరములు మనకథ నెంతవఱకు జరపునో చదువరులు ముందుముందు గ్రహింపఁగలరు.

# మూడవ ప్రకరణము

## అచలేశ్వరుఁడు - వైకుంఠయోగి

ఆరావలి యను పర్వతమాలిక రాజపుత్రస్థానమునకు నడుమ ఉత్తరదక్షిణముగాఁ బెట్టఁబడిన గోడవలె నున్నది. 'ఆరావలి' శబ్దము 'ఆదర్శావలి' శబ్దములో నుండి పుట్టినది. 'ఆదర్శావలి' యనఁగా అద్దముల పంక్తి యని యర్థము. ఈ పర్వతములలోని కొన్ని గుట్టలు సంగమల అనఁబడు తెల్లని చంద్రకాంతశిలలతో నిండియున్నవి. కావుననే వానికి ఈపేరు వచ్చెను. ఈ పర్వతరాజమునకుఁ జుట్టును జగద్విఖ్యాతిఁ జెందిన రాజపుత్ర సంస్థానములు పెక్కులు కలవు. దీనికి ఈశాన్యమందు ఆల్వార్ భరత్పురములును, తూర్పున జయపుర, బుందీ రాజ్యములును, ఆగ్నేయమున ఉదయపురమును, వాయవ్యమున బికానేరును, తూర్పున జోధపురమును పర్వతమును అంటుకొని యో, లేక కొంచెము దూరముగనో యున్నవి. ఉదయపురము, రూపనగరము మొదలయిన కొన్ని పట్టణములును, దుర్గములును కొండలకు నడుమనే కట్టఁబడినవి. ఇట్టి పర్వతమాల ముఖ్యమైన రాజపుత్రసంస్థానముల కన్నిటికిని ఏదో ఒకవైపు తగిలి యున్నందున ఆయారాజ్యములలోని రాజులకును ప్రజలకును దానిని గూర్చి అభిమానము మెండు. ఆపర్వతము మీఁది యరణ్యమచ్చటి జనులందఱకుఁ ద్రాగుటకుఁ దేనెయు, తినుటకుఁ బండ్లును, పాకమునకు నింధనములును, ఇండ్లకు ఉపయుక్తమైన

కలపయు, గుచికి సైంధవమును అనఁగాఁ గొండయుప్పును, ఇచ్చుచుండె. ఇది యది యననేల ? రాజులకు యుద్ధమునందు కావలసిన యినుమును ప్రజాసంరక్షణ నిమిత్తమై వలయు వెండి బంగారములును ఆరావలియే యొసఁగుచుండెను. ఆరావలిలోని వెండి యినుము రాగి మొదలయిన లోహముల గనులు సుప్రసిద్ధములు. వారి జీవితమునకై కావలసిన ముఖ్య ద్రవ్యము లన్నియు నాపర్వతము కామధేనువు వలె నొసఁగు చున్నందున వారు దానిని దేవతయనిఁ బూజించుట ఆశ్చర్యమా ?

రాజపుత్రుల కందఱకును ఈ పర్వతముపైఁ బ్రీతి యుండుటకుఁ బై కారణములకంటె మఱియొక కారణము కలదు. ఆపర్వతము రాజపుత్రుల శౌర్యమును, దేశ భక్తిని వేయినోళ్లఁ గొనియాడు బట్రాజు. రజపూతుల యనన్య సామాన్యక్షాత్ర తేజముతో వెలుఁగునట్టి కథానకములును, పౌరుష ప్రధానములగు నద్వితీయ వీరచరిత్రములును, స్వదేశ స్వమత స్వగౌరవములును రక్షించుకొనుటకు నై పూలచెండ్లనలెఁ దమ శిరః ప్రకరంబుల రణక్షేత్రమున నర్పించిన వీరనామ సహస్రమును, శరణనిన దీర్ఘదుర్మార్గశత్రువునైన రక్షించిన యౌదార్య ప్రసంగములను, అందలి చెట్టు చెట్టు, గుట్ట గుట్ట, కనుమ కనుమ ఎలుఁగెత్తి చెప్పుచుండును.

ఇది యెట్టిస్థలము ? ఇది బప్పారావల్ పార్మార్ వంశజుని గెలిచిన స్థలము. ఇవి యెట్టి స్థలములు ? ఇవి ఖుమాన్ రాణా మహమ్మదీయుల నిరువదినాలుగు పర్యాయములు ఓడించిన స్థలములు. ఇది యెట్టి స్థలము ? ఇది కుతుబుద్దీన్ కరుణదేవి కోడి పాఱిపోయిన స్థలము. ఇది యల్లా ఉద్దీనును మోసపుచ్చిన స్థలము, ఇది హమీరుఁడు మాలవదేవుని సంహరించిన స్థలము, ఇది రాణాప్రతాపుని సైనికులలోఁ బదివేలమంది తమ రాజుకొఱకుఁ బ్రాణములర్పించిన స్థలము, అని రాజపుత్రులు ఆ పర్వతారణ్యములమీఁద వేటకుఁ దిరుగునప్పుడెల్లఁ జెప్పుకొనుచుఁ

బులకాంక్షిత దేశములగుదురు. ఈ పర్వతారణ్యప్రదేశము రజపుత్రులకుఁ బెట్టనికోటవంటిది. రాజపుత్రసైన్య మాకోటఁ బ్రవేశించిన తరువాత నది యెచ్చట నున్నది కనుఁగొనుటకాని దానితోఁ బోరుటగాని యెట్టి ప్రబలశత్రువునకైనను సాధ్యముకాదు. ఇట్టిది యితరత్ర దైవ వశమునఁ బరాజితులయిన రాజులు నిర్భయముగా నుండుటకు నాశ్రయ స్థలము. ఇంతియకాదు. శత్రు సైన్యము పొరఁబాటున వీరివెంటఁదగిలి యా పర్వతారణ్యములలోఁ బ్రవేశించెనా, యిఁక నది తిరిగి పోవుట దుర్లభము. అచ్చటి కొండత్రోవలు ఎప్పుడచ్చటఁ దిరుగుచున్న భిల్లులకు రాజపుత్రులకుఁ దప్ప మఱి యెవ్వరికిని తెలియవు. కావునఁ దురుష్కు లనేకపర్యాయములు రాజపుత్రుల వెంటఁదగిలి యీ పర్వత కందరములలోఁ జిక్కి బాధ పడిరి. కాని అధర్మయుద్ధము చేయఁ గూడదని రాజపుత్రుల దీక్షయైనందున, అట్టి సంకటములోఁ జిక్కిన శత్రువులు 'శరణు' అని యన్నతోడనే వారిని విడుచుచుండిరి ! ఇట్టి ప్రసంగము లెన్నియో రాజపుత్రచరిత్రయందు వర్ణింపఁబడినవి. చదువరులారా ! ఇఁక నీ పర్వతముమీఁద సికారుచేయుట మాని మన కథానకముతో నెక్కుడు సంబంధముగల అబూపర్వతముమీఁద విహరింపఁ బోదము. రండు !

అబూపర్వత మారావలియొక్క భాగమే. కాని యన్నదమ్ము లలోనుండి వేఱై దూరముగా నిల్చుకట్టుకొన్న వానివలె ముఖ్యపర్వతము నకుఁ గొంతదూరముగా నున్నది. మూలపర్వతమునకును దీనికిని నడుమ పండ్రెండుమైళ్ల వైశాల్యముగల దరి యనఁగాఁ గొండసందు కలదు. ఆరావలి పర్వతమునందుఁబుట్టి యొకనదియచ్చట బ్రవహించు చును. ఈ కాలమందు అబూపర్వతము రాజపుత్రస్థానమునకును గుజరాత్ దేశమునకును ఆరోగ్యస్థానము (**Sanitarium**) ఈ పర్వ తముమీఁద సుందరములయిన హిందూమందిరములును జైనమందిర ములును పెక్కులు కలవు.

ఆబూపర్వతము మిక్కిలి పవిత్రమైన క్షేత్రమని ఉత్తర హిందూదేశమందలి జనుల యభిప్రాయము. పూర్వకాలమందు దేవతలకును మహర్షులకును హిమాలయపర్వతము మొదటి నివాస స్థలమనియు, ఆబూపర్వతము రెండవ నివాసస్థలమనియుఁ జెప్పెదరు.

ఇప్పుడు చెన్నపట్టణమునందు నాలుగు నెలలుండి, గవర్నరుగారును, కడమ దొరలును, ఆఱు నెలలవఱకు ఉదకమండలమునకుఁ బోయినట్లు కృతాదియుగములలో శివుఁడును ఆతని గణములును హిమాలయముమీఁద గొంతకాలముండి విసువుపుట్టినప్పు డచ్చటి నుండి వెడలి యాబూపర్వతముమీఁదికి వచ్చి విహరించుచుండిరఁట ! కాని యీ పాపపుఁ గలియుగము వచ్చినప్పటి నుండియు వారిచ్చటికి వచ్చుట మానిరఁట ! రాజపుత్రస్థానమందలి జనులీ పర్వతమును గుఱించి యిట్టి నమ్మికలుగలిగినవారై, మఱి యెన్నియో గాథలు చెప్పుకొనుచుండిరి. అందొక గాథ యిచ్చట నిచ్చుచున్నాము.

త్రేతాయుగమందు నీ పర్వతముమీఁద శివభక్తి పరాయణులగు ఋషులు తపస్సుచేసికొనుచుండిరి. ఆ ఋషులందఱకును భగవాన్ వశిష్ఠులవారు కులపతిగా నుండిరి. సూర్యోదయమునకుఁ బూర్వము లేచి యఘమర్షణస్నానముచేసి, స్వాధ్యాయము బ్రహ్మయజ్ఞము, పితృతర్పణము, యజనము, యజ్ఞము, జపతపములు మొదలయిన పవిత్ర కర్మల నాచరించి, కామధేనువుయొక్క పవిత్రమైన దుగ్ధమును త్రాపి శరీరరక్షణముచేయుట యా ఋషిపుంగవుల నిత్యకృత్యము. అందుచే నచ్చట శాంతియు, బ్రహ్మతేజస్సును, సత్త్వగుణప్రభావమును ఎచ్చటఁ జూచినను కానవచ్చుచుండెను. మేఁక తోఁడేలు, ఆవు పులి, ఏనుఁగు సింగము, ఒక్క కొలనిలోనే కలిసి జలముద్రాగి యొకదాని నొకటి ప్రేమతో నాఘ్రాణించు కొనుచు, నాడుకొనుచుండును. దానిఁజూచి ఋషులును, ఋషిపత్నులును, ఋషికన్యకలును మిక్కిలి

యానందించుచుండిరి! అప్పుడప్పుడు శంకరాది దేవతలు వచ్చి ఋషులకు దర్శనమిచ్చుచున్నందున ఋషుల బ్రహ్మానందమునకు మితిలేక పోయెను.

ఇట్లుండ నొక్కనాఁ డా ఋషుల కామధేనువు ఒకగుండమున నొడ్డున నున్న పచ్చిక మేయుచుఁ గాలుజాఱి యాగుండములోఁ బడెను. ఆగుండమత్యంతవైశాల్యమును, లోతును గలిగి యుండుటచే నిఁకఁ గామధేనువు తమకు లభింపదని ఋషు లందఱును చింతించిరి. కాని వారి పుణ్యప్రభావమున ఆగుండములో గంగాదేవి యుద్భవించి తనమూఁపునఁ గామధేనువును మోసికొని యావును ఋషులకు నప్పగించెను. అంత ఋషులందఱును సంతసించిరి. కాని మరల నిట్లు జరిగి యాధేనువు గుండములోఁ బడకుండ నా గుండమును పూడ్చివేయుమని వసిష్ఠుఁడు శివుఁ బ్రార్థించెను. శివుఁడు భక్తపరాధీనుఁడుగదా! అందు వశిష్ఠుఁడు అడుగుటయు, శివుఁడు లేదనుటయు సంభవించునా! అంత శివుఁడు హిమాలయ పర్వతములయొక్క కుమారుల నందఱఁ బిలిచి 'ఆరావలీ పర్వతమునందలి వసిష్ఠాశ్రమములో నున్న గుండమునందుఁ గాఁపుర ముండుటకు వెళ్ళ నిచ్ఛగలవాఁడు నే యొక్కఁడుగాని యని యాజ్ఞాపించెను. హిమాలయుని పుత్రులలోఁ కడపటివాఁడు కుంటివాఁడయినందున, నింట నుండ నొల్లక ఆరావలి పర్వతమునకుఁ బోయెదనని చెప్పెను. కాని కుంటివాఁడయినందున వాఁడు హిమవత్పర్వతమునుండి ఆబూపర్వతమునకు నడుచుటెట్లు? కావున వానికిఁ దక్షకుని సాయముగా నిచ్చిరి. తన మిత్రుఁడగు తక్షకుని మీఁదఁ సవారియై యాకుంటిపిల్లగుట్ట వసిష్ఠ ఋష్యాశ్రమముఁ జేరి, మునులకు నమస్కరించి, యా గుండములో దుమికెను! అంతతాపసు లందఱును సంతసించిరి. కాని గుండము మిక్కిలి పెద్దదియైనందున నా కుంటిపర్వతము చుట్టు కొంతస్థలము మిగిలిపోయెను. అందుచేతను, కుంటిదైనందునను, ఈపిల్ల పర్వతము తిన్నగ నిలువలేక గడగడ వడఁకఁజొచ్చెను. అందులకు

నిది యొక్క క్రొత్త సంకటము వచ్చెఁగదా! యని ఋషులు భీతచిత్తులై యీ పర్వతము కదలక యుండునట్లు చేయుమని పార్వతీరమణునిఁ బ్రార్థించిరి. ఉబ్బులింగఁడయిన శివుఁడు భక్తులకొఱకుఁ దన తపో భంగము మఱియొకసారి చేసికొని తన బొటనవ్రేలు పాతాళమువఱకుఁ ద్రొక్కి యచ్చటినుండి దానిని ఆ కుంటి పర్వతములోనికిఁ బోనిచ్చి దాని శిఖరమును ఛేదించి పైకి వచ్చువఱకును నొక్కెను! అంత నా పర్వతము అచలమై యుండెను. అట్లు శివుని బొటనవ్రేలు వెలువడిన చోట ఋషులందఱును దేవాలయము కట్టించి యా దేవునికి నచలేశ్వరుఁడని పేరు పెట్టిరి.

ఆ పర్వతముమీఁద నొక చక్కని కొలను గలదు; దానికి 'నఖీ' యని పేరు. పూర్వము మహిషాసురుఁడు దేవతలను మిక్కిలి బాధ పెట్టినప్పుడు వా రా బాధకుఁ దాళలేక యీ పర్వతము మీఁదికి వచ్చి డాఁగియుండిరి. పర్వతమును తమ నఖములతో గీఱి దాఁగుటకు స్థలముఁ జేసికొనిరి. అట్లు నఖములచే గీఱగా నేర్పడినదే యీ కొలను కావుననే దానికి 'నఖీ' యని పేరు వచ్చెనట!

ఇట్లాపర్వతము మీఁది గుళ్లను గుఱించియు, గోపురములను గుఱించియు, గుండములను గుఱించియు, కొలంకులను గుఱించియు, నా దేశపు జనులనేక గాథలు చెప్పుకొనుచుండిరి. ఈ పౌరాణికకథలు నిజమా యబద్ధమా యని విచారించుటకు మన పనిగాదు. ఆ పర్వతము పురాతనకాలమునుండియు జనులు పవిత్రస్థలముగా చూచుచుండి రని యీ గాథలవలన మన మూహింపవచ్చును.

ఈ పర్వత రాజమును గుఱించి జనులకిట్టి గౌరవము కలుగుటకుఁ గారణము లేక పోలేదు. హిమాలయమువలెనే సక లౌషధులకును, శ్రేష్ఠలోహములకును, వివిధమృగపక్షి సంతానములకును ఈ పర్వతము పుట్టినిల్లు. సృష్టియొక్క నైసర్గిక సౌందర్యముఁ జూడవలె నన్న

యాబూపర్వతము మీఁది యత్యుచ్ఛస్థల మగు గురుశిఖరమును చూడవలయును. ఈ శిఖరము 5650 అడుగుల యెత్తున నున్నది. అచ్చటినుండి రాజపుత్రస్థానమంతయుఁ జక్కఁగఁ గానవచ్చును. క్రింద నున్న యారావళి పర్వత పరంపర యొక్క గుహలును, లోయలును, కనుమలును, గహ్వరములును, అరణ్యములును, వనములలోని మార్గములును, భిల్లనివాసస్థలంబులును, వనములును, స్వచ్ఛమైన జల ప్రవాహములతో సర్పములవలె రత్నములుదాఁపిన బంగారు రేకువలె నెండలోఁ బ్రకాశించు నిసుక యెడారియును, వక్రమార్గమునఁ బ్రవహించుచున్న సింధు, లూని, మొదలయిన నదులును [illegible], సంరక్షకభటులవలె నాపర్వతమునకు చుట్టునున్న చిత్తోడ్, ఉదయపురము, జోధపురము, రూపనగరము, బుంది మొదలయిన క్షత్రియ సామర్థ్య సూచకములగు దుర్గరాజంబులును, ఏకకాలమున నయన గోచరంబులై భూదేవియొక్క సౌభాగ్యసంపద యంతయు నీక్షించి నట్లుండును! ఇట్టి యప్రతిమ సృష్టిసౌందర్యముఁ జూచువారికి శరీరమంతయుఁ బులకాంకితమై, యది దేవభూమి యని తోఁచుట యాశ్చర్యముకాదు. ఇంతియ కాదు. ఆ యరణ్యమునందు గానరాని చక్కని పుష్పజాతిగాని, ఫలవిశేషముగాని ఓషధీలతల్లికలుగాని లేవు. అచ్చటనుండువారికి భోజనచింత లేదు. మామిడిపండ్లు, జామిపండ్లు, పనసపండ్లు, సీతాఫలములు, అడివి యరఁటిపండ్లు మొదలయిన ఫలములును, కందమూలములును ఆయా ఋతువులయందుఁ గొండలలో సమృద్ధిగ నుండును. త్రాగుటకు జలగుండములును, వాసముచేయుటకుఁ జక్కని గుహలును అచ్చటఁగలవు. అందుచే నా పర్వతము దేవతలును, మునులును కాఁపురముండుటకు బ్రహ్మదేవునిచే నిర్మింపఁబడిన ప్రతి నందనవనమే యని సామాన్య జనులనుకొనుట యాశ్చర్యమా ?

మన కథ జరుగుచున్న కాలమునందు నాబూపర్వతముమీఁద నొకయోగి వాసముచేయుచుండెను. ఆతనిపేరు వైకుంఠయోగి.

నిది పర్వతముమీఁద యోగాభ్యాసముచేయుచున్న యోగుల కందఱకు యాతఁడు గురువుగానుండెను. వారందఱును ఆతని యాజ్ఞలో మెలఁగుచుండిరి. ఆతఁడు వసిష్ఠులవారి యవతారమని లోకులు చెప్పుకొనుచుండిరి. ఈ యోగియెడల రాజపుత్రస్థానములోని రాజపుంగవు లందఱును భక్తి కలిగియుండిరి. ఈ యోగిని వారు తమపాలిటి దేవునిగా దలఁతురు. తమ కెట్టియాపద వచ్చినను రాజపుత్రరాజులు తాము స్వయముగా వైకుంఠయోగియొద్దకుఁ బోయి, తమ కష్టసుఖములఁ జెప్పుకొని యాపద నివారణోపాయముఁ దెలిసికొనుచుండిరి. ఆతఁడు యోగదృష్టితోఁ జూచి భూతభవిష్యద్వర్తమానములను తెలిసికొను త్రికాలవేత్తయని వారి నమ్మకము. అందులకుఁ దగినట్లుగ దేశదేశపు వార్తలన్నియు నితరులకుఁ దెలియుటకుఁ బూర్వమే యోగికిఁ దెలియుటయు, నాతఁడు తన దర్శనమునకు వచ్చినరాజులకు నా వార్తలు తెల్పుటయు, వారు ఆశ్చర్యముఁ జెందుటయు సంభవించుచుండెను. ముఖ్యముగా రాజపుత్రులకుఁగాని, హిందువులకుఁగాని తురుష్కుల రహస్యాలోచనలను గుఱించి దెలిసికొని యోగి యా సమాచారములను రాజులకుఁ దెలుపుచుండును. అందుచే నాతని త్రికాల జ్ఞానమువలన రాజపుత్రుల స్వాతంత్ర్యమునకు నపారమైన సాహాయ్యము కలుగుచుండెను.

యోగి వయస్సు ఏఁబది సంవత్సరములకు మించినదియైనను ఆతఁడు నవయౌవనములకంటెను నెక్కుడు జవసత్త్వములు గలిగియుండెను. నడకలో నాతనితో సమానముగా నడచువారు లేరు. ఒక్కొక్కప్పుడు సమాధినుండి దిగిన తరువాత నాతఁడు ఈ పర్వతమునుండి యా పర్వతమునకును, ఈ గుహలోనుండి ఆ గుహలోనికిని, అవలీలగా బోవుటను కొండ గుహలలోనుండు భిల్లులుగూడనాశ్చర్యముతోఁ జూచుచుందురు. ఈయోగి రాజునకు ననేకభిల్లులును, భిల్లాంగనలును

శిష్యులుగను, శిష్యురాండ్రగను, ఉండి యగణ్యములోని, పేన. చాఱపప్పు మొదలయినవి ఫలహారమునకై తెచ్చియిచ్చెదరు.

మనము ఆబూపర్వతము మీఁదికిఁ బోయినప్పుడెల్ల ఈ యోగి కనఁబడునని నిశ్చయము లేదు. సాధారణముగా నీతఁడు అచలేశ్వర మందిరములోఁ దపము చేయుచుండును. కాని అప్పుడప్పుడు కొంత కాలమువఱకు మాయమైపోవును. ఆకాలమందాతఁడు మనుజులకుఁ బోవుటకు సాధ్యముగాని కొండతావులలోని గుహాలయములఁ గూర్చుండి తపస్సు చేసికొనునని యు, సమాధిలో నుండి దిగఁగానే మరల నచలేశ్వర మందిరమునకు వచ్చునని యు భక్తులనుకొనుచుండిరి.

కొండమీఁదఁ దపస్సు చేసికొనుచున్న బైరాగులతో నలుగురు ఈ యోగికిఁ బ్రియశిష్యులనియు, ఆతనివలన వారు యోగరహస్యముఁ దెలిసికొన్నందున ఆతనివలెనే యప్పుడప్పుడు ఇతరజనులకు సాధ్యము గాని కొండగుహాలలోనికిఁ బోయి కొన్ని దినములవఱకుఁ దపస్సు చేయు దురనియు నచ్చటవారు చెప్పెదరు.

యోగియొక్క పూర్వవృత్తాంత మెవరికిని తెలియదు. అతఁ డనాది కాలమునుండియు, నిప్పుడున్నట్లే యుండెనని రాజపుత్రు లందఱును చెప్పెదరు. ఆతఁడు బ్రాహ్మణుఁడైనది, క్షత్రియుఁడైన దెవ్వ రెఱుఁగరు. కాని యాతని దర్శనమునకునై వచ్చుచుండెడు విద్వాంసులతోడి యనేక విద్యలనుగుఱించి ముచ్చటించుట చూడఁగా నాతనికి వేదాధ్యయనము, వ్యాకరణ వేదాంత శాస్త్రములు చక్కఁగాఁ దెలియుననియుఁ, గావున నాతఁడు బ్రాహ్మణుఁ డనియు నూహింప వచ్చును. ఒక్కొక్కసారి భక్తిపరవశుఁడై యాతఁడు అచలేశ్వరుని మీఁదఁ గీర్తనలు పాడుచుండఁగా విన్నవా రాతఁడు 'నారదుఁడో! లేక తుంబురుఁడో ?' యని తలఁపక మానరు.

# నాల్గవ ప్రకరణము

## యశవంతసింహుఁడు

కాబూలులో జరుగుచున్న ప్రజాయుద్ధమునివారించి యశవంతసింహుఁడు తనపని నెఱవేర్చుకొనెను. దుర్గాదాసును శివసింగును గూడ నా కార్యమందు వానికి మిక్కిలి సహాయులైరి. ఆ కలహమును వారించుటయందు వారికి విశేషము ప్రయాసము గలుగలేదు. ఒకనాఁడు మధ్యాహ్న మాతఁడు తన పరివారముతోఁ గూర్చుండి యాతని సేనానాయకుం డగు దుర్గాదాసుతో, నిట్లు వచించుట కారంభించెను.

"దుర్గాదాస్! మన మీ కాబూల్ దేశమునఁ బ్రవేశించి యెట్టులెట్టులో ప్రజల కలహమును నివారించి ఔరంగజేబుని కోరిక నెఱవేర్చితిమి. ఇంక మన కిచ్చట చేయవలసిన కార్యము లేమి యున్నవి?"

"రాజేంద్రా! ఇంక నేమున్నవి? ఇంతకుఁ దమ కిట్టి స్వల్ప కార్యములన్న నేపాటి?"

"ఓయీ! సకల సైన్యములు వలసినయట్లు నడుపుచు నెట్టి యాపదనైనఁ దప్పింప సమర్థుండవగు నీవుండ, నాకివి స్వల్పకార్యములే కదా."

"దేవా! దీని కేమిగాని, ఔరంగజేబు మనలను మోసపుచ్చుటకే కాబూలు దేశమునకుఁ బంపెనని నాకుఁ దోఁచుచున్నది."

"దుర్గాదాస్! అట్లనెదవేల? ఆతఁడు వాని తండ్రియైన షాజహాన్ వలెనే నన్ను నాదరించుచున్నవాఁడు. నన్ను మోసపుచ్చుటకు వానికి నేనేమి యపకార మొనర్చితిని?"

"అయ్యా! మీ రాతని కెట్టి యపకారమును జేయలేదను కొనుచున్నారు. కాని షాహజహాన్ కాలమున వానియాజ్ఞ గైకొని ఔరంగజేబును మీరు లక్ష్మణపురి యొద్ద నోడించితిరి కదా? ఇంతలో మఱచితి రేల? వానికా సంగతి జ్ఞాపకము లేదనుకొంటి రేమో?"

"జ్ఞాపక ముండినను లేకపోయినను ప్రభుచిత్తానుసారముగ మెలఁగుట విధి గావున నప్పటి కా కార్యముఁ జేయవలసివచ్చెను. ఔరంగజేబు మాత్ర మీ సంగతి యెఱుఁగఁడా? ఇంతమాత్రమున నాపై మోసబుద్ధి వహించునా? ఆతఁ డంత తెలివి మాలినవాఁడా? ఒకవేళ ఔరంగజేబే తన కుమారునిపై దాడివెడల నా కాజ్ఞాపించిన నా కార్యము నాకుఁదప్పునా? స్వామిద్రోహ మెట్టివారికైనఁ దగదు కదా? రాజ్యాంగ విషయములన్నియు బాగుగ నెఱిఁగి రాజ్య మేలుచున్న ఔరంగజే బింతటి యన్యాయమున కొడిగట్టుకొనఁడు."

"రాజేంద్రా! మీరు చెప్పినవన్నియు నిజమే! కాని, ఒకరిని మోసపుచ్చవలయు నని ప్రయత్నించువా రిన్ని న్యాయము లాలోచించువారు కారు. దుష్టస్వభావము గలవారికి యుక్తాయుక్త వివేక ముండునా?"

"అవును ఆ మాటమాత్రము నిజము. ఔరంగజేబు దుష్టబుద్ధి యగుటచే వానివలన మన కెట్టి కీడు సంభవించినను సంభవించును. ఆ సంగతి నేను నెఱుఁగుదును. కావున మనము భద్రముగా నుండుట మేలు."

అని, యిట్లు వారిరువురుఁ గొంతసేపు తమలో మాట్లాడుకొనిరి.

యశవంతసింహుఁడు ప్రజాపాలనమునందును, రాజకార్య నిర్వాహణమునందును పేరొందినవాఁడే, కాని, వానికి దూరాలోచన

ఖించుక తక్కువ. షాహజహాన్ పాదుషా రాజ్య మేలుకాలమున (అనఁగా 1628 మొదలు 1658 వఱకు) నాతఁడు వానికి సామంతుఁడై యనుగ్రహమునకుఁ బాత్రుఁడై యుండెను. ఔరంగజేబునకు యశవంతసింహునిపై నసూయ గల్గుట కిదియే మొదటికారణము. షాహజహాన్ తన కుమారుఁడగు ఔరంగజేబుతో వైరముఁ గొని యుండిన వాఁడగుటచేత వానిని, పెక్కుమాఱులోడించెను. అందులో యశవంతసింహునిఁ గూడ వానిపై కొకసారి పంప నాతఁ డౌరంగజేబును లక్ష్మణపురియొద్దఁ దాఁకెను. అచ్చట ఔరంగజే బోడిపోయి నప్పటినుండియు యశవంతసింహునిపై మరింత ద్వేషము వహించి యుండెను. తన తండ్రి సింహాసనముపై నున్నంతకాలముఁ దన కృత్యమేమియు సాగనందున నాతఁడు కొంతకాల మూరకుండి సమయము నిరీక్షించు చుండెను. క్రమక్రమముగా నాతఁడు తండ్రిని వంచించి సింహాసన మెక్కినప్పటినుండియు యశవంతుని విషయమై యోచించు చుండెను. ఆతఁడు సింహాసన మెక్కక పూర్వము యశవంతసింహుఁడు షాహజహాన్ పెద్దకుమారుఁడైన దారా యను వానితోఁ గలసి ఔరంగజేబు నోడించుటచే ఔరంగజేబునకు వానిపైఁ గల ద్వేషము నలువంకల వ్యాపించి ప్రతిఫలించుచుండెను. పూర్వ ప్రకారముగ యశవంతసింహుఁడు ఔరంగజేబు రాజ్యమును వశము చేసికొని నప్పటినుండియు వానినిఁగూడ భక్తియుక్తముగ సేవించు చుండెను. వానికి దూరాలోచనము లేకుండుటచే ఔరంగజేబు తన్ను మోసపుచ్చఁ జూచుచున్నాఁడని తొలుత గ్రహింపలేకపోయెను. యశవంతసింహునిపైఁ దనకు ద్వేషముండినను నాతని శౌర్యమును; పరాక్రమమును పూర్ణముగా నెఱుఁగును. గావున ఔరంగజేబు వానినే తఱుచుగ యుద్ధములకుఁ బంపి జయములొంది యెన్నో కార్యములు నిర్వహించుకొనెను. యశవంతసింహునకు హఠాత్తుగ నేదైన మోసముఁజేసిన రసపుత్రు లెల్లఁ దనపై దండెత్తి వచ్చెదరని

యూహించి యాతఁడందులకుఁ దగిన యుపాయ మాలోచించుచుండెను. విరోధముచేఁ బాలు ద్రాగింప లేముగాని మంచితనముచే విషముఁ ద్రాగింపవచ్చును గాన, ఔరంగజేబు కుటిలమర్యాదలు సేయుచు వానిపైఁ దనకెంతో యభిమానముండిన యట్లు యశవంతసింహు నెడల నటించుచుండె. కాని యశవంతసింహుఁడాయూయలఁ గనిపట్ట నేరక, యామర్యాద లన్నియు నిజమని నమ్ముచునచ్చెను. కాని వాని సేనాధిపతియగు దుర్గాదాసు మాత్ర మదంతయుఁ గుటిల ప్రవర్తనమని యెఱుఁగకపోలేదు. ఆకారణమున నప్పుడప్పుడు యశవంతసింహునితో ఔరంగజేబుని క్రౌర్యము గుఱించి చెప్పుచువచ్చెను. కాని యామాటలు లాతఁడంతగాఁ బాటింపలేదు. దుర్గాదాసు మిక్కిలి బుద్ధిచాతుర్యము గలవాఁడు, పరాక్రమశాలి. రజపుత్ర వీరులలో మిక్కిలి పేరొందిన వాఁడు.

ఔరంగజేబు మహమ్మద్ అమీన్ఖాన్ అను వానిని తనకు ప్రతినిధిగా కాబూలులో నుంచెను. కాని 1672వ సంవత్సరములో నాయమీన్ఖాను నలువదివేల సైనికుల వెంటఁబెట్టుకొని కాబూలునకుఁ బోవుచుండఁగా ఖైబరు కనుమయందు కొండ అరణ్యవాసులు చెలరేఁగి మహమ్మదీయ సైనికుల నెల్లరఁ బరిమార్చి నేలపాలొనరించిరి; ఆ యుద్ధములో అమీన్ఖాను మిక్కిలి పరాభవ మొందెను. అప్పటి నుండియు ఔరంగజేబు వానిపై నీర్ష్య వహించి యుండెను. గాని తత్క్షణము వారితో కలహించుటకు వీలులేక కొంతకాలము జాగు చేయవలసివచ్చెను. పిదప యశవంతసింహుని కాబూలునకుఁ బంపిన నాతఁడు వారిని జయించిన తన కోరిక యీడేఱుననియు, లేక యాతఁడే వారిచే హతుఁడైన నదిగూడ తనకు లాభకారియే యనియు వానిపైఁ గల యీర్ష్యచే యశవంతసింహునే 1678వ సంవత్సరములో కాబూలునకుఁ బంపెను.

నాఁడట్లు కాబూలు దేశమున గుడారములలో దుర్గాదాసును యశవంతసింహుఁడును సంభాషించుకొనుచుండఁగాఁ గొంతసేపటికొక మహమ్మదీయుఁ డచ్చటికి కరుదెంచి యశవంతసింహునిఁ జూచి "అయ్యా! ఢిల్లీ నగరమునుండి యలమ్గీరు పాదుషా గారు తమ కొకయుత్తరమును వ్రాసి నా చేతికిచ్చి తమ కిమ్మని పంపినారు" అని యొక కాగితమును వాని చేతి కిచ్చెను. యశవంతసింహుఁ డాజాబును విప్పుచు "ఓయీ! విశేషము లేమి? పాదుషాగారు క్షేమము గనే యున్నారా?" అని యడిగెను. అతఁడు క్షేమముగనే యుండె నని వానికిఁ బ్రత్యుత్తరమిచ్చెను. పిదప నా జాబు విప్పి కడముట్ట జదువు కొని "హా! కుమారా! పృథివిసింగూ పృథివిసింగూ!" అని గుండెలు బాదుకొనుచు బొబ్బలిడి క్రిందఁబడి మూర్ఛిల్లెను. తోడనే పరివార మంతయు నల్లకల్లోలమై వానిచుట్టును మూఁగెను. దుర్గాదాసును శివసింగును తత్తరపడుచు నా యుత్తరమున నేమిసంగతులున్నవో యని చదువుకొని వారుఁగూడ రోదన మారంభించిరి. పృథివిసింగు చనిపోయెననియు నా వార్తయే ఔరంగజేబు వ్రాసెననియు గ్రహించి యశవంతసింహుని పరిచారకులును సేవకులు గొల్లున నేడువ నారం భించిరి. లోపలనున్న యిందిరాచంద్రావతులు దాసదాసీజనంబులుగూడ నా పృథివిసింగు మరణవార్తవిని కన్నీట మజ్జనమాడఁదొడఁగిరి. ఆహా! దైవసంకల్ప మెంతలో నున్నది. ఏక్షణమున నేమిజరుగునో తెలిసికొనుట దుర్లభము గదా! గడియకాలము క్రిందటఁ దాము శత్రువుల జయించితి మని యమందానంద మొందుచుండిన నా పరివార మెల్ల నిప్పుడు గుండెలు బాదుకొనుచు నేలఁబొరలుచు మిన్నంట రోదనమొనర్పఁ దొడఁగెను. దుర్గాదాసుని యుపచారములవలనఁ గొంత సేపటికి యశవంతసింహుఁడు మూర్ఛనుండి లేచి నిశ్చేష్టితుఁడై కొయ్యబొమ్మవలె నట్లే యులుకుఁ బలుకు లేక చూచుచుండెను.

ఎందఱోదార్చినను వాని రోధనములకు మేరలేకుండెను. గర్భవతి యైయున్న స్త్రీ యేడ్చిన నాయాసము గలుగు నని దాసీజనంబులెల్ల చంద్రావతినిగూడ నోదార్పఁజొచ్చిరి. కాని యచ్చట సయిత మేమియు గార్యము లేకపోయినది.

ఔరౌరా ! ఔరంగజేబుని క్రౌర్యానలం బెంతవఱకు వ్యాపించినది. పృథివిసింగును జూచి చాల దినము లైనందున వాని రప్పించి సభలోఁ గూర్చుండఁబెట్టుకొని ముద్దులాడి సురల జోధపురముసకుఁ బంపఁగానే రాచదృష్టి తగిలినందున నాతఁడు మరణమొందెనని యా పాపాత్ముఁ డవురంగజేబు యశవంతసింహుని కుత్తరమును వ్రాసెను. ఎంత సాహస మెంత సాహసము ! కుమారుని మరణవార్త శూలమువలె హృదయమున నాటినప్పటినుండియు బలం బుడిగి యారోగ్యము దప్పి క్రమముగ రోగపీడితుండై నిద్రాహారములు లేక యశవంతసింహుఁడు శుష్కించుచుండెను. కడకొకనాఁ డాతఁడు స్మృతిదప్పి ప్రాణము మీఁదికి రాఁగా వాని మంచము చుట్టును దుర్గాదాసు శివసింగు మొదలయిన వారెల్లమూఁగి కన్నీరుఁ గార్చుచు నేడువ నారంభించిరి. గోరుచుట్టుపై రోఁకటిపోటుకరణి నప్పటిసమయమున జంద్రావతి హృదయ మెట్లుండెనో చదువరులే గ్రహించుకొనఁగలరు. ఇట్లు పరివార మంతయు దుఃఖసముద్రమున మున్గియుండ నొక మహమ్మదీయ సేవకుఁ డరుదెంచి దుర్గాదాసునకొక జాబొసంగెను. ఆతఁడాజాబు చదువుకొని యశవంతసింహుని స్నేహితులలో నొకఁడు వ్రాసెననియు విషవస్త్రములఁ దొడిగి ఔరంగజేబే బలవంతముగ పృథివిసింగును జంపించెననియుఁ దెలిసికొని యశవంతసింహునెదుటఁ జదివెను. కాని యాతని కీలోకముపై రవ్వంతయు జ్ఞానము లేకుండెను.

నిక్కమైన పృథివిసింగు మరణవార్త రసపుత్రులెవ్వరైన యశవంతసింహున కుత్తరముద్వారా తెలియఁజేసెద రేమో యని

యనుమానమొంది ఔరంగజేబె వరెట్టి యుత్తరముల గొనిపోవుచున్నను వారిని బట్టి శిక్షించి యా యుత్తరములు గైకొని నాకడకుఁ దోడ్కొనిరండని తన సైనికులను మార్గమధ్యమునఁ గాపుంచెను. అందుచే యశవంతసింహున కుత్తరము లేమియుఁ జేరలేదు. కాని యీ యుత్తరము మాత్ర మెట్లో తప్పి వచ్చినది. తైలమంతయు ముగిసిన పిదపఁ గడసారి యొక్కమాఱు గప్పున వెలిఁగి దీప మాఱిపోవునట్లు యశవంతసింహుఁడు తెలివిఁ దెచ్చుకొని దుర్గాదాసును పిలిచి "ఓయీ! నా ప్రియ మిత్రమా! నేను పరలోకమునకుఁ బోవుచున్నాను. జోధపుర వంశమంతయుఁ గడకు దిక్కుమాలి నశించునేమో యని భయపడుచున్నాను. చంద్రావతి నవమాసములు భరించియున్నది. కావున నాతోడ సహగమనము చేయవలదని చెప్పుము. ఆమెను శత్రువులకుఁ జిక్కకుండ సౌఖ్యమున జోధపురమునకుఁ గొంపోయి మా వంశము నిర్మూలముగాకుండ నభివృద్ధిఁ జేసెద నని వాగ్దానము చేసిన నిర్విచారముగ నా ప్రాణములు విడిచెదను!" అని పలుక దుర్గాదాసు కన్నీరు దుడుచుకొనుచు వాని పాదములపైఁ జేయివైచి "యెట్టి కష్టములైన భరించి మీ జోధపురవంశము నిర్మూలముగాకుండ నే నభివృద్ధిఁ జేసెదను" అని పలికెను. అది చూచి మిగిలిన శివసింగు మొదలయిన పరివారమందఱునుగూడ నట్లే వాగ్దానముఁజేసి రాజ విశ్వాసమును వెల్లడించిరి. 1678వ సంవత్సరములో డిశంబరు నెల 8వ తేదిని పుత్రమరణ దుఃఖముచే యశవంతసింహుఁడు కీర్తిశేషుఁ డయ్యెను.

# అయిదవ ప్రకరణము

## ఔరంగజేబు ప్రతిజ్ఞ

ఆనాఁడెందుఁ జూచినను ఉదయపురి మహలులో నల్లకల్లోలముగ నుండెను. పరిచారికలందఱును గడగడ వడఁకుచు భీతచిత్తులై ఉదయపురి సమీపమునకుఁ బోవ వెనుదీయుచుండిరి. ఆమె మాటిమాటికిని చీకాకు పడుచు నరుణాలోచనయై దాసీజనము నెల్ల నావలకుఁ బొమ్మని కసర నారంభించెను. భోజనమునకైనను లేవక ఆయింతి తన నవారుమంచముపైఁ బరుండి తనలో నేమేమో దీర్ఘాలోచనము సేయఁదొడఁగెను. ప్రతిసేవకుఁడును నామె సమీపమునకుఁ బోవ వెఱచుచుండెను. ఉదయపురి తనచేతిలో నేదియో యొక యుత్తర ముంచుకొని మాటిమాటికి నందలి సంగతులు చూచుచు తన క్రోధమును వృద్ధిచేసికొనుచు, శయ్యపైనుండి తటాలున లేచుచు నుత్తరమును క్రిందఁ బాఱవైచుచుండెను. కాని, మరల నేమో కొంతవడికి తనలోఁ దలపోసి తల పంకించుచు పాఱవైచిన యుత్తరమును దీసి పొందుపఱిచి యొకచో నుంచుచుండెను. ఆనాఁడి ట్లుదయపురి యనేకవిధముల మనోవికార మంతయు వెల్లడిసేయుచు తదితరులకు భయము దోచునట్లు నటించుచుండెను. సేవకులును సేవకురాండ్రును మూలమూలల నక్కి తమలో గుసగుస లాడుకొనుచుండిరి. దేవి యిట్లాగ్రహ మొంది యుండుటకుఁ గారణ మేమని వారొండొరుల రహస్యముగఁ బ్రశ్నించుకొనిరి గాని, యందులకు గారణము వారందఱకు నగ్రాహ్యమయ్యెను.

ఔరంగజేబునకుఁ జాల కాలమునుండి యుదయపురమునఁ గల రాచ కన్నియలలో నెవ్వతెనైనఁ బెండ్లాడవలెనని కోరిక యుండెను. కాని ఆపురమునఁ గల రాజపుత్రులు నిరుపమ పరాక్రమశాలు లగుటచే వానికా కార్యము సాధ్యమైనది కాదు. కడ కాతఁడు తన పూనిక నెఱవేర్చుకొనఁ దలంచి రహస్యముగ నొక బీదరాచవానికి లంచ మిచ్చి యాతని కుమార్తెను వివాహము చేసికొని యామెకు "ఉదయపురి" యని పేరు పెట్టి తనపట్టపురాణిగఁ బాలించుకొనుచుండెను. తన కనేక మహమ్మదీయకాంతలు కాంతలై యుండినను, అపరిమితాభిమానము చేత, ఉదయపురినే పట్టపురాణిని జేసికొనియెను. ఉదయపురికి స్వాతిశయము మెండుగ నుండినను, మహమ్మదీయ వంశములోఁ గలిసిపోయినను, పుట్టుక రాచపుట్టు కగుటచే సహజముగఁ బతిభక్తి యామెకు విశేషముగ నుండెను. ఔరంగజేబును తన వలలో వేసి కొనుటయం దామెకు మిక్కిలి చాతుర్యము గలదు. దుఃఖము లేకున్నను, ఒక్కొక్కపుడు దుఃఖము వచ్చినట్లు నటించుట యందుఁ గూడ నామె కెవ్వరును సాటి లేరు. ఆనాఁ డామెహృదయ తలమున నాటిన దురాగ్రహ బీజము మొలకలెత్తి పెరిగి పుష్పించి వృద్ధియై నలువంకలకు వ్యాపించు చుండఁగా ఔరంగజే బామె నుహా లులోఁ బ్రవేశించెను. తత్క్షణమున నే సేవకుల గుసగుసలును, భీతిజనిత మైన వారిశరీర కంపమ్మును, కొందఱుసేవకులు మూలమూలల నక్కి యుండుటయును జూచి యాశ్చర్యాక్రాంత స్వాంతుఁడై యందులకుఁ గారణమాలోచింప సాగెను. పాదుషాను జూచినంతనే సేవకులందఱు మెల్ల మెల్లగ చాటునకుఁబోయిరి, ఔరంగజేబు క్రమక్రమముగా నుదయపురిని సమీపించెను గాని యామె కడు దీర్ఘాలోచనమున నుండుటచే కొంతవఱ కాతనిని జూడ కుండెను. తాను, తనమహాలులోఁ బ్రవేశించినంతనే యెదురుగ వచ్చి చేయి పట్టుకొని యాసనముపైఁ

గూర్చుండఁ బెట్టి ముద్దులొలుకు పలుకులఁ బ్రమోదము గలిగించు చుండిన యుదయపురి నాఁడు తన్నుఁ జూడకుండినందుల కేదియో యొక మహాకారణ ముండు నని ఔరంగజేబు గ్రహించి యామెకు మఱింత చేరువగఁ బోయెను. అప్పు డుదయపురి తన మగనివీక్షించి తటాలున లేచి యుచితగతి వానినిఁ గూర్చుండఁబెట్టి వాని సమీపము ననే తాను గూడఁ గూర్చుండెను. ఔరంగజేబు ఆమెముఖలక్షణము లన్నియుఁ గనిపట్టి.

"సుందరీ ! నేఁడు నీవేల యిట్లు చింతాక్రాంతవై యున్న దానవు ? నేను పంపించిన యుత్తరము లన్నియుఁ జదివితివా ?"

"మహారాజా ! అన్నియుఁ జదివితిని."

అని మొగము వాల్చుకొని కన్నీరు దుడుచుకొనుచు ప్రత్యుత్తర మిచ్చెను. పిదప ఔరంగజేబు.

ప్యారీ ! నీవిచారమునకుఁ గారణము చెప్పవేల ? నేనుండఁగ నీకేమి కొఱఁత గల్గును ? తత్క్షణ మెఱింగింపుము."

"ఎఱింగించుట కేమున్నది ? మొగలాయి చక్రవర్తివైన నీకుఁ బెండ్లిచేసిన నే నెల్లసౌఖ్యములఁ బొందఁగలనని నాతండ్రి నన్ను నీకప్పఁ జెప్పెను. కాని నాకపనింద గలుగునని యోచింపఁడయ్యె."

"అరే ! ఏమిది ? మొగలాయి సామ్రాజ్య లక్ష్మీ దురంధ రుండనగు నన్నుఁ బెండ్లాడిన నిన్నెవరైన నిందించిరా యేమి ? చెప్పు చెప్పు."

"మహారాజా! నాఁటనుండియు మీచెట్టఁ బట్టి నేనెల్ల సౌఖ్యము లనుభవించుచు దేవేంద్రుని రాణి వలె మెలఁగు చుంటిని గాని నేఁటితో మీకును నాకును ఋణము దీఱిపోయినది."

"అబ్బా ! చెప్పు మన్న నీకాలయాపన మేల ? నిన్నెవరే మన్నను వారిని నీకండ్ల యెదుటకే రప్పించి నీవు చూచుచుండఁగనే కఠిన దండన గావించెదను. వేగము చెప్పు చెప్పు."

"నాథా ! నే నేనూతిలోనైనను గోతిలోనైనను బడి ప్రాణములు విడిచెదను. అంతియ కాని నేనింక నీయపనింద భరింపఁ జాలను. ప్రాణములతో నుండి యిట్టి యవమానము భరించుటకన్న చచ్చి స్వర్గమున నుండుట మేలు. నేను గతించినంత మాత్రమున మీకు లోపము సంభవింపదు. మీకు నాయట్టి భార్యలు పలువు రున్నవారు. ఇంతియ కాక చక్రవర్తులైన మిమ్మేకాంత యైనను గోరి వరించును. గ్రుడ్డు వచ్చి పిల్లను ధిక్కరించిన ట్లీదుష్టాత్మురాలు నన్నుఁ దూలనాడుచు నుత్తరము వ్రాసెను. మహారాజా! నాకింక సెలవొసంగుఁడు"

"ప్యారీ ! నే నెంత బతిమాలినను స్పష్టముగ చెప్పవేమి ? ఏ దుష్టాత్మురాలు నిన్నిట్లు దూలనాడుచు నుత్తరము వ్రాసెను ? ఆ యుత్తరములోని సంగతులేమి ? తత్క్షణము నా కెఱింగింపుము. ఆదుష్టురా లెవ్వతెయైనను నీయెదుటనే ఘోర పరాభవము గావించి నీపగ యెల్ల దీర్చెదను. ఇంక నాలస్యముచేయక ఆ యుత్తరము నాకు వినిపింపుము."

అని యనేక విధముల ధైర్యము చెప్పి తన్ను ప్రార్థింపఁగా నుదయపురి తన చెంతనున్న యుత్తరము దీసి కన్నీరు దుడుచుకొని ఔరంగజేబున కిట్లు మెల్లగ వినిపింప నారంభించెను.

మహాలక్ష్మి సమానురాలును, మాపినతల్లిగారును, నగు చంద్రావతీ మహారాణీ గారి దివ్య సముఖమునకు

రూపనగరాధీశుఁడైన విజయసింహుని కూఁతురు విమలాదేవి వ్రాసికొనిన విజ్ఞాపన మేమనఁగా,

శ్రీయశవంతసింహ మహారాణాగారితో మీరుగూడఁ గాబూలు దేశమునకుఁ బ్రయాణమై వెడలితి రని విన్నప్పటి నుండియు నామనంబున నొక తీవ్రైన యనుమానము జనించి బాధించు చుండెను. అందులకనుకూలముగ ఔరంగజేబు మన వంశవృక్షమును వ్రేళ్లతోఁబీకి

పాఱవేయఁదలంచినాఁడు. అమాయకుండైన మనపృథ్వీసింగును రప్పించి వానికనేక విధములఁ గుటిల మర్యాదలొసఁగి, తుదకు విషవస్త్రములఁ గట్టించి యాతనిని బలిమిని జంపించినాఁడు. భీతచిత్తులైన రాజపుత్రులు కొందఱు వానికి విధేయులై యుండుటచేఁ గదా మన కిన్నికష్టములు సంభవించుచుండుట ? దయాదాక్షిణ్య మెఱుఁగని యాతని క్రూర కృత్యము లెన్నాళ్లిట్లు కొనసాగుచుండునో తెలియదయ్యె. మన క్షత్రియ వంశమున కైకమత్యము లేని కారణమె కదా యింతకును ముఖ్యము ? దినము గడచుట దేశమున కెల్ల దీర్ఘాయువుగ నున్నది. సమయము చిక్కిన రాజకన్యలను బలిమినైన ఔరంగజేబు పెండ్లాడఁ దలఁచుచుండెను. అయినను ఉత్తమ రాజపుత్రస్త్రీ ప్రాణములనైన విడుచును గాని, యింతటి నీచ కృత్యమున కొడంబడదు. ఒక్క యుదయపురి మాత్రము మన వంశమునకుఁ గళంకము తెచ్చినది. తురకను చేపట్ట నా మాతృరా లెట్లు సమ్మతించెనో తెలియకున్నది ? ఇట్టి నీచాంగనలు వసుంధరాదేవికి మోఁతచేటునకుఁ గాక వేఱేమి ప్రయోజనమున్నది ? ఔరంగజేబొనర్చిన యీ ఘోరకృత్యము రాజపుత్రస్థానమునం దంతట నీవఱకే వ్యాపించి యుండుట మీకుఁ గూడఁ దెలిసియే యుండవచ్చును. మన కీయభాగ్య దేవత యెన్నాళ్లుండునో యన్నాళ్లు భరింపక తప్పదు. శరీరములు క్షణభంగురములు గావున మీరు ధైర్యము వహించి రోదనంబుడిగి మాపినతండ్రిగారి నోదార్ప వలయు. మీరింక విచారించి ప్రయాస పడవలదు. ఇంతకును మించిన దానికై వగచిన నేమి ప్రయోజనము ?

"విమలా దేవి."

ఉత్తరమంతయు విని సంగతు లామూలాగ్రముగ గ్రహించి ఔరంగజేబు దురాగ్రహ పరుఁడై యుదయపురిని జూచి "ప్యారీ ! నీవిచారం బింక చాలింపుము. ప్రచండ మగు నా సైన్యము రూపనగరము పైకంపి యాపురమంతయు ధ్వంసము చేయించి క్రూరాత్ములగు

నా విమలను బట్టి తెప్పించి నీకు దాసినిగా నియమించెదను. ఇంతులకుఁ దప్పిన నేను మహమ్మదీయునకుఁ బుట్టినవాఁడను గాను; ఔరంగజేబనుగాను. అల్లాతోడుసుమీ, ఖురాను మీఁదను గానక మహోన్నతముగ యిట్లు చెప్పుచున్నాను నన్నును నిందించిన విమలను నీవు చూచుచుండఁగనే మన ముసల్మానదునకుఁ బెండ్లి చేసి నీకుఁ బరిచారికగా నియమించెదను. నీ వింక విచారము మాని యుండుము. ఇది అలమ్గీరు పాదుషా యొక్క ప్రతిజ్ఞ." అని అనేకవిధముల నామె నోదార్చి యప్పుడే యామె చూచుచుండ, తన సేనానాయకుండగు హిదయత్ ఖాను అను వానికి సైన్యముల సిద్ధముచేయవలసిన దనియుఁ, మూఁడుదినములలో నలువది వేల సైన్యములఁ జేకొని రూపనగరముపై దండెత్తి బయలుదేఱ సిద్ధపడవలయు ననియు, విజయసింహుని పట్టణ మంతయు ధ్వంసముచేసి యతని కూఁతును బట్టి తనకడకుఁ గొని రావలయుననియు నుత్తరము వ్రాసెను. ఆ యుత్తరముఁ జూచి యుదయపురి యమందానందహృదయయై తన మగని ననేకభంగులఁ గొనియాడెను. ఇంతలో నా ప్రాంతమున నెవరో నడచుచున్నట్లు కాలిచప్పుడు వినఁబడ ఔరంగజేబు "ఎవరురా అక్కడ?" అని యడుగ "స్వామీ! నేను మసావదు సేవకుఁడను" అని ప్రత్యుత్తరము రా, వెంటనే యాతఁడు వానిని లోనికి రప్పించెను. సాధారణముగ మహమ్మదీ యాంతఃపురములలోఁ బనిపాటలు సేయ ఖోజాలను నియమించుచుండుట యప్పటి యాచారమై యుండెను. వారే ద్వారపాలకులు. వారే పరిచారకులును సేవకులును. ఉదయపురి మహాలులోఁ గల ఖోజాలకందఱకును మసావదు నాయకుఁడై యుండెను. వానిరూపము చూచిన యమదూతలు జ్ఞప్తికి వచ్చుచుందురు. వాని శరీరచ్ఛాయ అమావాస్యనాఁటి చీఁకటిని దిరస్కరించుచుండెను. ఆ నలుపునకుఁ దోడుగ నాతఁడు తగినంత పొడుగరి యగుటచే వాని వికారాకారమును జూచిన పరిహాసముగా నుండెను. ఉదయపురి

యనుగ్రహమునకుఁ బాత్రుఁడై యుండవలయు నని యాతఁడు, ప్రతి కార్యము చక్కఁగ నిర్వర్తించుచు నయభయముల నిరంతర మామె యెడల మెలఁగుచుండెను. ఔరంగజేబు తన్ను లోనికి రప్పించినంతనే మసానదు, దూరముననుండియే వంగివంగి సలాములు చేయుచు మహా వినయముతో చేతుల జోడించి పాదుషాను సమీపించెను. అప్పుడు ఔరంగజేబు తానువ్రాసిన యుత్తరము వానికిచ్చి తత్క్షణమే సాదతు ఖానున కిచ్చివేయవలయు నని వానిఁ బంపెను.

ఔరంగజేబు తాను పృథివిసింగును జంపిన వృత్తాంతము రాజపుత్రు లెవరైన కాబూలులో నున్న యశవంతసింహునకు వ్రాసి తనరహస్యము వెల్లడిచేసెదరేమో యను భయమున, తన సెలవుచీటి లేకుండ కాబూలునకుఁ బోవువారి నడ్డగించి వారియొద్ద నుత్తరము లేమైన నున్నయెడల బలిమిని గ్రహించి తనకడ కంపవలయు నని కొందఱుభటులను మార్గమధ్యములఁ గాపుంచెను, పాదుషా సెలవు ప్రకారము వారు మార్గములఁ గాచి బాటసారులను మర్దించి, వారియొద్ద నుండు నుత్తరముల నెల్ల గ్రహించి కూడఁబెట్టి అవి యొక నాఁడు ఔరంగజేబునకుఁ బంపిరి. ఆ యుత్తరములన్నియు మార్వాడ భాషలో విరచింపఁబడి యుండెను. తన కా భాష తెలియనందున, తనభార్య మార్వాడదేశపు రాచకన్నియ యైనందున నామె కాభాష తెలియఁగలదని యెంచి, ఆ యుత్తరము లన్నియుఁ జదివి తన కందుల సంగతులు చెప్పవలయు నని యుదయపురి కంపెను. ఆమె ప్రతి యుత్తరమును దీసి చదువుచుండ కొంతసేపటికి ఒకదానిలో నింకొకటి మడతపెట్టి యుంపఁబడిన యొక్క యుత్తర మామె తీసెను. ఆ యుత్తరములోని యక్కరములు లించుగ వంకరగ నుండుటచే, చేతి వణఁకు గల యొకవృద్ధుఁడు వ్రాసి యుండనచ్చునని యామె గ్రహించి కడముట్టఁ జదివి క్రింద విజయసింహుని వ్రాలు చూచెను. విజయసింహుని యుత్తరమున నిక్కమైన పృథివిసింగు మరణవృత్తాం

తేము దక్క తదితర సంగతులు విశేషముగ లేవు. అందులోపల నుంపఁబడిన యుత్తరము దీసి యందలి యక్కరములు ముత్యములవలె చక్కఁగ నుండుటచే నెవ్వతెయో యొకజవ్వని వ్రాసెనని గ్రహించెను. ఆ యుత్తరమే విమల వ్రాసిన యుత్తరము. అందుఁగల యొక్కొక్క వాక్య మొక్కొక్క శూలమువలె నాటి ఆమెహృదయమును బాధింపఁ జొచ్చెను. కడకు తన కసిదీఱ పాదుషాచే ప్రతినఁ జేయించినఁ గాని యుదయపురి సంతాపము దీఱలేదు. ఆమె కోపాలనమును జల్లార్చి ఔరంగజేబు తా నంపిన యుత్తరములన్నియుఁ జదివించెను. కాని ప్రతియుత్తరమందును ప్రతి రాజపుత్రునిచేతను, తాను పృథివిసింగు నెట్లుచంపించెనో ఆ వృత్తాంతమే యశవంతసింహుని పేర వ్రాయఁబడి యుండెను. అంతఃపురమున తనగుట్టు నెవ్వరు నెఱుఁగలేదని సంతసించు చున్న పాదుషా ఆ యుత్తరములన్నియు విని ఆశ్చర్యాక్రాంతుఁడై, “ఔరా! రాజపుత్రులకు దివ్యదృష్టి గలదా యేమి? అని నిర్ఘాంతపడి చూచుచుండెను. పిల్లి కుండలోని పాలెల్ల కన్నులుమూసికొని చెడఁ ద్రాగుచు తన దొంగతన మెవ్వరు చూడలేదని యనుకొనుట సహజమేకదా? అట్లే ఔరంగజేబుకూడ తనరహస్య మెవ్వరు కనుఁగొనలేదని సంతసించెను. కాని గోడలకుఁ జెవులున్నవను సంగతి యెఱుంగఁడయ్యె.

విజయసింహుఁడు తనకుమారితచే నట్టియుత్తరము వ్రాయించుటకుఁ దొలుత సందేహించెను గాని, ఆయుత్తము యశవంతసింహున కందిన మేలేయనియు, అట్లుకాక ఒకవేళ పాదుషాకుఁజిక్కిన వానితో యుద్ధము సంభవించుననియు, అట్టులైన తనపరాక్రమము గూడఁ జూపవచ్చుననియు భావించెను. ఈ రెండు విషయములలో నేదియైనను మేలే యని యాతఁడట్టిసాహస మొనర్చెను.

# ఆఱవ ప్రకరణము

## చ ం ద్రా వ తి

కుమారుని మరణమును సీమ్నకట
మగని మరణమును చంద్రావతిని దుఃఖ
సముద్రములో ముంచెను. సహజ ధైర్యశాలిని యగు నిందిర ఆమె
నెన్నియో మాఱులోదార్చెను గాని చంద్రావతి నిర్వారమును బట్టఁ
జాలక మగనితోఁ గూడ సహగమనముఁ జేయ నుద్యమించెను. కాని,
దుర్గాదాసు, శివసింగు మొదలగు వారందఱు నామె సాహసమునకు
భీతిల్లి పాదములపైఁ బడి యామె నిట్లు ప్రార్థించిరి. "తల్లీ చంద్రావతి!
నేఁటితో జోధపుర వంశమంతయు నాశనముగా సిద్ధముగ నున్నది
నీవు గర్భవతివై యుండుటచేఁ బ్రాణ పరిత్యాగముఁ జేసితి నేని పాతకము
సంభవించును. నీ గర్భమున నున్న బిడ్డను దలంచుకొని ధైర్యము
వహించి ఆ మూలమున నీ వంశము గాపాడ వలయునని మేమందఱముఁ
గంకణము గట్టుకొని యున్నారము. మా యాశలన్నియు నిరాశలు
చేయకుము" అని యనేకవిధముల బతిమాల చంద్రావతి తన
సాహసము మానుకొనెను. దుఃఖాతిశయమున సహగమనము చేయ
బ్రయత్నించెను గాని చంద్రావతి యవివేకురాలు గాదు. సామాన్య
స్త్రీలలో నామె నెన్నుటకు వీలులేదు. రాజపుత్రస్థానమున నామెపై
అభిమానమును పూజ్యభావమును లేని పురుషుఁడు లేఁడు. యశవంత
సింహునిఁ దిరస్కరించుచుండినను చంద్రావతిని మాత్రము రాజపుత్రులు
కులదేవతగ భావించుకొనుచుండిరి. యశవంతసింహుఁడు దారాపక్ష
మవలంబించి వానికిఁ బరాభవము గలిగిన తరువాత తాను శత్రువగు

నౌరంగజేబునొద్ద నుద్యోగములోనుండుట ఎవ్వరికి నిష్టములేదు. అందువలన నెల్లవారు వానియెడల నసూయ గలిగియుండిరి. కాని చంద్రావతిమాత్ర మట్టిదికాదు. ఆమె ఉదయపురరాజుల యింటి ఆడుఁబడుచు. వీరపత్నులకు నుండవలసిన సద్గుణములన్నియు నామె యందు ప్రత్యక్షములై యుండెను. ఎప్పుడైన నలుగురు రాజపుత్రు లొక్కచోఁగూడి జోధపురమునుగూర్చి మాటలాడుకొనునప్పుడు, యశవంతసింహుని నిందించుటయు, వెంటనే చంద్రావతిని గొని యాడి, పుట్టిన చంద్రావతి గర్భమునఁ బుట్టవలెనని యామెకుఁ జేతు లెత్తి నమస్కరించుచుండుటయు జరుగుచుండెను. ఆమె విషయమై రాజపుత్రులకు బూజ్యభావ ముండెనని నొక్కి వక్కాణించుట కింకొక కారణముగూడ గలదు.

క్రీ. శ. 1658 వ సంవత్సరమునందు దక్షిణదేశమునుండి ఔరంగజేబు సైన్యములతోవచ్చి తండ్రిపైఁ దిరుగఁబడెను. వాని నెదిరించుటకునై షాజహానుని యాజ్ఞఁ గైకొని యశవంతసింహుఁడు బయలుదేరెను. ఉభయ సైన్యములకును మాళవదేశమందు ఉజ్జయిని పట్టణమువద్ద ఘోరయుద్ధము జరిగెను. అందు యశవంతసింహుఁడు తన బాహుపరాక్రమము పూర్ణముగాఁ జూపెను. కాని వాని సైనికు లందఱు యుద్ధరంగమునఁ గడతేఱినందున నాతఁడు చావఁగా మిగిలిన పదుగురు భటులతో విధిలేక పాఱిపోవలసివచ్చెను. తన భర్త యుద్ధమునం దోడిపోయి వచ్చుచున్నాఁడని తెలియఁగనే శూరా గ్రేసరియగు చంద్రావతి మండిపడి గ్రామము చుట్టు నుండు కోట ద్వారము లన్నియు మూయించి యెవ్వరిని లోనికి రానీయవలదని కావలివారికిఁ గఠినముగ నాజ్ఞాపించెను. చంద్రావతి పరమ పతివ్రత యైనను ఆకాలమునం దామెయందు పౌరుషమును, శూరత్వమును విశేషముగ నుండుటచే నిట్టి సాహసమున కొడంబడెను. క్షత్రియుఁడై

పుట్టినతరువాత యుద్ధములో జయమైన నొందవలయును, లేదా మరణ మైన నొందవలయు. అట్టితఱి తనమగఁడు శూరవంశజుఁడును, మహా క్రమవంతుఁడునయ్యు యుద్ధములో నోడిపచ్చినందున క్షత్రియ కుల మునకంతకుఁ గలంకము గలుగునని తలఁచి యశవంతసింహుఁడు లోనికి రాకుండ ద్వారములు మూయించి యాతఁడు మరల యుద్ధమునకుఁ బోవునట్లు పురికొల్పవలయు నని నిశ్చయించెను.

యశవంతసింహుఁడు శత్రువులకుఁ జిక్కకుండ మాఱువేషము లెన్నియో వేసికొని పదిమంది భటులతో జోధపురమార్గమును సమీపించెను. కాని ద్వారములన్నియు మూసియున్నందున లోనికిఁ బోవుటకు వీలు లేదయ్యె. తాను జోధపురాధీశుఁడయ్యు జోధపురమునఁ బ్రవేశింప మార్గము గానక అతఁ డాశ్చర్యమొందెను. ద్వారపాలురకుఁ దన పేరుచెప్పి వారిని నయభయముల బోధించెనుగాని వారు "మారాణీగారి సెలవులేనిదే తలుపులఁ దీయ" మని గట్టిగాఁ జెప్పిరి. కోటబురుజుపై నిలువఁబడి చంద్రావతియు నామె కుమారుఁడగు పృథివిసింగును తమ్ముఁ జూచుచున్నారని తెలిసినంతనే, యశవంత సింహుఁడును, అతని పరిజనులును, చంద్రావతియున్న బురుజునద్దకుఁ బోయిరి. యశవంతసింహుఁడు సిగ్గుచే చంద్రావతిని జూడలేక బురుజు క్రిందఁ బ్రక్కనే నిలువఁబడి యుండెను. అతని సేవకులలో నొకఁడు పైనున్న చంద్రావతిని జూచి "అమ్మా మహారాజా యశవంత సింహ మహారాజుగారు వచ్చియున్నారు. దుర్గద్వారముల తెరిపింపుఁడు" అని వేఁడెను. అందుపై నా వీరవనిత వానిని జూచి "ఓయీ! ఉదయపుర జోధపురములందలి శూరవనితలకుఁ బుట్టిన మగవాఁడు పగఱకు వెన్నిచ్చి యెన్నఁడును పాఱిరాఁడు అని నా నిశ్చయము. మీవంటి సిగ్గుమాలిన వారుమాత్రము కాళ్ళకు బుద్ధిఁజెప్పి రాజపుత్రుల కపకీర్తిఁ దెచ్చెదరు. రణములో నా పతి పడిపోయిన

మాట నిక్కమే. వానితో మీరుగూడ యుద్ధమందేల ప్రాణములు విడువలేదు? సిగ్గు విడిచి యాడుదానివలె చేతులకుఁ గాజులు దొడిగించుకొంటిరా? మహారాణాగారు వచ్చిరని నాతో నబద్ధమాడెద రేల? పౌరుషమును విడనాడి యెన్నఁటికైన నాపతి యిట్లు పాఱిపోయి వచ్చునా? పొండు పొండు. మీరందఱుఁ దిరిగి యుద్ధభూమికిఁ బోయి మగవారివలెఁ బోరుఁడు," అని పలికెను.

ఆమాటలు విని సేవకు లేమిచెప్పుటకుఁ దోఁపక యశవంతసింహుఁ డేమిచేయునో యని వాని మొగమువంక జూడసాగిరి. బురుజు క్రింద ఒకమూలనడఁగియున్న యశవంతసింహుఁ డేమిచేయుటకుఁ దోఁపనందునఁ గొంతసే పాలోచించి సగము చచ్చినవాడై విధి లేనందున "సుందరీ! చంద్రావతీ! నేనే నిజముగ యశవంతసింహుఁడను" అని యెట్టులో పలికెను. పైనున్న చంద్రావతి ఆ మాటలు వినియు విననట్లు నటించి క్రోధమును బెంచుకొని క్రిందఁ దనకుఁ గానవచ్చుచుండిన సరదారులను జూచి "ఏమి? యుద్ధభూమికిఁ బోకుఁడ నింకను నిలిచి యున్నారా? మీరు పోకున్న యెడల పట్టణములోనుండి మఱియొక సైన్యమునుబంపి నా ప్రియభర్తను యుద్ధములో విడిచి వచ్చినందులకు మిమ్ముఁ జెండాడించెదను," అని కఠినముగఁ బలికెను. లోనికిఁ బోవుటకు యశవంతసింహుఁ డెన్నివిధములనో ప్రయత్నించెను. తుదకాతఁడు చంద్రావతిని బెదరించుచు వర్తమానము లంపెను. కాని అంతమాత్రమున నామె లొంగినదికాదు. "శత్రువుల కోడి పాఱిపోయి వచ్చినవారికి స్త్రీలను బెదరించుటతప్ప మఱేమి చేతనగును? శత్రువుల జూచి బెదరివచ్చిన వారి బెదరింపులకు నాఁడువారైన నేల భయపడుదురు?" అని చంద్రావతి ప్రత్యుత్తర మంపెను.

అంతఁ జేయునదేమియు లేనందున యశవంతసింహుఁడు తన పరిజనులతో గ్రామము వెలుపలనున్న శివాలయములోఁ దిగెను,

యుద్ధములోఁ బెక్కుగాయములు దగిలినందునను, భార్యవలనఁ గలిగిన యవమానము వల్లను, ఆతని కారాత్రి యపరిమితమైన జ్వరము వచ్చి పదియైదు దినములవఱకు విడువలేదు. తొమ్మిది దినములవఱకీ సమాచారము నిజమని చంద్రావతికిఁ దెలియలేదు. రాణాను లోనికి రానిచ్చుటకుఁ జేసిన యుపాయ మనితలఁచి యామె యుపేక్షఁ జేసెను. కాని తన చారులు నిక్కమే యని పలుమాఱు చెప్పుటచే, ఆ సంగతి కనుఁగొనవలయునని ఆమె దాసివలె వేషము వేసికొని రాణాయున్న శివాలయమునకుఁ బోయెను. అచ్చట యశవంతసింహుఁడు నిద్రాహారములు లేనందున క్షీణించి జ్వరపీడితుఁడై ప్రాణమాత్రావశిష్టుఁడై పడియుండెను. అదిచూచి చంద్రావతి తన నిష్ఠురతకుఁ జింతించి పట్టరాని దుఃఖముతో నాతని కాళ్లపైఁబడి క్షమింపుడని ప్రార్థించి, యేడ్వనాగెను. యశవంతసింహుని కామెపైఁ దొలుతఁ గోపము వచ్చినను పిదప క్షమించి యాదరించెను. ఆ సాధ్వి యచ్చటనే యుండి పరిచర్య సేవఁ జేసి జ్వరము నిమ్మళించినవెంటనే పట్టణము లోనికిఁ దీసికొని పోయెను.

ఇట్లీ సాధ్వీమతల్లి మొదటఁ జూపిన శూరత్వము వలనను, తరువాతఁ జూపిన పాతివ్రత్యంవలనను, ఆమెకీర్తి రాజపుత్రస్థానమునందంతట వ్యాపించినందున, అందఱు నామెనొక కులదేవతగాఁ గొల్వసాగిరి. ఔరంగజేబు చేసిన కుట్రవలన యశవంతసింహునకుఁ గలిగిన సంకటములలోఁ జంద్రావతీదేవి తన పతిభక్తి నంతయు వెల్లడించెను. కాబూలు దేశమునకుఁ బోవునపుడు కుమారుఁడైన పృథివిసింగునకు రాజ్యమిచ్చి నీవు నీ కుమారునియొద్దనే యుండుమని యామెతో యశవంతసింహుఁడు చెప్పెనుగాని గర్భవతియయ్యు నా సాధ్వీమణి యామాటలను సమ్మతింపక పుత్రప్రేమ సయితము విడిచి సీతాదేవివలె భర్తవెంటఁ బయలుదేఱెను, అచ్చటికిఁ బోయినతరువాత పుత్ర మరణమును మగని మరణము నొక్కమాఱు సంభవించినందున నా శూర

వనిత తన ధైర్యమంతయుఁ తన మగనివెంటనే పంపి తా నొక సామాన్యమగు నబల కావలసివచ్చెను.

మగనితో సహగమనముఁ జేయ నుద్యమించెను గాని దుర్గాదాసు మొదలగు వారి ప్రార్థనలఁ గైకొని యామె తన సాహసమును మానుకొనెను. శత్రువుల వలన నేమియు భయము గలుగకుండ దుర్గాదాసును, శివసింగును ఆమెను గాపాడుచుండిరి. బుద్ధిశాలియగు నిందిర ముచ్చటలైన కథలఁ జెప్పుచు చంద్రావతికి సంతసము గలుగఁ జేయఁ బ్రయత్నించుచుండెను. ఇందిర తన యన్నయగు దుర్గాదాసు వలెనే కార్యోపాయములు చక్కఁగ నెఱిఁగి చంద్రావతికిఁ బ్రాణసఖియై యామె యనుగ్రహమునకుఁ బాత్రమై యుండెను. చంద్రావతి తన దుర్గతినంతయుఁ దలపోసి కొనుచు నింక నెట్టి కష్టములు రానున్నవోయని చింతించుచుండెను.

అట్టి విచారకరమగు సంగతులతోపాటు సంతోషదాయకమగు నొక శుభవార్త మనము వినబోవుచున్నాము. ఈ ప్రకారము రెండు దినములు గడచినంతనే మూఁడవనాఁటి ప్రాతఃకాలమున శుభముహూర్తమున చంద్రావతీ మహారాణీగారి కొక మగ శిశువు జనించెను. ఈ కారణమున నచ్చటి పరివారమునకుఁ గల విచారమునఁ గొంత భాగము తగ్గెనని వ్రాయుట కనుకూలముగ నున్నది. ఇందిరా చంద్రావతులును దాస దాసీజనములును నానంద మొంది తమ దుఃఖమునఁ గొంత యెడమిచ్చిరి. కాని యీ సంతోష మెంతోసేపు వారి హృదయముల నుండలేదు. యశవంతసింహుని మరణమును చంద్రావతి కుమారుఁడైన అజితసింగుని జన్మమును ఔరంగజేబు వినిన నెట్టి మోసముగావించునో యని దుర్గాదాసు విచారించుచుండెను. కాని శివసింగును నాతఁడును ధైర్యశాలులు గావున నెట్టి కష్టములకైన నోర్చి జోధపురవంశమును రక్షింపఁ గంకణము గట్టుకొని యుండుటచే ఔరంగజేబునకు వెఱచువారు కారు. ఆ కాలమున రాజపుత్ర వీరు

లలో వా రిరువురును పేరుపొందినవారు. దేశాభిమానమును, రాజభక్తియు వారికడఁగదా నేర్చుకొనవలయు ! రాజ్యకార్య నిర్వహణంబున నెడ తెగని చాతుర్యము గలవారు. దుర్గాదాసు చెల్లెలైన యిందిరయు సద్గుణములలో నన్నగారితో దులఁదూఁగుచుండెను. స్త్రీ యయినను నామెకుఁ గల ధైర్య మొరులకు లేదు. ఈ ముగ్వురి సద్వర్తనములుఁ జదువరులు ముందు ముందు గ్రహింపఁ గలరు. పురుటి దినములు గడచిన వెంటనే కాబూలు దేశమునుండి చంద్రావతిని, అజితసింగును ఎట్టులైన సాధ్యమైనంత త్వరలో సౌఖ్యముగ జోధపురముఁ జేర్పవలయు నని వా రూహించుచుండిరి. కాని వారి ప్రయత్నములు గొనసాగక పూర్వమే యొకనాఁటి మధ్యాహ్న మొక మహమ్మదీయుఁడు వారి గుడారము వద్దకు వచ్చి "దుర్గాదాసెక్కడ ?" అని కేకలు వేసెను. గుడారములో నున్న దుర్గాదా సా మాటలు విని పైకి వచ్చినంతనే యా మహమ్మదీయుఁడు వాని కొక యుత్తర మిచ్చెను. దుర్గాదా సా యుత్తరము విప్పి ఆతురతో నిట్లు చదువ నారంభించెను.

"యశవంతసింహుని సేనాధిపతి దుర్గాదాసునకు
ఢిల్లీనగర నాయకుఁడైన ఔరంగజేబు పాదుషా
వ్రాసిన సంగతు లేమనఁగా

పుత్త్రశోకమున యశవంతసింహుఁడు పరలోకమున కేగె నని విన్నప్పటి నుండియు నేను గడువిచారించుచుంటిని. దూర దేశమగు కాబూలులో నుండుటచే చంద్రావతి కెట్టి కష్టములు గలుగునో యని ఆమెకు సహాయునిఁగ మా సేనానాయకుండగు నయనపాలుని సైన్యములఁతో బంపితిని. కావున గతించిన యశవంతసింహునికై విచారింపక చంద్రావతిని వెంటఁబెట్టుకొని నయనపాలునితో నీవు ఢిల్లీ నగరమునకు రమ్ము."

"ఔరంగజేబు."

మతిక్రమించుచున్నది గాని కార్యము కొనసాగు నుపాయము వానికిఁ గానరాకున్నది. జోధపురవంశమున కెట్టి యిక్కట్లు సంభవించిన నవి దొలంగించు భారము తనపై నున్నది గావున, దుర్గాదాసు హృదయము పరిపరివిధములఁ బోవసాగెను. నయనపాలుఁడు తన సైన్యమంతయును గుడారమునకుఁ జుట్టును గానలియుంచెను. ఇంతియకాక దుర్గాదాసును నాతని చెల్లెలగు నిందిరయుఁ దక్కఁ దక్కటి వారావలకు నీవలకుఁ జోఁగూడదని కూడ నాజ్ఞాపించెను. కార్యోపాయము లెటింగించుట యందిందిర కసమర్థురాలయని దుర్గాదాసామెకడకుఁ బోయి యా నాఁటిరాత్రి యెల్లరు [illegible]చుచుండఁ దగిన సమయమని యామెను లేపి రహస్యముగ నిట్లనె:

దుర్గా : ఇందిరా! కాఁగల [illegible]నేకములుండ నీవు నా కుపాయములు చెప్పక యిట్లు స[illegible]టమేల ?

ఇందిర : అన్నయ్యా! నేనుమాత్ర మెఱుఁగనా? దైవఘటన మెట్లున్నదో తెలియకున్నది. శత్రువుల వారినుండి చంద్రావతిని, [illegible] సింగును దప్పించు నుపాయము గానరాకున్నది. యశోవంతసింహ మహారాజాగారి ఋణము మనమెట్లు తీర్చుకొనఁగలము?

దుర్గా : నేనుఁగూడ నందులకే విచారించుచుంటిని. నీవు నాకన్న చతురమతివిగాన నేదైననుపాయ మెఱిఁగించెదవేమో యని యిట్లు వచ్చినాఁడను. నయనపాలుఁడు మనల మోసపుచ్చవలయునను తలంపుతోనున్నవాఁడు. వాని నెట్లైన మోసపుచ్చవలయునను తలంపు నాకుఁగూడనున్నది. కాని దైవ మెట్టియుపాయమును దోఁపనీకున్నది.

ఇందిర : నయనపాలుని బలిమిని జయించెదమన్న, మనకున్న సైన్యములే స్వల్పము. అందుసగము తురకలసైన్యములే! యుద్ధమున వెనుక దిరిగి మనపై బడకమానరు. ఏమిసేయవలయును?

దుర్గా : ఇందిరా! అది యెంతమాత్ర మిప్పటి కనుకూలమైన పనిగాదు. అట్లుచేసితిమేని మోసము సంభవించును. నయనపాలునితో

స్నేహామునుండియే లోలోన మనకార్యము కొనసాగించుకొనవలయును. ఆతఁడునుగూడ సామాన్యుఁడు గాఁడు, ఆతఁడెటువంటి మాయల నైనన్ రెఱుఁగగరు, కాలుక్రిందనైనఁ గన్నము ద్రవ్వఁగలవాఁడు. [illegible] ద్రేవులు లెక్కించువాఁడు. అట్టి వానిని మోసపుచ్చుటయన్న సామాన్యుల మీఁద జరుగుపనికాదు. బుద్ధిమతివిగాన నీవే యేదైన నుపాయము మాలోచించి క్రోధపురవంశమును రక్షించుకొనుము. నా బుద్ధియు, చాతుర్యమును, బలమును యశోవంతసింహుని వెంటనే పోయినవి. నా కొక యుపాయము తోఁచుచున్నది. దాని నీకు సమ్మతమైనచో తెల్పెదను వినుము.

అని రహస్యముగ నిందిర చెవిలో నేమో చెప్పి "చెల్లెలా! దీనికి నీ వంగీకరింపవలయు. లేనిచో మన కార్యములు కొనసాగవు సుమా" యని ప్రార్థించెను.

ఇందిర దుర్గాదాసు చెప్పిన యుపాయమునకు సంతసించి "అన్నా! నీ కెంతమాత్రమును సందియము వలదు. నీ యాజ్ఞ నేను తీరెదను. కంఠమునఁ బ్రాణ మున్నంతకాల మెట్టి కష్టములకైన నోర్చి యున్నినాళ్లు మనలఁ బెంచిన యశోవంతసింహునిపై నా [illegible] మును జూపెదను. ఇందునకై నా ప్రాణములైన లక్ష్యింపక నిచ్చెదను. నీ వెంతమాత్ర మనుమానింపకుము. సంపదలు శాశ్వతములుగావు. ఆపదలు కాఁపురముచేయవు. రెండు మూఁడు దినములలో మన మీ కార్యము నెఱవేర్పవలయు. నీ వింక పోయి నిద్రింపుము. మన రహస్యము లెవ్వరైన నెఱింగినఁ గీడుమూఁడును." అని పలుకు నిందిర బుద్ధిచాతుర్యమునకు దుర్గాదాసు సంతసించి శయ్యపైఁ జేరి నిద్రించెను.

సాహసంబున నిందిరసాటిలేనిది. పౌరుషంబున చంద్రావతికం దక్కువగాదు. యుద్ధములో నోడిపోయివచ్చిన యశోవంతసింహుని చంద్రావతి తిరస్కరించి పట్టణములోనికి రానీయకుండఁ జేసినప్పు డిందిరకూడ చంద్రావతియొద్ద నుండెను. యుద్ధములో నోడివచ్చిన

పొరలలో నిందిరమగఁడుగూడ నుండెను. ఆమెగూడ చంద్రావతి వలెనే యుద్ధములో నోడివచ్చినవారి మొగమేల చూడవలయునని పలుక, నామెమగఁడు యశవంతసింహునివలె గాక పౌరుషమును దెచ్చుకొని "రణరంగమున శత్రువుల నోడించి నా పరాక్రమ మంతయుఁ జూపినఁగాని నా భార్య మొగము జూడ" నని యెల్లరు వినుచుండఁ బ్రతిజ్ఞఁ జేసి యెచ్చటికో పాఱిపోయెను. కాని పిదప ఇందిర పశ్చాత్తాపమొంది తన మగనికై యెల్ల దేశముల వెదకించెను గాని యాతఁ డెందును గాన రాఁడయ్యె. రెండు మూఁడు వత్సరములవఱకు యశవంతసింహుఁడుగూడ ఇందిరమగఁ డెచ్చట నుండెనో యని కనుఁ గొన ప్రయత్నించుచుండెను. కాని యందువలన నేమియు లాభము గలుగలేదు. అప్పటినుండియు నిందిర యెల్ల సౌఖ్యములు విడనాడి చంద్రావతిసేవ చేయుచు, నామెయొద్దనే మెలంగుచుండెను. కాబూలు దేశమునకుఁగూడ చంద్రావతిని విడువలేక, ఆమె ప్రయాణమై వచ్చెను. వచ్చినప్పటినుండియు నామె చంద్రావతి కనుకూలముగ సంచరించుచు ఆమెకుఁ గల్గిన దుఃఖమును బాపుచుండెను. ఆమె వివేక మంతయు నెఱిఁగిన వాఁడగుటచే దుర్గాదాసు ఇందిరతో సంభాషించి యామెసాహాయ్యమును గోరెను. ఎట్టి కార్యము తనపైఁ బెట్టినను ఇందిర త్వరలో నిర్వహించుట కుపాయము బాగుగ యోచించు చుండెను. నాఁటిరాత్రి దుర్గాదాసుతో నామె సంభాషించి వాని నంపి తాను సుఖముగ నిద్రించెను. దుర్గాదాసు మొదలగువారిని మాసప్పుచ్చి చంద్రావతిని గొనిపోయి పాదుషా కొసఁగి యాతని వలన మెప్పొందవలయునని నయనపాలుఁడు నిరీక్షించుచుండెను. కాని చంద్రావతి కెట్టి కష్టమును గలుగనీయకుండఁ దోడితెమ్మని ఔరంగ జేబు నయనపాలునితోఁ జెప్పియుండుటచే నాతఁడింతవఱకు వేచియుండెను.

తెల్లవాఱినంతనే యిందిర లేచి ప్రాతఃకాలకృత్యములు నిర్వ ర్తించుకొని, తాను జేయఁబోవు నుపాయమంతయు రహస్యముగ చంద్రావతి కెఱిఁగించెను.

"ఇందిరా! నిన్నిట్టి కష్ట సముద్రమునఁ ద్రోసి నేనెట్లు పోవఁగలను? దుర్మార్గుఁడైన నయనపాలుఁడు నీ కెట్టి మోసము గావించునో కదా! ఇన్నినాళ్ళును నిన్నుఁ బెంచి పెంచి యిప్పు డాకస్మికముగఁ బాడునూతిలోఁ ద్రోసి నేను బోవఁజాలను. నా ప్రాణములు పోయినను సరే! నిన్ను విడిచి నేనొక్క క్షణమైనను బ్రతుకఁజాలను. పతివియోగము సహింపలేక నే నీవఱకే ప్రాణములఁ బాయ సిద్ధముగ నున్నాను. నాకై నీవు విచారింపకుము. నీకు శక్యమైన యెడల, నజితసింగును గొనిపోయి పెంచి పెద్దవానినిజేసి జోధపురము వానికిఁ బట్టముగట్టుము. నీవే వానికిఁ దల్లివిగాని నేనుగాను. తమ ప్రాణములు విడిచియైనను తమ్మాశ్రయించిన వారిని రక్షించుట రాజులకైనను రాణులకైనను గర్తవ్యమై యున్నది. కావున నీ వెంత మాత్రమును సందేహింపక నీ ప్రాణములు గాపాడుకొనుము. అజితసింగునిగతిఁ దలంపుము. నామాటకేమి? వాఁడు పెద్దవాఁడైనచో మిమ్మందఱను రక్షింప సమర్థుఁడుగాని, యాఁడుదాననైన నేనేమి చేయఁగలను? నావలన మీ కేమి ప్రయోజనమున్నది? యశవంత సింహునితోడనే చంద్రావతి ప్రాణములుగూడఁ బోయెననుకొనుము."

అని చంద్రావతి యెన్నోవిధముల నా యుపాయమును సరి కాదని సమ్మతింపకుండెను. కాని ఇందిర కామాటలన్నియు విరుద్ధములై తోఁచినందున "అయ్యో ఎంత పిచ్చి దానవమ్మా! చంద్రావతీ! మరణమొందుకాలమున యశవంతసింహు డన్న మాటలన్నియు నింతలోనే మఱచితివా? సతులకుఁ బతియాజ్ఞ మీఱు టుచితమా? అన్నియు నెఱిఁగిన నీకు నే నేమి చెప్పఁగలను? ఈ యుపాయమునకు నీవు సమ్మతింపవేని జోధపుర వంశనాశమునకు చంద్రావతియే కారణమని, మేమందఱము నిన్ను నిందింపక మానము, ముమ్మాటికి నమ్ముము. నీవు గతించిన పిమ్మట మేముండిమాత్ర మేమి ప్రయోజనము? నీకు బ్రతుకుపై నాశలేనిచో నందఱమొక్కమారే శత్రు

వులతోఁ బోరి ప్రాణములు విడిచెదము లెమ్ము. దీనికి నీవొడంబడని-చో నజితసింగునకు మోసము సంభవించును. వాని ప్రాణములు గాపాడుట కైన నీ విందులకు సమ్మతింపుము. ”

అని యెన్నియోవిధముల నామెను బ్రతిమాలెను. ఇందిర మాటల కెదురాడలేక ఎట్టకేలకు చంద్రావతి ఆమె చేయఁబోవు నుపాయమునకు సమ్మతించెను. ఇందిర సంతసించి దుర్గాదాసున కెఱింగించి, చంద్రావతి సమ్మతించెనని రహస్యముగఁ దెలిపెను. దుర్గాదాసునకును, నయనపాలునకును ప్రతిదినము మైత్రి యధికమగు చుండెను. వా రిరువురు నొకరి నొక రెడఁబాయక సంచరించు చుండిరి. చంద్రావతి గుడారములోనికిఁ బోవుటకును, అచ్చటనుండి వచ్చుట కును, ఇందిరా దుర్గాదాసులకుఁ దప్ప యితరులకు నయనపాలుఁ డాజ్ఞ యొసంగనందున ఇందిర యెన్నిమాఱులు దిరిగినను ఆమె నెవ్వరు నాటంకపరుపలేదు. సారె సారెకు నిందిర గుడారములోనికిఁ బోవుచు మరల నీవలకువచ్చి యెచ్చటికో యేగుచు, పలుమాఱు సంచరించు చుండెను. ఆమె యెన్నిమాఱులు దిరిగినను మేలిముసుఁగు ధరించి మొగము వాల్చుకొని పోవుచుండుటచే నామె వదన మెట్లుండెనో యచ్చటి వారెవ్వరు నెఱుఁగరు. ఆ దినమున నామె యెన్నియో మాఱు లీవలకుఁ నావలకుఁ బోవుచుఁ గాలము గడిపెను,

# ఏడవ ప్రకరణము

## ఒ క గొ ల్ల ది

**చం**ద్రావతియు నిందిర మొదలగు వారు యుండిన గుడారములకు సమీపమున నే యొక గొల్లపల్లె కలదు. తాటికమ్మలతోడను, వరిగడ్డితోడను కట్టఁబడిన నాలుగైదు వందల యిండ్లు మాత్ర మాపల్లెలోఁ గలవు. ఇంచుమించుగ చుట్టుపట్టులనుండు గ్రామములకు అందఱి గొల్లలే పెరుగు, పాలు మొదలైన విచ్చుచుండిరి. గడ్డికుప్పలును, పసువుల శాలలును, ఎందుఁజూచిన నాపల్లెయందు గానవచ్చుచుండెను. అక్బరు మానసింగు అను తన సైన్యాధిపతితో నలువదివేల సైన్యములు గైకొని కాబూలుపైకి యుద్ధమునకు బయలుదేఱినపుడు, అతని సైనికులలోఁ గొందఱు హిందూసైనికులు అచ్చటచ్చట గ్రామములలో తమ కుటుంబములతోఁ గాపురముండిరి. అదివఱ కచ్చట నివసించియున్న మహమ్మదీయుల సహవాసముచేత తాము హిందువులైనను, కొన్నాళ్ళకు వారందఱు మహమ్మదీయులు కావలసివచ్చెను. అట్లని వారు హిందూమతమును దూషింపక, అతిథులైనను, బాటసారులైనను తమ గ్రామమునకు వచ్చినయెడల, నా హిందువులను సగౌరవముగ నాదరించుచుండిరి. ఇట్లు హిందూమతమును విడిచి సహవాస దోషంబున నూతనముగ మహమ్మదీయ మతం బవలంబించి, హిందువుల నెల్లప్పుడు నాదరించువారు మనము వర్ణించుచున్న గొల్లపల్లెలోఁగూడ నెంతోమంది యున్నవారు,

ఒకనాఁటి యుదయమున నాయూరిలోని గొల్లలందఱును తమ పసువులను శాలలనుండి యీవలకుఁ గొనివచ్చి యొక మైదానముపై

నిలిపిరి. వానిలోఁ గొన్ని యావులును, కొన్ని గేదెలును, మఱికొన్ని మేఁకలును గూడ నుండెను. గొల్లలు మట్టిపాత్రలను జేతఁగైకొని యచ్చటనే నిలువఁబడి యుండిరి. పాకలలోఁ గట్టఁబడియున్న లేఁగ దూడలు తమతల్లులఁజేరి పాలుత్రాగవలెనని కట్లు త్రెంపుకొని పరుగున వచ్చునేమో యను నట్లాతురతతో ముందునకు దుముకుచుండెను. ఇంతలో నిరువురు గొల్లలేగి వాని మెడత్రాడులను విప్పి అన్నిటిని వదలిరి. ఆ దూడలన్నియు దమతమ తల్లులపాలికి గంతులిడుచుఁబోయి మూతులతోఁ బొదుగుల మాటిమాటికిఁ బొడుచుచుఁ బాలుత్రాగు చుండెను.

కొంతవఱకుఁ బాలుత్రాగనిచ్చి వారు బలిమిని దూడల పొదుగులనుండి పైకిఁదీసి చెంతనున్న కొయ్యలకుఁ గట్టివేసి పాత్రములలోఁ బాలుపిదుక నారంభించిరి. తమమోఁకాళ్ల సందున మట్టిపాత్రల నిమిడ్చి రెండుచేతులతోడను పాలు పిదుకుచుండ నప్పుడు కొన్ని దుష్టపశువులు తమ వెనుకటి కాళ్లతోఁ దన్నినందున, మట్టిపాత్రలు బ్రద్దలై పాలొలికి పోవుటయేకాక, తమదవుడలు విఱిగినందున కొందఱు గొల్లవాండ్రు క్రిందఁ బడుచుండిరి. మఱికొందఱు పశువుల దువ్వి మచ్చిక చేసికొనుచు గడ్డివేయుచు, మెల్లగఁ బొదుగుల చెంతకుఁబోయి పండ్లు విఱుగఁదన్నునేమోయని మరల వెనుకకు జరుగుచు నల్లరి పడుచుండిరి. భయముచే కొందఱు గొల్లవాండ్రు దుష్టపశువుల వెనుకటికాళ్లకు ముందరికాళ్లను త్రాళ్లచే బంధించి బలిమిని పాలు పితుకుచుండిరి. ఇంతలోఁ గొందఱు స్త్రీలు గంపలను గైకొని యచ్చటికివచ్చి వేగ వారి చేతులనుండి పాలకుండలను గైకొని,తమగంపలలోఁ బెట్టుకొని శిరములపై నిడికొని, తమవాడుక ప్రకారము వేఱువేఱు మార్గములఁ జెంతనున్న గ్రామములకుఁ బోవుచుండిరి. కాని యే కారణముననో వానిలో నొక గొల్లపడుచు చంద్రావతి గుడారము వైపు వచ్చుచుండెను. ఆమె క్రమక్రమముగా గుడారము సమీపించి లోనికిఁ

బోవుచుండెను. కాని, చంద్రావతి కుమారునకుం బాలొసంగునది కదాయని, ఆమె నెవ్వరు నడ్డగింపలేదు. ఆగొల్లది వచ్చుచున్నప్పు డిరువురు సిపాయీలు మాత్ర మామెను జూచి కన్నువేసి తమలోనిట్లు గుసగుస లాడుకొనిరి.

“ అరేభాయీ! ఇది ప్రతిదినమునువచ్చు గొల్లది కాదుసుమా! అది వృద్ధ స్త్రీ. ఇది దానిచిన్న కోడలివలె నున్నదిరా! ఎంతచక్కఁగ నున్నది ?”

“ సందేహమేమి? ఇది గొల్లదియైనను, నిండు యౌవనములో నుండి పకీవలె నెంతో రాణించు చున్నది. ఆహా దాని గమనము, దాని మొగము, దాని యొయ్యారము, బలే! బలే!”

ఇట్లింకను దమలో నా యిరువురు నేమేమియో రహస్యముఁగ మాటలాడు కొనుచు, నా గొల్లపడుచు తమదృష్టికిఁ గోచరించునంత వఱకు నామెను రెప్పవాల్చక చూడనారంభించిరి. గొల్లది గుడారము లోని కించుకపోయి నంతనే లోపలినుండి యెవ్వరో ఆమెను తిరస్కరించుచు బిగ్గరగ—

“ ఓసి దుర్మార్గురాలా! ఇంత ప్రొద్దెక్కినదాఁక పాలు తేకున్నచోఁ బసిబిడ్డఁ డెట్లుండఁ గలుగును? నీ కిష్టము లేకున్న నీయమ్మ యింకొకతె వచ్చును. ఇంతియకాక ఈదినము యశవంతసింహ మహారాణాగారి పదునొకండవ దినమగుటచే మామూలుకన్న నెక్కుడు పాలు గైకొని ఉదయముననే రమ్మని నిన్న చెప్పలేదా? ఇంత ప్రొద్దెక్కిన బ్రాహ్మణ సమారాధన మెప్పుడుజరుగు ననుకొంటివి? మాకుఁ బాలు దొరకక ననుకొంటివా? ఇంతియకాక పాలలో నీళ్లుగూడ గలుపు చున్నట్లున్నది. నమ్మకమైన పాలిచ్చిన నీకుఁదగిన డబ్బు ముట్టుఁ గలదు. నీళ్లు గలిసినపాలు పట్టినచో పసిపిల్లలకు జబ్బుచేయదా? జాగ్రత్త” అని నిందింప నారంభించిరి. ఆ గొల్లది మొగము వంచుకొని గుడారములోనికిఁ బోయెను.

ఆ దినమున దుర్గాదాసు నయనపాలునిఁ జేరి తన వాక్చాతుర్య మంతయుఁ జూపుచు నాతని వలన మెప్పొందు చుండెను. దుర్గాదాసు సద్గుణములును, వాని పరాక్రమమును నయనపాలుఁడు పూర్ణముగఁ దెలిసి యుండెను. ఆ పదిదినముల నుండియు వారిరువురకు మిక్కిలి స్నేహము గల్గినందున వారిట్లు సంభాషించు కొనిరి.

"నయనపాల మహారాజా! చిన్నప్పటి నుండియు నన్నుఁ బోషించుచుండిన యశవంతసింహునకును నాకును నేటితో ఋణము చెల్లెను. కావున మీరు ఔరంగజేబు పాదుషాగారితో నావిషయమై చెప్పి యేదైనను ఉద్యోగ మిప్పించి పుణ్యము గట్టుకొనవలయును."

"దుర్గాదాస్! నీవింత విచారింప నేల? దైవానుగ్రహమునఁ గొలది దినములలో నేనే యొక రాజను కాఁగలను. అప్పుడు నీకు మంచి యుద్యోగమిచ్చి పోషించెదనులే."

"ఆహా! అంతకన్న నాకు భాగ్యమున్నదా? అయ్యా! నేఁటి నుండియు మీకు నేను సేవకుండ ననియే భావింపవలయు."

"ఇంతమాత్రమునకై యింత వేఁడవలయునా? అట్టులే కానిమ్ము. నిన్ను మేము పోషించుటయం దెంతమాత్రమును సందేహము లేదు. మాయెడ విశ్వాసముగల్గి సంచరించు చుండుము. మాయాజ్ఞకు బద్ధుఁడవై, మాకార్యములనెల్లఁ జక్కఁగ నెఱవేర్చు చుండిన నీవు మంచిస్థితిలోనికిఁ రాఁ గలవు."

"ఏలినవారి కటాక్షమున్న నెంతసేపు? తమరు నాకుఁ బ్రభువులైనచో యశవంతసింహుఁడు గతించెనను చింత నాకుండదు."

"ఓహో! యశవంతసింహునకును నాకును సాటి తెచ్చెద వేమి? వానియంతరమేమి? నాయంతరమేమి? నాకాలి గోటికైన నాతఁడు సరిపోలునా? దీనికేమిగాని మీ చంద్రావతి యదృష్టము బాగుగానున్నది. ఆమె త్వరలోనే ఔరంగజేబు పాదుషాకు—"

అని యేమో చెప్పఁబోయి నయనపాలుఁడు [illegible] నిల్చి యూరకుండెను. ఆ కడపటి వాక్యము వాని నోటనుండి వెడలినంతనే, దుర్గాదాసు చేయి మొలనున్న కత్తి పైకి బోయెను. కాఁగల కార్యము లనేకము లుండుటచే దుర్గాదాసు శాంతము వహించి నయనపాలుఁ డెన్ని దుష్ప్రలాపము లాడినను సహించి యూరకుండెను.

ఇంతలో గుడారములోనికిఁ బోయిన గొల్లది తిరిగి వచ్చి తన పల్లెకుఁ బోవుచుండెను. తొలుత నామెను జూచి మోహభ్రాంతులైన సిపాయి లిరువురు నామె వెంటఁ బోవుచుండిరి. ఆ గొల్లది కొంత నేపటి వఱకు వెనుకవైపునఁ జూడక తనదారిని దాను బోవుచుండెను. ఆమె తనవెనుక నిరువురు సిపాయిలు వచ్చుచుండిరని గ్రహించి మరింత వడిగ నడువ నారంభించెను. కాని వారుగూడ త్వరలోఁ బోవుచుండిరి. అదిగనిపెట్టి యా గొల్లపడుచు కొంతవఱకు తనలో నేమియో యోజించి, శిరఃకంపనము గావించి యటు నిటుఁ జూచి, వెనుకకు దిరిగి ఆ యిరువురి మొగములు వీక్షించి చిఱునవ్వు నవ్వి కనుసంజ్ఞ చేసి మరల వడిగాఁ బోవుచుండెను. ఆ యిరువురు సిపాయిలును "నన్నే రమ్మనెను" అని యొకఁడును "నిన్ను గాదురా నన్నే రమ్మనెను" అని మఱియొకఁడును వాదించుకొని అది మీఱినంతనే ముష్టి యుద్ధము చేయ నారంభించిరి. అదే సమయమని ఆ గొల్లది వారిపాలఁ బడకుండ తన పల్లెకుఁ బోయెను.

నయనపాలుఁ డనేక విధముల దుర్గాదాసుతో సరస సల్లాపము లాడుచు వాని నెట్టులైనఁ దనవలలో వేసికొన వలయు నని ప్రయత్నించుచుండెను. వాని యుద్దేశమును దుర్గాదాసు కనిపెట్టెను గాని యేమియు నెఱుఁగని వానివలె వానియెడల నటించుచుండెను. నయనపాలుని యాజ్ఞ చొప్పున సిపాయీలు ఇందిరను దుర్గాదాసును దప్ప తదితరులను చంద్రావతి గుడారములోనికిఁ బోనీయ లేదు.

మేలుముసుఁగునందు గప్పఁబడి యుండిన యామె వదన మెట్లుండెనో ఎవ్వరు నెఱుఁగక పోయినను, ఆపాదమస్తకము నామె ధరించు కొనిన తెల్లని బురఖాను జూచి యెంతదూరమునుండియైన ఇందిర కదా యని త్వరలో పోల్చి యామె గుడారములోనికిఁ బోవుటను వచ్చుటను అడ్డగింప కుండిరి. నాఁటి యుదయమున నిందిర యెచ్చటికోపోయి జాము ప్రొద్దెక్కు సరికి చంద్రావతి గుడారములోనికిఁ బోయెను. ఆ గుడారము చుట్టును సిపాయీలు జాగరూకత వహించి కాపుండిరి. గుడారములో చంద్రావతి కెట్టి కొఱఁతయుఁ గల్గకుండ నామె పరిచారిక లామెను ఊడిగము సేయుచుండిరి. కొంతసేపటికి ఇందిర మరలఁ దన మేలుముసుఁగు ధరించుకొని తన మొగ మితరులకుఁ గనఁబడకుండున ట్లెప్పటివలెనే గుడారము వెలువడి యెచ్చటికో పోవుచుండెను.

దుర్గాదాసును నయనపాలుఁడును తమలో నేమేమియో సంభాషించుకొనుచు, నెప్పటికిని దమ ప్రసంగము గట్టిపెట్టరైరి. వారొక రహస్య ప్రదేశమున దూరముగ మాటలాడు కొనుచుండుటచేతను, ఎల్లవారలు యశవంతసింహుని పరలోక క్రియల జరుపు నుద్యమమున నుండుటచేతను, ఆ యల్లకల్లోలమున, ఆ మాటలు ఇతరులకు వినఁబడకుండెను. అట్లు వారు ప్రసంగించు కొనుచుండఁగాఁ గొంతసేపటికి చంద్రావతి గుడారములోనుండి "హా! అజితసింగ్! అజితసింగ్! మాకేది దిక్కు?" అని స్త్రీలెల్లరు ఘొల్లున రోదనము సేయ నారంభించిరి. నయనపాలుఁ డా రోదనము విని తత్తఱపడి "దుర్గాదాస్ ఏమి యీ రోదనము! ఎట్టి యుపద్రవము సంభవించెనో కదా! పాపము పోయొకసారి చూచి రమ్ము" అని వాని నంపెను. ఆతురతతో దుర్గాదాసు గుడారములోనికిఁ బోయి, కొంత సేపటికి మరల వాని చెంతకు వచ్చి "అయ్యో! ఇం కేమున్నది? ఆ బాలుఁడు పరలోక

మనుమన్న తనతండ్రిని జూడక పోయెను. మా యదృష్ట మిట్లున్నది? ఏమి చేయగలము" అని కన్నీరు గార్చుచు విచారించుచుండెను. నయనపాలుఁ డాతని నోదార్చి తనకు నిశ్చయముగ సంతోషము జనించినను, మర్యాద గాదని లేని విచారముఁ దెచ్చుకొని నటించుచుండెను. అంతట మరల దుర్గాదాసు కన్నీరు దుడచి "ఓయీ! విచారింపక శవమును గొనిపోవు నుపాయముఁ జూడుము. వలయునేని నా సేవకులను బంపెదను నీవు వెంటఁ బెట్టుకొని పొమ్ము" అని పలుక దుర్గాదాసు "అయ్యా! వలదు వలదు. చంద్రావతి తన బిడ్డను తన చేతులతోడనే ఆ గుహాంతమునఁ బాతిపెట్టించునఁట. ఇతరులు తన కుమారుని ముట్టఁ గూడదఁట." అని చెప్పెను. నయనపాలుఁ డందులకు సమ్మతించి అజితసింగు చావు దలఁచుకొని లోలోన సంతసించుచుండెను.

# ఎనిమిదవ ప్రకరణము

## అనురాగాంకురము

"అరే భాయీ! నేఁటికి పది దినములనుండి మన కెవ్వఁడును పట్టుపడ లేదురా. కారణ మేమో?"

"కారణమేమి? మనకంటెఁ బడిన ప్రాణములు దక్కవని చాటు చాటునఁ బాఱిపోవు చుండి రేమో?"

"కాదు కాదు. పాదుషాగా రెఱింగిన మన కాపద సంభవింపక మానదు. కావున ఈ దినమైన మన మీ యరణ్యమున జాగరూకులమై యుండి వేఁటకై వచ్చిన యే రాజునైనఁ బట్టుకొనవలయు!"

"మన మందఱము నీ యరణ్యమున నలువంకలు వెదకిన నొక్కఁడైనఁ జేఁజిక్క కుండునా?"

అని యిరువురు మహమ్మదీయులు తమచెంత ఖడ్గపాణులై యున్న యిరువది మంది భటులతో నారావళీ పర్వత ప్రాంతారణ్యమున నశ్వముల నధివసించి యటునటు దిరుగు చుండిరి. క్రూరమృగసంకులంబై యా కాననము కడు భయంకరముగఁ దోఁచుచుండెను. రాజపుత్ర స్థానమునఁ గొందఱు రాజులు ఆ యరణ్యము తమ స్వాధీనముఁ జేసికొనవలయు నని ఒకప్పుడు తగవు లాడుకొనిరి. ఆ కాననము జోధపుర రాజ్య మందలి దగుటచే, తదధిపుఁడు తనకే యధికార మున్నదని వాదింపఁ జొచ్చెను. ఎట్టకేలకు ఆ యటవిలో వేఁటాడుటకు ప్రతి రాజపుత్రుడును రావచ్చు ననియు, అందలి కలప

మొదలైనవి మాత్రము జోధపురపు రాజునకుఁ జెందవలసిన పనియు వారిలో వారే తీర్పుఁ జేసి కొనిరి. నాఁట నుండియు ప్రతి రసపుత్రుఁ డును ఆ యడవికి వేటకై వచ్చుచుండుట వాడుక. ఈ సమాచార మంతయు ఔరంగజేబు తెలిసికొని వేటకు వచ్చిన ప్రతిరాజును ఒంటరియై యున్నప్పుడు రహస్యముగఁ బైఁబడి బలిమిని బట్టి తన ద్రోహులకుఁ గొనిరావలయు నని నియమించి తన భటులను గొందఱ నచ్చట నచ్చట గాపుంచెను. వారును తమ సేనియాన సమసరించి ఆ కాననమున పొదలలో దాఁగియుండి, తమకుఁ జేఁ జిక్కిన రసపుత్రు నెల్ల దొంగతనమునఁ బట్టి పాదుషా కప్పగించుచుండ, నాతఁడు వారిని కారాగృహమున నుంచుచు వచ్చెను.

నాఁడట్టు లామహమ్మద్దీయులు తురంగారూఢులై యయ్యట విలో సంచరించుచుండ, నంతలో కురంగంబు వలె తన వీనుల రెంటిని ముందునకు సూటిగఁ జూఁచి, పలు విధములఁ గడు చమత్కారముగ పరుగిడుచు పంచకల్యాణి యగు తురంగముపైఁ గూర్చుండి యొక సుందరరాజకుమారుఁ డాదారినేవచ్చుచుండెను. నెమలి పింఛము వలె వీపుపై నొక కుచ్చు వ్రేలాడునట్టు లొక పట్టు చెమలా! తలకుఁ జుట్టు కొని, మోఁకాళ్ళవఱకును వ్రేలాడుచు పలువిధములగు జలతారు మొగలచే నలంకరింపఁ బడిన మఖమ లంగరఖా ధరించి, నడుమున నొకతీరైన చక్కని పటకా బిగయఁగట్టుకొని తాను ధరించుకొనిన పాయిజమా కొక క్రొత్త సోయగము గలుగు నట్లు పాదములకు ఢిల్లీ పాపూసులను దొడిగి, యా క్షత్రియ వీరుఁడు తన సహజ సౌందర్య మున కొక తీరైన వన్నెఁ గలిగించు చుండెను. కుడిచేతంగల యొక వాడియైన బల్లెమును, వామభాగమునఁ బటకాకుఁ దగిలింపంబడిన యొఱలోని భయంకరమగు ఖడ్గమును గాక, మున్ముందుగ ముఖలక్షణ ములే యాతఁడొక వీర పురుషుఁ డని వెల్లడించు చుండెను. ఆజానూ బాహుఁడే కాక గంభీ రాకారముతో నున్న యాతని మొగము

వీక్షించిన నెట్టి శత్రుఁడైన భీతిఁ జెందునని నుడువుచుండ నాతఁడు జగదేక వీరుఁడని వేఱుగ వ్రాయ నేల? ఇట్టి యా రాజకుమార కంఠీరవుండు నిజాశ్వారోహణ కౌశలము వెల్లడించుచు, తన వారువ మును జమత్కారముగ నడిపించుచు వచ్చుచుండ, నాకస్మికముగ వెనుక నుండియు, ముందుననుండియు పొదల దాఁగియున్న మహమ్మ దీయ భటులు తమ గుఱ్ఱములఁ బరుగెత్తించు కొనుచు వచ్చి యాతనిని జుట్టు ముట్టిరి. అందొక మహమ్మదీయుఁడు తన ఖడ్గమును గిరగిరఁ ద్రిప్పుచు చెంతకు వచ్చి "అరే! బచ్చా! పెండ్లికొడుకు వలె నున్నావే! గుఱ్ఱము దిగు దిగు" అని వానిని జడిపింపఁ జొచ్చెను. అప్పు డా క్షత్రియవీరుఁడు తనలో నేమియో కొంచెము యోజించి యొఱలో నున్న కరవాలంబు బిరానఁ బెఱికి, యొక చేత ఖడ్గమును మరియొక చేత బల్లెమును గిరగిరఁ ద్రిప్పుచు రోషభీషణాకారుఁడై కాలాంతకుని వలెఁ గన్పట్టు చుండెను. తురకల రౌతులు వాని సాహసంబున కచ్చెరు వొందుచు వెను తీయక యాతనిపై ఖడ్గములును బాణములును విడువఁ జొచ్చిరి. కరవాలము గైకొని కదళీకాంతార మును ఛేదించు నట్టులా యాయుధముల నన్నిటిని నిమేష మాత్రమునఁ దెగనేసి, తన హయమును వారిపైకిఁ బరుగెత్తించుచు నావీరుఁడు ఒక్కొక్కని భూదేవికి బలి యీయ నారంభించెను.

ఇట్లాగుఱ్ఱపు రౌతులలో పదిమంది మృత్యుదేవత కాహార మైనంతనే మిగిలిన వారు రోష కషాయిత నేత్రులై ప్రాణములకుఁ దెగించి యొక్కమాఱు క్షత్రియవీరునిపైఁ బడిరి. కాని ఎండ వేఁడిమిచే సఘర్మశరీరుఁడై యాతఁడించుక యాయాస మభినయించుచు మిగిలిన వారినిఁ గూడ సూక్ష్మముగఁ గడతేర్చు నుపాయముఁ జూచుచుండ, నింతలో తరుణ వయస్కుఁడగు నొక రాజకుమారుఁడు తనమిత్రునితో నెచ్చట నుండియో తన గుఱ్ఱమును వాయువేగమునఁ బరుగెత్తించు కొనుచు వచ్చి యా పురుష సింహునకుఁ దోడుగ మహమ్మదీయులపైఁ

బడి చెండాడ నారంభించెను. వారిరువురిలో రాకుమారుఁడు పదునైదేండ్ల ప్రాయము గలవాఁడు. అతని మిత్రుఁడు దాదాపు పదునెనిమిది వత్సరముల ప్రాయముగలవాఁడు. క్షత్రియవీరుఁ డాయిరువురి ధైర్య శౌర్య సౌందర్యాతిశయంబులఁ జూచి ఆశ్చర్యమగ్నుఁడై క్రొత్త ధైర్య మవలంబించి పోరాడఁ జొచ్చెను. ఇట్లామువ్వురి తీవ్ర కరవాలముల కోర్వలేక భటు లందఱును తహతహ పడుచుండిరి. ఆ నూతన పురుషులలో రాకుమారుఁడు తన కరవాలమును గిరగిరఁ త్రిప్పుచు, చూపఱకు భయంకరుఁడై మహమ్మదీయులను రక్తప్రవాహమునఁ దేల్చుచుండెను. రోషాతిశయంబున నొక భటుఁడు ఖడ్గపాణియై యీ చిన్నవానిపైఁ కుఱికి నంతనే యా బాలుఁడు వెనుదీయక తత్క్షణముననే వానిని నేలపాలొనరించెను. అతని మిత్రుఁడు గూడ తన పైకురుదెంచుచున్న భటుల నాఁపి ధైర్యముతోఁ బోరాడుచు వారిని గ్రమక్రమముగా నొక్కొక్కని భూదేవికి బలి యీయ నారంభించెను. ఈ యిరువురి పరాక్రమంబులఁ జూచి క్షత్రియవీరుఁడు నిశ్చేష్టితుఁడై ఱెప్పవాల్పక చూడఁ దొడఁగెను. ఎట్టకేల కామువ్వురు వీరుల శౌర్యానలంబునకు భరింపలేక హతశేషులగు భటులును విశేష భీత చిత్తులై తమ పిక్కబలిమిఁ జూపుచు నలువంకలకుఁ బాఱిపోయిరి.

ఆ యిరువురు నూతన పురుషుల సాహసమునకును శౌర్యాతిశయమునకును క్షత్రియవీరుఁ డద్భుత మొంది, యాతఁ డెవఁడా యని పరికించు చుండెను. వారి బాహు పరాక్రమ మసామాన్యమని క్షత్రియ వీరుఁడు నిశ్చయించి తన యుత్సాహమును బట్టలేక.

క్షత్రియ వీరుఁడు : అయ్యా! మీ రెవ్వరు ? మీ కాఁపుర మే పురము ?

రాకుమారుఁడు : మాది జయపురము.

క్షత్రియ వీరుఁడు : జయపురమున మీ యుద్యోగము లెవ్వి ?

రాకుమారుఁడు : ఉద్యోగముల కేమున్నది ? జయపురము రాజుగారి సైన్యములలో మే మిరువురము రణవిద్య నేర్చుకొను చున్నారము.

క్షత్రియ వీరుఁడు : ఆహా ! మీ యిరువురు నా కొనరించిన యుపకార మెంతని కొనియాడఁ గలను ? మీ పరాక్రమము వర్ణనాతీతముగదా ? నేను మిమ్ములను విడువఁ జాలకున్నాను. కావున మీ రిరువురు మా నగరమునకువచ్చి నాసపర్యల సంతుష్టాంతరంగులై పోవచ్చును కావున రావలయును.

రాకుమారుఁడు : అయ్యా ! మీనిలయ మెయ్యది ?

క్షత్రియ వీరుఁడు : ఉదయపురము.

క్షత్రియ వీరుని యాకార మంతయు నాపాద మస్తకమును రాకుమారుఁడు ఱెప్ప వాల్పక చూడ సాగెను. కాని, ఏ కారణము ననో వాని ముఖ లక్షణములు వెంటనే యొక తీరున మారిపోవ నా బాలుఁడు తనలో నేమియో యోజించు చుండెను. క్షత్రియ వీరుఁడు తన వైపు దిరిగి చూచినప్పు డాబాలుఁడు మొగము వంచు కొని చిఱునవ్వు నవ్వుచు మాటలాడ కుండెను. క్షత్రియ వీరుఁడు తన సమీపమున నిల్చియుండి నప్పు డాతఁడు వెంటనే మిత్రుని వెనుకకుఁ బోయి నిలుచుచు వచ్చెను. ఈ లక్షణము లన్నియు మిత్రుఁడు కనిపట్టి రాకుమారునిఁ జూచి నవ్వుచు తల పంకింపఁ జొచ్చెను. కాని యా చిన్న బాలుఁడు వాని ముందుఁ గల యర్థము గ్రహించి యూరకుండ వలసిన దని కనుఱెప్పలతో సంజ్ఞ చేసెను. ఇట్లాయిరువురును తమలో నేమేమో సంజ్ఞలు చేసికొనిరి. కాని క్షత్రియ వీరుఁడు మాత్ర మించు కంతయుఁ గనిపట్టలేదు ! అప్పుడు మిత్రుఁడు క్షత్రియ వీరునిఁ జూచి,

“ అయ్యా : మాకు వేళ యయినది. మేము పోవలయును. మీ నగరమున కిప్పుడు రాలేనందులకు క్షమింప వలయును. ”

క్షత్త్రియ వీరుఁడు : క్షమించుట కేమున్నది ? మీ రు రాకున్నను మీ మీ స్నేహము నేను గోరెడు వాఁడను సుఁడీ !

మిత్రుఁడు : మేముగూడ మీ స్నేహము ముమ్మాటికిఁ గోరు వారమే కదా ?

క్షత్త్రియ వీరుఁడు : అయ్యా ! ఈ రాకుమారుని బాహు పరాక్రమ మద్వితీయమైనది. బాలుఁడైనను వీని శౌర్యమునకు మితి లేదు. కావున నే నెల్లప్పుడు జ్ఞప్తి యుండుటకై నా యుంగర మీ చిన్నవాని కిచ్చెదను.

అని యా క్షత్త్రియవీరుఁడు తన యుంగరము దీసి యా రాకుమారున కిచ్చెను. ఆ బాలుఁ డాయుంగరముఁ గైకొని వ్రేలి కిడు కొని సిగ్గున తల వంచుకొనెను. క్షత్త్రియ వీరుఁడు వారికి సెల విచ్చి తాను తన దారి నేగెను.

ఆ యిరువురును తమ ఖడ్గముల నెప్పటి యట్లు ఒఱలలో నుంచుకొని, గుఱ్ఱములఁ బరుగెత్తించుకొనుచు పోవ సాగిరి. అప్పు. డప్పుడు మార్గమధ్యమున మిత్రుఁడు రాకుమారునిఁ జూచి, చిఱు నవ్వు నవ్వుచు నేమేమో పరిహాస మాడుచు వచ్చెను. ఆ మాటలఁ బాటింపక యీ చిన్నవాఁడు, తన వ్రేలియుంగరమును మాటి మాటికిఁ జూచుచు, మందహాసము సేయుచుండెను. అప్పుడు మిత్రుఁడు రాకుమారునిఁ జూచి,

“ చెలీ ! నీలో నీవే నవ్వుకొనుచుంటివేమే ! నాతోఁ గొంచెము చెప్పరాదా ?”

“ ఏమి చెప్పు మనెదవు ? నీవు నవ్విన నాకుఁ గూడ నవ్వు వచ్చినది. ”

“ అబ్బా ! ఎంత వడిదానవమ్మా ! సరే ! రహస్యము దాఁచి పెట్టికొనుము. నీవు నాకు చెప్ప నక్కఱ లేదులే. ”

" అయ్యో ! వెఱ్ఱిదానా ! చెప్పుట కేమి రహస్య మున్న దే ? ఆ రాజకుమారుఁ డిచ్చిన యుంగరముఁ జూచి నవ్వుకొను చుంటిని. అంతియే. "

" విమలా ! ఇం కెందుకు దాఁచెద వమ్మా ! నీవు చెప్ప కున్న నే నప్పుడే గ్రహించితిని. ఆ రాకుమారు నెదుట నున్నంత సేపు నీ ముఖ లక్షణములు, నీ సిగ్గులు, అన్నియు నేఁగనిపట్టితిని. ఇంక నీవు దాఁచి పెట్టినమాత్ర మేమిలాభము ?"

" చెలీ ! పద్మా ! ఈ పరిహాసముల కేమి గాని యీ రాజ పుత్రుఁ డెవఁడో నీ వెఱుఁగుదువా ?"

" ఏమో, నే నే మెఱుఁగుదును ? అతని కాఁపుర ముదయపుర మఁట. వానిని మన మెప్పుడును చూడ లేదు కదా ?"

" పద్మా ! చూడనంత మాత్రమున నాతఁడు మనకుఁ గ్రొత్త పురుషుఁ డని భావింప రాదు ; మన మిన్నాళ్ళ నుండియు నెవ్వని కీర్తి విని సంతసించుచుంటిమో, అసహాయ శూరుఁ డగు నా రాజ సింహుఁడే యీతఁడు !"

" విమలా ? నీ వెట్లు గుర్తించితివమ్మా ! ఇంత వఱకు నాతో నేల చెప్ప లేదు ?"

" చెలీ ! ఈ యుంగరముపై నాతని నామధేయ మున్నది. నే నప్పుడే చూఁచితిని. "

" విమలా ! నీ వెట్టులైన నదృష్ట వంతు రాల వమ్మా. నాకు మిక్కిలి సంతోషము జనించినది. దీని కేమి గాని, చెలీ ! మీ తండ్రి గారు నిన్నొక రాకుమారున కిచ్చి వివాహముచేసి, అల్లుని కూఁతును గూడ తన యొద్దనే యుంచు కొనెద రఁట. నీ వెఱుఁగుదువా ?"

" పద్మా ! ఇవెక్కడి మాటలు ? హృదయమునఁ గోరిన సుకుమారుని విడనాడి యన్యపురుషులను బెండ్లాడుటకన్న కష్ట

మున్నదా ? ఇంక రూప నగరపు రాణివి నీవు గాని నే నంతమాత్ర మును గాను. ”

“ అమ్మా ! కొనసాగని మాట లేల చెప్పెదవు ?”

“ ఇవి కొనసాగని మాటలుగావు. ఏమో కోపము వచ్చి నందున మా యన్న యగు శివసింగునకు బుద్ధి రావలయు నని నాయనగారు వానిని నగరమునఁ జేరకుండ నాజ్ఞాపించిరి. గాని, మరల నాతని రప్పింపక పోరు. కడకు మా తండ్రిగారు ని న్నతనికే యిచ్చి వివాహము చేసెదరు. ”

అని వారిలో వారు మాట్లాడు కొనుచు వారు తమ నగరము నకుఁ బోవు చుండిరి.

# తొమ్మిదవ ప్రకరణము

## ప ద్మ సా హ స ము

భిల్లు లిరువంకల నొక సవారి మోయుచుఁ దన వెంట వచ్చుచుండఁ గొంత పరివారముతో నొక రసపుత్ర వీరుఁ డొక మహారణ్యమునఁ బోవుచుండెను. ఆ సవారిలో నొక స్త్రీ తనకుమారునితోఁ గూర్చుండి యుండెను. ఆ రసపుత్రుఁ డెవఁడో యెచ్చటి నుండి యెచ్చటికిఁ బోవుచుండెనో మన కిప్పటికిఁ దెలియదు. కరమునఁ గరవాలము ధరించి, తన పరివారమును బోయీలను వేవేగ నడువ వలయు నని నడుమ నడుమ నాజ్ఞాపించుచు నాతఁ డతి త్వరగాఁ బోవుచుండెను. ఎత్తిన సవారిని క్రిందికి దింపకుండ, రవంతయు నాయాస మనకుండ, భిల్లులగు నాబోయీలు పరుగిడ సాగిరి. మార్గములనువిడిచి, మాఱు త్రోవలు ద్రొక్కి, గట్టు మిట్ట లనకుండ వారు ప్రయాణము సేయు చుండిరి. అట్టి గుట్టల యందును, మిట్టల యందును, పర్వత గుహాల యందును, కంటక ప్రదేశముల యందును, నడచుట మిక్కిలి యల వాటు వడిన భిల్లులకుదక్క, తదితరులకు సాధ్యము గాదు. వారి తొందరయు, నాతురతయుఁ గనిన, వా రేదియో మహాపద సంభ వించునని, యిట్లు పరుగిడి పోవుచున్నా రని వారిని జూచిన వా రను కొనక తీరదు. రసపుత్రుఁడు మాటి మాటికి సవారి దగ్గఱకు వచ్చి లోపల నున్న స్త్రీని జూచి, "మన కింక భయము లేదు. మన బోయీలు త్వరగాఁ బోవుచున్నారు. ఖైబరు కనుమను వెనుక వేసి తిమి. అటక్‌నది దాఁటినారము. మన హిందూ దేశమునఁ బ్రవేశించి

నారము. ఆరవలీ పర్వతములు సమీపించుచున్నవి. మన గండము గడచినది. దైవానుగ్రహమున నిట్టులే మన పట్టణముఁ జేరుకొనఁ గలము. మనల నింకెవ్వరును గుర్తించి పట్టుకొనఁ జాలరు. మన భిల్లులందఱును మాఱుత్రోవల నెఱిఁగి యున్నారు. ఇంక విచారమున కవసరము లేదు." అని ధైర్యముఁ జెప్పుచు మరల ముందునకు బోవుచుండెను. పరివారమును, బోయీలును ఎంతయో డస్సిరి గాని యించుకంతయు లక్ష్యపెట్టరైరి. ఎంత దూరము నడచినను, వారిని మరింత తొందరపెట్టుచుండెను. గాని, రసపుత్రుఁ డించుకంతయు జాలి వహించి వారికి విశ్రాంతిఁ గలుగ నీయఁడయ్యె. సూదుల వలె నున్న రాలు పాదములఁ గ్రుచ్చుకొనఁగా రక్తము గాఱుచుండఁ గొందఱు బాధ పడుచుండిరి.

ఆ యరణ్యమంతయుఁ జూపఱకుఁ గడు భయంకరముగ నుండెను. ఏవంకఁ జూచినను, తాటి చెట్టు పొడవునఁ బెరిఁగి చూపరులకు భీతిఁ గొలుపు పాముల పుట్టలే! ఏ ప్రక్కఁ దిలకించినను, కడు వైశాల్యము గలిగిన వెదురు డొంకలే! ఏతట్టు గాంచినను, నడచుటకు వీలు లేకుండఁ గంటకమయములగు పలుతుప్పలే! ఆ మహారణ్యమున నిటు మార్గమున్నదని, భిల్లులు తప్ప, తదితరులు గని పట్టలేరు. అచ్చట నరహత్యలు మొదలైన యెట్టి ఘోర కృత్యములు సలిపినను, ఎవ్వరును గనుఁగొనఁ జాలరు. ఒక్కసారిగ తమ గర్భముల వేలకొలంది శత్రువుల భరించి యితరులకుఁ దెలియకుండ, కన్నతల్లులవలెఁ గాపాడు పర్వత గుహ లనేకము లందుండెను. సకల విహంగ కుల కలకలా రావ విరాజితంబైన యా సాంద్రారణ్యమున సూర్య రశ్మిఁ దగుల కుండఁ జేయ జాలు మహా వృక్షము లచటఁ బెక్కులు. అట్టి భయాకర మగు మహారణ్యమున నెల్ల కష్టముల కోర్చి వారు పోవుచుండఁగా నొక ప్రక్కనుండి "హా! రక్షింపుఁడు! రక్షింపుఁడు!" అని యొక స్త్రీ నాదము వారందఱకు విన వచ్చెను.

రాజపుత్రుఁ డాకంఠధ్వని ము న్నెప్పుడో విని నట్లు తనలో నేమో యాలోచింపఁ జొచ్చెను. ఇంతలో సవారిలో నున్న స్త్రీ "ఓ భిల్లు లారా! మీ రిచ్చట నిలువుఁడు. పాప మెవ్వతెయో యొక జవ్వని తన్ను రక్షింపు మని కేకలు వేయు చున్నది" అని యాజ్ఞాపింప నాపలుకు లాలకించి ముందఱ నడచు చున్న రాజపుత్రుఁడు సవారి దగ్గఱకు వచ్చి,

"అయ్యో! ఎవ్వ రెట్టులైన మనకేమి మన మిచ్చటఁ గాల యాపన మొనర్చితి మేని శత్రువులకుఁ జిక్కుట తప్పదు."

"ఓయీ! క్షత్రియులకు దీనులఁ గాపాడుట పరమ ధర్మ మని యెఱుఁగవా? నే నెట్టి సంకటములలో నున్నను, శర ణన్నవారిని విడువఁ జాలను. పరుల కష్టములు తన కష్టములేయని భావించువారే క్షత్రియులు. కావున, మన మిచ్చటఁ గొంతసేపు తాళి యా దీను రాలిని రక్షించెదము."

"అన్నయు నెఱిఁగి యిట్లనిన నే నేమనఁ గలను? మనలను మనము రక్షించు కొనుటయే దుర్లభ మగుచుండ నొరుల సంగతిఁ జూడఁ గలమా? నేను మాత్రము క్షత్రియుఁడను గానా? క్షత్రియ ధర్మము లెఱుఁగనా? సమయమును బట్టి యెప్పటి కెట్లు సంచరింప వలయునో, అప్పటి కట్లు సంచరింపక తప్పదు. వలయునేని మీరందఱు ముందుగఁ బోవుఁడు. నే నామెను రక్షించి రెండు మజిలీలలో మిమ్ము లను గలసి కొనెదను. అంతియ కాని మీరిట కాలయాపనము సేయుట నా కెంత మాత్రము నిష్టము లేదు."

అని, చెప్పి బోయీలకు వేవేగ నడువ వలయునని యాజ్ఞా పించి, పరివారమునకు జాగ్రత్త యని బోధించి వారిని బంపివేసెను. పిమ్మట రాజపుత్రుఁడు కరమునఁ గల కరవాల మాడించు కొనుచు నా మహారణ్యమున నా కాంతామణి యొనర్చు నాక్రందన ధ్వనిని బట్టి యామె నెల్లెడల వెదక నారంభించెను. అట్లు కొంత దూరము

పోయిన తరువాత నొక చెట్టుక్రింద నిద్రజు మహమ్మదీయులును, ఒక భిల్లుడును హోరాహోరిగఁ బోరాడు చుండినట్లును, ఆ భిల్లుని వెనుక నొక చక్కని రాచకన్నియ భయ కంపితయై, గడగడ వణఁకుచుఁ గన్నీరు గార్చుచు నిలుచుండి నట్లును వానికి గోచర మయ్యెను. మహమ్మదీయుల కత్తి దెబ్బలచే నొడలెల్ల గాయములు పడ రక్త ప్రవాహ ముద్భవిల్లు చుండ నా భిల్లుఁడు వెనుదీయక పోరు చుండెను. అట్టి సమయమున మన రసపుత్రుఁ డచ్చటి కేగి సన్నసన్నగ వెనుక నుండి, తన ఖడ్గమున నందొక మహమ్మదీయుని కంఠము దెగవేసెను. వెంటనే రెండవ వాఁడు కాళ్ళకు బుద్ధి చెప్పుకొని, యెచ్చటికో పాఱి పోయెను. రాజపుత్రునిఁ జూచి నప్పటి నుండియు నా సుందర రాజ కన్య దుఃఖమును బాసి, ధైర్యము వహించి, ఎక్కడ లేని సిగ్గు తల కెక్క మొగము వాల్చుకొని చెట్టు చాటున నిలిచియుండెను. నేలఁ బడియున్న భిల్లునిఁ జూచి యా రాజపుత్రుఁడు,

"ఓరి బలీ! మీా రెఱుఁగని ఔషధము లుండవు. గాన నే నిప్పు డేమి చేయవలసి యున్నదో యెఱింగించిన నట్లుచేసి నీ గాయ ములు మాన్పెద."

"ఓ శివసింగు మహారాజా! మీా యనుగ్రహమున నేఁడు మా ప్రాణములు దక్కినవి. మీారు లేకున్న నేను మా ప్రాణములు మహమ్మదీయులు గొనియుందురు. దైవమే మిమ్ము మా మోక్షముఁ బంపెనని తలంచెద. మన మిప్పుడే చెట్టుక్రింద నుంటిమో దాని యాకులఁ గొన్ని దీసి, పసరు పిండి నా శరీరమునకు వ్రాసినఁ జాలును. ఇంత కన్న మఱేమియు నవసరములేదు."

అని పలికెను. వెంటనే శివసింగు వానికిఁ దగిన యుపచార ములుచేసి బాధ నివారించి చెట్టు చాటున ముసిముసి నవ్వులు నవ్వుచు సిగ్గుచేఁ దలవంచుకొనియున్న కోమలాంగిని జూచి,

"పద్మా! నీ విచ్చటి కేల వచ్చితివి?" అని యడుగ పద్మ యించుక సిగ్గును విడిచి చెట్టుచాటునుండి ముందునకు వచ్చి,

"మా విమలాదేవి పృథివిసింగు మరణానంతరము చంద్రావతి కొక జాబు వ్రాసెను. కాని అది యందినదో లేదో తెలియదు. ఇంతలో యశవంతసింహుని మరణము విని మిక్కిలి విచారించి యుత్తరము వ్రాసిన నామె కందదని నన్నే పంపెను. ఈ బలీభిల్లుని వెంటఁ బెట్టుకొని నేను వచ్చుచుండఁగా నా యిరువురు మహమ్మదీయులు మార్గమధ్యమున మమ్మడ్డగించి, బాధింప సాగిరి. మీరు రాకున్నచో మాగతి ఎట్లుండునో తెలియదు" అని బదులు చెప్పెను. శివసింగు ఆ మాటలు విని మందహాసముతో "పద్మా! చంద్రావతినిఁ జూచుటకే బయలు దేఱితివా? లేక మఱి యెవ్వరినైనఁ జూచుటకా?" అని యడిగిన పద్మ సిగ్గునభినయించి మొగము వాల్చుకొని యూరకుండెను. వారిరువురు నొకరి కొకరు చూచుకొని ముసిముసి నవ్వులు నవ్వుకొనుచు, తమ యనురాగము లొండొరులపైఁ జూపిరి. పిమ్మట పద్మ శివసింగును జూచి "తమ రీయరణ్యమున నెచ్చటి కేగు చున్నారు?" అని యడుగ శివసింగు "పద్మా! శత్రువుల మధ్యఁ జిక్కియున్న చంద్రావతిని, ఆమె కుమారుని, చమత్కారముగఁ దప్పించి జోధపురమునకుఁ గొనిపొమ్మని దుర్గాదాసు నా కప్పగించెను. వా రిరువురిని సవారిలోఁ గూర్చుండఁబెట్టి కొందఱు భిల్లులను రాజపుత్రులను వెంటఁ బెట్టుకొని జోధపురమునకుఁ బోవుచున్నాను. ఇంతలో "రక్షింపుఁడు! రక్షింపుఁడు" అని యార్తధ్వని వినినంతనే, చంద్రావతి నన్నిచ్చటికిఁ బంపెను. వా రీసరికిఁ గడుదూరము పోయియుందురు" అని చెప్పెను. ఆ మాటలన్నియు బలీ భిల్లుఁడు విని "స్వామీ! మీ రీమెను వెంటఁగొని మీవారిని గలసి కొనుఁడు. నేను వెనుకనుండి మెల్లగ వచ్చెద" నన శివసింగు అట్లులే యని పద్మతోఁ గూడ బయలు దేఱెను.

శివసింగునకును పద్మకును జరిగిన సంభాషణము బహిః సవారిలోఁ గూర్చుండిన స్త్రీ చంద్రావతి యనియు, కుమారుఁ డజిత సింగనియు, మా చదువరులు గ్రహించియే యుందురు. శత్రువుల మధ్యనుండి వా రెట్లు బయలఁ బడిరో తెలియఁ గుతూహలులై యుందురు. ఇందిరా దుర్గాదాసులు చంద్రావతి విషయమై తమలోఁ బ్రసంగించుకొని యప్పటినుండియు శ్రద్ధతోఁ దగిన ప్రయత్నములు సేయుచుండిరి. ఆ దినము యశవంతసింహుని పదునొకండవ దినమగుటచే, మంత్ర పఠనములు, బ్రాహ్మణ సమారాధనములు జరుగుచుండినందున గుడారములలో నల్లకల్లోలముగ నుండెను.

ఆ నాఁడుదయమున నిందిర తన మేలుముసుఁగు ధరించుకొని మొగ మేరికిఁ గనఁబడకుండఁ గప్పుకొని గుడారములోనుండి బయలు దేఱెను. ఎన్ని మారులు సంచరించినను, ఆమె నెవ్వరు నడ్డగింప వీలు లేదు గావున, ఇందిర ఆటంకములేక చెంతనున్న యొక గొల్లపల్లెకుఁ బోయి, అచ్చటి గొల్ల యిల్లాండ్రలో నొక బీదదానికి లంచమిచ్చి తన మేలుముసుఁగు నచ్చటవిడచి ఆ గొల్లదాని వస్త్రము గట్టుకొని నెత్తిపై నొక పాలుగంప నిడికొని గొల్లదానివలె గుడారములోనికిఁ బోయెను. సిపాయు లందఱు నజితసింగునకుఁ బాలిచ్చునదికదా యని యామె నెవ్వరును వారింపరైరి. అట్టు లిందిర మాయవేషమున లోనికిఁబోయి, అజితసింగును గంపలో నడుగుననుంచి, వానికిఁ దగల కుండ నా గంపకు మధ్యనొక బల్లనిమిడ్చి, దానిపై నెప్పటియట్లు పాలకుండలిడి మరల గొల్లపల్లెకుఁబోయి యా బాలు నొక గొల్లదాని కప్పఁజెప్పి తాను తన బురఖా ధరించుకొని తన గుడారములోఁ బ్రవేశించెను. ఈ పదిదినములలో నామె యీవలకు నావలకు నెన్నో మాఱులు తిరిగెను గాని, ఆపాద మస్తకమును మేలుముసుఁగు ధరించి యుండుటచే నామె వదన మిట్లుండునని యెవ్వరును కనిపట్టఁ జాలరైరి. ఇందిర గుడారములోఁ బ్రవేశించి తన మేలుముసుఁగు చంద్రావతికిఁ

పోడిగి మొగము వాల్చుకొని తిన్నఁగ గొల్లపల్లెకుఁ బొమ్మని పంపెను. చంద్రావతి ఇందిర వేషధారిణియై ఇటునటుఁ జూడక గొల్ల పల్లెకుఁజోయి తనకుమారుని యొద్దనుండ నంతకుమునుపే దుర్గాదాసు సిద్ధముచేసియుంచిన సవారీ జోయీలను భిల్లులను శివసింగు గొనివచ్చి చంద్రావతిని, అజితసింగును సవారిలోఁ గూర్చుండఁబెట్టి తాను తన పరివారముతో బయలు దేఱెను. అజితసింగు గుడారములో లేనందున, ఆతని యేడుపు పూర్వమువలె నెవ్వరికిని వినఁబడనియెడల ననుమాన మొందెదరేమోయని తలంచి, ఆనాఁటి సాయంకాల మాతఁడు మరణ మొందెనట్లు తన దాసీలందరచే రోదనముచేయించి, ఇందిర చంద్రావతి వేషము వేసికొని గుడారములోనే యుండెను.

బలీ భిల్లుని విడిచి పద్మయు శివసింగును బయలుదేఱిపోవుచు రెండు పూఁటలలోఁ జంద్రావతిని గలసికొనిరి. చంద్రావతియుఁ బద్మయు నొకరి నొకరు కౌఁగిలించుకొని యొండొరుల క్షేమములు దెలిసికొని యమందానంద మొందిరి. ఆ మఱునాఁడు ఉదయముననే శివసింగు పరివారమునకు బయలుదేఱ నాజ్ఞయిచ్చి పద్మను చంద్రా వతితో సవారిలోఁ గూర్చుండఁబెట్టి ప్రయాణము సేయుచుండెను.

# పదియవ ప్రకరణము

## రాజసింహుఁడు

ఒకనాఁటి యుదయమున అగలేశ్వ రాలయములో వైకుంఠయోగి జపము చేసికొనుచుండెను. అతని శరీర మంతయు విభూతితో నిండి యున్నం దునఁ జూపఱ కాతఁడు సాక్షాత్కరించిన శంకరుని వలెఁ దోఁచు చుండెను. మెడలోని రుద్రాక్ష తావళములును, విరియఁ బోసికొనిన జడలును, వాని యాకారమున కొక తీరైన సోయగము గల్గించు చుండెను. అచలేశ్వరుని సహవాసమునఁ గాఁబోలు నాయోగి పుంగ వుఁడుగూడ నచలుఁడై యెంతసేపటికిని జపము సలుపుచు గదలకుండెను. ఆ దేవాలయములో నాతని శిష్యుఁడొకఁడు చేతులు జోడించుకొని నిలువఁబడి యాతఁ డెప్పుడు జపమునుండి లేచునో యని కనిపెట్టుకొని యుండెను. కొంతసేపటికి వైకుంఠయోగి జపముచాలించి కన్నులు దెఱచి తనయెదుటనున్న శిష్యునిజూచి " ఏమిరా వత్సా! విశేషము లేమి ?" అని యడిగెను. ఆ శిష్యుఁడు వినయవిధేయుఁడై " స్వామీ! మీ యాజ్ఞానుసారముగ నేను ఢిల్లీ మొదలైన పట్టణములకుఁ బోయి యచ్చటి విశేషము లన్నియుఁ గనుగొంటిని " అని ఔరంగజేబు పృథివిసింగును చంపించుట మొదలుకొని నయనపాలుఁడు చంద్రా వతిని గొనిపోవుటకు వచ్చిన వఱకును, ఎల్ల వృత్తాంతమును వాని కెఱిఁగించెను. ఆ చరిత్ర మంతయువిని వైకుంఠయోగి తనలో నేమియో కొంతవరకు యోజించి ఆలయములోనుండి యీవలకు వచ్చుచుండెను. ఇంతలో రాజసింహుఁడు వైకుంఠయోగినిఁ జూచుటకై

యచ్చటికే వచ్చి యోగిని గలసికొనెను. యోగి యాతనిఁ జూచి సంతసించి వెంటనే తన శిష్యులకు సెలవిచ్చి పంపివేసెను.

రాజపుత్ర స్థానమున నుదయపురము రాజధానిగఁ జేసికొని రాజసింహుఁడు మేవాడ్ దేశమును బాలించుచుండెను. ఆతఁడు సత్య వాక్పాలుఁడు ప్రజలనందఱను గన్నతండ్రివలెఁ గాపాడుచుండెను. దేహి యనువానికి నహి యనుట యెఱుంగని కరుణాయత్తచిత్తుఁడు, సదాచారుఁడగు వాఁడెట్టివాఁడైనను చేపట్టి రక్షింపక మానఁడు. ఈతని కీర్తి నానాదేశముల వ్యాపించియున్నది. మానవతీమణుల మానము గాపాడుటయన నీతనికి పంచభక్ష్య పరమాన్నములతో భోజనము సేయుటయే! రాజసింహుని సుగుణపరాక్రమాతిశయ ములు వినులారఁ బలుమాఱు లాలకించి పెక్కు రసపుత్రులు వీని తోడఁ గోరి స్నేహము చేసికొనిరి. మహమ్మదీయుల నెట్టులైనఁ బాఱఁ దోలి దేశమంతయు నకలంకముగఁ బాలింపఁ బెక్కునాళ్ళనుండియు రాజసింహునకు ముఖ్యాభిప్రాయమైయున్నది. కాని యాతఁ డందు లకుఁ దగినప్రయత్నములు సలుపుచు సమయముకొఱకు నిరీక్షించి యుండెను రాజసింహుఁ డనయము ఔరంగజేబునకుఁ బ్రక్కలోని బల్లెమువలె నాతని లక్ష్యపెట్టక మెలఁగుచుండెను. జోధపురము జయ పురము మొదలగు రాజ్యముల రాజులందఱు పాదుషాకు వశులైరి. కాని రాజసింహుఁడు మాత్రము నిరాకరించి సంచరించుచుండెను. ఆ కారణమున ఔరంగజేబుకూడ రాజసింహునిపై నెడదెగని పగ వహించి వాని నెట్టులైన సాధించుకొనను నుపాయము లాలోచించు చుండెను.

వైకుంఠయోగి పొట్టకై యూరూరఁదిరుగు కపట సన్న్యాసుల వలెఁగాక త్రికాలజ్ఞుఁడని యెఱిఁగి యప్పుడప్పుడు వానిని దర్శింపఁ బోవు చుండుట రాజసింహునకు వాడుకయైయుండెను. ఏదేనొక కార్యముఁ జేయవలసివచ్చిన నాతనికడకుఁబోయి ఆ కార్యమును వానికెఱిఁగించి

వాని యనుమతిప్రకారముగ రాజసింహుఁడు వర్తించుచుండెను. ఇంతియకాక, అతఁడెట్టిపని నియోగించినను శిరమునధరించి కడు భక్తితో నాచరించుచుండెను. సజ్జనుల ప్రవర్తనము లిట్లేకదా యుండును. ఆ కారణమున రాజసింహుఁడన్న వైకుంఠయోగికిఁ బంచ ప్రాణములలో నొకప్రాణమే! అతని రూపలావణ్యాతిశయములును, సద్గుణములును, ధైర్య శౌర్యాతిశయములును లోలోనఁ దలంచుకొనుచు యోగి నిరంతరముఁ బరమానంద మొందుచుండెను. ఎన్ని పనులున్నను నెలకు రెండు మూఁడుసారులైనను దన్నుఁ జూచి పోవుచుండవలయునని ఆతఁడు రాజసింహున కాజ్ఞాపించెను. సచ్చరిత్రులు పెద్దలమాటల కడుగుదాటరు. గావున నట్లే యెన్నికార్యములున్నను రాజసింహుఁడు తఱుచుగా నచ్చటికిఁ బోవుచుండెను. ఎట్టికష్టములకైననోర్చి మహమ్మదీయులనెల్లఁ బాఱదోలి దేశమంతయు నుద్ధరింపఁగల పరాక్రమశాలి యా రసపుత్రవంశమునకెల్ల నొక్క రాజసింహుఁడే యని వైకుంఠయోగి దృఢముగాఁ దొలుతనుండియు నమ్మియుండెను. వారిరువురకును బెక్కువత్సరములనుండియున్న స్నేహమే కాని యిప్పుడు క్రొత్తగ గల్గినదికాదు.

వైకుంఠయోగి రాజసింహుని చేయిఁబట్టుకొని ఆ పర్వతముపై నొకవనములోఁ బ్రవేశించి రహస్యముగ నిట్లు సంభాషించెను.

"వత్సా! మీ రాజ్యమున నందఱు క్షేమముగ నున్నారా? నీ విచ్చటికి రాఁ గారణమేమి?"

"స్వామీ! కారణ మేమియును లేదు. మిమ్ము దర్శించి పోవలయుననియే వచ్చితిని. మీ యనుగ్రహమున నేనును నా ప్రజలును నేఁటివఱకు క్షేమముగ నేయున్నాము."

"వత్సా! యశవంతసింహుని వృత్తాంతమంతయు నీ వెఱుఁగుదువుకదా?"

# పదియవ ప్రకరణము

"దేవా! ఎఱుఁగుట కేమిసంగతులున్నవి? మొన్ననే ఆతఁడు కాబూలు దేశమునకుఁ బ్రజాయుద్ధమును నివారింపఁ బయలుదేఱెనని విన్నాఁడను. పాప మాతనికుమారుఁడగు పృథివిసింగును ఔరంగజేబు బలిమిని జంపినాఁడఁట. ఇంతకన్న నేనేమియు నెఱుఁగను."

"అయ్యో! నీవింక నెఱుఁగనే యెఱుఁగవా! ఆతఁ డిప్పుడు కాబూలు దేశమున లేఁడుసుమా."

"ఏమీ యశవంతసింహుఁడు కాబూలు దేశమున లేఁడా? అప్పుడే జోధపురమున కెట్లువచ్చెను? యుద్ధ మెప్పుడు చేసెను?"

"జోధపురమున కేగనేలేదు. వానికీలోకముపై విరక్తి వొడమి నందునఁ బరలోకమునకుఁ బ్రయాణమైపోయెను."

(ఆతురతతో) "ఏమేమీ? యశవంతసింహుఁడు కాలము చేసెనా? ఇంక చంద్రావతి గతియేమి?"

"ఔరంగజేబుండ నామె కేమిభయము? యశవంతసింహుఁడు కాలము చేసెనను కొఱంతలేకుండ నాతఁడు చంద్రావతి నేలుకొనఁ దలఁచియున్నాఁడు."

"మహాపతివ్రతయైన చంద్రావతినే ఔరంగజేబు పెండ్లాడఁ దలంచెనా? స్వామీ! జోధపుర మిన్నాళ్ళ కరాజకమై దీనావస్థ లొందవలసి వచ్చెనుగదా?"

"కుమారా! రాజసింహా! నయనపాలుఁడుండ జోధపుర మరాజక మేటికగును? ఆతఁడారాజ్యముపై నిప్పుడేకాదు, తొలుత నుండియు గన్నువేసి యున్నవాఁడు."

"కుటిలాత్ముఁడైన నయనపాలుఁడు జోధపురరాజ్యము హరింప నెంచెనా? తాపసోత్తమా! ఇంక నన్నాడింపక యీ వృత్తాంతము లన్నియు సవిస్తరముగ నా కెఱింగింపుఁడు."

అని వేఁడికొనఁగా వైకుంఠయోగి, కుమారుని మరణవార్తవిని యశవంతసింహుఁడు మరణమొందుటయు, పిదప చంద్రావతి మగ

శిశువునుగనుటయు, నౌరంగజేబు కపటవర్తనుఁడై యామెను గొనిరమ్మని నయనపాలునిఁ బంపుటయు, వైకుంఠయోగి రాజసింహున కెఱింగించెను. శోడనే భయమును సంభ్రమమును దుఃఖము నాగ్రహము నొంతరలై యాతని హృదయమును గలఁతవెట్ట, రాజసింహుఁడు కొంతవఱకు మాటాడలేక నిర్ఘాతపడి చూచుచుండెను. అంతలో గొంతసేపునకు మరల ధైర్యము దెచ్చుకొని "తాపసోత్తమా! ఇట్టి ఘోరకృత్యము లొనరించుచున్న యౌరంగజేబునేమిచేయవలయు? మదోన్మత్తుఁడై యిచ్చకొలఁది సంచరించుచుండెనుగాని త్రిలోకభీకరుఁడగు రాజసింహుఁడుండెనని ఎఱుఁగఁడుగాఁబోలు! సరియే వానివిషయమింక జాగ్రత్తతో యోజింపవలయును. సుకుమారుఁడగు పృథివిసింగును నిష్కారణముగఁ జంపుటకు వానిచేతు లెట్లాడెను? నిర్మలచిత్తుఁడగు యశవంతసింహుఁ డాతని కేమియపరాధ మొనర్చెను? తాను సింహాసన మెక్కినప్పటినుండియు యశవంతసింహుని సాహాయ్యమువలనఁగదా తానింతవాఁడయ్యెను? ఆతనికింత మాత్రమైనను విశ్వాసము లేకపోయెను" అని రాజసింహుఁడు గంభీరముగాఁ బలుకసాగెను. అన్నియును నాలించి వైకుంఠయోగి,

"వత్సా! రాజసింహా! పలుపలుకులతో నింక నేమి ప్రయోజనమున్నది? కావలసినదంతయు నీవఱకే జరిగిపోయినది. చేయికాలిన పిదప నాకులుపట్టిన నేమిలాభమున్నది? చంద్రావతి యిప్పుడు శత్రువులమధ్యనున్నది. బాలుఁడును క్షేమముగనే యున్నవాఁడు. నయనపాలుఁడు వారందఱ నెట్లయిన మోసపుచ్చవలయునని చూచుచున్నవాఁడు. శివసింగును, దుర్గాదాసును విచారగ్రస్తులై యేమిచేయుటకుఁ దోపక తల్లడిల్లుచున్నారు. నీవింక నాలస్యముసేయక మీ పురంబునకుఁబోయి కొంతసైన్యమును వారికి సాహాయ్యముగఁ బంపుము. పిదప దైవాజ్ఞ యెట్లున్న నట్లగును. మనము చేయవలసిన దేమియును లేదు. అజితసింగును చంద్రావతి నెట్లయిన నౌరంగజేబునకునప్పగించిన

జోధపురరాజ్యము తనకు స్వాధీనమగునని నయనపాలుఁడు మెండుగ నాశతో నున్నవాఁడు. ఆశాపిశాచ మావేశించి యుండుటచే నా దుర్మార్గుఁ డెట్టిద్రోహమునైనఁ జేయసమర్థుఁడు. రాజలోక మంతయు నుద్ధరింప నీవుగాక వేతెవ్వరు సమర్థులులేరు. జాగుచేసినఁ గార్యము మించిపోవును. నీ వింక మీ పురమునకుఁబోయి సైన్యముల వాఁకిడకంపుము. అట్లయిన పరాక్రమశాలియగు దుర్గాదాసును శివ సింగును ధైర్యమువహించి నయనపాలునోడించి సౌఖ్యముగ జోధ పురముఁ బ్రవేశింపఁగలరు” అని బోధింప రాజసింహుఁడు సంతసించి “దేవా! మీ యాజ్ఞానుసారముగఁ జేయుచున్నాఁడను. నాకు సెల వొసంగు” డని వానిపాదములకు మరల నమస్కరించి దీవనలొంది సెలవుఁగైకొని తనపరివారములఁ గలసికొని వేవేగ ఉదయపురమునకుఁ బోయెను. వైకుంఠయోగియు తన కాలకృత్యములన్నియు నిర్వర్తించు కొని యచలేశ్వరాలయములోనికిఁ బోయెను.

# పదునొకండవ ప్రకరణము

## న య న పా లుఁ డు

నయనపాలుఁడు ఔరంగజేబు సేనానాయకులలో నొకఁడు. ఈతఁడు రాజపుత్రవంశజుఁడు. యశవంతసింహుని తండ్రియు వీనితండ్రియు నన్నదమ్ములే! కాని, నయనపాలునితండ్రి దురాచారుఁడును, క్రూరాత్ముఁడునగుటచే వానితండ్రి వాని నావలకుఁ బాఱఁదోలి యశవంతసింహునకే రాజ్యమొసంగెను. ఆ కారణమున యశవంతసింహునిపై నయనపాలునకుఁ దొలుతనుండియు నీర్ష్యజనించియుండెను. ఇంతియకాక, సమయముచిక్కిన యశవంతసింహుని మోసపుచ్చి, జోధపురము తనవశము చేసికొనవలయునని యాతఁడు నిరీక్షించుచుండెను. ఔరంగజేబు నను్గ్రహమువడిసిన తనకార్యము కొనసాగుననితలంచి ఆతఁడు పాదుషాయెడల నయభయములమెలఁగుచు వానివెంటఁ గుక్కవలెఁ దిరుగుచుండెను. యశవంతసింహుని మరణవార్త వానిచెవినిఁ బడినంతనే నయనపాలునకుఁ గల్గిన యానందమునకు మితిలేకుండెను. తన మనోభీష్టము నెఱవేర్చుకొనవచ్చునని యాతఁడు సంతసించెను. ఈ సంగతి ఔరంగజేబుగనిపట్టి వానినిబంపిన తనకార్యము శ్రద్ధతోఁ జూడఁగలఁడనితలంచి నయనపాలునే చంద్రావతికై పంపెను. అట్టి సమయముననే తన బుద్ధిచాతుర్యమంతయుఁజూపి చంద్రావతినిబట్టి ఢిల్లీకిఁగొనిపోయి పాదుషాకప్పగించి తాను జోధపురమును సంపాదించుకొనవలయునని యాతఁడు నిశ్చయించుకొనెను. యశవంత సింహుని నెట్టులైన మోసపుచ్చితినేను, లేక పీలైన వారిఁ జంపించి

ఖైనను, జోధపురము నయనపాలునకుఁగాని, తనవారిలో ముఖ్యుల కెవ్వరికైనఁగాని, ఈయవలెనని పాదుషా చాలకాలమునుండి యూహించుచుండెను. కాని యశవంతసింహుఁడు నిరుపమాన పరాక్రమశాలియగుటచే నించుక వెనుదీసి యూరకుండెను.

యశవంతసింహుఁడు గతించెనని విన్నంతనే నయనపాలుఁడు తానే జోధపురరాజ్యమునకు వారసుననియు, చంద్రావతీమహారాణిని బట్టితెచ్చిన యాతఁడు సంతోషాతిశయమ్మున, జోధపురము తనకొసంగకమానఁడనియునెంచి పాదుషాకార్యము మిక్కిలి శ్రద్ధతోఁ జేయఁ బయలుదేఱెను. జోధపురరాజ్యమునకు ముఖ్యవారసును, చంద్రావతి కుమారుఁడునునగు నజితసింగు గతించినందున, ఎవ్వరును వారసులు లేరని పాదుషా, రాజ్యము తనకేయొసంగునని నయనపాలుఁడు నిశ్చయించుకొనెను. కాని తానొకటిఁదలఁచిన దైవమొకటి దలఁచుననుట నిజమైనది. సకలసైన్యసమేతుఁడై యాతఁడు కాబూలులోఁ బ్రవేశించి నప్పటినుండియు, దుర్గాదాసు నెట్టులైన మోసపుచ్చ వలయునని ప్రయత్నించుచుండెను గాని, తుదకాతఁడే మోసపోయ్యెను. దుర్గాదాసు శత్రుచయమునుండి చంద్రావతిని అజితసింగును దప్పించినప్పటినుండియు నయనపాలునితో మరింతచనువుగా మాటలాడ నారంభించెను. పూర్వముకన్న వానిమొగమువికసించి కలకలలాడుచుండెను. అప్పుడప్పుడు నయనపాలుఁడు దుర్గాదాసును జేరఁజీరి, "చంద్రావతి యింకనైన ఢిల్లీనగరమునకుఁ బ్రయాణము కాఁగలదో లేదో ఆమెను కనుఁగొనిరమ్మని పంపుచుండెను. దుర్గాదాసు తత్క్షణమ లోనికింజని మఱలవచ్చి "స్వామీ! ఆమె శరీరస్థితి యిప్పుడే కొంచెము కొంచెము త్రోవలోనికి వచ్చుచున్నది. ఇంక రెండుమూడు దినములు మాత్రము తమరు కటాక్షించి సెలవొసంగినచో బయలుదేఱఁజాలుట కెంతమాత్రము సందియములేదు" అని పలుకుచువచ్చెను. ఆ పలుకులకు నయనపాలుఁడు సంతసించి "ఆవంతయు నభ్యంతరములేదు.

ఆమె కెట్టియిక్కట్టులును గిల్లనీయకయే ఢిల్లీనగరమునకుఁ దోడ్కొని రమ్మని పాదుషాగారు నాకాజ్ఞాపించినారు. కావున నట్టులే సెల విచ్చితిని" అని ప్రత్యుత్తరమిచ్చాయ దుర్గాదాసు లోలోననవ్వు కొనుచు నావలికిఁ బోవుచుండెను.

ఒకనాఁటి సాయంకాలమున నయనపాలుఁడు తనగుడారముల చుట్టు సంచరించుచు, సైనికులందఱు జాగరూకులై యుండిరో లేదో యని వారిని బరీక్షించుచుండెను. వాని ముఖలక్షణము లవలోకింప నాతఁడు స్వగతమున నేదియో దీర్ఘాలోచన సేయుచున్నట్లు తెలియు వచ్చుచుండెను. ఆతఁ డేవిషయమునుగూర్చి తలపోయుచుండెనో తెలియదు గాని, ఒక్కొక్కప్పుడు తనలోదానే చిఱునవ్వునవ్వుచు, సంతోషించుచు, మీసముదువ్వుకొనుచు, నిటునటుఁ బచారు సేయు చుండెను. ఇంతలో నొకసిపాయి యాతనివద్దకు మెల్లఁగావచ్చి, వానితో నక్కఱకురాని ప్రసంగము గొంతవఱకుఁజేసి తాను చెప్పఁ దలఁచుకొనినసంగతికి సందర్భముఁ గలుగఁజేసికొని "అయ్యా! దుర్గా దాసు ముఖలక్షణములుచూడ నాతఁడేదియో మోసముపన్నుచుండె నని నాకుఁ దోఁచుచున్నది. మీ రిట్టు లుపేక్ష సేయుట పాడిగాదు. కార్యము మించిపోయినపిమ్మట మనము చేయవలసిన దేమియు నుండదు. కావున తమరెంచుక జాగరూకత వహించియుండుట మేలు" అని చెప్పెను.

ఆ పలుకులకు నయనపాలుఁ డులుకువడి, సాశ్చర్యస్వాంతుఁడై "ఏమీ? దుర్గాదాసు మనల మోసపుచ్చవలయునని యోజించు చుండెనా? ఆతఁడంతటి కార్యవేదియా? నాయెడల నెంతో భక్తి వినయములతో మెలఁగుచుండెనే, నాకే ద్రోహముసేయునా? ఈ గుడారములచుట్టును మనసైనిక నికాయంబులు కావలియుండ వాని చేత నేమగును? ఇంతకు నాతఁడు చేయఁజాలిన దేమున్నది? మనతోఁ బోరాట మొనర్పఁగల యంతటి పోటుమానిసికాఁడుగదా? సరియే!

ఇప్పుడు మించినదేమి ? దుర్గాదాసును ఇందిరయుఁగూడ నీ క్షణము నుండి యావలకు నీవలకుఁ బోఁగూడదని నాయాజ్ఞ యెఱిఁగింపుము. మీఁదసంగతి యోజింపవచ్చును" అని ధైర్యముగాఁ బలికెను. కాని వెంటనే వానిహృదయమున ననుమాన మంకురమైనది. దుర్గాదాసొనరించిన మోసమెఱుఁగఁడు గావున, నయనపాలుఁ డంతవఱకుఁ బెరటిత్రోవలోనేయుండెను. ఆతఁ డెన్నియాజ్ఞ లొనరించినను చంద్రావతి విషయమై మన దుర్గాదాసున కింకేవిచారమును లేదుకదా ? త్వరలోనే చంద్రావతిని ఢిల్లీనగరమునకుఁ గొనిపోయి పాదుషా కప్పఁ జెప్పి, వానివలన మెప్పొందవలయునని యూహించి, దుర్గాదాసుపై తన కనుమానముపుట్టినందున నా మఱునాఁడే నయనపాలుఁడు ఢిల్లీ నగరమునకుఁ బ్రయాణముకావలయునని, తనసైనికుల కాజ్ఞాపించెను. పరివారములన్నియుఁ బ్రయాణమునకు సిద్ధములై బయలుదేఱెను. అట్లు వారు కొంతదూరమువఱకుఁబోయి, దుర్గములు, అరణ్యములు, పల్లెలు అనేకములుదాఁటి రెండు మూఁడు మజిలీలుచేసి జలాలాబాదు దుర్గముఁ బ్రవేశించిరి. అచ్చట మరల నెప్పటివలె నయనపాలుఁడు గుడారములు వేయించెను. కాని యేకారణముననో తనగుడారము మాత్రము చంద్రావతి గుడారమువద్ద వేయించుకొనెను. అచ్చటఁ గూడ దుర్గాదాసును, ఇందిరయు నావలకు నీవలకుఁ బోఁగూడదని యాజ్ఞాపించెను. ఆదినమాతఁడు మాటిమాటికి నీవలకువచ్చుచు నలు వంకలుఁ జూచుచుండెను. ఆతని సైనికులెల్లరు పూర్వమువలెనే గుడారములచుట్టుఁ గాపుండిరి. నయనపాలుఁడు తనలో నేమియో విచారించుకొనుచు నిటునటుజూచుచు తలపంకించుచుండెను. ఆతఁడు, తనలో నేవిషయమై తలపోయుచుండెనో తెలియదు గాని, లోలోన నేమేమో గొణఁగుకొనుచు నీ క్రిందిమాటలుమాత్ర మప్పుడప్పుడు పైకిఁ బలుకసాగెను. "అయిన నేనుమాత్ర మేటి కూరకుండవలెను ?

చక్కఁదనమా ?.........చిన్నతనమున చూచినందువలన బాగుగా జ్ఞాపకము లేదు.........ఇంత ప్రయాసపడి పాదుషా కేల యప్పఁజెప్ప వలయు ?.........ఆఁ—నన్నేమిచేయఁగలఁడు ? తప్పించుకొనిపోయె నని చెప్పెద.........అయినను ఆమెనుచూచినఁగాని ఏమియు నిశ్చ యించుకొనఁజాలను."

ఇట్లు కొన్నిమాట లస్ఫుటముగను, కొన్ని స్పష్టముగను, బలుకుచు, నాతఁడు తనగుడారములోనుండి యీవలకువచ్చి, యిటు నటుఁదిరుగుచు, ఒక పరిచారికనుబిలిచి తాను లోనికివచ్చుచున్నాఁడని చంద్రావతికిఁ జెప్పుమనిపంపెను. తానంపిన పరిచారికపోయి, మరల వచ్చి తనకుఁ బ్రత్యుత్తరము చెప్పకమున్నె నయనపాలుఁడు చంద్రా వతి గుడారములోనికిఁ బోవఁజొచ్చెను. ఆతఁ డెప్పు డెప్పు డేయే సంగతులు గనుఁగొనుచుండునోయని దుర్గాదాసు తనదృష్టి తనపైనే యుంచుకొని సంచరించుచుండెను. గావున నాతఁడుగూడ నయన పాలునివెంటనే వెళ్ళెను. అప్పటికింకను నయనపాలుని యాగమన వృత్తాంతము నెఱుఁగనందున లోపలనున్న ఇందిర తన మేలుముసుంగు దీసి కూర్చుండియుండెను. అచ్చటచ్చటఁ గొందఱు పరిచారికలు మాత్రముండిరి. నయనపాలుఁ డింతలో లోనబ్రవేశించి యిటునిటుఁ జూచుచుండెను. దుర్గాదాసు ద్వారముచెంతనే నిలిచియుండెను. నయనపాలుఁడు చంద్రావతిని జాలకాలముక్రిందటఁ జూచినవాఁడగుట చేత పోలికపట్టలేక సహజముగ "నీమెయేనా చంద్రావతి" అని యిందిరనుజూపుచు నొకదాసినడిగెను. సహజభీతచిత్తయైన యాదాసి, జరిగిన వృత్తాంతమంతయు నయనపాలుఁ డెట్లో గ్రహించెననియు, ఇట్టితఱి నిక్కువ మెఱిఁగింపకున్న తన్ను దండింపక మానఁడనియుఁ దలంచి గడగడవణకుచు, నోటమాటరాక "కా—దు—కా—దు— ఈ—మె—చం—ద్రా—వ—తి—కా—దు—యి—యి—యి—

యిందిర" అని నాలుకతడబడఁ బ్రత్యుత్తరమిచ్చెను. ఆ మాటలువిని నంతనే అంతవఱకు నెట్టియూహాములేని నయనపాలుఁ డనుమాన మొంది, "ఓసీ ! మూర్ఖురాలా ! చంద్రావతి యేమయ్యెనో చెప్పెదవా లేదా ?" అని గంభీరముగాఁ బలికెను. వెంటనే యా పరిచారిక, యాతఁడు తన్నేమిసేయునోయని యేడ్చుచు, ఇందిరవేషధారిణియై చంద్రావతి తప్పించుకొనిపోయెనని వానికెఱిఁగించెను. ఆమాట లాలించి, త్రొక్కిన త్రాఁచుపామువలె మండిపడి రక్తాననుఁడై నలుఘంకలఁబరికించి, ద్వారమువద్దనున్న దుర్గాదాసువైపుతిరిగి నయనపాలుఁడు "ఓరోరి దుష్టాత్మా ! ఈమోసము నీవలననే జరిగినది. నాకింతటి ద్రోహ మొనర్పగలవని కలనైన నెఱుఁగనైతినిరా కుమతీ ! చంద్రావతి నెచ్చటికంపితివో చెప్పెదవా ? లేదా ?" అని ఖడ్గమెత్తి భయపెట్టసాగెను.

కాని, యా మాటలకేమియుఁ బ్రత్యుత్తరమీయక, లక్ష్యము లేనట్లు తిరస్కారముగాఁ జిఱునవ్వునవ్వి, దుర్గాదా సూరకుండెను. పిమ్మట నయనపాలుఁ డిందిరనుజూచి, "ఓసీ ! దుష్టురాలా ! నీవైన చంద్రావతివృత్తాంతము నెఱింగించెదవా లేదా ? వచింపకున్న నాకరవాలంబునకు బలియయ్యెదవు. ఏమియు నెఱుఁగని ముద్దరాలివలె నూరకుండెదవేల ?" అని యాగ్రహ ముట్టిపడునట్టులడిగెను. కాని దుర్గాదాసేమి ప్రత్యుత్తరమిచ్చెనో నామెయు నా ప్రత్యుత్తరమే యొసంగెను. నయనపాలుఁ డెన్నిసారులు తన్నడిగినను, ఎంతభయము గల్గించినను, దుర్గాదాసు చిఱునవ్వు నవ్వుటదక్క వేఱు జవాబేమియు నాతనికీయలేదు. ఇంక వానినడుగుటవలనఁ దన కెంతమాత్రమును ప్రయోజనములేదని యాతఁడు నిశ్చయించుకొనెను. దుర్గాదాసును ఖండింపవలసినంత యాగ్రహము వానికిఁబుట్టెను కాని, యాతనిని జంపినంత మాత్రమునఁ దన కేమియుఁ బ్రయోజనము లేదనియు. బ్రతికియుండిన

నెప్పటికైన చెప్పింపవచ్చుననియు నూహించి దుర్గాదాసును చంపక విడిచెను. తనయాశలన్నియు నిరాశ లయ్యెఁగదాయని యప్పటి నుండియు నయనపాలుఁడు విషణ్ణ హృదయుండయ్యెను. చంద్రావతి నెట్లులైన, ఔరంగజేబునకొసంగి తాను జోధపురమును సంపాదించు కొనవలయునని పుట్టెఁడాశతోనుండెను. కాని కడకు నిరాశయయ్యెను, ఢిల్లీనగరంబునకుఁబోయి పాదుషా మొగమెట్లు చూడఁగలనని ఆతఁడు నిరంతరము చింతార్ణవమునఁ బడియుండెను. ఏయుపాయమును దనకుఁ దోపనందున నిందిరా దుర్గాదాసులఁ జతుర్విధోపాయముల బోధించి యడుగుచు వచ్చెనుగాని యందువలన నేమియుఁ గార్యము గానరాలేదు. ఇంకెంతచింతించిన ప్రయోజనములేదని నిశ్చయించుకొని, చంద్రావతిని వెదకుఁడని కొన్నిసైన్యముల వేర్వేఱుగ నలువంకలకుఁ బంపెను. ఇందిరను దుర్గాదాసును విడువక ఖయిదుచేసి వెంటఁ బెట్టుకొని మిగిలిన సైన్యములతోఁ దానుఁగూడ నొకమార్గమున వెదకుచు బయలుదేఱెను.

# పండ్రెండవ ప్రకరణము

## ఆ శా భ ం గ ము

బెలాలాబాదు దుర్గమునువిడిచి నయన పాలుఁడు తన సైన్యములతో చంద్రావతినివెదకుచు నెల్లెడల సంచరించుచుండెను. మార్గమధ్యముననున్న ప్రతిదుర్గమును, ప్రతిగ్రామము బరీక్షించుచు నాతఁడు క్రమక్రమముగా నొక పల్లెటూరుయొద్దకువచ్చుసరికి, కొందఱు భిల్లు లొకసవారి మోసికొనిపోవుచున్నట్లు వానికి గోచరమయ్యెను. ఆ సవారివెనుకఁ గొంతపరివారముగూడఁ బోవుచుండుటగనిపట్టి, నయనపాలుఁడు సత్వరముగ తనసైన్యములతో నచ్చటికిఁబోయి, భిల్లులనడ్డగించి సవారి నాఁపెను. అప్పుడాభిల్లులందఱును మహమ్మదీయులను సవారియొద్దకు రానీయకుండ చుట్టునుమూఁగి వారితోఁ బోరాడఁజొచ్చిరి. నయనపాలుఁడు నేలఁబడియున్న సవారిఁజూచి చంద్రావతి తనకుఁజిక్కెఁగదా యని డెందంబున నమందానందమొందెను. కాని ఇందిరయు దుర్గాదాసుమాత్రము తమప్రయత్నమంతయు బూడిదఁబోసిన పన్నీటివలె వ్యర్థమయ్యెనని యూరక వగచుచుండిరి. జోధపురవంశము నుద్ధరింపఁ గలమని యశవంతసింహునితో నాతఁడొనర్చిన ప్రతిన జ్ఞప్తికిఁదెచ్చుకొని దుర్గాదాసు విషాదమగ్నుఁడయ్యెను. సవారిలోనున్న చంద్రావతిని, అజితసింగునుజూచినంతనే వారినిరువురను నయనపాలుఁడు గడతేర్పకమానఁడని యిందిర నిశ్చయించుకొనెను. ప్రాణత్యాగమునకైన నొడంబడి సాధ్యమైనంతవఱకు నయనపాలునితోఁ బోరవలయునని

దుర్గాదాసు తనలో నిశ్చయించుకొనెను. అంతకన్న వేఱొక్క యుపాయ మాతని కప్పటికిఁ దోఁపలేదు.

భిల్లులును రాజపుత్రులును గలసి సవారీచుట్టు నిలువంబడి శత్రువుల దరికిరానీయకుండఁ బోరాడుచుండిరి. కాని మహమ్మదీయ సైన్యములు తమకన్న నెక్కుడుగ నుండుటంజేసి, రాజపుత్రులకు వారినిభరించుట కష్టతరమైయుండెను. వారి పరివారమునఁ గొందఱు మహమ్మదీయులచే హతులైరి. ఇంతలో నయనపాలుఁడు తన కర వాలము గిరగిరఁద్రిప్పుకొనుచు సవారివద్దకు వచ్చుచుండెను. ఉన్నవా రందఱు మహమ్మదీయులతోఁ బోరాడుచుండుటచే నప్పటికి వాని నడ్డగించువారెవ్వరును లేరైరి. నయనపాలుఁడు మెల్లమెల్లఁగా సవారి యొద్దకుఁబోయి కవాటంబుదెఱచి, వంగి లోనికిఁ జూడసాగెను. వెంటనే లోననుండి యొకకత్తిదెబ్బ వానిభుజముపైఁ దగిలెను. ఆఘాతమున కాతఁడు సొమ్మసిల్లి, మరలలేచి, దురాగ్రహస్వాంతుఁడై సవారిలో నున్న చంద్రావతిని బలవంతముగ నీవల కీడ్చుకొనిరండని యిరువురు సైనికుల కాజ్ఞాపించెను. తత్క్షణముననే వారచ్చటికిఁబోయి నిలుచుండి నంతలో నాసవారిలోనుండి యొక రసపుత్రవీరుఁ డాయుధపాణియై బయలుదేఱి, మహమ్మదీయుల నుఱుమాడఁజొచ్చెను. ఆ చిత్రమును జూచి నయనపాలుఁడు నిశ్చేష్టితుఁడై మాటయాడలేక యంత్ర జాలముఁ జూచుచున్నట్లు నిలువఁబడియుండెను. ఇంతవఱకును చంద్రా వతికి రాఁబోవు దుర్గతిఁదలంచి విచారించుచున్న యిందిరా దుర్గా దాసులు నిర్ఘాతపడి యా చమత్కారమును జూచుచుండిరి. చంద్రా వతి తనకింకదక్కుట దుర్లభంబని నయనపాలుఁడు నిరాశ వహించు కొనియెను. పాప మాతఁ డెన్నిపాట్లుపడినను, ఇంచుకంతయుఁ బ్రయో జనము గానరాదయ్యెను. ఎంతమూర యాలోచించినను వాని కేయుపా యము దోఁపలేదు. కాని తనహృదయతలంబున గాఢంబుగనాటిన యాశాబీజ మించుక యంకురించుటచే, మఱలనొకసారి దుర్గాదాసును

భయపెట్టిన చంద్రావతి నిక్కువ మెఱింగించునేమో యని తలంచి వానింబిలిచి, "ఓరోరి మూర్ఖచిత్తా! ఇంకనైన చంద్రావతి వృత్తాంత మెఱింగించెదవా లేదా? నీకుఁ బ్రాణములపై నాసయున్నయెడల మిమ్ముమోసపుచ్చక, మా యనుగ్రహము సంపాదించుకొని బ్రతుకుము. ఔరంగజేబు పాదుషాగారితో నీవిషయమై చెప్పి నీకు బహుమానమిప్పించెదను. నాపలుకులాలింపకున్న నీయెదుటనే నీచెల్లెలైన యిందిరను పరాభవించి నా ఖడ్గమునకు బలివేసెదను. కడకు నీగతియు నంతియయనుకొమ్ము."

అని యనేకవిధములభయపెట్ట దుర్గాదాసు చిఱునవ్వు నవ్వుటఁ దక్క వేఱొక ప్రత్యుత్తర మాతనికొసంగలేదు. వాని నిర్లక్ష్య భావమునకు నయనపాలుఁడువిసిగి ఇందిరకడకుఁజని యామెను జేరఁజీరి "ఓసీ పాపాత్మురాలా! అలమ్గీరు పాదుషాయంతవానికి ద్రోహమొనర్చిననిన్ను బ్రతుకనీయరాదు. నీచరిత్రమంతయుఁజూడ నీవాఁడుదానవైనను, ఎందఱనో వీరపురుషులఁ జంపిపుట్టినట్లు దోఁచుచున్నావు. బాగుపడఁదలంచితివేని చంద్రావతి యెచ్చటనున్నదో మాకెఱింగించి మానవలన మెప్పొందుము. లేనియెడల నీవు వీక్షించుచుండఁగనే నీయన్న దుర్గాదాసును ఖండఖండలుగ ఖండించి గ్రద్దలకు వైచెదను. ఇంతియకాదు, ఇందఱిలో నిన్నుఁబరాభవించి నీకులంబుఁజెఱచి పెట్టరాని కష్టములెల్ల బెట్టి నిన్నొక్క కఱకు తురకకిచ్చి పెండ్లిచేసెదను. నేఁటినుండియు నీజన్మమంతయు దుఃఖభాజనం బగును."

అని పలుమాఱు బోధింప సహజ ధైర్యాలంకృతయైన యిందిర రాజపుత్రస్త్రీయగుట నిసుమంతయు భీతిఁజెందక, పౌరుషంబు వహించి రోషారుణనేత్రయై నయనపాలుని విలోకించుచు,

"ఓరోరి క్రూరాత్మా! తాటియాకుల చప్పుళ్ళకు కుందేళ్లెన్నఁడైన వెఱచుననుకొంటివా? కుమతీ! మాటిమాటికి మమ్మేటి

కడిగెదవు ? మా ప్రాణములపై నాశ త్యజించియే మేమిట్టికార్యమునకు సాహసించితిమనుకొమ్ము. జోధపుర వంశోద్ధారణముకన్న మా ప్రాణములు మాకెక్కువగావు. నేఁటివఱకు నామెయన్నముఁ దినుచుండుటచే చంద్రావతినిరక్షించుట మాకుఁగర్తవ్యము. అందుకై మేమాచరింపవలసిన దింతకుమున్నే యాచరించితిమి. నీవు మాయిరువుర నింక నేమిచేసినను చేయవచ్చును. అస్థిరంబులగు ప్రాణములన్న నీవలె మాకంత తీపిగాదు."

"ఓసీ! గయాళీ! ఇందిరా! సకల మహమ్మదీయాన్వయ సామ్రాజ్యలక్ష్మీ దురంధరుండగు నలమ్గీరుపాదుషాను దృణప్రాయంబుగనెంచి, నిరుపమాన బాహుబలాన్వితుండగు నయనపాలుని ధిక్కరించి నీవాడినపలుకులకు నిన్నిప్పుడే పరిమార్పవలసియున్నది. కాని సదయ హృదయుండనగుటచే నెప్పటికైనఁ జెప్పకుందువాయనితలంచి సాహసంబు విడిచితిని. కావున నకారణంబుగఁజావక నాపలుకాలకించి చంద్రావతియెచ్చటనున్నదో మా కెఱింగింపుము. నిక్కువం బెఱింగించిన నిన్నును మీయన్ననుగూడ సబహుమానంబుగ సౌఖ్యంబుగ బంగారుపల్లకిలోఁ గూర్చుండఁబెట్టి మీపురంబునకుఁ బంపెదను."

"ఓరి కూళమిన్నా! నయనపాలా! బంగారుపల్లకి యని వంతనే భుజములుపొంగుటకు నీవలె ఘోరదరిద్రులము గాము. పొట్టకూటికై క్షత్రియధర్మమునువిడిచి నీవలె నొరుల సేవింపము. పుట్టినప్పటినుండియు సకల భాగ్యోపేతులమై యెల్లసౌఖ్యంబు లనుభవించుచున్న క్షత్రియ ధర్మాచరణ కుతూహలాంతరంగులము. పదునాల్గు భువనంబు లల్లకల్లోలమైనను ప్రతిన నెఱవేర్చుకొనువారము. చంద్రావతీ రక్షణ మవశ్యకర్తవ్యమని కంకణము గట్టుకొన్నారము. ఇంక నీ వడియాశలఁజెందక మా యిరువుర నేమిచేయఁదలంచితివో సత్వరముగఁజేసి నీపురంబునకుఁబొమ్ము. చంద్రావతియు నజితసింగు నీవఱకే

సౌఖ్యముగ నున్నవారు. వారినిఁ గనుఁగొనుట నీకశక్యము, నిన్నుఁ బుట్టించిన వానికైనను దరముకాదు. ”

“ ఏమేమిరా ! అజితసింగు బ్రతికియే యుండెనా ? అతఁడు గుడారములో గాయము చనిపోలేదా ?”

“ నీ చాతుర్యమంతయు నింతలో నున్నది. నిన్నేటికనవలె ? నీయట్టి వివేకహీనునకు సైన్యాధిపత్యమొసంగిన యారంగజేబు ననవలెఁగాక. ”

అని యిందిర నవ్వుచు బలికెను. అజితసింగు బ్రతికియుండెనని విన్నతోడనే నయనపాలునకు జోధపుర రాజ్యముపై గల యాశ యంతయుఁబోయి యాతనికి విరక్తిఁబుట్టెను. ఇందిర సాహసంబునకు నయనపాలుఁ డాశ్చర్యమొంది మాఱుమాటాడలేక ఆమె శరీర మాపాదమస్తకము చూచుచు సహజ సౌందర్యమునకు లోలోన మెచ్చుకొనుచుఁ గొంతసేపటికి మోహభ్రాంతుఁ డయ్యెను.

సవారిలోనున్న చంద్రావతియు, నజితసింగును, పద్మయు నేమయిరో చదువరులకుఁ దెలియకపోవచ్చును. వారు మువ్వురును సవారిలోఁగూర్చుండి సపరివారంబుగ శివసింగు వెంటఁ బ్రయాణము సేయుచుండఁగా కొంతదూరము పోయినపిమ్మట బలీభిల్లుఁడు కాళ్ళీడ్చుచు కొనుచుఁ బరుగునవచ్చి “ అయ్యా ! తురకల సైన్యములు వచ్చుచున్నవి. ఇంక రెండుజాముల కాలములో మిమ్ముఁ గలసికొనఁగలవు ” అని కేకలువేయుచు వచ్చి చెప్పెను. ఆమాటలాలించి శివసింగు తత్తఱపడసాగెను. సవారిలోనున్న పద్మయుఁ జంద్రావతియు మఱల నీ గండమెట్లుగడచునోయని భీతిల్లిరి. శివసింగు తత్క్షణమే చెంతనున్న పల్లెటూరిలోనికిఁబోయి యచ్చట సవారి దింపించెను. అంతకంతకుఁ గాల మతిక్రమించుచుండెను గాని యెవ్వరికి నేమియుపాయమును దోఁపలేదు. ఆలోచనములతో వారా రెండుజాములకాలము గడపి యుండిరా యెట్టిమోసమైనఁ జెందియుందురు. రసపుత్రులును, భిల్లులును చంద్రావతి నెట్లు రక్షింపవలెనో యని చింతిల్లుచుండిరి. చంద్రా

పతియు నించుమించుగ నట్టియవస్థలోనేయుండెను. తన ప్రాణములు పోయినను, అజితసింగునైనఁ గాపాడిన బాగుగనుండునని యామె కష్టపడు తలంపువొడమెను. తమకంఠమునఁ బ్రాణములున్నంతవఱకు నెట్టియాపదలును రానీయమని సేవకులందఱు చంద్రావతికి ధైర్యముఁ జెప్పిరి, కార్యానుకూల చతురోపాయంబుల బాగుగ నెఱింగినపద్మ సేవకుల కలకలంబుజూచి, యొక్క చక్కని యుపాయ మాలోచించి శివసింగు మొదలైనవారి కెఱింగించెను. అందులకు వారందఱు సంతసించి పద్మను గొనియాడసాగిరి.

వెంటనే పద్మ అజితసింగును నెత్తుకొని చెంతనున్న ఆరావలీ పర్వతమెక్కి అచలేశ్వర మందిరమునకుఁబోయి వైకుంఠయోగిని గాంచి "స్వామీ! నాదొక విజ్ఞాపనముగలదు. నయనపాలుఁడు మమ్ము వెదకుకొనుచు సైన్యములతో వచ్చుచున్నాఁడు. ఎన్నిగండములుఁగడచినను చంద్రావతికి సౌఖ్యము చేకూఱకున్నది. తమరు కటాక్షించి యీ బాలునిఁ గొంతకాలము తమయొద్దనుంచుకొని పెంచుచుండవలయును." అని చెప్ప వైకుంఠయోగి సమ్మతించి యా బాలు నొక భిల్లాంగనకప్పఁజెప్పి సౌఖ్యముగనుంచెను శివసింగు చంద్రావతిని రహస్యముగఁగొనిపోయి యొకభిల్లునియింటిలో నుంచెను. ఆతఁడుగూడ నచ్చటనే యామెకు ధైర్యముజెప్పుచు నుండెను. రసపుత్రులును భిల్లులును మఱింత ధైర్యమువహించి పద్మ చెప్పిన యుపాయముచొప్పున నొక రసపుత్రవీరుని సవారిలోఁ గూర్చుండఁ బెట్టిరి. నయనపాలుఁడు, సవారిలో చంద్రావతియున్నదని ఎంతో యాశవహించెను గాని, చంద్రావతికిమాఱుగ రసపుత్రవీరుఁడు బయలుదేఱి సైన్యముల చెండాడ నారంభించెను.

ఇందిరా దుర్గాదాసులవలన తనకింక నెట్టిప్రయోజనములేదని నయనపాలుఁడు నిశ్చయించుకొని భిల్లులను రాజపుత్రులను బరిమార్ప వలయునని తనవారికిఁ గఠినముగ నాజ్ఞాపించెను. మహామ్మదీయులు వానిప్రోత్సాహమున రాజపుత్రులతో ఘోరముగఁ బోరాడఁ దొడఁ

# పదుమూడవ ప్రకరణము

## తానొకటి తలంచిన దైవ మొకటి తలంచును

నయనపాలుండు శత్రువుల కోడిపోయి ఢిల్లీ నగరమునకుం బాఱిపోయెను. అంతకుమున్నే యిందిరపై మోహముచేత నెడంబాయలేక, యామెను కొందఱుభటుల కప్పగించి మజిల రసపుత్రులకుం జిక్కకుండ పంపి వేసెనుకదా! కాని నయనపాలుండు ఢిల్లీనగరమునకుం బాఱిపోవు మార్గమధ్యముననే యామెను కలసికొనెను. ఢిల్లీనగరముం బ్రవేశించినపిమ్మట నామెను తనయింటనే యుంచుకొనెను. ఆతం డెట్టి ముహూర్తమున ఢిల్లీనగరము బయలుదేఱెనో కాని వాని ప్రయత్నములన్నియు భంగమయ్యెను. వాని యాశలన్నియు నిరాశలయ్యెను. చంద్రావతిని పాదుషా కొసంగిన యాతండు తన కెట్టి మహోపకార మొనర్చునోయని సంతసించుచుండెను. కాని యిప్పు డెట్టిదండన గావించునోయని భయపడుచుండెను. తనసమాచారమంతయు ఔరంగజేబు చారులవలనం గనుంగొనుచుండెనేమోయని వాని కనుమానము జనించెను. ఔరంగజేబు స్వభావము నయనపాలునకుం గ్రొత్తగాదు. చంద్రావతి, నిందిరయు, దుర్గాదాసును దప్పించుటయు, నయనపాలుండు వారిని వెదకుచు బయలుదేఱుటయు పాదుషా యిదివఱకే సంగతులన్నియు గనుంగొనియుండెను. పృథివిసింగు మరణానంతరము తన కార్యములన్ని యింకం జక్కనగునని ఔరంగజేబు నమ్మకొని యుండెను. యశవంతసింహునింగూడం జంపింప వాని యుద్దేశముండెను గాని, యాతండు పన్నిన విషవస్త్రములే, ధరించుకొనిన పృథివి

సింగును, కాబూలు దేశములోనున్న యశవంతసింహునిఁగూడఁ గడ తేర్పఁజాలెను. ఔరంగజేబుపన్నిన వ్యూహమంతయుఁ జెడిపోవుటకుఁ దానే కారకుఁడనియు తన్నేమి సేయునోయనియు, భయమొందుచు నయనపాలుఁడు రేయుంబవళ్లు నుపాయ మాలోచించుచుండెను. ఎంత యోజించినను వానికేమియు నుపాయముదోఁపలేదు. ఇందిరను చంద్రావతియును హాసుసాయెనుటఁ బెట్టఁదలంచెను. కాని యామెపైఁ గల వానిమోహము వాని నాకార్యముఁ జేయనీయలేదు. శత్రువులకుఁ జిక్కకుండ తానెట్టికష్టములుపడినను ఆమెను గొలుపోక ఢిల్లీనగరము నకు దెచ్చుట ఇందిరను వివాహమాడుటకేకదా? ఎట్టియనృతములైన నాడి తానుచేసిన తప్పిదమునకుఁ బాదుషావలనఁ దనకురానున్న మోసముఁ దప్పించుకొనవలయుననియు, పిదప నెట్టులైన నిందిరను వివాహము చేసికొనవలయుననియు, నాతఁడు చూచుచుండెను. “అయ్యో! ఔరంగజేబు నన్నుఁ బ్రాణములతో నుండనిచ్చునఁగదా! ఇందిరను పెండ్లాడుట? కావున చావు తప్పించుకొనవలయు.” అని యప్పుడప్పుడూహించి చింతించుచుండెను. ఆ కారణమున నాతఁడు ఢిల్లీనగరమునఁ బ్రవేశించియు నేమియు నుపాయము గానరానందున రెండుదినములవఱకు ఔరంగజేబును దర్శించుటకుఁ బోకుండెను. తన్నుఁజూచినంతనే “నయనపాలా! చంద్రావతిని భద్రముగాఁ దోడి తెచ్చితివా?” అని యడుగ తానేమి ప్రత్యుత్తర మీయఁగలఁడు? జరిగిన వృత్తాంతమంతయు నిజమెఱిఁగించినఁ దనకెంత కఠినశిక్షఁ జేసినను పాదుషా చేయవచ్చునని యాతఁడెఱుఁగును. ఒకవేళ నజిత సింగువిషయ మేమైననడిగిన నాబాలుఁడు చనిపోయెనని చెప్పఁదలం చెను. కాని, యట్టి యనృతమాడినందున నేమగునోయని మరల సందే హించి యూరకుండెను. తనయొద్ద నిందిర యున్నదనుసంగతి పాదుషా యెఱింగిన నామె తనకింకదక్కదని, దుర్గాదాసు చేసిన మోసమువలన చంద్రావతియు, ఇందిరయుఁ దనకుఁజిక్కలేదని చెప్ప నిశ్చయించె

కొనెను. కాని తా నిందిరను దోడ్కొనివచ్చుట సైనికులందఱు నెఱుఁగుదురు గాన నారహస్యము పాదుషాకుఁ దెలియకుండునాయని శంకించెను. ఏవిచారమును లేకుండ ఇందిర చేసిన వంచనోపాయ మెఱింగించిన "ఓరిమూర్ఖా! ఆఁడుదాని మాయలైనను గనుఁగొనలేక కార్యమంతయు భంగముచేసివచ్చితివి గాన నీవు సేనానాయకత్వము నకుఁ దగవు" అని మెట్టిదండన విధించునోయని ఆ ప్రకారముగూడ జెప్పుటకు నిశ్చయించుకొనలేదు. చంద్రావతినిబట్టికొనివచ్చుచుండఁగా మార్గమధ్యమున రాజసింహునిసైన్యము లడ్డగించెనని చెప్పి తప్పించుకొనఁదలచెను గాని యట్లుచెప్పుట తనపిఱికితనమును వెల్లడిచేసికొనుటయేయని మానివేసెను. ఎన్నివిధముల నాలోచించినను వానికేయుపాయమునుదోఁపలేదు. ఢిల్లీనగరమును ప్రవేశించినదిమొదలు వానిచిత్త మల్లకల్లోలమైయుండెను. ఆ కారణమున నిద్రాహారములు లేక దీర్ఘవిచారమువహించి శుష్కించుచుండెను. పాదుషా యొద్దకుఁ బోయిన నెట్టికీడు సంభవించునోయనిపోకుండెను. పట్టణమునుండియుఁ దన్నుఁ జూడరాకుండెనని పాదుషా మెఱిఁగిన నెట్టిమోసమువచ్చునో యని యింకొకభీతి వానికిఁగల్గినది. ఎప్పటికైనను నయనపాలుఁడు వానియందఱకుఁ బోకతప్పదు. ఇట్లు రెండుదినములు గడచినంతనే మూఁడవనాఁడిద్దఱుసిపాయిలు వానియింటికిఁబోయి "నయనపాల్!" అని వీధితలుపుఁదట్టిరి. వెంటనే లోపలినుండి "ఎవరువారు?" అని శబ్దమువినిపించెను. "మేము రాజభటులము అలమ్గీరు పాదుషాగారి సెలవైనది; ఎట్లున్నట్లురావలయు." అని యా తురక లిరువురు గంభీరముగాఁ బలికిరి. ఆ పలుకులు వినినతోడనే నయనపాలునకు గుండెలుజాఱిపోవునవి. ఒడలెల్ల గడగడ వడఁక దొడఁగెను. చలువ చేసిన వస్త్రములు ధరించుకొని పిమ్మట నయనపాలుఁడు వీధిలోనికి వచ్చి మహమ్మదీయులతో దర్బారునకుఁ బోవసాగెను. తనగుట్టెల్లఁ బాదుషా గనుఁగొనెనేమోయని యాతనికనుమానముదోఁప నాభటు

లతో నయనపాలుఁడు పోవుచు మార్గమున నిట్లు సంభాషింప నొడఁగెను.

"ఓయీ ? అలమ్గీరుపాదుషాగా రేమిచేయుచున్నారు ?"

"అయ్యా ! ఆయన కూర్చుండి తమరాక కెదురు చూచు చున్నారు."

"ఆయన నన్ను రప్పించుటకుఁ గారణ మేమియో నీవెఱుఁగు దువా ?"

"ఎఱుఁగ కేమి ? తమరు గ్రామములోనుండియు దర్బారునకు రాకుండి రని యాగ్రహ మెంది ఎట్లున్న నట్లు తోడి తెండని మమ్ముంపినారు."

"అట్లయిన పాదుషాగారివలన నేఁడు నాకేదియో మోసము సంభవించునని నాకుఁ దోఁచుచున్నది. ఏమిచేయుదును ?"

"చేయుట కేమున్నది. అనుభవింప వలసినదే."

అంతకుమున్నే భీతచిత్తుఁడై యున్న నయనపాలుఁడు వారి మాటలవలన మఱింతభీతిల్లి, ఔరంగజేబున కేమిసమాధానముఁ జెప్ప వలయునో యోజించుకొనుచుండెను. బలియిచ్చుటకై యెనుపోతును కాళికాలమునకుఁ గొనిపోవున ట్లామహమ్మదీయ రాజభటులిరువురు నిర్వంకలనడచుచు నయనపాలునిఁ గొనిపోవుచుండిరి. అంతవఱకు వానిపై నౌరంగజేబున కెంతో యభిమానముండెను గాని తరువాత నాయభిమాన మేమయ్యెనో తెలియదు. ఆగ్రహమువచ్చినప్పుడు తన వారును బెరవారును, అనువివేచన పాదుషాకు మొదటనుండియు లేదు. ఏమాయోపాయముచేసైనను చంద్రావతిని బట్టితెచ్చిన నీకు జోధ పురము పట్టాభిషేకముచేసెదనని పాదుషా నయనపాలునితోఁ బ్రతిజ్ఞఁ జేసెను. కాలము ప్రతికూలమగుటచే జోధపుర పట్టాభిషేక మబద్ధము గాని తనకుఁ బ్రేతరాజ్య పట్టాభిషేకము గట్టకమానఁడని నయన పాలుఁడు నిశ్చయించుకొనెను. ఉత్తమ క్షత్త్రియ వంశజుఁడనయ్యు,

నావివేకమువలన నౌరంగజేబును జేరుటచేఁగదా నాకిట్టి దురవస్థ సంప్రాప్తమయ్యెనని యాతఁడనుకొనుచుండెను.

"ఇంక మించినదానికై యెంతవిచారించిన నేమిప్రయోజనము? కావున నున్నవికొన్నియు లేనివికొన్నియుఁ గల్పించి చెప్పి పాదుషాను నమ్మించుటకై నాశక్తిఁగొలఁదిఁ బ్రయత్నించెదను. మనమ్మున ధైర్యమువహించి యించుకంతయు భీతిఁజెందక నిష్కపటునివలె వానిముందర నటించెదను. పిమ్మట దైవాజ్ఞ యెట్లున్న నట్లగుఁగాక." అని నయనపాలుఁడు దృఢనిశ్చయుఁడై క్రమక్రమముగా ద్వారము లన్నియుఁగడచి ఔరంగజేబును సమీపించెను. ఆతఁడు దూరము నుండియే వంగివంగి చేతులుజోడించి సలాములుచేయుచు వాని కట్టెదుట కేగినంతనే ఔరంగజేబు వానినిఁజూచి, యుచితాసనమునఁ గూర్చుండఁబెట్టి,

"నయనపాలా! నీకు సేమమేకదా?"

"దేవా! ఇల్లు బయలుదేఱినదిమొదలు నేనెట్టికష్టముల పాలైతినో దైవమ యెఱుంగు. అయినను అలమ్గీరు బిరుదాంకితులైన దేవరవారి దివ్యదర్శనభాగ్యము లభించినంతనే నా యాయాస మంతయు పూర్ణముగ క్షీణమయ్యెను."

"అయ్యో! పాపము నీవు మాకార్యమునకై యిన్ని కష్టములుపడి శ్రమయనక జయమొందిద మమ్ము సంతోషపెట్టినందుకు నీఋణము మేము తీర్చుకొనుట యెట్లులోకదా? బళే! నీరాజభక్తి యన్న నీకే చెల్లునుగాక! సరియే! నయనపాలా! చంద్రావతిని మా జనానాలోని కంపితివా? లేక మీయింటనే యుంచివచ్చితివా?"

"దేవా! ఆప్రియ మెట్లు మనవి చేసికొనఁగలను?"

"ఏమీ? అప్రియ మేమున్నది? ఒకవేళ మీయింటనే యుంచివచ్చి యందుకు నేనేమందునోయని భయపడుచుంటివేమో? ఇంతమాత్రమునకై భీతియేల? జోధపుర రాజ్యపట్టాభిషేకమునకు

సిద్ధముగనున్న నీయింట జంద్రావతినుంచుట నాకు సమ్మతమే! నీవు గూడ నీకమీఁద నొకరాజవేకదా."

నయనపాలుఁడు గడగడవణఁకుచు లేనిధైర్యమును బలవంతముగఁ దెచ్చుకొని,

"దేవా! నాకీకార్యము సాధ్యమైనదికాదు క్షమింపవలయును"

"ఏమీ! ఆమెను జనానాలోనికంపుట నీకు సాధ్యముకాలేదా? ఆమె రానన్నదా యేమి? అవును. ఔరంగజేబుపాదుషాయన దేశమంతయు గడగడలాడుచుండ, చంద్రావతి భీతిల్లుట యాశ్చర్యమా! ఆమె స్త్రీయగుటచే నేనేమిశిక్ష విధించెదనోయని భీతిఁజెందెను, కాని నేనామె నెందులకు రప్పించితినో తెలిసియున్న తప్పకవచ్చియుండును. పోనీ! ఓ నయనపాలా! జోధపురభూపాలా! నీవైనను నాయుద్దేశమామెకెఱింగించి యీ భయమును తొలగింపక పోయితివా?"

"అయ్యా! చంద్రావతి నాకు దొరకలేదు క్షమింపుఁడు."

"ఏమీ! చంద్రావతి నీకు లభింపనేలేదా? నీవుపోయి చేసికొనివచ్చిన కార్యమేమియో చెప్పుము."

"మహారాజా! నామనవి యాలకింపుఁడు, దుర్గాదాసు చెల్లెలగు నిందిర కడుచమత్కారిణియగుటచే, నేను సైన్యముల గుడారముచుట్టును గాపుంచినను, చంద్రావతి నెట్టులోతప్పించి మనకు మోసమొనర్చినది."

"నయనపాలా! ఆఁడుదాని మాయలైనను కనుఁగొనలేక పోయితివా?"

"నాయనా! అది యాఁడుదికాదు. బ్రహ్మదేవుఁడు దానినొక వీరపురుషునిఁగ సృజియింపనెంచి, మఱచి యాఁడుదానిఁగఁ జేసెను. పిదప నేనాదుష్టురాలినిఁబట్టి కొట్టి యష్టకష్టములఁ బెట్టితిని."

"పోనిమ్ము చేఁజిక్కిన యిందిరనైనఁ గొని తెచ్చితివాలేదా?"

నావివేకమువలన నౌరంగజేబును జేరుటచేఁగదా నాశక్తి మురవస్థ సంప్రాప్తమయ్యెనని యాత్మఁ డనుకొనుచుండెను.

"ఇంక మించినదానికై యెంతవిచారించిన నేమిప్రయోజనము? కావున నున్నవికొన్నియు లేనివికొన్నియుఁ గల్పించి చెప్పి పాదుషాను నమ్మించుటకై నాశక్తిఁగొలఁదిఁ బ్రయత్నించెదను. మనమ్మున ధైర్యమువహించి యించుకంతయు భీతిఁజెందక నిష్కాపట్యునివలె వాని మ్రోల నటించెదను. పిమ్మట దైవాజ్ఞ యెట్లున్న నట్లగుగాక." అని నయనపాలుఁడు దృఢనిశ్చయుఁడై క్రమక్రమముగా ద్వారము లన్నియుఁగడచి ఔరంగజేబును సమీపించెను. ఆతఁడు దూరము నుండియే వంగివంగి చేతులుజోడించి సలాములుచేయుచు వాని కట్టెదుట కేగినంతనే ఔరంగజేబు వానినిఁజూచి, యుచితాసనమునఁ గూర్చుండఁబెట్టి,

"నయనపాలా! నీకు సేమమేకదా?"

"దేవా! ఇల్లు బయలుదేఱినదిమొదలు నేనెట్టికష్టముల పాలైతినో దైవమ యెఱుంగు. అయినను అలమ్గీరు బిరుదాంకితు లైన దేవరవారి దివ్యదర్శనభాగ్యము లభించినంతనే నా మార్గాయాస మంతయు పూర్ణముగ క్షీణమయ్యెను."

"అయ్యో! పాపము నీవు మాకార్యమునకై యిన్ని కష్టములుపడి శ్రమయనక జయమొంది మమ్ము సంతోషపెట్టినందుకు నీఋణము మేము తీర్చుకొనుట యెట్టులో కదా! బళే! సేనాధిపతి యన్న నీకేచెల్లునుగాక! సరియే! నయనపాలా! చంద్రావతిని మా జనానాలోని కంపితివా? లేక మీయింటనే యుంచివచ్చితివా?"

"దేవా! అప్రియ మెట్లు మనవి చేసికొనఁగలను?"

"ఏమీ? అప్రియ మేమున్నది? ఒకవేళ మీయింటనే యుంచివచ్చి యందుకు నేనేమందునోయని భయపడుచుంటివేమో? ఇంతమాత్రమునకై భీతియేల? జోధపుర రాజ్యపట్టాభిషేకమునకు

సిద్ధముగనున్న నీయింట జంద్రావతినుంచుట నాకు సమ్మతమే! నీవు గూడ నీకమీఁద నొకరాజవేకదా."

నయనపాలుఁడు గడగడవణఁకుచు లేనిధైర్యమును బలవంతముగఁ దెచ్చుకొని,

"దేవా! నాకీకార్యము సాధ్యమైనదికాదు క్షమింపవలయును"

"ఏమీ! ఆమెను జనానాలోనికంపుట నీకు సాధ్యముకాలేదా? ఆమె రానన్నదా యేమి? అవును. ఔరంగజేబుపాదుషాయన దేశమంతయు గడగడలాడుచుండ, చంద్రావతి భీతిల్లుట యాశ్చర్యమా! ఆమె స్త్రీయగుటచే నేనేమిశిక్ష విధించెదనోయని భీతిఁజెందెను, కాని నేనామె నెందులకు రప్పించితినో తెలిసియున్న తప్పకవచ్చియుండును. పోనీ! ఓ నయనపాలా! జోధపురభూపాలా! నీవైనను నాయుద్దేశమామెకెఱింగించి యా భయమును తొలగింపక పోయితివా?"

"అయ్యో! చంద్రావతి నాకు దొరకలేదు క్షమింపుఁడు."

"ఏమీ! చంద్రావతి నీకు లభింపనేలేదా? నీవుపోయి చేసికొనివచ్చిన కార్యమేమియో చెప్పుము."

"మహారాజా! నామనవి యాలకింపుఁడు, దుర్గాదాసు చెల్లెలగు నిందిర కడుచమత్కారిణియగుటచే, నేను సైన్యముల గుడారముచుట్టును గాపుంచినను, చంద్రావతి నెట్టులోతప్పించి మనకు మోసమొనర్చినది."

"నయనపాలా! ఆఁడుదాని మాయలైనను కనుఁగొన లేకపోయితివా?"

"నాయనా! అది యాఁడుదికాదు. బ్రహ్మదేవుఁడు దానినొక వీరపురుషునిఁగ సృజియింపనెంచి, మఱచి యాఁడుదానిఁగఁ జేసెను. పిదప నేనాదుష్టురాలినిఁబట్టి కొట్టి యష్టకష్టములఁ బెట్టితిని."

"పోనిమ్ము చేఁజిక్కిన యిందిరనైనఁ గొనితెచ్చితివా లేదా?"

"స్వామీ! ఆమెను బట్టుకొని వచ్చుచుండఁగా, మార్గమధ్యమున రాజసింహుని సైన్యములు నన్నెదిరించెను, మనసైన్యములు స్వల్పమగుటచే నాకాకార్య మసాధ్యమయ్యెను. ఇంతకు చంద్రావతి కెట్టియిబ్బందియుఁ గల్గనీయక సౌఖ్యముగాఁదోడి తెమ్మని, తమరు నాకాజ్ఞాపించి సర్వాధికారము నాకీయనందున నింతవట్టుమునిఁగెను. లేకున్న చంద్రావతి ముప్పతిప్పలువెట్టి గొనిరాకుందునా? ఆ యిందిరయు దుర్గాదాసును నాకు లక్ష్యమా?"

"ఓరి పశువా? ఇంతకార్యమును భంగముచేసికొనివచ్చి మాపైనే నింద మోపుచుంటివా? నిన్నుఖండించినను బాపములేదు. మా మహమ్మదీయవంశమున కపకీర్తిఁ దెచ్చితివి. అలమ్గీరుపాదుషా తలంచినకార్య మీవఱ కెన్నఁడును భంగముకాలేదు. నేఁటికి నీయట్టి యప్రయోజకుఁడు లభించుటంజేసి, యిట్టిమాటలు వినవలసివచ్చినది. ఓరి పాపీ చండాలుఁడా! నీవు బయలుదేఱినప్పు డెన్నెన్ని డంబములు పలికితివో జ్ఞప్తికిఁదెచ్చుకొనుము. నీ సమాచారమంతయుఁ జారుల వలన నేనీవఱకే తెలిసికొంటిని. నీవుదొంగవు. నిన్నింక విడువరాదు."

అని రోషారుణ నయనుఁడై నయనపాలుని గృహంబున నెవ్వతె యైనఁ గ్రొత్తస్త్రీయున్నయెడలఁ గొనిరమ్మని, యొక సేవకునంపెను. కొంతసేపటికా సేవకుఁ డిందిరను దోడ్కొనివచ్చి పాదుషా యెదుటఁ బెట్టెను. అప్పు డౌరంగజేబునకుఁగల్గిన యాగ్రహామునకు మితిలేక పోయెను. నయనపాలుఁడు తనప్రాణములపై నాశవదలుకొని మొగము వాల్చుకొని యూరకుండెను. కాలాంతకునివలె భయంకరుఁడై ఔరంగజేబు వెంటనే నయనపాలుని కారాగృహామునకుఁ గొనిపొమ్మని తన సేవకులకు కఠినముగ నియమించెను. నయనపాలుఁడు మొగమువంచుకొని మాఱుపలుకక సేవకునివెంటఁబోయి చెఱసాలలోఁ బ్రవేశించెను.

ఔరంగజేబు కడుటక్కరి. నయనపాలుని చరిత్రమంతయు నదివఱకే తనచారులవలన పూర్ణముగ నెఱిఁగియుండినవాఁడయ్యు నేమియుఁ దెలియనివానివలె నయనపాలుఁ డెన్ని యనృతములాడునో యని వాని మ్రోల నట్లు నటించెను. ఇందిర సౌందర్యాతిశయమున కాతఁడు డెందంబున నాశ్చర్యమొంది యామెను విలోకించి,

"ఓసీ! దుర్మార్గురాలా! చంద్రావతిని, అజితసింగును నెచ్చట నుంచితివో చెప్పెదవా లేదా."

"ఈ వెఱపింపులకు వెఱచినదాననైన నంతటి సాహస కార్యము నేనేల గావించియుండును?"

"ఛీ! మూర్ఖురాలా! మాకు ద్రోహమొనర్చిన నీకుఁ దగిన శిక్ష విధింపక నిన్ను విడువము, జాగ్రత్త."

"ప్రాణములపై నాశవిడిచియే యీ కార్యమున కొడంబడితిని. ఇంక మీరేమిచేసినను చేయవచ్చును."

అని యిందిర ధైర్యముతో బ్రత్యుత్తరమిచ్చెను. ఆమె సాహసమునకును శౌర్యమునకును, శేముషీవిశేషమునకును పాదుషా అక్కజమొంది, "ఓరి సేవకా! నీవీమెను జనానాలోనికిఁ గొనిపోయి దాసిగానుంచుకొమ్మని యుదయపురి కప్పగింపుము" అని యాజ్ఞాపించెను. అప్పుడే యాతఁ డిందిరను వెంటఁబెట్టుకొని మహాలులోనికి బయలుదేఱెను.

# పదునాలుగవ ప్రకరణము

## ఇందిర

ఉదయపురి విశేషము సద్గుణములుగల స్త్రీ గాదు కాని, కేవలము క్రూరాత్మురాలని చెప్పుటకు వీలులేదు. తానొక పట్టపురాణి కావలెనని చిన్నప్పటి నుండియుఁ గోరుచు, తుద కౌరంగజేబును పెండ్లాడి యా కోర్కె నెఱవేర్చుకొనెను. తన మాయాజాలములవలన తానెట్లుచెప్పిన పాదుషా అట్లు నడచుకొనులాగున వానిని వశము గావించుకొనియెను. జనానాలోని సేవకులందఱు నామెకువిధేయులై, యామె యనుగ్రహమునకుఁ బాత్రులై యుండిరి. అట్లననేల? ఢిల్లీనగరంబున నొక నీచసేవకుఁడు మొదలుకొని, ఔరంగజేబు పాదుషావఱకును నామెమాట కెదురాడెడువారు లేరు. ఔరంగజేబు తనమహలులోఁ బ్రవేశించినప్పుడే యితర విషయములఁగూర్చియైన నాతఁడు చింతాక్రాంతుఁడై యున్నట్లు తనకుఁ దోఁచినయెడల, తన మృదుమధురోక్తుల వాని సంతాపమును వారింపఁజేసి యమందానంద మొదవించును. ఆకారణమున పాదుషా కుదయపురిపై నెంతయో యనురాగముండెను. ఆ దంపతుల యన్యోన్యానురాగము చూపఱు కానందదాయకమై యుండెను. మహమ్మదీయున కిల్లాలైనను, సహజముగ రాజపుత్ర స్త్రీ గావున పతియెడల నెంతభక్తిగలిగి మెలఁగవలయునో ఆమె కొఱులు చెప్పనవసరము లేకుండెను. ఎట్టిరాచబిడ్డయైనను, మహమ్మదీయుల యిల్లుద్రొక్కినతరువాత నాగాలి సోఁకకుండునా? విమల వ్రాసిన యుత్తరమును జూచినప్పటినుండియు, నామెపై నెట్టులైనఁ గసి

తీర్చుకొనవలయునని నిరంతరము జూచుచుండెను. ఆమె పలుమాయ లెఱింగిన జాణగావున విమలపై నాగ్రహము జనించినప్పటినుండియు, తనమగనియెడల వేఱొకతీరుగ సంచరించుచుండెను.

ఔరంగజేబు తనమహాలునకు వచ్చుచుండు టెఱిఁగి, విచారించుచున్నట్లు నటించుచు, జేత నాయుత్తరముంచుకొని దీనాననయై యొక మూలఁగూర్చుండి యుదయపురి తనలో నేమేమో యోజించుకొనుచుండెను. ఔరంగజేబు లోనఁబ్రవేశించి యామెనుజూచి నీవిచారము నకుఁ గారణమేమని యడిగినప్పుడు మాఱుపలుకక కన్నీరు గార్చుచుండెను. ఈ ప్రకారము సంచరించుచు, రూపనగరముపై నౌరంగ జేబునకుఁగల రోస మధికముసేయుచు, నాతనిని విమలనుగుఱించి మఱవకుండఁ జేయుచుండెను. "తాను మునిఁగినది గంగ తాను వలచినది రంభ" అనునట్లు మహమ్మదీయ చక్రవర్తిని జేపట్టిన తన భాగ్యమే భాగ్యమనియు, తానే రసపుత్రరాణులకెల్ల రాణియనియు గర్వించుచుండెను. ఇంతియకాక, రాచకన్నియలందఱుఁ దనవలెనే మహమ్మదీయులఁ బెండ్లాడవలెనని యామెకోరిక.

ఇది యిట్లుండ పాదుషా యాజ్ఞప్రకారము మసావదు ఇందిరను గొనివచ్చి యుదయపురి యెదుట నిలిపెను. అప్పుడామె కవాచీ మంచముపై శయనించి తనలో నేమో యోజించుకొనుచుండెను. ఆమె ధరించుకొనినచీర ఆకుపచ్చనిరంగుగలిగి, అచ్చటచ్చట జలతారు మొగ్గలతో నిండియుండెను. ఆమె శయనించినదికూడ నాకుపచ్చని మఖమల్ పఱుపే! ఉదయపురి విలాసార్థము దినమునకొకతీరుగ నలంకరించుకొనుచుండెను. ఆనాఁడుమాత్ర మామె ఆకుపచ్చని వస్త్రములు ధరించుకొనియుండెను. ఇందిర ఆమెను జూచినతోడనే, రాజపుత్రస్త్రీయయ్యు, మహమ్మదీయకులములోఁ గలిసిపోయెననియు, తానొందుచున్న విభవమంతయుఁ దన భాగ్యవశమునఁగల్గెను గాని,

యంతనీచము మఱిలేదని యెఱుంగకున్నదనియు, భావించి, తిరస్కార ముఖ్రనామెను జూచుచుండెను. ఉదయపురిగూడ నిందిరను జూచు చుండెను గాని, తనదృష్టి ఆమెపై లేనట్లు నటించుచుండెను. ఎల్లప్పుడు మత్తతగల్గి శయనించియుండుట పూర్వము మహమ్మదీయాంగనల కౌదార్యసూచకమట. ఎంతసేపు నిలిచియుండినను, ఇందిర నామె పలుకరింపలేదు. పరిచారికలును, పరిచారకులును, ఉదయపురిని జూచి నంతనే దూరముననుండియే వంగి వినయముగ సలాములుచేసికొనుచు వచ్చుచుండుట వాడుక. కాని ఇందిరమాత్ర మట్లుచేయక తిరస్కార భావముగఁ దన్ను విలోకించుచుండుట, యుదయపురి కనిష్టకపోలేదు. కొంతసేపటికామె లేచి మసావదునుజూచి యీయామె యెవ్వతెయని వాని నడిగెను. "అమ్మా! ఈమెను దాసిగ నుంచుకొనవలసినదని చక్ర వర్తిగారు నావెంటఁ దమదరికంపిరి" అని మసావదు బదులుచెప్పెను. ఇందిర సౌందర్యాతిశయమున కుదయపురి లోలోన మెచ్చుకొనుచు,

"ఓసీ! నీవెవ్వతెవు? పాదుషాగారికి నీవెట్లు చిక్కితివి?"

"నే నెవ్వతెనైననేమి? ఎట్లువచ్చిననేమి? నా విధియే నన్నిచ్చటకుఁ ద్రోడితెచ్చెను."

"ఓహో! నీవు గడు నేర్పరివలెఁ దోఁచుచున్నావే? అట్లైన మాయెడల బాగుగనే మెలంగఁగలవు. పాదుషాగారియెడల నీవేమి ద్రోహముఁజేసితివో చెప్పరాదా?"

"అన్నివిషయములెఱిఁగియు నన్నిట్టులడిగిన నేమిచెప్పఁగలను? ఎచ్చట జక్కనిస్త్రీ కంటఁబడినను పాదుషాగారామెను తత్క్షణమ జనానాలోనికి రప్పించెదరుకదా?"

"సరియే! నీవేజాతి జవ్వనివో యెఱింగింపుము."

"తురకలకు సేవఁ జేయవలసి వచ్చినప్పు డేజాతిస్త్రీనైన నేమి లాభమున్నది?"

"ఓహో! నీకంతకంతకుఁ బాగ రెక్కువగుచున్నదే! నీమాటలఁబట్టి నీవు రసపుత్రస్త్రీవలెఁ దోఁచుచుంటివి."

ఈ సంభాషణమువలన నిందిర నెట్టులైనఁ బెండ్లాడఁదలఁచి ఔరంగజేబు తనజనానాలోనికిఁ బంపించెనని యుదయపురి కనుమాన మంకురించెను. మహమ్మదీయాంగనలకన్న రజపుత్రాంగనలు ఎక్కువ సౌందర్యవతులని దానుండఁగ నౌరంగజే బెప్పుడేరాచకన్నియను దెచ్చి వివాహము చేసికొనునుయని యుదయపురి మనస్సునందు అనవరతము నొక యనుమానముండెను. ఔరంగజేబు స్త్రీలోలు డని యామె యెఱుఁగును. ఈ కారణములవలన పాదుషా యిందిరనుఁ బెండ్లాడక మునుపే యామెను తనజనానాలోనుండి యావలికి గెంటింపఁ దలంచు కొనెను గాని, ఇందిర పాదుషాచే స్వయముగఁ బంపఁబడినదగుట చేతను, రాజకీయ వ్యవహారములవలన రప్పింపఁ బడినదగుటచేతను, వ్యవహారవిషయములలో పాదుషా కెన్నడైన నిందిరయొక్క యవసర ముండు నేమోయనుశంక చేతను, ఆమెను బాఱఁదోలుట కుదయపురి శంకించెను. కాని, యనన్య లావణ్యా సౌందర్యాతిశయమున కమందా నంద హృదయుండై మోహపాశబద్ధుఁడై పాదుషా యేక్షణమున నిందిరను చేపట్టునోయని యామె శంకాన్వితస్వాంతయై తలపోయు చునే యుండెను.

ఆహా! మనయిందిర యెన్నిమాయ లెఱింగనది? తన వాక్చాతుర్యమున నుదయపురికిఁ బెద్దయనుమానముగల్గించి తానెట్టు లైన నచ్చటనుండి తప్పించుకొనఁ బ్రయత్నించెను. ఇందిర సామాన్య స్త్రీవంటిదికాదు. దూరాలోచనఁజేసి కార్యోపాయము లాలోచించుట యందామెకామెయేసాటి. ఆమె సాహసమును, రాజభక్తియు, తెలిసికొని, ఔరంగజేబే యాశ్చర్యమొందెను. మాయలఁబన్ని శత్రు వుల మోసపుచ్చుట యామెకుఁ గరతలామలకమైయుండెను. ఇందు

లకుఁ జంద్రావతీ రక్షణమే చదువరులకు సాక్ష్యము. కాని భగవంతుఁడామెపై జాలివహింపక, పెట్టరాని కష్టములన్నియు నామెకే పెట్టుచుండెను. రసపుత్రాంగనయు శూరవనితయుఁ గావున నెట్టికష్టముల కైననోర్చి శత్రువులకు భీతిల్లక తన బుద్ధిచాతుర్యమున గండములన్నియుఁ గడచుచు వచ్చుచుండెను.

ఇందిర నేమిచేయవలయునాయని యుదయపురి కొంతదూరమాలోచించెను గాని, యెంతయోజించినను, ఆమెను గెంటించుటమాత్రము తనకు సాధ్యముగాదని నిశ్చయించుకొనెను. కాని ఆసుందరీమణియగు నిందిర తఱచుగ పాదుషా కంటఁబడుచుండిన నెప్పుడైననొకప్పుడు పెండ్లిచేసికొనకమానఁడనియెంచి, తనమగని కగపడకుండ జనానా లోపలిభాగమునుండి యామెకు విశేషము కష్టముగలుగు పనుల నియోగింపక తనసెలవులేనిదే యావలికిరావలదని గట్టిగ నాజ్ఞాపించెను. తనకది గ్రుడ్డిలో మెల్లగదాయని సంతసించి పాదుషా కంటఁబడకుండ నేవో చిన్నచిన్న పనులుచేయుచు నంతఃపు రాంతర్భాగముననే యిందిర మెలఁగుచుండెను. ఆమె దినమునకు రెండు మూఁడుసారులీవలికి వచ్చుచుండెను గాని, తక్కినవేళలయందెరికిఁ గానరాకుండ జనానాలోపలనే యుండుచువచ్చెను. ఇంతియకాక, ఉదయపురిముట్టిన నీరమును, ఆమెయిచ్చు పదార్థములును ఇందిర గైకొనకుండెను. మఱియు నామెకు సేవఁజేసి తనయింటికిఁబోయి మజ్జన మాడకయే భోజనమొనర్పకుండెను. ఇందువలన నుదయపురి యొకనాఁడామెను జూచి, "ఏమే, మా పదార్థములు నీవేల భుజింపవు? మేము నీకంత నీరసముగనుంటిమా?" అని యడుగ "నేను జాతిచెడని యుత్తమ రజపుత్రకాంతను. మీ పదార్థము లెట్లు భుజింపఁగలను" అని ఇందిర ప్రత్యుత్తరమిచ్చెను. అందుల కుదయపురియలిగి "ఓసీ! నీగర్వమంతయుఁ ద్వరలో నడంచెదనులే! తొందరపడకుము. రాజపుత్ర

స్త్రీవని యూరక విఱ్ఱవీగుచుంటివి. త్వరలోనే నీజాతిచెఱచి నినొ్నక కఱకు తురకకుఁ బెండ్లి చేసి నీమదముఁ దొలంగఁజేయకున్న నేనుదయ పురినిగాను. కన్నులు నెత్తికెక్కినందున మహమ్మదీయవంశమును నిందించిన నీకిదియే తగినశిక్ష !" అని ప్రక్కకుఁజూచి " ఓరిమసాదద్! నీవీ యిందిరను బెండ్లిఁజేసి కొనెదవా ?" అని పరిహాసముగ నవ్వుచుఁ బలికెను. వికృతాంగుఁడైన మసావదును జూచిన నెట్టివారైన భీతిఁ జెందకమానరు. ఉదయపురి మాటలకాతఁడు సంతసించి, తన దంతము లన్నియు నందఱ కగపడునట్లు లొక్కసారి పక్కున నవ్వి, మొగము వాల్చుకొని యూరకుండెను. అప్పటి నుండియు నిందిరను తనకు నిక్క ముగఁ బెండ్లిసేయు నని యాశ వహించి యుదయపురి యెడల నాతఁడు మఱింత భక్తివిశ్వాసములు గల్గి మెలఁగు చుండెను.

మోహపిశాచ మావేశించి నందున మసావదు నిందిర వెను వెంటనే సంచరించు చుండెను. మార్గ మధ్యమున నిందిర కంటఁ బడిన నామె సౌందర్య మంతయు రెప్పవాల్పక చూచుచు తనకిట్టి సౌందర్య వతి భార్యకానున్నది కదా యని సంతసించుచు వచ్చెను. ఉదయపురి యప్పు డప్పుడు ఇందిరను బిలిపించి, యామెతో నేమియో సంభాషిం చుచు కాలక్షేపము సేయుచుండెను. ఆసమయములయం దిందిర సంద ర్భాను సారంబుగ, పూర్వపు రాజుల చిత్ర చరిత్రములను, శత్రువుల మధ్యనుండి తాను చంద్రావతిని దప్పించిన యద్భుత విషయమును, ముచ్చటఁ గలుగు నట్లు చెప్పుచుండెను. ఆ కథలన్నియు సంతోష ముతో విని, ఇందిరయొక్క బుద్ధిచాతుర్యమున కద్భుతమొంది, అప్పటి నుండియు నుదయపురి యిందిరపై కొంచె మభిమానము గల్గియుండెను. అట్టులే ప్రతిదినము వారిరువురును గడుపుచుండ నొకనాఁ డుదయపురి యింధిరనుజూచి ప్రసంగ వశంబున, " నిందిరా ? రూప నగరాధీశుం డట్టి విజయసింహుఁ డను వాఁడఁట. ఆతనికి విమలాదేవి యను నొక

కూఁతురు గలదఁట. ఆమెను నీ వెఱుఁగుదువా ? " అని యడిగెను. అందుల కిందిర " ఓహో! విమలాదేవిని నేనెఱుఁగనా ? ఆమె యెన్ని విద్యలు నేర్చినది ! ఎంతటిజాణ ! ఇన్నిటి కేమిగాని ఆమె సౌందర్యము వంటి సౌందర్యము మన మెప్పుడును విని కని యెఱుఁగము. ఇప్పటి రాచ కన్నియలలో నట్టి లావణ్యాంగి సాటి కొక్కతెయైన లేదనుట ముమ్మాటికి నిక్కము." అని వచింప నుదయపురి " ఇందిరా! ఆమె అంతటి చక్కని కన్యయా ? ఇన్నాళ్లనుండి నాకుఁ జెప్పవైతివే " అని పలికెను. ఆమాటల కిందిర " అయ్యో ! ఆమె సంగతి మీ రెఱుఁగరు కాఁబోలు ? ఆమెశరీరకాంతి మెఱుపుఁ దీఁగవలె నిరంతరము మెఱయు చుండును. వేయేల ? ఒక్కమాట వినుఁడు. ఆమెను జూచిన మీ పకీరు లైనను మోహాంధులై పరితపింపక మానరు. " అని చెప్పెను.

ఆ మాటలు విన్న తోడనే, యుదయపురికి మఱియొక క్రొత్త విచారము గలిగెను. సాదత్ ఖాను రూపనగరము ముట్టడించి విమలను బలవంతముగఁ దోడి తెచ్చి తన కప్పగించి నంతనే, అట్టి యనన్య సామాన్య రూప లావణ్యాతిశయముల విరాజిల్లు విమలను పాదుషా పెండ్లి యాడక తీఱఁడని యామె నిశ్చయించుకొనెను. ఔరంగజే బెవ్వతెను దెచ్చుకొన్నను దన యాటలు సాగ నేరవు గదా యని యామె యెఱుఁగును. సామాన్య సౌందర్య వతి యగు రాచకన్నియ కంటఁ బడి నప్పుడే ఔరంగజేబు విడువఁడు ! అట్టి లతి అసామాన్య సౌందర్య వంతురాలు తనకుఁ జేఁజిక్కిన పాదుషా ఎట్లు పెండ్లాడ కుండునని యుదయపురి విషాద మగ్నయై కార్యోపాయము యోజింపఁ దొడఁగెను. ఆ యుత్తరమే యింతవఱకు దనగొంతుక గోసెననియు, చూచినదానిని యూరకుండక పాదుషా కేల తెల్పవలెననియు, తెల్పియు నంతమాత్రమున నేనేల రోసము వహింపవలెననియు, రోసము వహించి నను విమలనుబట్టి తెమ్మని నేనేల పాదుషాను నిర్బంధింపవలెననియు,

ఉదయపురి దలఁచుకొనుచు, తన వివేకమునకు విచారించుచుండెను. అయినను, తన పరిచారకుఁడైన మసావదునకిచ్చి పెండ్లిఁజేసి విమల నెట్టులైన పరాభవింపవలయునని యామె ముఖ్యాభిప్రాయము గావున, ఔరంగజేబు విమలను చెప్పించిన తత్క్షణముననే తనజనానాలోని కంపుననియు, అప్పుడు పాదుషా యెఱుఁగకుండ విమలను మసావదున కిచ్చి పెండ్లిచేసిన, తనకు సవతిపో రుండదనియు నిశ్చయించుకొనెను. అట్టి చక్కని యుపాయము పన్నినందులకు తనంతట తానే పొగడు కొనుచు, నప్పుడప్పు డిందిరతో విమలనుగూర్చియే సంభాషించుచు, నుదయపురి కాలముఁ బుచ్చుచుండెను. ఇందిరయుఁ దనకు సాధ్యమైనంతత్వరలో నచ్చటనుండి తప్పించుకొని యావలికి దాఁటవలెనని తగినరీతులఁ బ్రయత్నములు సేయుచుఁ బ్రవర్తించుచుండెను.

# పదునేనవ ప్రకరణము

## ఢిల్లీ నగరము

ఢిల్లీనగరము పూర్వము హస్తినాపుర మనుపేరఁ బరగుచుండెను. యుధిష్ఠిర రాజ రాజ్యాభిషేకము మొదలుకొని మొగలాయి ప్రభుత్వాంతము వఱకు నీనగరము, మన హిందూదేశమునకెల్ల రాజధానియై యుండెను. ఇప్పుడది మనదేశమునకు రాజధానియై యుండకపోయినను, దాని పూర్వ గౌరవాతిశయమునకుమాత్ర మణుమాత్రమైన లోపము జనింపలేదు. ఢిల్లీనగర చరిత్రమంతయు వ్రాసిన హిందూదేశచరిత్ర మంతయు వ్రాయుట సంభవించును. ఏనగరరాజంబున జనులకు విశేష ముగఁ బ్రీతికలదో, అట్టినగరమందే మన యుత్సవములు జరుపవలయు నని యెంచి పశ్చిమదేశవాసులగు మన యాంగ్లేయప్రభువులు 1877 సం—లో "చక్రవర్తిని" అను బిరుదుతో శ్రీ విక్టోరియా మహా రాజ్ఞిగారి పట్టాభిషేక మహోత్సవమును, 1903 వ సం॥లో, ప్రజా పరిపాలన నిపుణులై జనుల సౌఖ్యకరముగ నేలుచున్న శ్రీ యెడ్వర్డు మహాచక్రవర్తిగారి పట్టాభిషేక మహోత్సవమును మహోత్సాహ మున ఢిల్లీనగరమందే జరిపించిరి.

మఱియు ఢిల్లీనగర మెల్లవిద్యల కాలయమని చెప్పవచ్చును. అచ్చటి చేతిపనులఁజూచిన నెల్లవారలు గన్నులకద్దుకొనెదరు. అచ్చటి చిత్రకారుల చాతుర్యము వర్ణింప నలవికాదు. ఎట్టిదరిద్రుఁడైన నేదైన నొకవిద్య నేర్చుకొనినయెడల, ఢిల్లీనగరమునకుఁబోయి త్వర లోనే ధనికుఁడై సుఖించుచుండును. రాజవీధు లతిదీర్ఘములైనను,

అంచులకుఁ దగిన వైశాల్యముగూడఁ గలిగియుండెను. వివిధములగు ప్రతిమలు చెక్కఁబడి, పలురంగులతో శృంగారింపఁబడిన సౌధరాజములు చూపఱకు నయనానంద మొనర్చుటకు సందియములేదు. సకల వ్యాపారములకిది యునికిపట్టు. సునీతములై, ప్రసిద్ధములై, దేశదేశములకు వెల్లడియై, భూమండలమునందంతట వెదచల్లఁబడిన నగిషీపనులకీనగరరాజము పుట్టినిల్లు. చిత్రటాతినైనఁ గరఁగింపఁగల గాన విద్యావిశారదులచే నలంకరింపఁబడి, యీ నగరము గంధర్వలోకమును మించుచుండెను. ఔరంగజేబు రాజ్యకాలమున ఢిల్లీనగరము మఱింత శృంగారమును, ఔదార్యమునుగల్గి భూలోకస్వర్గమైయుండెను. ఆనగరమెంతచూచినను దనివిగల్గింపక, చూపఱ కపరిమితానంద దాయకమై యాశ్చర్యము గలుగఁజేయుచుండెను.

ఒకనాఁడు సాయంకాలమున నాలుగుగంటలప్పు డొకబాటసారి ఢిల్లీనగరముఁ బ్రవేశించి రాజవీధులయందుఁ బోవుచుండెను. అతఁ డెవ్వఁడో యెచ్చటినుండి వచ్చుచుండెనో యెఱిఁగిన వారెవ్వరును లేరు. కాని చినిఁగిపోయిన వస్త్రములఁ గట్టుకొనుటచే బీదవాఁడని తోల్పవచ్చును. శరీరమంతయుఁ జెమటచేఁ దడిసియుండుటవలన నాతఁడు గడుదూరముననుండి వచ్చుచుండినట్లు గ్రహింపవచ్చును. ఆ పురమునఁగల యెట్టివిచిత్రములుఁజూడక, తనదారినే పోవుచుండుటచే, నాతఁడు ఢిల్లీనగరమునకుఁ గ్రొత్తవాఁడు కాఁడనియు, నాతఁ డాపట్టణమునకుఁ జిరపరిచితుఁడైనియుఁ జెప్పవలసియున్నది. ఏ కారణముననో, ఆ బాటసారి మార్గమున వచ్చుచుఁ బోవుచుండినవారి నెవ్వరినిఁ బలుకరింపఁడయ్యె. సాధారణవేగముకన్న నాతఁ డిందుక వడిగానే పోవుచుండెను. ఆతని ముఖలక్షణములు చూచినవారు మార్వాడదేశస్థుఁడని యనుకొనెదరు గాని, ధరించుకొనిన వస్త్రములుమాత్ర మించుక యనుమానము గల్గించుచుండెను. అతఁ డెవ్వరిని మార్గమడుగక, కడుఁ బరిచయము మున్నవానివలె నిటునటుఁజూడక యూరక

పోవుచుండెను. సాధారణముగాఁ బెద్దపట్టణములయందు నివసించి యున్నను, దారిఁ గనుఁగొనలేక, యొక్కొక్కప్పుడు తప్పిపోవు చుండుట సహజము. క్రమక్రమముగా రాజవీధులన్నియుదాఁటి యాతండు సందులలోఁబడి పోవసాగెను. ఆతఁ డేయింటికిఁ బోవ నిశ్చయించుకొనెనో తెలియదు గాని, అయిదుగంటల కాలమైనను నడచు చునేయుండెను. ఆతఁ డెవ్వరిని మార్గమడుగకయే పోవుచుండుటచే, దారితప్పి, తాను బోవవలసినయిల్లుఁ గనుఁగొనఁ జాలకుండెనని మన మెంతమాత్రముఁ జెప్పుటకు వీలులేదు. అట్లు పోయిపోయి యా బాట సారి ఢిల్లీనగరమునకుఁ గొట్టకొనసనున్న యొక సన్నని సందులోఁ బ్రవేశించెను.

ఏకారణముననో సాధారణముగ నానగరవాసు లాసందులోనికిఁ బోకుండిరి. జనసంచారము విశేషంబుగ లేకుండుటంజేసి, యా వీధిలో నెవ్వరును కాఁపురముండుట మానివేసిరి. కాని స్వగృహములుగల రెండు మూడు బీదకుటుంబములవారుమాత్రము విధిలేక యందు నివసించియుండిరి. ఇంచుమించుగఁ దక్కిన గృహములు జనులు గాఁపుర ముండని కారణమున శిథిలములై, క్రూరసర్పములకును, గబ్బిలము లకును, సాలెపట్టులకును, నాలయములై, నోరెఱుంగని జంతువుల కాధారంబులుగనుండెను. క్రమక్రమముగ నాగృహములయందు సూర్యచంద్రులు దాండవ మాడుచుండిరి. మేఘదేవుఁడుగూడ నాగృహములపై యధికానురాగమువహించి తన వర్షధారలఁ బైకి బోకుండ వానియందుఁ గురిపించుచుండెను. మనబాటసారి రాను రా నాసందు చిట్టచివరనున్న గృహమునకుఁ బోయెను. కాని, మానవ నివాసంబువలన నాగృహమునకింక నింతటియదృష్టము గల్గుటకు వీలు లేకుండెను. మొత్తముమీఁద మేమిప్పుడు వర్ణించిన గృహములతో నాగృహమునకు బంధుత్వముమాత్ర ముండకపోలేదు. తద్గృహ కవా టంబు లించుకంతయుఁ బటుత్వములేక | పాఁతగిలియుండెను.

మన బాటసారి ఆ యింటికిఁ బోవుసరికి తలుపులు మూసి యుండుటచే నాతఁడు బిగ్గరగఁ దట్టనారంభించెను. కొంతసేపటికి లోపలినుండి "ఎవరువారు ?" అని యొక వృద్ధస్త్రీకంఠము వానికి వినవచ్చెను. ఎందుచేతనో బాటసారి తానెవరో చెప్పక తలుపుమాత్రము గొట్టుచుండెను. ఇంతలో నొక వృద్ధస్త్రీవచ్చి తలుపులుదెఱచి ఆతని మొగమును బాగుగ విలోకించి, కొంతసేపటికిఁ బోల్చి, "నాయనా! ఎన్నాళ్ళకు వచ్చితివిరా ? నిన్నుఁజూడనందున నాకన్నులు గాయలు గాచినవిరాబాబూ! ఇట్లు చిక్కిపోయితివేమిరా ? మన యమ్మాయికి క్షేమమేనా ? అబ్బాయిసంగతి యేమైనఁదెలిసినదా ?" అని వణఁకుచు నభిమానపూర్వకముగఁ బ్రసంగింప నారంభించెను. అంతట నా బాటసారి "అవ్వా! నాపేరుపెట్టి నన్నుఁబిలువకుమా! నేనీయూరు చేరితినని పాదుషాయెఱింగిన మోసము సంభవించును. సంగతులన్నియుఁ దరువాతఁ జెప్పెదను. ఇప్పటినుండి నీవు నన్ను ఛోటుసింగని పిల్చుచుండుము" అని మెల్లగాఁబలికి క్షేమమల్లెచ్చుట నున్నాఁడని యడిగెను. "నాయనా! ఇప్పుడే పట్టణములోనికిఁ బోయినాఁడు. త్వరలోనే రాఁగలఁడు. నీవులేచి స్నానముచేయుము. వంటయయినది. వానికొఱకు నీవు వేచియుండ నవసరములేదు. పాప మెంతయాఁకలితో వచ్చితివో ? లే ! లే !" యని యవ్వ తొందరపెట్టెను. సాధారణముగ లోకమునందు స్త్రీలహృదయంబుల నెట్టిరహస్యములైన దాఁగియుండ వనుసంగతి ఛోటుసిం గెఱిఁగినవాఁ డగుటచే నేమాటలు నాయవ్వతో ననకుండ, తనవస్త్రములువిప్పి, మూటలోనున్న యంగవస్త్రమును దీసికొని, పెరటిలోనికిఁబోయి నూతియొద్ద స్నానముఁజేసెను. ఇంతలో మనయవ్వగారు, నట్టింటిలో నొకమూల నాతనికై వడ్డించి, చేతిలో నేతిగిన్నెనుంచుకొని సిద్ధముగనుండిరి. అప్పుడు ఛోటుసింగువచ్చి విస్తరివద్దఁగూర్చుండి భోజనము సేయనారంభించెను. కాని మార్గాయాసముచేఁ బడలియున్న వానికి భోజనముసేయుట మఱింత ప్రయాస

గానేయుండెను. “నాయనా! మొగమాట మొందకుము. కావలసిన పదార్థము లడిగి వేయించుకొని, కడుపునిండ తినుము” అని యవ్వ వానిని నిర్బంధింపసాగెను. ఎట్టెట్టులో ఛోటుసింగు భోజనముం జేసి, చావడిలోనున్న మందసముపై నొక్కింత విశ్రమింతమని యెంచి “అవ్వా! నేను పరుండెదను. వీధితలుపులు జాగ్రత్త. జ్యేష్ఠమల్లు రాఁగానే నన్ను లేపుము” అని చెప్పి యాయాసముదీఱునట్లు స్వేచ్ఛగా నందుపైఁబరుండి నిద్రించుచుండెను.

రాత్రి తొమ్మిదిగంట లగునప్పటికి జ్యేష్ఠమల్లు ఇంటికివచ్చెను. తోడనే మందసముపై శయనించియున్న ఛోటుసింగునుజూచి, యమందానందమొంది “అమ్మా! యీతఁ డెప్పుడువచ్చెనే?” యని యవ్వ నడిగెను. “నాయనా! ఆతఁడువచ్చి రెండుగంటలు కావచ్చినవి. భోజనముఁ జేసి పరుండెను. పాప మాతనిని లేపకుము. ఉదయమున మీరిరువురును మాటలాడుకొనవచ్చును” అని చెప్పి, యవ్వ వానికి భోజనముపెట్టి, తానుగూడ నింత ఫలాహారముఁ జేసెను. భోజనము లైనతరువాత నవ్వయు, జ్యేష్ఠమల్లును, ఛోటుసింగువద్దనే గూరుచుండి, వానిరాక కత్యద్భుతమొంది వారిలోవారు మాటలాడుకొనుచుండిరి. ఆ మాటలసందడిని నిద్రలోనున్న ఛోటుసింగు మేల్కాంచి, చెంత నున్న జ్యేష్ఠమల్లునిఁజూచి, పలుకరించి, క్షేమసమాచారంబులు కనుఁగొనెను. జ్యేష్ఠమల్లును వానిని కౌఁగిలించుకొని యభిమాన పూర్వకముగ వానితో ననేకవిధములఁ బ్రసంగించెను. కొంతసేపటికి ఛోటుసింగు జ్యేష్ఠమల్లునిఁజూచి రహస్యముగఁ గొన్నివిషయములఁగూర్చి మాటలాడవలసియున్నదనియు, నావలికొకసారి రావలసినదనియుఁ బిలిచెను. తత్క్షణముననే జ్యేష్ఠమల్లు వానితోఁగూడి గాఢాంధకార బంధురంబైన యా నిశాసమంబున పట్టణమావలికిఁబోయి, నిర్జనమ్యమైన యొక ప్రదేశమునఁ బ్రవేశించి, పురాతనకాలముననే కట్టఁబడి, క్రమక్రమముగా శిథిలమైపోయి, యిప్పటికి నామమాత్రావశిష్టమై

యుండిన యొక దేవాలయమునఁ జేరి ప్రసంగింప నుద్యమించిరి. కాని, యప్పటికిని దనయనుమానము దీఱనందున ఛోటుసింగు తనరహస్యము లెవ్వరైన వినెదరేమోయనుభయముచేత, తన జేబులోనున్న జెకుముకి రాయిదీసి ఉక్కుబిళ్ళతో దానిపైని టిక్కుటిక్కునఁగొట్టి అగ్నిఁ బుట్టించి, యెవ్వరులేకుండ నాకాంతిలో నలువంకలఁ గలయఁజూచెను. పిమ్మట ఛోటుసింగు రహస్యముగ వానిచెవిలో నేమో చెప్ప నారంభించెను.

కొంతసేపటివఱకు వారట్లు తములో నేమేమియో గుసగుస లాడుకొని, వారిరువురును గృహంబునఁ జేరి శయనించిరి. తెల్లవాఱి నంతనే ఛోటుసింగు మేల్కొని నిర్వర్తిత ప్రాతఃకాలకృత్యుఁడై, జ్యేష్ఠ మల్లును లేపెను. జ్యేష్ఠమల్లు కాలోచిత కృత్యములు చేసికొనిన పిమ్మట, వారిరువురును, ఎప్పటియట్ల తమతమ వస్త్రముల ధరించు కొని, ఏదోకార్యముమీఁదబోయి యిప్పుడే వచ్చెదమని మన యవ్వ గారితోఁ జెప్పి, పట్టణములోనికిఁ బోయిరి.

జ్యేష్ఠమల్లు తనకుమిత్రుఁడైన యొక చిత్రకారునియొద్దకుఁ బోయి తనచెంతనున్న ఛోటుసింగు బొమ్మలు వ్రాయుటయందును, రంగులు వేయుటయందును, సాటిలేని నేర్పరియనిచెప్పి, వలయునెడల నీ వీతనిని నీయొద్ద నౌకరుగా నుంచుకొమ్మని చెప్పెను. చిత్రకారుఁ డా మాటలువిని, వానిని బరీక్షించుటకై, తా నా యంగడిలోఁ గూర్చుండియున్నట్లు లొక ప్రతిమను వ్రాయుమని ఛోటుసింగునడిగెను. వెంటనే యాతఁడు, తన చమత్కారమంతయుఁజూపుచు, నొక కాగిత ముపై ముద్దులు మూటఁగట్టునట్లు చిత్రకారుని వానియంగడిని వ్రాసి, రంగులువేసి వర్తకునకుఁజూపెను. ఆ ప్రతిమనుజూచి చిత్రకారుఁ డత్యద్భుతమొంది మైమఱచి "ఔరా! వీనిసామర్థ్య మెంత వర్ణ నీయము? ఇట్టినేర్పరిని నే నీవఱకెన్నఁడును జూడలేదే!" అని తనలో

ననుకొనుచు తనయుత్సాహమును వెలుపలికిఁజూపిన యెక్కుడు జీత మడుగుననియెంచి జ్యేష్ఠమల్లునిఁజూచి,

"అయ్యా! ప్రతిమలు వ్రాయుటయందు వీనికి విశేషము నేర్పు లేకున్నను, కొలఁది కాలములోనే నేర్పరియగును. అంతవఱకు వీనికి నెలకొక రూకచొప్పున జీతమిచ్చెదను. మీ యిష్టమైనచో వీనిని నాయొద్దనుంపవచ్చు" నని చెప్పెను. కాని యేకారణముననో మనఛోటుసింగు ఆ స్వల్పజీతమునకే సమ్మతించి, వానియొద్ద కొలు వుండెను.

ఆ చిత్రకారుఁడు అప్పుడప్పుడు తనప్రతిమలను జనానాలోని కంపి యచ్చటివారివలన ధనము సంపాదించుచుండెను. జనానాలోని వారు తమకు వలయు ప్రతిమలు తయారుచేయవలయునని సేవకులచేఁ గబురంపుచు నాప్రతిమలు తాము గొనుచుండిరి. ఈ కారణమున నీవర్తకునకు పాదుషా జనానాలో నించుక సంబంధమున్నది. ప్రతి మలు చెక్కుటయందును, వ్రాయుటయందును ఛోటుసింగుయొక్క సామర్థ్యము చిత్రకారుఁడు బాగుగ నెఱింగినవాఁడగుటచేత గొప్ప గొప్ప ప్రతిమలన్నియుఁ జేయుమని వానికే నియోగించుచుండెను. ఆనాఁటినుండియు నావర్తకుని రాబడియధికమై నేలకొలఁది సంపన్నునిఁ జేయుచుండెను. పట్టణమునఁగల జనులందఱు నా ప్రతిమలను కన్నుల కద్దుకొనుచు, బేరమాడకయే యాతఁ డెంతవెలచెప్పిన నంతవెల యిచ్చి కొనిపోవుచుండిరి. క్రమక్రమముగ నావర్తకుని వ్యాపార మంతయు ఢిల్లీనగరమునందంతట వ్యాపించి మిక్కిలి విఖ్యాతి వహించి యుండెను. ఆ వర్తకునకు ఛోటుసింగుపై నధికానురాగము జనించెను. వానివలన నాతఁడు లక్షలకొలఁది ధన మార్జింపసాగెను. ఢిల్లీ నగ రంబునఁగల చిత్రకారులందఱును తమపనులమానుకొని వేఱువృత్తు లవలంబించి జీవింపసాగిరి.

# పదునేనవ ప్రకరణము

ఛోటుసింగునకు జీతముగడుస్వల్పముగ నిచ్చుచుంటినని యప్పు డప్పుడు వర్తకుఁడు దలపోయుచుండెను. ఇతరుఁ డెవ్వఁడైన నంతకన్న నెక్కుడు జీతమిచ్చెదనని పిలిచిన ఛోటుసిం గెప్పుడు పోవునోయని వానికి భీతిమాత్రము గలదు. ఆ కారణమున వర్తకుఁ డొకనాఁడు ఛోటుసింగునుజూచి,

"ఓయీ! ఛోటుసింగ్! ప్రతిమలు వ్రాయుటయందు నీకిప్పుడు కొంచెము నేర్పుఁగలిగినది. నావలననే నీ వింతవాఁడవైతివి గావున యేడుసంవత్సరములవఱకు నన్నొడఁబాసి మఱియొకరివద్దకు బోకుండ నాకొక పత్త్రిమును వ్రాసియిచ్చితివేని నీజీత మధికము చేసెదను. ఈ యంగడికెల్ల నిన్నే యధికారినిజేసి యింతకన్న నిన్నెక్కుడుగ సమ్మానించెదను."

"అయ్యా! అట్టిపత్త్రిము వ్రాసియిచ్చుటకు నాపట్టణ మిది గాదు. కొన్నికారణములచే నేనిచ్చటకు రావలసివచ్చినది. నేను బహుదినము లుండువాఁడనుగాను. ఈ గ్రామమున నే నెంతకాల ముందునో, అంతవఱకు నెంతజీతమిచ్చినను బరుల సేవింపను. కావున మీ యనుమానమింక విడువుఁడు."

అని పలుక వర్తకుఁడు వాని స్వామిభక్తికిని, బుద్ధిచాతుర్యము నకును సంతసించి నెలకు రెండురూకలచొప్పున నిచ్చుటకు జీత మేర్పఱిచెను.

# పదునాఱవ ప్రకరణము

## మొ గ లా యి జ నా నా

పూర్వము మొగలాయి జనానాలు కడు విచిత్రముగ నుండెడివి. ఘోషా గల మహమ్మదీయస్త్రీల కెట్టికొఱతయు లేక, ఉద్యానవనములు, సరస్సులు మొదలయిన వానినిమిత్తము వారు మహాలుదాటి ఈవలికి రానవసరములేకుండ నన్నియు నందే యుండెను. అట్టులే ఉదయపురి మహాలు కూడ గడు మనోహరమై పరుల కచ్చటికిఁ బోవుట కసాధ్యముగ నుండెను. ఈమె మహాలున కుత్తరపుఁ దట్టున ఔరంగజేబు చెల్లెలైన "రోషన్ ఆర్ బేగము" అను నామె జనానా యుండెను. ఉదయపురి జనానాకన్న రోషన్ఆర్ జనానా పరపురుషులు ప్రవేశించుట కించుక యనుకూలముగ నుండెను.

రోషన్ఆర్ కడుఁ గ్రూరురాలు. తండ్రిని అన్నదమ్ములను వంచించి రాజ్యమును సంపాదించుకొనుట యందుఁ ఔరంగజేబున కామె చాల సాహాయ్యము చేసెను. ఆ కారణమున ఔరంగజేబు రోషన్ ఆర్‌పై మిక్కిలి యభిమానము గలవాఁడై యామె కోరిక లెల్ల దీర్చుచుండెను. ఇంతియ కాక సర్వాధికారము నామెకే యొసంగి యామె చెప్పినట్లు తానుగూడ సంచరించు చుండెను. కాని ఉదయపురిని ఔరంగజేబు పెండ్లాడి తెచ్చినప్పటినుండియు రోషన్ఆర్ అధికారము కొంచెము తగ్గినది. అందుచే నామె కుదయపురిపై ద్వేషము గలిగెను, క్రమక్రమముగ నా ద్వేషము వృద్ధిలోనికి వచ్చినందున నామె ఉదయపురి కెట్టి మోసమైనను సమయము చిక్కినప్పుడు చేయుటకు సిద్ధముగ

నుండెను. ఉదయపురి గూడ జాగ్రత్త వహించి యామెపైఁ గసి దీర్చు కొన వలయునని చూచుచుండెను. ఉదయపురి సేవకులు రోషన్ ఆర్ జనానాలోనికి బోఁగూడదు అచ్చటి సేవకు లుదయపురి జనానా లోనికిఁ బోఁగూడదు. ఒకవేళ తప్పి వచ్చిన నా సేవకులు మఱలఁ బ్రాణములతోఁ బోవు టరుదు. ఒక్కొక్కప్పుడు వీరి వివాదములు ఔరంగజేబు విచారణ చేయవలసి వచ్చుచుండెను. ఆతఁడు గడుఁ జతురుఁ డగుటచే నెవ్వరిపైని నేరము మోపక యా వివాదములు పరిష్కరించు చుండెను. ఉదయపురి యన్న నాతనికిఁ బ్రాణముకదా! చెల్లెలగు రోషన్ ఆర్ పైఁ గూడ నాతని కంత యభిమానము లేక పోలేదు. రోషన్ ఆర్ క్రూరత్వ మెట్టిదో వర్ణించుట కెన్ని పుటలైనను జాలనందున నామె హృదయము వజ్ర నిర్మితమని సూక్ష్మముగా వ్రాసినఁ జాలును. ఆమెచర్య లెఱింగిన వారు మృత్యు దేవత భూలోకమున నవతరించెనేమో యని భావింపక మానరు. తప్పు చేసిన సేవకులకు రోషన్ ఆర్ ఎట్టి శిక్ష లొనర్చునో వ్రాయలేముగాని, అట్టి యుపద్రవములు మున్నెన్నఁడు విని కని యెఱుఁగని యమధర్మరాజాశ్చర్య మొంది ఆ శిక్షల నేర్చుకొని క్రొత్తగాఁ దన లోకమున స్థాపించుకొనెను. ఆమె ఉదయపురిపై లేనిపోని నేరము లన్నియుఁ గల్పించి ఔరంగజేబుతోఁ జెప్పుచుండుట వాడుకయే. ఉదయపురికిఁ గూడ నామెపై నీర్ష్య విశేషముగ నుండెను. కాని తనకు సాధ్యమైనంత వఱకు శాంతించి యూఱడిల్లుచుండెను.

ఇట్లుండ నొకనాఁడు ఛోటుసిం గుదయపురి మహాలులోనికిఁ బోవలయునని బయలుదేఱెను. వర్తకుఁడు వానికి జీత మెక్కుడుచేసి నప్పటినుండియుఁ బనిగూడ హెచ్చించెను. ఆ చిత్రకారుఁడు పూర్వము కన్నఁ బ్రతిమలకు విలువ నెక్కుడు గావించి విక్రయింపసాగెను. రెండు సంవత్సరముల వఱకును మన ఛోటుసింగు వాని నెడఁబాయ కుండిన యెడల నా వర్తకుఁడు రెండవ కుబేరుఁ డగుట కెంత మాత్రమును

సందియము లేదు. వానికి ధనాశ యపరిమితముగ నుండెను. వాని బ్రతుకంతయు ఛోటుసింగుతోడనే యున్నందున, తన్ను విడిచి యాతఁ డెప్పుడు పోవునో యని వర్తకున కనుమానముండెను గాని, ఒకవేళ పోయెదనన్న, నాతఁడు కోరినంత ధన మిచ్చియైన తనయొద్ద నుంచుకొనవచ్చునని మఱల ధైర్యము వహించెను. ఛోటుసిం గిదంతయుఁ గని పట్టి యొకనాఁడు వాని దరిఁజేరె.

"అయ్యా! దంతపు బల్లలపై నిట్లు చిన్న చిన్న ప్రతిమ లెన్ని చెక్కి విక్రయించినను, మీకుఁ దగినంత ధనము లభింపదు. కాఁబట్టి మీరు సెలవిచ్చినయెడల నా చమత్కార మంతయుఁ జూపుచు నే నొక దంతపు పీవనఁ దయారుచేసి, దాని నౌరంగజేబు పాదుషాగారి యొద్దకుఁ గొనిపోయి, సమృద్ధిగా ధనముఁ గొనివచ్చి మీ కిచ్చెదను."

అని యనుగ వర్తకుఁడు చిఱునవ్వు నవ్వి,

"ఓయీ! మన పాదుషాగారి కిట్టి పిచ్చిపిచ్చి పనులు సంతోషమును గలుగఁ జేయవు. నీ పీవనిఁ జేయఁ బూనితివేని మన కెంత లేదన్నను రెండువేలకుఁ దక్కున గాకుండఁ జేతిసొమ్ము దగులక మానదు. అది యమ్ముడువోని యెడల మనకు నష్టము గదా."

"అయ్యా! మీ రెంత మాత్ర మీ విషయమై సందేహింప వలదు. పాదుషాగారి కక్కఱ లేనిచో జనానాలోనికిఁ గొనిపోయెదను. నేను మీకు నష్టము రానీయను. నామాట మీరు విశ్వసింపుఁడు."

"ఓయీ నామాట వినుము. ఇంత సొమ్మును బూడిద పాలగును జుమీ!"

"అయ్యా! మీ కీసంగతు లన్నియు నేటికి? నష్టము గల్గినచో ఆ సొమ్మంతయు నే నిచ్చుకొనెదను."

"ఓయీ? నిన్ను ద్వారపాలుగు లోనికిఁ బో నిచ్చెదరా?"

"ఏల పోనీయరు? వారి నెట్లులైన మంచి మాటలాడి నా వలలో వేసికొనియెదను."

“సరియే! నే నిదివఱ కెన్నియో ప్రతిమలు వ్రాసి జనానాలోని కంపి విక్రయించితిని. ఆ కారణమున జనానాలో నాకుఁ గొంచెము సంబంధమున్నది. నే నొక యుత్తరము వ్రాసి యిచ్చెదను. అది నీవు గొనిపోయి చూపినయెడల మొదటి రెండు మూడు ద్వారముల వద్దనున్న భటులు నిన్నడ్డగింపక విడిచెదరు. పిమ్మట నీ యంతనే నీ వేగవలయును.”

అని చెప్పి వర్తకుఁడు వాని యుద్యమమున కంగీకరించెను. పిమ్మట ఛోటుసింగు దంతముతో నొక వీవనఁ దయారుచేసి, దాని చుట్టును, పుష్పములతోడను, ఆకులతోడను, చిలుకలతోడను. రమ్యముగ నొక లతఁజెక్కెను. పట్టుతో జాలు నల్లి దాని చుట్టునుఁ గట్టి, యా వీవనకు మధ్యభాగంబున నొరంగజేబు పాదుషాను, వాని ప్రక్కనే వానినిఁ గౌఁగిలించుకొని యున్నట్లు లుదయపురినిఁ గడు చమత్కారముగఁ జెక్కెను. ఇంతియకాక, యా వీవనను కెంపులతోడను, మంచి ముత్యములతోడను, వజ్రములతోడను, అలంకరించి, యొక చక్కని పెట్టెను జేసి, దాని నందులో నుంచి బయలుదేఱెను. ఆతఁడు పోవునప్పుడు కొన్ని కాగితములును రంగులునుగూడఁ గొనిపోయెను. వర్తకుఁడు తన కిచ్చిన యుత్తరముఁ జూపినంతనే మొదటి రెండు మూఁడు ద్వారముల చెంతనున్న భటులు వాని నడ్డగింపక లోనికి విడిచిరి. కాని, తక్కిన ద్వారపాలకులు మాత్రము వాని నాటంకపఱుపఁ జొచ్చిరి. ఛోటుసింగు వారితో మెల్లమెల్లగ మంచి మాటలాడి, స్నేహముఁ జేసికొని, యాతురకలను చక్కని స్త్రీలు కౌఁగిలించుకొని యున్నట్లు ప్రతిమలను వ్రాసి వారికి బహుమానముగా నిచ్చెను. వారా ప్రతిమలను జూచుకొని, తమ గడ్డములను సవరించుకొనుచు, నపరిమితానంద మొంది “శబాసురా! భాయీ! శబాసు!” అని వానిని మెచ్చుకొన సాగిరి. పిమ్మట ఛోటుసింగు వారిని గాంచి తన్ను లోనికిఁ బోనీయ వలయునని యడుగ, వారు వానిని నిరాటంకముగ లోనికి

విడిచిరి. ఈప్రకారముగ ఛోటుసింగు ద్వారపాలుర చక్కని స్త్రీలం గౌఁగిలించుకొని యున్నట్లు ప్రతిమలను వ్రాసి వారి కొసంగుచు, వారి వలన మెప్పొంది ద్వారము లన్నియుఁ గడచి, యుదయపురి మహాలు సమీపించుచుండెను.

అప్పుడు మసావదు తానేదో కార్యముఁబూని, యాత్రోవనే వచ్చుచు వాని కెదురై "ఓరీ! నీవెవ్వఁడవు? ఎచ్చటికిఁ బోవుచుంటివి?" అని యడుగ, "అయ్యా! నేనొక చిత్రకారుఁడను. ఉదయపురిబేగమ్‌వారి యనుగ్రహమువడసి, యామె ప్రతిమను వ్రాసి యెట్టులైన నాదారిద్ర్యముఁ బాపుకొననలయునని వచ్చుచున్నాఁడను. ప్రతిమలు వ్రాయుటయందు నాకెవ్వరును జోడులేరు. నన్ను బరీక్షింప నెంచెదరేని మీ ప్రతిమను వ్రాసెదను జూడుఁడు" అని వాని కిరువంకల నిరువురు జవ్వనులు వింజామరులు వీచుచున్నట్లు ప్రతిమను వ్రాసి వానికిచ్చెను. దానినిజూచి మసావదు పట్టరాని సంతోషమున వానిని గౌఁగిలించుకొని, "అరే! భాయీ! నిన్నుఁ దప్పక మా బేగమ్‌గారివద్దకుఁ గొనిపోయెదనురా! నీవద్ద నింకేమేమి బొమ్మలున్నవో నాకుఁజూపుము" అని యడుగ, ఛోటుసింగు తనవద్దనున్న బొమ్మలన్నియు నొక్కొక్కటిగఁదీసి వానికిఁ జూపనారంభించెను. అప్పుడామార్గమునఁ బోవువారందఱు నావింతయేమోయని ఛోటుసింగుచుట్టును గుంపుగుంపులుగఁగూడి యాతఁడు జూపు ప్రతిమలన్నియుఁ గడు నాశ్చర్యముతోఁ జూచుచు, "ఓయీ! నా ప్రతిమఁ దీయుము నా ప్రతిమఁ దీయుము" అని వానిని నిర్బంధింపసాగిరి. ఛోటుసింగు వారందఱ ప్రతిమలును వ్రాసి, యొక్కొక్కనికిచ్చి వారిచే మెప్పు వడయుచుండెను. అంతట మసావదు వానినిఁజూచి "ఓయీ! నీవృత్తాంతము మాబేగమ్‌గారి కెఱింగించి, మరల నిన్నుఁ దోడ్కొని పోవుటకై యిప్పుడేవచ్చెద. నీవంతవఱ కిందుండుము" మని పోయెను.

ఇంతలో రోషన్ ఆర్ బేగముయొక్క ముఖ్యసేవకుఁడగు ఫరక్ షైరనువాఁడు తనచేత నొకవీణఁగైకొని యెచ్చటికోపోవుచు నా జనసమూహమునుఁజూచి యీ సమాచారమేమియో కనుఁగొన వలయునని యచ్చటికివచ్చెను. వానినిజూచి యచ్చటిసేవకులందఱు వెంటనే నిలువఁబడిరి. అప్పుడు ఛోటుసింగు యథాప్రకారముగ నాతని నొక కాంత కౌఁగిలించుకొనియున్నట్లు ప్రతిమనువ్రాసి ఫరక్ షైరునకొసంగ నందఱికన్న నాతఁడెక్కుడుసంతసించి "నిన్ను మాబేగమ్‌గారి యొద్దకుఁగొనిపోయి గొప్ప బహుమాన మిప్పించెదనులే!" అని ప్రతిజ్ఞ చేసెను. అందులకు ఛోటుసింగు సంతసించి, "అయ్యా! మీయనుగ్రహమున్న నాకేమికొదువ? మీరీవీణ నిప్పు డెచ్చటికిఁ గొనిపోవుచున్నారు" అని యడుగ, "మా బేగమ్‌గారు దీనిని బాగుచేయించి దెమ్మని నన్నంపినారు; నేను బజారునకుఁబోయి త్వరలోనే వచ్చెదను. నీవంతవఱకు నిచ్చటనే యుండుము" అని ఫరక్ షైరు చెప్పెను.

ఎట్టి దుర్మార్గులకైన నొక్క సుగుణమైన నుండకపోదు. రోషన్ ఆర్ నకు సంగీతమన్నఁ గడుసంతోషము. మఱియు నామె గానవిద్యయందు గడు నేర్పరి. ఢిల్లీనగరముననున్న గానవిద్యా విశారదులందఱు నామెపాండిత్యమును పలువిధములఁ గొనియాడుచుందురు. అప్పుడప్పుడామె ఢిల్లీనగరమునఁగల గాయకులనురప్పించి, వారివిద్యను బరిశీలించి, తగిన బహుమానమిచ్చి పంపుచునుండెను. కాని ఔరంగజేబునకుమాత్రము గానమన్న నెంతమాత్రము నిష్టములేదు. అందుకై రోషన్ ఆర్ నకు నీవిద్యయందు కుతూహలమును ప్రవేశము నుండఁబట్టిగాని, లేకున్న యెడల ఢిల్లీనగరమునగల గానవిద్యయంతయు నప్పటికి సంపూర్ణముగ నశించియే యుండును.

ఫరక్ షైరు మాటలువిని, ఛోటుసింగు "అయ్యా! నాకుఁ గూడ నీగానవిద్యయందుఁ గొంచెము ప్రవేశము గలదు. కావున నేనే

యీ వీణను బాగుచేసెదను" అని పలుక "ఓయీ! ఇది కడు విలువఁగలవీణ. దీనిని జెడఁగొట్టితివేని, మాబేగమ్‌గారివలన నాకు మోసము సంభవించునుజుమీ! జాగ్రత్త!" అని చెప్పి సంచిలోనున్న వీణను బైకితీసెను. తోడనే చూపఱ కన్నులు మిఱుమిట్లు గొనునట్లావీణ ధగద్ధగాయమానమై గన్పట్టెను. ఇంతియకాక విచిత్రములగు లతలతోడను, నగిషీపనులతోడను, బంగారుమువ్వలతోడను నలంకరింపఁబడి యావీణ గడురమ్యముగ నుండెను. ఛోటుసింగావీణను గైకొని త్వరలోనే తీఁగలన్నియుసవరించి చక్కఁబఱిచి, తానొక్కసారిమీటిచూచి, మఱల నానికిచ్చివేసెను. వానిచాతుర్యమున కెల్లవార లత్యద్భుతమొంది వానిముఖమువంకఁ జూడసాగిరి. షరక్‌పైరుగూడ నమందానందమొంది యావీణను ఎప్పటివలె సంచిలోనుంచి, యిప్పుడే వచ్చెదనని ఛోటుసింగునకుఁజెప్పి రోషన్ ఆర్ మందిరమునకుఁ బోయెను.

కొంతసేపటికి మసావదు, ఉదయపురియొద్దనుండివచ్చి, ఛోటుసింగును వెంటఁబెట్టుకొని జనానాలోనికిఁ బోవుచుండెను. ఛోటుసింగు మసావదు వెనువెంటనడచుచుండియు, నలువంకలఁజూచుచు, తనవస్తువేదియో యందుండినట్లును, దానికై తాను వెదకుచున్నట్లును నటించుచుండెను. కాని వాని కందేమియును గానరాలేదు. మసావదుదయపురిని సమీపించి "అమ్మా! నేను తమతో మనవిచేసికొనిన చిత్రకారుఁడీతఁడే. తమదర్శనము చేయవలెనని వచ్చినాఁడు. వీని సంగతు లత్యద్భుతముగనున్నవి. మీరుగూడఁ బరీక్షింపవలయు" నని చెప్పి ఛోటుసింగు నామెకుఁ జూపెను. అప్పు డుదయపురి వానివైపుఁ జూచి "ఓయీ నీవువ్రాసిన ప్రతిమలను మాకుఁజూపుము" అని యడుగ ఛోటుసింగు తనయొద్దనున్న పెట్టెనుదీసి యుదయపురి చేతి కందిచ్చెను. అందులోనున్న దంతపువీవనఁ బైకిఁదీసి చక్కఁగ బరిశీలించి వాని చాతుర్యమున కెంతయు సంతసించి యందుపైఁ జెక్కఁబడిన తన

విగ్రహమును, పాదుషా విగ్రహమునుజూచి యామెపొందిన యానంద మింతింతయని చెప్పనలవికాదు. ఆ పీవన నిటు నటుఁ దిరుగవేయుచు, దానిసౌందర్యమున కక్కజమొందుచు, నుదయపురి ఛోటుసింగును నీవద్దనున్న ప్రతిమలన్నియుఁ జూపుమనియడుగ నాతఁ డన్నియుఁజూపి ఆమెసమక్షముననే తన సామర్థ్యము తేటపడునటుల ప్రత్యేకముగా నుదయపురి కవాచీ మంచముపైఁగూర్చుండి విసనకఱ్ఱ విలోకించు చున్నట్టు లొకబొమ్మ వ్రాసి యామె కొసంగెను. ఆమె వానిచాతుర్య మున కద్భుతమొంది చిఱునవ్వుతో "ఓయీ! నీవు మామసావద్ పటము వ్రాసితివా లేదా?" అని పరిహాసముచేసెను. వెంటనే ఉదయ పురి ప్రక్కకుఁజూచి "ఎవరక్కడ" అని పలుక ఇందిర యచ్చటకు వచ్చెను. ఛోటుసింగు ఇందిరను చూచినంతనే వాని ముఖలక్షణము లొకతీరున మారెను. ఉదయపురి మసావదునుజూచి "ఓరీ నీవిందిర చెంత నిలువఁబడుము. నీప్రతిమ దీయించెదను" అని పలుక మసావ దిందిరయొద్దకుఁ బోవ నుద్యుక్తుఁడయ్యెను. ఇంతలో ఛోటుసింగు వాని చేయిపట్టుకొని "మసావద్! నాకు జ్యోతిషముగూడ వచ్చునుజుమా! నీతోఁ జెప్పమఱచితిని. ఇందిర జాతకముఁజూచి నీకుఁజెప్పెదను విను" అని కాగితముపై రెండుగీఱలుగీసి ఆలోచన నభినయించి కనులు మూసి, వ్రేళ్ళులెక్కించి "అబ్బా! ఈ యిందిర యనుమతిలేనిదే బలిమి నీమెను పెండ్లాడినవారు పదిరోజులలోఁ దప్పక చచ్చెదరు! ఈమెయెచ్చటనున్ననచ్చట వారి కన్నికార్యములు భంగమగును. కావున నిచ్చటనుండి గెంటింపవలయు. ఈమెజాతకమున నన్నియు దుష్టగ్రహములే" అని పలికెను. ఆమాట లుదయపురివిని "ఓరీ మసావద్! పోనీ! నీవీమెను బెండ్లాడకుము. రూపనగరమునుండి యొకకన్య త్వరలోనే రానున్నది. ఆమెను వివాహముచేసెదనులే! అప్పుడు మీయిరువుర ప్రతిమను దీయించెదను" అని పలికెను. ఇంతలో పాదుషాగారు వచ్చుచున్నారని వర్తమానము వచ్చినందున

నుదయపురి ఛోటుసింగునుజూచి "ఓయీ! నీవు మరల రేపు మా జనానాలోనికిరమ్ము. నీవిద్యకు మేము తగిన బహుమానముఁజేసి యంపెదము" అని వానికి సెలవిచ్చెను. పిమ్మట ఛోటుసింగు లేచి యామహాలులోనుండిపోవుచు, నేలపై పఱచియుండిన పఱపు తన కాలునకుఁ దగిలినట్లు నటించి క్రిందఁబడి మెల్లగ నొక యుత్తర మాపఱపుక్రిందఁ బెట్టెను. అంతవఱకు వానివైపు తెప్పవాల్పకచూచు చుండిన యిందిర అదికనిపట్టి, యచ్చటికిఁబోయి రహస్యముగ నా యుత్తరమును సంగ్రహించి యితరులెవ్వరైన ననుమాన మొందెద రేమోయని భ్రమించి, ఛోటుసింగునుజూచి, "ఓయీ! నీ వెప్పుడును రాజాంతఃపురములలో దిరిగియెఱుఁగవు గాఁబోలు. యీ పఱపంతయుఁ ద్రొక్కి పాడుచేసితివి. చాలుచాలు లేలెమ్ము" అని యాపఱపు తన చేతితోఁదట్టుచు తుడిచి లోనికిఁ బోయెను. ఇంతలో మసావదువచ్చి "పాదుషాగారువచ్చుచున్నారు. ఆయన నిష్క్రమించువఱకు నీవిందే యుండు" మని ఛోటుసింగు నొకగదిలోఁబెట్టి తలుపులు మూసెను. ఆ ఉత్తరమం దేమిసంగతులుండెనోగాని దానిం జదివినప్పటినుండియు ఇందిర సంతుష్టస్వాంతయయ్యెను. ఛోటుసింగుచేసిన సాహసమున కామె ఆశ్చర్యమొంది తనప్రయత్నములెల్లను గొనసాగవలయునని దైవమును ప్రార్థించుచుండెను. ఛోటుసింగు దిగులువడుచు నాగది లోనేయుండెను. కాని యెంతసేపు వేచియున్నను మసావదువచ్చి వాని నావలికిఁ గొనిపోవఁడయ్యె. తనకెట్టికీడు మూడనున్నదోయని ఛోటుసింగు భయాకులచిత్తుఁడై యుండ క్రమక్రమముగా చీఁకటిపడి రాత్రి యెనిమిదిగంటలయ్యెను. అప్పు డిరువురు తురకలు త్వరలోవచ్చి యాతలుపుతెఱచి లోపలనున్న ఛోటుసింగునోటిలో గ్రుడ్డలుక్రుక్కి వాని కన్నులఁగప్పి మోసికొనిపోయి చెఱసాలలో నుంచిరి.

# పదునేడవ ప్రకరణము

## రూ ప న గ ర పు ము ట్ట డి

ఔరంగజేబు నాఁ డుదయపురితోఁ జేసిన ప్రతిజ్ఞ యేమయ్యెనో యోజింతేము. సైన్యసమేతుఁడవై రూపనగరమును ముట్టడించి విమలను గొని రావలయునని పాదుషా యుత్తరము వ్రాసి యది మసావమద్వారా సాదతుఖానున కంపెనని యీవఱకే వ్రాసియున్నాము. సాదతుఖాను మసావదిచ్చిన యుత్తరముఁజూచుకొని స్వామియాజ్ఞ నుల్లంఘించుట, అయుక్తమని యెఱింగినవాఁడయ్యు, నకారణకలహంబేటికని పాదుషా యొద్దకువచ్చి యాతని సాహసము వారింపఁజూచెను. కాని ఔరంగజేబు వానిమాటలఁ బాటింపక, "ఓయీ! అక్కఱకురాని సంగతులు నీకేల? సత్వరముగ నాయాజ్ఞ నిర్వహింపుము. నేనొక యుత్తరము వ్రాసియిచ్చెదను. అది విజయసింహునకుఁ జూపుము" అని చెప్పి యప్పుడే, సామవాక్యముల నిచ్చగించి, నీకూఁతురగు విమలను సాదతుఖాను వెంటఁ బంపవలసినదనియు, లేనియెడల, నీరూపనగరమంతయు ధ్వంసముఁగావించి నిన్నుఁబట్టి నీకూఁతును గొనిపోక మాననమనియు, స్పష్టముగా విజయసింహునకు వ్రాసెను.

రాజ్యాంగ విషయములఁగూర్చి వ్రాయవలసిన యుత్తరములు తాను స్వయముగ వ్రాసికొనుటయే ఔరంగజేబున కలవాటు. వాని యక్కరములు ముత్తియములవలెఁ జక్కగ నుండును. ఆతఁ డెంత కార్యవేదియో వ్రాయుటయందుఁగూడ నంత నేర్పరియే! సాదతు

ఖాను పాదుషాయిచ్చిన యుత్తరముంగైకొని వానియాజ్ఞ శిరమున ధరించి బయలుదేఱెను. ఆతఁడు పాదుషా సేనానాయకులలో నొకఁడయ్యు, దురాగ్రహపరుఁడుగాక, యకారణ కలహప్రియుఁడుకాక, యించుక సన్మార్గవర్తి. అయినను పాదుషాయాజ్ఞ నిర్వహింపక విధి లేదుగావున నాతఁడాకార్యమును జేయ నుద్యుక్తుఁడై, రూపనగరము స్వల్పసంస్థానమగుటచే దానినొక పల్లెటూరుగ నెంచి కొంచెము సైన్యములుమాత్రము వెంటఁబెట్టుకొని పోయి నగరమును ముట్టడించెను. పిదప సాదతుఖాను పాదుషాయిచ్చిన యుత్తరము తనభటులలో నొకనిద్వారా విజయసింహునియొద్దకంప నాతఁ డాయుత్తరమును జదువుకొని, రక్తాననుఁడై మహాగ్రహమొంది యా యుత్తరమును దనపాదములతోఁ ద్రొక్కి యందుపై నుమ్మొకుమిసి, యా సేవకుని మొగముపైఁ బడవేసి "ఇదియే నీయుత్తరమునకుఁ బ్రత్యుత్తరమని మీ పాదుషాకుఁజూపుము" అని వానిని పంపివేసెను. సహజ పౌరుషవంతుఁడగు విజయసింహుఁ డిట్టియుత్తరములకు వెఱచువాఁడు కాఁడు.

సాదతుఖాను, తనసైన్యముల రూపనగరము చుట్టునునిలిపి పట్టణములోనివారిని బైకి రాకుండఁజేసెను. రూపనగర మెంతటి చిన్న సంస్థానమైనను దానిని సాధించుట శత్రువర్గముల కసాధ్యమే కాని సుసాధ్యముగాదు. ఆనగరము కొండల నడుమ గట్టఁబడియుండుటచే, తత్ప్రాకారకుడ్యము పర్వతములతోఁ గలిపియే నిర్మింపఁబడినది. ఆ కారణమున దానిభేదించుటయన మాటలతోఁ జరుగునదికాదు. ఈ ప్రాకారము ననుసరించి లోపలిభాగమున మఱియొకగోడ పెట్టఁబడియుండెను. ఆగోడ మిక్కిలి పటుత్వముగలిగి నాలుగు గజములు వెడల్పుతోనుండెను. సమరసమయములయందు విజయసింహుని సైనికులు, ఆగోడపై భాగముననిలిచి యుద్ధముఁ జేయుచుందురు. మఱియు నానగరమునఁ జుట్టునుగల బురుజు లెల్లప్పుడు యుద్ధసామగ్రితోడను, వీరపురుషులతోడను నిండియుండెడివి. ఇంతియకాక యా నగరము

నకుఁజుట్టు నగాధమై చూపఱకు భయంకరమైన కందకముగూడఁ గలదు. తన్నగర సింహద్వారము బలిష్ఠమైన తలుపులతోఁ గూడుకొని యున్నందున దానిని భేదించుట పరులకు మిక్కిలి కష్టసాధ్యము. శత్రువు లెంత యాకస్మికముగ నగరమును ముట్టడించినను, ఆ పట్టణ మందలి సేనాసమూహ మేవిధమైన లోపములేక తత్క్షణమే బయలు దేఱి యుద్ధముసేయుటకుఁ దగినంత స్థితివహించి సిద్ధముగనుండును. మహమ్మదీయు లెప్పుడు దండెత్తి వచ్చెదరోయను సందేహముచే, విజయసింహుఁడు తనసైనికులకొఱకు వలసినదానికంటె నెక్కుడుగ యుద్ధసామగ్రి తయారుగ నుంచుచుండెను. ఆ పట్టణంబునఁ బెక్కు తటాకంబులును, ధాన్యమును, కూరగాయలును సమృద్ధిగ నుండుటచే నప్పటివారి కాహారమున కెప్పటికిఁ గొఱతలేదు. ఎంతటి ప్రబల శత్రువర్గమైనను, రెండు మూడు సంవత్సరములవఱకుఁగూడ పట్టణము ముట్టడించియున్నను, ఆ నగరమందలి సైనికులకుఁగాని, పౌరులకుఁగాని భోజనవిషయముననేకాక, మఱి యేవిషయమునందుగూడ లోపము జనింపదు.

సాదతుఖాను తన నగరము ముట్టడించినంతనే విజయసింహుఁ డించుకంతయు భీతివహింపక తగిన యేర్పాటులన్నియుఁ జేయు చుండెను. తన సేనానాయకులలో నొక్కొక్కనికి కొంతభాగమిచ్చి పట్టణము నలువంకల భద్రముగఁ గాపుంచెను. అందు మదనసింగు అనువాఁడు ముప్పదివేల సైన్యములతో నుత్తరపుఁ దట్టునను, జయ సేనుఁ డనువాఁ డిరువదివేల సైన్యములతోఁ దూర్పుభాగమునను, తక్కినవారు పశ్చిను, దక్షిణ భాగములను శూరత్వముతోఁ గాపాడు చుండిరి. అంతతో విడువక, విజయసింహుఁడు శత్రువులెవరైన దొంగ తనముగఁ గోడలుదాటి పట్టణములోఁ బ్రవేశించెదరేమోయని యను మానమొంది మేడలపైఁగూడఁ గొందఱు రాజభటులను గాపుంచెను. తాను నియమించిన ప్రకారము సేవకులందఱును జాగరూకులై

బట్టణముఁ గాపాడుచుండిరో లేదోయని వారిని బరీక్షించుటకు మఱి కొందఱ నేర్పఱిచి, తానుగూడ ప్రతిదినము నర్ధరాత్రములయందు ఖడ్గపాణియై బయలుదేఱి నగరమంతట సంచరించుచుండెను. ఎప్పుడైన విజయసింహుఁ డొంటరిగఁ గూర్చుండి కార్యోపాయము యోజించుచున్నయెడల, విమల తన తండ్రియొద్దకు వచ్చి, వానికి ధైర్యము గఱపుచు "నాన్నగారూ! ఇంత మాత్రమున మనము విషాదమొంద వలసిన యవసరములేదు. ఎంతటి యాపద సంభవించినను, మన క్షత్రియ ధర్మమును మనము విడువకుండఁ బనిచేసినచో మన కిదియే జయప్రదమగును." అని పలుక,

"అమ్మా! విమలా! నిక్కము వచించితివి. మన సేవకులందఱును గడుజాగరూకులై పట్టణమున నలువంకలఁ గాచియుండిరి. ఇంక నీ పాదతుఖానును, వీని సైన్యములును మనల నేమి చేయఁగలవు?" అని విజయసింహుఁడు ప్రత్యుత్తర మిచ్చుచుండెను, ఆతఁడు ధైర్యాలంకృతుండగుటచే మనమున నించుకంతయు భీతిఁజెందక, తన సమాచార మంతయు రాజపుత్రస్థానమునఁగల రాజు లెల్లరు నెఱుఁగ వలయునని వారి కిట్లుత్తరము వ్రాసెను.

"రజపూతులారా!

నా కుమారిత యగు విమలను గొనిపోవఁదలంచి పాదుషా తన సైన్యములనంపి నాపట్టణమును ముట్టడిఁగొనఁ జేసెను. ఇంతటి దారుణకృత్యమింక నెందైననుండునా? రజపూత రక్తము నా శరీరములోఁ బ్రవహించుచుండ నా కూఁతును మహమ్మదీయునకిచ్చి యెన్నఁటికిని వివాహముఁ జేయను, పాదుషా యిట్టి కార్యముఁ జేయఁబూనుట నాకే కాక మన రజపూత వంశమున కంతకును పరాభవమే! రాచకన్నియలందఱకును లజ్జాకరమే! కావున మీరందఱ టీకార్యమున నాకుఁ దోడు గావలసి యున్నదని నేను వేఱుగ వ్రాయ నవసరములేదు. ఎవ్వరును రాకున్నను నే నించుకంతయుఁ భీతి వహించువాఁడనుగాను. నాకూఁతును

హామహా వైకొనఁజాలుట కలలోనైనఁ గల్ల. అయినను మీ రంపిన నాకుఁ దోడుపనులు భూసవిధి గావునఁ దెలియఁ జేసినాఁడను.

విజయసింహుఁడు ”

మాయలును మర్మములును బాగుగ నెఱింగిన యొక సేవకుని రావించి, విజయసింహుఁడు, వానిని శత్రువుల కంటఁబడకుండ మాయ వేషమును ధరించుకొని యా యుత్తరమును గొనిపోయి రాజులకు జూపుమని పంపెను.

శత్రువు లేమేమి కుట్రలు పన్నుచుండిరో యను సందేహముచే విమల కొందఱు సేవకుల రహస్యముగఁ బంపి మహమ్మదీయుల వృత్తాంతముఁ గనుఁగొనుచుండెను. శత్రువులు పట్టణము ముట్టడించి నప్పటినుండియు నామెకుఁ గూడ తన తండ్రితోపాటు నిద్రాహారములు సరిగా లేవు. ఆమె, అప్పుడప్పుడు పురుషవేషమును ధరించికొని నగర మెల్ల సంచరించుచు సంగతులన్నియు జాగ్రత్తతోఁ బరీక్షించు చుండెను. ఇంతియకాక, చక్కని యుపాయము లాలోచించుచు, తన తండ్రికిని, యాతని మంత్రులకును, సేనానాయకులకును నెఱిఁగించుచు యుద్ధసన్నాహ మనుకూలపఱుచు చుండెను.

అప్పుడప్పుడు మహమ్మదీయులును విజయసింహుని సైనికులును బోరాడు చుండిరి. పట్టణములోని సైనికులు బురుజులపై నుండి ఫిరంగులు శత్రువులపై విడుచుచుండిరి. మహమ్మదీయులుగూడ నా దుర్గమును భేదింపవలయునని తమకు సాధ్యమైనంత వఱకుఁ బ్రయత్నింపసాగిరి, ఇట్లిరు తెగలవారును జయకాంక్షులై సమరము జరుపుచుండినందున నొకప్పుడు రసపుత్రు లోడిపోయి మహమ్మదీయులు గెలుచుటయు, మఱి యొకప్పుడు మహమ్మదీయు లోడ రసపుత్రులు గెలుచుటయు సంభవించు చుండినందున, జయశాలులు వీరని యింతలో వేఱుపఱుచుట కవకాశము లేదు.

ఒకప్పుడు తన సైనికులు సమరమున నోడిపోయినను, విజయ సింహుఁడు వారికి మరలఁ బ్రోత్సాహము గల్గించుచు నిరుత్సాహులు గాకుండఁ జేయుచుండెను. పాపము విజయసింహుఁడు గడు వృద్ధుడయ్యు యౌవనపురుషునికన్న నెక్కుడుగఁ బాటుపడుచు నెంతటి శ్రమకైనఁ దాళుకొనియుండెను. సైనికులకును, సేనానాయకులకును, మంత్రుల కును, తన కన్నతండ్రికిని, తనవలననేకదా యింతటి కష్టము చేకూరెనని విమల యించుక వగుచుచుండెను. శత్రువులు నగరమును ముట్టడించి నప్పటినుండియు, దానుగూడ, రహస్యముగ చారులనంపి శాత్రవుల మర్మములు గనుఁగొనుటయందును, చేయవలసిన కార్యములు సేవకా వళికి నియోగించుటయందును, తనతండ్రితోఁగూడ సదుపాయంబు లాలోచించి మంత్రుల కెఱింగించుటయందును, మఱియు నింక ననేకములైన సమర విషయక ప్రయత్నములయందునుఁ బడి యెంతయో ప్రయాస పడుచుండెను గాని, తన కష్టముల నించుకేనియుఁ బాటి సేయక, మన విమల, తనవలనఁ గల్గిన తక్కటివారి కష్టములకు మాత్రము విచారింపవలసి వచ్చెను. ఒకనాఁడామె యొంటరియై గూరు చుండి, అన్ని విషయములచేతను తన హృదయము గలఁత వడుచుండ తనలో నిట్లు వితర్కింపఁ జొచ్చెను.

"అయ్యో! నిర్భాగ్యురాలనగు నావలనఁగదా మాతండ్రి కింతటి యాపద చేకూరెను? ఇంతకును నన్నుఁ గొనిపోవలయునని పాదుషా కేల బుద్ధిపుట్టవలెను? వానికి నే నేమి యపకార మొనర్చితిని? రాత్రింబవళ్లు నిద్రాహారములులేక శత్రువు లెట్టిమోస మొనర్చెదరో యని యన్నివిధముల నల్లకల్లోలమై పాటుఁబడు చుండిన నాతండ్రి కష్టము లన్నియుఁ జూచి సహింతునా? లేక, సిగ్గువిడిచి, క్షత్రియ ధర్మమునకు విరోధముగ నా మహమ్మదీయునిఁ జేపట్టి నా జన్మ మంతయు దుఃఖభాజనముఁ జేసికొందునా! ఈ రెంటిలో నే కార్యమును

నేను సహింపఁగలను ? కన్నులార నాతండ్రి కష్టములఁ జూడఁ జాలను. కోరి కోరి మహమ్మదీయునిఁ బెండ్లాడఁ జాలను. ”

అని కొంతవఱకుఁ దనలో నేమేమియో తలపోసి ముఖలక్షణము లొక తీరున మార్చి,

“ ఇసీ ! బ్రహ్మాండ భాండమంతయు దల్లక్రిందయినను రాజ ధర్మమునకు భంగము గలుగనిత్తునా ? నే నొక మహమ్మదీయునిఁ బెండ్లాడినందున, నా పాట్లట్లుండ, నాతండ్రి కెంతటి పరాభవము ? ఎంత లజ్జాకరము ? సాటిరాజులలో నెన్నితలవంపులు ? వీర పురుషోచిత ధర్మంబగు సమరంబు విడిచి నాతండ్రి గాజులు దొడిగించుకొనునా ? ఆతఁ డంతటి పిఱికి మానిసియా ? ఇంతయేల ? తప్పక మాకే జయము గల్గును. ఇంకనిది యిట్లుండ మా వృత్తాంతమంతయుఁ దెలియఁజేసిన నుదయపుర నాథుఁడగు రాజసింహుఁడు మాకుఁ దోడగునేమో ? నాఁ డరణ్యమున కతఁ డుంగర మిచ్చినప్పుడే యా సుందరాకారుని సదయ హృదయమును గనుఁగొంటిని. ”

అని తనలో నూహించుకొనుచు నుండు నంతలోఁ బద్మ యచ్చటికివచ్చి యామెను జూచి “ అమ్మా విమలా ! ఒంటరివై యిట్లు కూర్చుండి యేమి యాలోచించుచుంటివి ? మేడమీఁదికిఁ బోవుదము రమ్ము ” అని యామె చేయిపట్టుకొని మేడమీఁదికి తీసికొని పోయెను. వారచ్చట నొక మంటపముపై గూర్చుండి యందుపైనుండి శత్రు సైన్యమునెల్ల విలోకించుచు నేమేమియో మాటాడుకొనుచుండిరి. కొంత సేపటికి ముద్దులు మూటఁగట్టు నొక పావుర మామేడపై వారి కెదురుగ నొక గవాక్షమునందు వ్రాలెను. వారిరువురు నా కపోత రాజము నవలోకించి సానందహృదయులైరి. పద్మ మెల్లగ జప్పుడు గాకుండ నా పావురమును బట్టుకొనవలయునని లేచెను. ఇంతలో, “ విమలా ! విమలా ! ఎచ్చట నుంటివమ్మా ? ఇటురా ” అని యొక

ధ్వని వినిపింప, విమల పద్మనుజూచి "చెలీ! నన్ను మాతండ్రిగా రెందులకో పిలుచుచున్నారు. నేనుపోయి మరల నిప్పుడే వచ్చెదను. నీవుమాత్ర మీ పావురమును బోనీయక పట్టుకొనియుండుము. దీనిని పెంచుకొనవలయునని నాకు మిక్కిలి మక్కువజనించినది" అనిచెప్పి క్రిందికిఁబోయెను. ఆ పావురము పద్మనుజూచియుఁ బాఱిపోక యచ్చటనే నిలిచియుండెను. ఎంతో మచ్చికయైనదానివలె తన రెక్కలు రెండును పైకెత్తి గుదుగుదుమని శబ్దముచేయుచు క్రిందికిఁ వాలి వలయాకారముగ దిరుగుచుండెను. అప్పుడు పద్మ మెల్లగా దానిని బట్టుకొని తనచేతులతో దువ్వి ముద్దులాడుచు దానిమెడలో దారముతో నొకకాగితముఁ గట్టఁబడియుండుటఁజూచి యాశ్చర్యమొంది యాకాగితముదీసి తనలోఁ జదువుకొనెను. ఆ యుత్తరమును జూచిన పిమ్మటఁ బద్మ ఎంతో యుత్సాహమొంది తనలోఁదాను చిఱునవ్వు నవ్వుకొనుచు, కొంతవఱకు నేమో ఆలోచించి, మరల నాకాగితము పైనే వెనుకప్రక్కను తనగోళ్ళతో "సరియే" అని మూఁడక్షరములు చెక్కి, యా కాగితమును పూర్వమువలెనే పావురము మెడలోఁ గట్టి విడిచెను. వెంటనే యా పావుర మంబరమార్గమున తుఱ్ఱున నెగిరి పోయెను,

ఇంతలోఁ గాలియందియలఁ జప్పుడు జేసికొనుచు విమల మేడ మీఁదికివచ్చి, యాతురతతో "పద్మా! పావురమేదే?" అని యడిగెను. "అమ్మా! అదినాకు దొరకలేదు. నేఁ బట్టుకొనఁ బోవు సరికి పాఱిపోయినది. నేనేమి సేయుదును?" అని పద్మ బదులు చెప్పెను. పావురము పోయినందుకై విమల కొంతవఱకు చింతించి పద్మతోఁగూడ క్రిందికిఁబోయెను. పావురమును విడిచినప్పటినుండియు పద్మ తనలో నేనేమియో యాలోచింపసాగెను. ఆమె గడియ గడియకును నెంతప్రొద్దున్నదోయని యాకసమువంకఁ జూడనారంభించెను. ఆనాఁటిరాత్రి వారందఱునుఁగలిసి భోజనముచేసి యథాప్రకారముగ

శయనించిరి. కాని, పద్మకుమాత్రము నిద్దుర గలుగలేదు. అట్లు కొంత సేపటివఱకు మేల్కొనియేయుండి, పిదప లేచి మేడమీఁదికెక్కి, ద్వారములన్నియుఁగడచి, యుత్తరపువైపుననున్న గవాక్షము నొద్దకుఁ బోయి, దానికొక పెద్దత్రాడుగట్టి యామె క్రిందికిఁ బడవేసెను. ఆమె మాటిమాటికిని మేడపైనుండి క్రిందఁజూచుచు, మరల ముందఱికి వచ్చుచు, నచ్చటనే కొంతవఱకుఁ గాలముఁ బుచ్చెను. ఇంతలో నొక రాజపుత్రుఁ డా త్రాటిగుండ పైకెక్కి గవాక్షమునుబట్టుకొని, మేడ మీఁదికివచ్చి, యచ్చట నిలిచియున్న పద్మను గౌఁగిలించుకొనెను. పద్మ కొంతవఱకు సిగ్గువహించి, తనమొగమువాల్చుకొని యూరకుండెను. పిమ్మట నారాజపుత్రుఁడు సంతోషాతిశయమున నెన్నియో మాటలుచెప్పి మెల్లగ నామెతో నిట్లు సంభాషించెను.

"పద్మా! పావురముచేఁ బంపిన యుత్తరము చదువుకొంటివా?"

"చదువుకొంటిని గాని మీ రిప్పు డిచ్చటికి వచ్చుటకుఁ గారణమేమి?"

"కారణమేమియో నీ వెఱుఁగనే యెఱుఁగవా? నీకన్న నా కింకేమి కారణమున్నది? నిన్నుఁ జూచుటకే వచ్చితిని."

"తురకల సైన్యములు మనపట్టణమును ముట్టడించియుండుటచే మీరు వచ్చెదనని వ్రాసిన యుత్తరమును జూచినప్పటినుండియు నాకు భయముగ నున్నది. వారికంటఁబడినచో నపాయము చేకూఱక తప్పదు."

"పద్మా! ఇంతమాత్రమున భయపడనేల? ఈ మార్గము నాకును నాపరిచారకులైన భిల్లులకుఁదక్క తదితరు లెఱుఁగరు."

"దీనికేమిగాని రూపనగరమున కెట్టియవస్థ చేకూఱెనో చూచితిరా?"

" నీవాసంగతి నేమియు విశేషించి నాకుఁ జెప్పనవసరములేదు. నే నన్ని సంగతులు నెఱుఁగుదును."

" ఎఱిఁగియు మీ రిట్లూరకొనుట పాడిగాదు."

(నవ్వుచు) " ఏమీ ! ఊరకుంటినా ? తద్విషయమై నే నెల్ల ప్రయత్నములు సేయుచునే యున్నాను. తొందరపడిన గార్యమగునా? నన్ను మాతండ్రిగారీ గ్రామమునఁ జేరనీయకుండఁ జేసినందున నేనేమి చేయుటకును వీలుకలుగలేదు. అట్లని యూరకుండలేదు. తగిన ప్రయత్నములు సేయుచునే యున్నాను."

" ఇట్టి సమయములయందే తొందర పడవలయు ? కార్యము మించినపిదప చేయునదేమున్నది ?"

" చిన్నదానవు నీవేమి యెఱుఁగుదువు ? నీకేల యూరకుండుము. మనరహస్య మెవ్వరైన వినినచోఁ గీడుమూడును. అర్ధరాత్రము గావచ్చినది. నీవింక పోయి పరుండుము, నేఁబోయెద. ప్రతి శుక్రవారముమాత్రము నేనిట్లు నిన్నుఁ జూచుటకై వచ్చుచుండెద. నీవు నేవచ్చుసరికి ఇచ్చట నుండవలయును."

అని గవాక్షమునకుఁ గట్టఁబడియున్న త్రాడుపట్టుకొని క్రిందికిఁ దిగి రాజపుత్రుఁడు తనకై వేచియున్న భిల్లులతోఁగూడి పర్వత ప్రదేశములనుండి నిష్క్రమించెను. వానిపోకడఁ గొంతసేపుచూచి పద్మ మేడఁదిగి తనగదిలోఁ బ్రవేశించి శయనించెను. ఆరాజపుత్రుఁడు శివసింగని మా చదువరులలో నొక్కరైనను తెలియనివారుందురా ?

# పదునెనిమిదవ ప్రకరణము

## రుక్మిణీకల్యాణము

మహమ్మదీయులు రూపనగరమును ముట్టడించి ఆఱుమాసములు గావచ్చినవి. విజయసింహుఁడంపిన యుత్తరము రాజులెల్లరుజూచియు నాతనికిఁ దోఁడురారైరి. ప్రతిదినమును యుద్ధప్రయత్నములయందు జాగరూకులై విజయసింహుని మంత్రులును, సేనానాయకులును, పట్టణముఁ గాపాడుచుండిరి. మహమ్మదీయులు రసపుత్రులతోఁ బోరాడుచుండిరి. గాని జయశాలులుగాలేదు. "ముందున్నది ముసళ్ళపండుగ" యనునట్లు, జరుగవలసిన కార్యము లనేకములుండ, నింతలో నాకలహమేల నివారించును? ఈ యాఱుమాసములనుండియుఁ దన తండ్రితోఁ గూడ ననేకకష్టము లొందియుండినందున నొకనాఁడు విమల పుణ్యకథా శ్రవణమునఁ గాలముఁబుచ్చి తన యాయాసమును దీర్చుకొనవలయుననియెంచి, భగవంతుని చరిత్రమువినినచో నెల్లదుఃఖములును బాయుటయేకాక శుభము లొనఁగూడుననని, సామల్ పండితుని రావించి భాగవతము చదువమనెను.

సామల్ పండితుఁడు విజయసింహుని యాస్థానమున విదూషకుఁడై యుండిన యొక బ్రాహ్మణుఁడు. ఆతఁ డెల్లరతోడను తఱుచుగ హాస్యముగ సంభాషించుచుండును. ఇంతియకాక, యాతఁడు భోజనప్రియుఁ డగుటచే నెల్లప్పుడు భోజనవిషయమే ప్రసంగించుచు, నెన్నివిధముల పిండివంటలున్నవో లెక్కఁజూచుచు వానిరుచులఁ బేర్కొనుచు, నందు తన కిష్టమైనవానిని వేఱుపఱుచుచు నెల్లరను నవ్వించు

చుండును. అయినను, అతని కించుక సంస్కృతమును నేర్చుకొనిన వాఁడగుటచేఁ బురాణము చదువుటయందును, అర్థముఁ జెప్పుట యందును, కొంత నేర్పుగలదు.

ఆ నాఁటి పురాణమువినుటకై విమల చెలికత్తెలును, బంధువులునుగూడవచ్చిరి. వచ్చినకాంతల నందఱును, విమల యుచితాసనములఁ గూర్చుండఁబెట్టెను. సామల్ పండితుఁడు తనయాసనము నలంకరించి పంచాంగముకట్టువిప్పి, యందులోనున్న సులోచనములనుదీసికొని, తనభుజముపై నున్న యుంగవస్త్రముతో నద్దములుదుడిచి కనులకు ధరించుకొనెను. కాని భాగవతమున నేభాగము చదువవలయునో యింకను నిశ్చయింపలేదు. అచ్చటి యా స్త్రీలలోఁ గొందఱు "అయ్యా శ్రీకృష్ణ జననమును చదువుఁడు" "శ్రీకృష్ణ జననము కన్న ప్రహ్లాదచరిత్ర మిక్కిలి భక్తిరసముగానుండును." "సరి! ప్రహ్లాదచరిత్ర యిదివఱకు విన్నదేకదా! సత్యభామ నరకాసురునిఁ జంపుట యెంతో చక్కఁగా నుండును." "అన్నిటికన్నను, భ్రమర గీతలు చదివిన యెక్కుడు రసవంతముగా నుండును." అని తమ తమ యుద్దేశములను వెల్లడించిరి. "ఇన్నిటికన్న, శ్రీకృష్ణుఁడు గోప బాలురతోఁగూడి యూరఁగాయల నంజుకొనుచు, చల్దిఁ గారగించు టను, చదువుట నాయిష్టము" అని మన సామల్ పండితుఁడుగూడఁ దనయుద్దేశమును వెల్లడించెను. కడకు విమలమాత్ర మవేవియు వల దనియు రుక్మిణీకల్యాణమును జదువుమనియు వాని కాజ్ఞాపించెను. ఎల్లవార లందులకు సమ్మతించి వినుటకుఁ గుతూహలముతో నుండిరి.

అప్పుడు సామల్ పండితుఁడు తనలో మెల్లగ రాగముదీయుచు, దొలుత విషయసూచికఁజూచి పుటసంఖ్యఁ గనుంగొని, రుక్మిణీకల్యాణ కథగలభాగముదీసెను. ఆతఁడు గణేశస్తుతి మొదలైనవి పురాణారంభ మునఁగల నియమములుగావించి చదువుట నుపక్రమించెను. ఆతఁడు ప్రతిపద్యమునుజదువుచు, తనకంఠమును బైకెత్తి రెండుచేతులతో

నభినయముఁజేయుచు బిగ్గరగ నర్థముఁ జెప్పుచుండెను. వాని వికారములుచూచి యచ్చటి స్త్రీలు దమలో నవ్వుకొనుచుండిరి. కాని సంగీత మెఱింగినవాఁడగుటచే నాతఁడు రాగముతోఁ బద్యములను చదివినప్పుడుమాత్ర మానందించుచుండిరి. రుక్మి తనచెల్లెలగు రుక్మిణిని శిశుపాలుని కేయిచ్చి వివాహముఁ జేసెదనని పట్టుఁబట్టియుండుటయు, నాతని వివాహమాడుట తన కిష్టములేనందున, రుక్మిణీదేవి నిరంతర విచారాయత్తచిత్తయై, శ్రీకృష్ణుని వివాహముఁ జేసికొనవలయునని నిద్రాహారములులేక పరితపించుచుండుటయు మొదలుగాఁగల కథాభాగములయందలి పద్యములఁజదివి సామల్ పండితుఁ డర్థముఁ జెప్పుచుండ నచ్చటి కాంతాజనమెల్లఁ గన్నీరుగార్చుచు, రుక్మిణీదేవికి సంభవించిన యాపదకై చింతిల్లఁదొడఁగెను. కడకుఁ దన కేయుపాయంబును దోఁపనందున రుక్మిణీదేవి సిగ్గువిడిచి యొక బ్రాహ్మణునిచే శ్రీకృష్ణునకు సందేశ మంపుటయు, నా భూసురుఁడు కృష్ణుని కడకుఁ బోయి, విచారకరములగు రుక్మిణి వచనము లాతనితోఁ జెప్పుటయు వినినంతనే సహజకోమలములగువారి హృదయములు వెంటనే నీరై పాఱఁజొచ్చెను. పిమ్మట మన సామల్ పండితుఁడు.

“ భటసంఘంబులతో రథావళులతో భద్రేభయూథంబుతో
పటువేగాన్విత ఘోటకవ్రజముతో బంధుప్రియశ్రేణితో
గటుసంరంభముతో విదర్భతనయం గైకొందునంచు న్విశం
కటవృత్తింజనుదెంచెఁ జైద్యుఁడు గడుంగర్వించి యప్వీటికిన్. ”

అను పద్యముచదివి, “ ఈ ప్రకారముగా ఆ రుక్మిణీదేవిని పెండ్లాడుదామనేటటువంటి యుద్దేశ్యముతో కూడుకొన్నటువంటి వాడై మంచి శూరత్వముగల భటులతోటిన్ని గొప్పగొప్ప రథములతోటిన్ని మంచి గాలితో సమానముగా పరుగెత్తే గుఱ్ఱాలతోటిన్ని తనయొక్క సమస్తమైన బంధువులతోటిన్ని కూడుకొన్నటువంటి

వాఁడై మిత్తిమీరిన గర్వముతోఁకూడా శిశుపాలుఁడుపుండిన నగరము నకు వచ్చినటువంటి వాఁడైనాఁడటా."

అని చివరకు పెద్దరాగమునుదీసి ఉన్నమాటలుగొన్నియు లేని మాటలుగొన్నియుఁగలిపి గ్రుక్కవిడువకుండ నర్థముచెప్పెను. క్రమ క్రమముగాఁ గృష్ణుఁడువచ్చుటయు, రుక్మిణినిగైకొనిపోయి పెండ్లి చేసికొనుటయుఁగూడఁ జదివి పురాణము ముగించెను. అప్పుడు విమల లేచి తాంబూలములుగొనివచ్చి మొదట సామల్ పండితునకును, పిదపఁ దక్కిన వారికినిగూడ నిచ్చెను. ఎల్లవారును తమతమ మందిరములకుఁబోయిరి. పురాణము ముగించినప్పటినుండియు, విమల తనలో నేమో యోజించుకొనుచుండెను, ఆమె ముఖలక్షణములు గనిపట్టి ఏమి యోజించుచుంటివని చెలికత్తెయలడిగిరి. గాని ఆమె యేమి యును వారికిఁ బ్రత్యుత్తర మీయలేదు. సారెసారెకును రుక్మిణి, శ్రీకృష్ణునితోఁ జెప్పుమని బ్రాహ్మణుని కెఱింగించిన వాక్యములే తలపోయుచు,

"అంకిలి సెప్పలేదు, చతురంగ బలంబులతోడ నెల్లి యో
పంకజనాభ ! నీవు శిశుపాల జరాసుతులన్ జయించి నా
వంకకువచ్చి, రాక్షస వివాహమునన్ భవదీయ శౌర్య మే
యుంకువచేసి కృష్ణ! పురుషోత్తమ! చేకొనిపొమ్ము!. వచ్చెదన్"

అను పద్యము మాటిమాటికిఁ దనలో గొణఁగుకొనుచుండెను. ఆదినమంతయు నామె యట్లులే కాలముగడపెను. ఆనాఁటిరాత్రి ఆమె భోజనముఁజేసి పరుండెను గాని, ఏ కారణముననో కొంతవఱకు నామెకు నిద్దురరాలేదు. తనలో నేమో దీర్ఘాలోచనము సేయుచు, మాటిమాటికి లేచుచు, నిట్లు రెండుజాముల రాత్రివఱకు మేల్కనియే యుండి, పిదప నొట్లోన్నిదించెను. కాని తెల్లవాఱుజామున నింకను గొంత చీకటియుండఁగనే లేచి, విమల తన ప్రాతఃకాలకృత్యములు

నిర్వర్తించుకొని, పద్మ పరుండియున్న గదిలోనికిఁబోయి యామెను లేపెను. అప్పుడు పద్మ లేచి,

"విమలా! ఏమమ్మా! యింత ప్రొద్దుననే లేచితివి ?"

"ఎంత ప్రొద్దెక్కెనో చూడవే! ఇంకనైన మేల్కొన రాదా ?"

"ఏమి ప్రొద్దెక్కినది ? ఇంకను జీఁకటులైనఁ బూర్ణముగఁ బోలేదు."

"పద్మా! నీతోఁ గొన్నిసంగతులు మాటలాడ వలయునని వచ్చితినే ? అవి రహస్యములగుటచే ఇతరు లెవ్వరైన వినెదరేమో యని యిప్పుడు వచ్చితిని."

ఆ మాటలువిని పద్మ లేచి కూర్చుండి ఆమె యేమిసంగతులు చెప్పనోయని యాతురతతో,

"విమలా! అట్లయిన చెప్పు! చెప్పు! రహస్యములు మాట లాడుకొనుట కింతకన్న మనకుఁ దరుణము లేదు."

"అందుచేతనే యిప్పుడు వచ్చితిని. చెలీ! నిన్న రుక్మిణీ కల్యాణమంతయుఁ బూర్ణముగ వింటివా ?"

"అవును వింటిని. అయిన నిప్పుడాసంగతి యెందులకు ?"

"ఏమియునులేదు. రుక్మిణి కన్యకయయ్యుఁ దన కెట్టియాపద సంభవించినను, పరపురుషుఁడైన కృష్ణున కట్లు సందేశముఁ బంప వచ్చునా ?"

"అమ్మకచెల్ల! ఇవేనమ్మా రహస్యములు ? ఏమో ఎట్టి గొప్పసంగతిఁ జెప్పెదవోయని యనుకొంటిని. బాగు! బాగు!"

"అబ్బా! ఎందులకే యీచీకాకు ? చెప్పఁదలఁచిన దేదయో సరిగా వినరాదా ?"

"రుక్మిణి కృష్ణునకు సందేశముఁ బంపుట యందేమి తప్పున్నది ?"

" అదికాదు, ఆమె కన్యకగదా! ఇంచుకైనను సిగ్గువహింపక, శత్రువులఁ దునుమాడి తన్నుఁ బెండ్లిఁజేసికొనవలయునని స్పష్టముగా నట్లు కబురంపుట——"

" ఇదేమమ్మా! పిచ్చిదానివలె ననుచుంటివి? కన్యక యైన మాత్ర మేమితప్పు? తనహృదయ మెవ్వరియందు లగ్నమగునో యాతఁడే తననాథుఁడుగదా? ఇట్లొక్క రుక్మిణియేకాదు. పూర్వ మెందఱో కన్యకలు తామువరించిన పురుషులకు రహస్యముగ జాబులు వ్రాసికొనినట్లు మన పురాణములలో నెన్నియో కథలున్నవి. కావున నిది పూర్వాచారమేగాని క్రొత్తగావచ్చినదికాదు. ఇందెంత మాత్రమును దోషములేదు."

ఆ మాటలకు విమల యేమియును మాఱుపలుకక మొగము వాల్చుకొని తనలో నేమియో చింతించుచుండెను. అది కనిపట్టి విమలయుద్దేశ మేమో తాను గ్రహించినట్లు పద్మ తనలోఁ జిఱునవ్వు నవ్వుకొనుచు, విమలను జూచి,

" అమ్మా! ఏమి తలపోయుచుంటివో నాతోఁ గొంచెము చెప్పరాదా?"

" చెలీ! తలంచుకొనినకార్యము నీ వలననే జరుగవలసి యున్నప్పుడు నీతోఁ జెప్పకుండు టెట్లు?"

" నావలననే జరుగవలసియున్నదా? ఇంతకును నేను జేయఁ గలిగిన దేమున్నది? అయినను చెప్పు."

" పద్మా! అట్లైనెదవేల? ఇన్నాళ్ళవఱకు నేనేపనిఁజెప్పినను నావల్లఁ గాదనక తప్పక నిర్వహించుచున్నావు. చంద్రావతిని జూచి రమ్మనిపంపిన, యెన్నికష్టములకైననోర్చి, యామె శుభవార్తఁ దెచ్చితివి. కాని యీ యుపకారము లుపకారములు గావు. నే నిప్పు డొక కార్యభారము నీపైఁ బెట్టెదను. నీ వెట్లులైనఁ జేయక తప్పదు.

"విమలా! నేఁడు క్రొత్తగా మాటలాడుచుంటివేమమ్మా? ఎట్టి కార్యమైనఁ జేయుటకు నేను సిద్ధముగనున్నాను చెప్పుము."

"నే నొక యుత్తరము వ్రాసియిచ్చెదను. అది నీ వాతని యొద్దకుఁ గొనిపోయి చూపవలెను."

"ఎవ్వరి యొద్దకు?"

"ఇన్నాళ్లు మన మేరాజునుగుఱించి ప్రసంగించుకొనుచున్నామో యారాజునొద్దకే!"

"నాకర్థముగాలేదు. స్పష్టముగఁ జెప్పుము."

"ఏరాజునామ ముచ్చరించుచు నీవు నన్ను హాస్యమాడుచుందువో ఆతని యొద్దకు. ఇప్పుడు [illegible]సదా?"

"ఆతని నామధేయమైన నెఱుఁగుదువా లేదా?"

"నాకు జ్ఞాపకము లేదు. ఆతఁ డుదయపురాధీశుఁడు."

ఆ మాటలకుఁ బద్మ నవ్వుచు,

"ఓహో! రాజసింహుఁడా? పేరుచెప్పుటకు సిగ్గుపడి నాకు జ్ఞాపకములేదని బొంకుచుంటివి. అప్పుడే యాతఁడువచ్చి నిన్నుఁ బెండ్లాడి చేపట్టెనాయేమి? ఇప్పుడే సిగ్గేల?"

"అబ్బా! చాలునే నీవు కడుజాణవని నేనెఱుఁగుదును. నామాట లిష్టములేనిచో నావలికిఁ బొమ్ము."

అందులకు బద్మ మఱింత నవ్వి,

"విమలా! నిక్కముగ రాజసింహుఁడేవచ్చి నిన్నుఁ జేపట్టి నప్పుడు నే నెట్టులైన నావలికిఁ బోవుదాననేకదా? ఇప్పుడే పొమ్మనెద వేల?"

"పద్మా! ఇంత హాస్యమును గట్టిపెట్టి నామాటకుఁ బ్రత్యుత్తరమిమ్ము!"

"అమ్మా! హాస్యమున కంటిని, కోపగింపకుము. నీ యిష్టము ప్రకారము తప్పక చేసెదను."

"పద్మా ! ఇంక నీయెడ దాఁపనేల ? నాఁడరణ్యమున నాతనిఁ జూచినప్పటినుండియు, నాహృదయము వానియందుఁ బ్రవేశించినది. ఆ సుందరాంగునిఁదప్ప యితరులఁ జేపట్టనని నేనప్పుడే నిశ్చయించు కొంటిని. మన వృత్తాంతమంతయు నాతఁడెఱింగిన, తప్పక మాతండ్రి గారికిఁదోడ్పై శత్రువులఁ బాఱఁదోలకమానఁడని నాకు నమ్మిక మున్నది. దీనికి నీవేమందువు ?"

"చెలీ ! అనఁటకేమున్నది ? అట్టులే ఉత్తరమును వ్రాయుము ; నే నెట్టులైన రాజసింహున కందఁజేసెదను."

"పద్మా ! అందఁజేసెదనన్నఁ గార్యములేదు. శత్రువులు మన పట్టణము ముట్టడించి యున్నవారు. మనయుత్తరము వారికిఁ జిక్క కుండ నుపాయముఁ జేయవలెను."

"నీ కెందులకమ్మా ! నీవుత్తరమును వ్రాయరాదా ? తక్కిన పని నేనే చూచుకొనియెదను."

అని యిట్లిరువురు సంభాషించుకొనుచుండఁగా విమల చెలికత్తె లలో నొకతెయగు కుంద యచ్చటికివచ్చెను. ఆమెయెడల నెట్టి రహస్యములైనను దాఁగవు. తనకుఁ దెలిసిన వృత్తాంతము వెల్లడి సేయువఱకుఁ గుందకేమియుఁ దోఁపకుండెను. మనము పురాణములలోఁ జదువు నారదున కామె చెల్లెలనుట కెంతమాత్రమును సందియము లేదు. ఆమెసంగతి యెఱిఁగినవారే కావున, పద్మయు విమలయు, నామె కెట్టిరహస్యములును జెప్పకుండిరి. అందుపై రోషమువహించి కుంద వారిని నిందించుచుండెను. అంతవఱకు స్వేచ్ఛగా మాటలాడు కొనుచుండిన వారిరువురును కుందరాఁగానే యూరకుండిరి. కుంద వారిపై నీర్ష్యవహించి "పోనీ ! నాతో మీరహస్యములు చెప్ప నక్కఱలేదు. దాఁచుకొండి. మీతో స్నేహముఁజేసినందులకు నన్ను బాగుగనే యాదరించుచుంటిరి. చాలుచాలు" అని యచ్చటనుండి

వెడలిపోయెను. విమలయుఁ బద్మయు గొంతసే పింక నేమియో మాట లాడుకొని వేర్వేఱుగఁ బోయిరి.

ఆనాఁడు మధ్యాహ్నమున విమల నుత్తరము వ్రాయుమని పద్మ చెప్పెను. విమల కాగితమును కలమును గైకొని జాబు వ్రాయ నారంభించెను. కాని యేసంగతి వ్రాసినను మఱల సమ్మతింపక కాగితమును జించి పాఱవేయుచుండెను. ఒక్కొక్కప్పుడు, పరపురుషున కుత్తరము వ్రాయవచ్చునాయని సంశయించుచుండెను. ఇట్లు కొంత వడువుఁ గాలయాపనముచేసి దృఢనిశ్చయమును జేసికొని యీ ప్రకార మొక యుత్తరమును వ్రాసెను.

ఉ. " శ్రీకర ! రాజసింహ నృపశేఖర ! య య్యవురంగజేబు నన్
జేకొననెంచి పంపెఁ దనసేనల మాపురి ముట్టడింప నిం
కేకరణిన్సహింతు మది నేమియుపాయముఁ దోఁపదయ్యె హా !
కాకికి రాజహంసి సతిగాఁ గలదే తలపోయ భూధవా.

సీ. బలిమిమన్నైన నన్ బట్టి కొంపోయెద
నంచుఁ బ్రతిజ్ఞఁ గావించినాఁడు,
తనయ నిచ్చెదవో యుద్ధముఁ జేయ నెంచెదో
యని జాబు మాతండ్రి కంపినాఁడు,
తగు సైన్యములను మా నగరంబుచుట్టును
జేర్చి ముట్టడిఁ గొనఁ జేసినాఁడు,
ఎల్లరాజులఁ గెల్చి ఢిల్లీకిఁ గొనిపోయి
నన్నుఁ బెండ్లాడంగ నున్నవాఁడు,

గీ. రాజమార్తాండ ! యల్ల ఔరంగజేబు
పావనంబగు క్షత్త్రియ వంశమందు
విజయసింహుని కూఁతురు విమల కకట !
యెట్టిగతి సంభవించెనో యెఱుఁగు మధిప !

గీ. అకట ! యాతని నెటు పెండ్లి యాడుదాన ?
మాయురే ! కాఁపురం బెట్లు సేయుదాన ?
అన్ని విధముల వేఁడితి నాఁడుదాన
నౌట నింతకన్నను నేమి యాడుదాన ?

ఉ. కావున సర్వసైన్యములఁ గైకొని మా నగరంబుఁ జేరి క్రూ
రావళి నుక్కడించి, సమరావని నెల్లరుఁ జూచుచుండ మున్
శ్రీవరుఁ డల్ల రుక్మిణిని జేకొనినట్టులు నీవుఁ గూడ నో
భూవర ! చేరఁదీసి వడిఁ బోవవె, లోకము నుద్ధరింపవే.

గీ. మానవాధీశ ! స్వకులాభిమానమెల్ల
క్షత్త్రియ కులోద్భవుల కిల సహజమొకద !
వేఱుగ వచింపనేల ! వేవేగరమ్ము
కానియెడల నీ లోకంబు దానఁగాను.

విమల ”

ఇట్లు వ్రాసి ఆ యుత్తరము పద్మ కిచ్చెను.

కుంద, పద్మను విమలనువిడిచి వారింక రహస్యములు తనకుఁ జెప్పరుకదాయని యచ్చటనుండక మేడమీఁదికిఁబోయి యచ్చట నున్న మంచముపైఁ గూర్చుండి శత్రుసైన్యముల విలోకించు చుండెను. ఇంతలోఁ బూర్వమువలె పావుర మచ్చటికివచ్చి కుందకు సమీపముననే వ్రాలెను. ఆమె మెల్లగా నాపావురమునొద్దకుఁబోఁగా నది తనంతట తానే కుందకుఁ జిక్కెను. మనుష్యులను గుఱుతుపెట్టుట యా పావురమునకు తెలియఁజాలదుకదా ! ఒకచోటనుండి యింకొక చోటి కుత్తరములు తీసికొనిపోవుటయే యది యెఱింగినవిద్య. కుంద యా పావురమును బట్టుకొనినంతనే దానిమెడలోఁ గట్టఁబడియున్న కాగితము తనకంటికగపడ నదిదీసి చదువుకొనెను. అందుండెడి రహస్య మంతయు నామె త్వరలోనే గ్రహించి పద్మ నెట్లయిన మోసపుచ్చ

వలయునని వ్యతిరేకముగ జవాబు వ్రాసి, పావురమునకుఁ గట్టెను. తన యలవాటుచొప్పున నాపావురము మీఁదికెగిరి పాఱిపోయెను. పిమ్మట కుంద మేడదిగి పద్మవద్దకు నరలఁబోయి తలయాడించుచు "మీరు చెప్పకున్నను మీరహస్యములన్నియు నాకుఁ దెలిసినవిలెండి." అని పలికెను. "కుందా! నీతో మా రహస్యములు చెప్పకుండుటకు నీపై మాకు విరోధమున్నదనుకొంటివే! నీవెఱిఁగిన సంగతులు దాఁప లేక యందఱిలో వెల్లడిచేసెదవని యిన్నాళ్ళును జెప్పకుంటిమి. మే మనుకున్న కార్యములన్నియు ఫలించినపిమ్మట నీవె యెఱుఁగఁ గలవు. ఇంతలో తొందరయేల?" అని జవాబుచెప్పి పద్మ యామె నావలికిఁ బంపివేసెను.

ఆనాఁటిరాత్రియు వారు ముగ్గురు యథాప్రకారముగ భోజనముఁజేసి శయనించిరి. కాని ముందేమిజరుగునో చూడవలయునని కుందమాత్రము టక్కువెట్టి మేల్కనియే నిద్రించుచున్నట్లు నటించుచుండెను. పద్మగూడ మేలుకొనియుండి యానాఁడు శుక్రవారమగుటచే శివసింగు వచ్చునని యెఱుఁగును. గావున, మెల్లగలేచి మేడమీఁదికిబోయి యాతనికై వేచియుండెను. కుంద తానుగూడ పద్మ వెంటఁబోయి యామెకుఁ బరాభవము జరుగునని యానందించుచు నొకమూల డాఁగియుండి చూచుచుండెను. తరువాత శివసింగు పూర్వమువలెనే యుత్తరపుదిక్కునుండి త్రాటివలన మేడమీఁదికెక్కి గవాక్షము నందుకొని పద్మదగ్గఱకువచ్చి యామె చేయి పట్టుకొనెను. పద్మ వాని నాదరించి యేమో చెప్పఁబోవుచుండఁగా శివసింగడ్డుపడి యామెతో నిట్లు ప్రసంగించెను.

"పద్మా! పావురమును మఱలఁ బంపలేదేమి?"

"అయ్యో! ఏమిపావురము? పావురము నేఁడు రానేలేదు."

"ఇదేల? యిట్లనెదవు? ఈ దినమున వచ్చుటకు నాకు వీలు లేదనియు, రెండవశుక్రవారము వచ్చెదననియు, నాకొఱకు నీవు వేచి

యుండవలదనియు నుత్తరముఁవ్రాసి పావురముచే నంపితిని. కాని యెంత సేపుచూచినను పావురము జవాబు గైకొని రాకుండుటచే నది యేమయ్యెనోయనిశంకించి, ఆ యుత్తరము నీకందినదో లేదోయని నాపని మానుకొని యిట్లు వచ్చితిని."

"అయ్యో! పాప మాపావుర మేదుర్మార్గులచేతిలోఁ బడెనో కదా. దానికిని మనకును ఋణము దీఱిపోయినది కాఁబోలు."

"పద్మా! చిన్ననాఁటనుండియుఁ గడు ముద్దుగఁ బెంచుకొనిన పావురముపోవుట నా ప్రాణములు పోయినట్లున్నది సుమా!"

"సరియే! ఇప్పుడేమయినది? దానికై వెదకింపుఁడు. దీనికేమి గాని మీరు నాకొకయుపకారముఁ జేయవలెను."

"పద్మా! అదేదియో చెప్పు తప్పక చేసెదను."

"నేనొక యుత్తరమిచ్చి మీవెంట నొక బ్రాహ్మణు నంపెదను. వానిని మెల్లఁగా నుదయపురమునకుఁ గొనిపోయి రాజసింహుని కప్పఁజెప్పవలెను."

"అట్టులే, కాని ఆ యుత్తరముసంగతి యేమో నా కెఱిఁగింపుము."

"నే నిప్పుడు చెప్పనేల? క్రమక్రమముగా మీకే తెలియఁగలదు. మీరు తప్పక రేపురాత్రియేరండి."

ఈ ప్రసంగ మంతయు గనిపట్టి కుంద తనకే పరాభవము గలిగెనని క్రిందికిదిగి తనగదిలోఁ బరుండెను. ఆ మేడపై వారట్లు సంభాషించుకొనుచునుండఁగాఁ గొంతసేపటికి, "ఎవరక్కడ?" అని యొక పలుకు వారికి వినంబడెను. అప్పుడు పద్మ తత్తరపడి, "మామగారు వచ్చుచున్నారు. మీరింక నిలువక పోవలయును. రేపుమాత్రము మఱవక రావలయునని ప్రార్థించుచున్నాను" అని చెప్ప, శివసింగు తత్క్షణమే కిటికీలోనుండి తాటినందుకొని క్రిందికిఁ బోయెను. అప్పుడు

విజయసింహుఁడు పద్మను సమీపించి "ఎవరువారు ?" అని బిగ్గరగ నడిగి వెంటనే పద్మయని పోల్చుకొని, యిట్లు పలుకరించెను.

"ఏమమ్మా ! పద్మా ! ఇంత రాత్రివేళ నొంటరిగ నిం దేమి చేయుచున్నావు ?"

"నా కేలొకో నేఁడు నిద్దుర రాలేదు."

"అవును, హృదయము స్తిమితముగా లేనియెడల నిద్రాహారము లెట్టులుండును ?"

"మామయ్యా ! ఈ రాజపుత్రస్థానమున నొక్కఁడైన మనకుఁ దోడురాలేదుకదా ! ఎంత సాహసము ?" [illegible] !

"అమ్మాయీ ! నీ కెంత పిచ్చియున్నదమ్మా ? మన రాజలోకమున కట్టి పరోపకారబుద్ధి ప్రస్తుతము నశించిపోయినది. ఇంతకు నాకావిచారము రవంతయును లేదు. నా స్వబలముననే నేజయింపఁగలను. పరులయాశ నా కెన్నఁడును లేదు."

అని ధైర్యముగాఁ బలికెను. పద్మ తనయనుమానమును విడిచి తనరహస్య మాతఁడు గనుఁగొన లేదుకదాయని సంతసించెను. పిమ్మట విజయసింహుఁడు "పద్మా ! నీవింక పోయిపరుండుము. నిద్దుర లేకున్న నీయారోగ్యము చెడిపోవును." అని యామెను క్రిందికిఁ బంపివేసెను. విజయసింహుఁడు తనవాసుక ప్రకారము నలువంకలుఁ బరిశీలించి కావలివారలకు జాగ్రత్తయనిచెప్పి దనదారిని బోయెను. శత్రువులు దొంగతనమున నర్ధరాత్రములందు గోడలుదాఁటి మేడలపైనుండి పట్టణములోఁ బ్రవేశించెదరేమో యను భీతిచే నాతఁడు ప్రతిదిన మిట్లు జాగరూకత వహించి యెల్లెడలఁ బరీక్షించుచుండె నని యిదివఱకే వ్రాసియున్నాము. కాని పద్మ మాత్రము ద్వారముల యొద్దఁ గాపుండిన భటులను వశముచేసికొని వారికి లంచమిచ్చుచు నచ్చటికి వచ్చుచుండెను. ఆ మేడ కుత్తరపుఁదట్టునఁ గ్రిందిభాగ మంతయు గొండలతో

నిండి యుండెను. శివసింగును, పద్మయు, దక్క యితరు లామార్గ మెఱుఁగరు.

ఆమఱునాఁటి రాత్రి విమల వ్రాసిన యుత్తరము సామల్ పండితుని ద్వారా రాజసింహున కంపవలెనని పద్మ తగిన ప్రయత్నము సేయసాగెను. ఆమె అంతకు మునుపే సామల్ పండితున కుత్తర మిచ్చి శివసింగు వెంట నుదయపురమునకుఁ బంప నిశ్చయించుకొనెను. ఆమె మాతనికి గొంత ధనమిచ్చినంతనే, యాతఁడు సంతసించి ప్రయాణమయ్యెను. పద్మ ఆ యుత్తరమును సామల్ పండితునకిచ్చి జాగ్రత్త యని చెప్పి యానాఁటి రాత్రి వానినిఁ గూడ మేడమీఁదకుఁ గొంపోయెను. ఇంతలో శివసింగు పూర్వమువలె వచ్చి పద్మను జూచి వేగముగ నుత్తరమును బ్రాహ్మణునిఁ బంపుమని ఆమెను తొందరపెట్టెను. అప్పుడు పద్మ బ్రాహ్మణుని వానికప్పఁజెప్పి "విప్రోత్తమా! జాగ్రత్త, ఆ యుత్తరమును బాఱవేయకుము. నీవు మరల నిచ్చటికి రానవసరము లేదు. బయలు దేఱితివేని శత్రువులకుఁ జిక్కఁగలవు. నేను చెప్పినదాఁక ఉదయపురముననే యుండుము. నీ కేకొఱఁతయు గల్గదు" అని బోధించెను. ఆ మాటలన్నియు విని "పద్మా! నీకు పిచ్చిపట్టినదా యేమి? నాఁడు రుక్మిణీదేవి యుత్తరమును గొనిపోయినప్పుడు, నాకే పద్మవచ్చి బుద్ధులు చెప్పెను? ఇంతియకాక యిట్లరణ్యాత్రముల మేడలు గోడలు దాఁటి శ్రీకృష్ణునియొద్దకు నేను బోలేదు." అని యింక నెన్నొన్ని చెప్పుచుండ పద్మ వాని నోరుమూసి "నాయనా! కేకలు వేయకుము. తెలివి తక్కువదాననై నీకు బుద్ధిఁ జెప్పితిని. క్షమింపుము. ఇప్పుడు నీవు తగవు పెట్టితివేని మోసము గల్గును." అని వానిని బతిమాలుకొనెను. పిమ్మట శివసింగుతో నాలస్యముచేయక వేగ పొమ్మని చెప్పి తాను మేడ దిగి పద్మ తనగదిలోఁ బ్రవేశించెను.

# పందొమ్మిదవ ప్రకరణము

## త్రోవ నడచెదరు

సామల్ పండితుని చేయి పట్టుకొని, శివసింగు మెల్లగా గవాక్షమును దాటించి క్రిందికి వ్రేలాడుచుండిన త్రాటిని వాని కందించి, వానికన్న ముందుగ తాను దిగుచుండెను. సామల్ పండితుఁడు మాటి మాటికి మాటలాడుచు, ధ్వని సేయుచుండినందున, నితరు లెవరైన నామాటలు విని రేని తన కాపద సంభవించునని భయమొంది, వానిని పలుమాఱు వారించెను. కాని, యా విదూషకుఁడు తనపని మానక పాటలు పాడుట గూడ నారంభించెను. ఎన్నిమాఱులు బోధించినను విననందున తుదకాతఁడు విసిగి, "ఓయి పిచ్చి బాపఁడా! నా మాటలు వినెదవా లేదా? అంతకంతకు నీ కేకలు మితిమీఱుచున్నవే? ఎంత చెప్పినను విననైతివి. ఇతరు లెవ్వరైన విని రేని నిన్నుఁ బట్టి శిక్షించెదరు, జాగ్రత్త!" అని పలుక సామల్ పండితుఁడు, "ఓయి శివసింగూ! పూర్వము రుక్మిణీదేవి యుత్తరమున గొనిపోయినప్పుడు, నన్నెవ్వరు శిక్షింపలేదే! కావున నిప్పుడు మాత్రము నాకట్టి యవస్థ యేల చేకూఱును? ద్వారకా నగరమునకు బయలుదేఱినపుడు నా యిష్టము వచ్చినట్లు పాడుకొనుచుఁ జోయితిని." అని పలుక శివసింగు వాని మూర్ఖత్వమునకుఁ గోపించి "ఓయి ఛాందసుఁడా! నీ పిచ్చి మా[illegible] కున్నావు. నా మాటలు విని యీ త్రాటినుండి క్రిందికిఁ దిగునఱకు న్యా మర్యాదఁ గా పాడుము. ఎవరైన వినిన నా కార్యము భంగమగును. నేఁడు మాపాలిట యమదూతవలె గూడితివి. ఆ పద్మ నిన్ను వెదకి

వెదకి పంపినట్లున్నది." అని పలికెను. దానికి సామల్ పండితుఁడేమో ప్రత్యుత్తరమీయ నుద్యమించెను గాని, శివసింగు వానిని మాటలాడ నీయక, "నోరెత్తకుము. నేను చెప్పినవఱకు మాటలాడఁ గూడదు. అట్లుండని యెడల నీ త్రాడు త్రెంపివేసెదను. క్రిందఁ బడఁగలవు జాగ్రత్త." అని మెల్లగాఁ బలుకుచు భయపెట్ట సామల్ పండితుఁడు భీతిల్లి మాఱుమాట ఆడకుండ శివసింగు వెనుక తాను గూడ దిగు చుండెను. అట్లు కొంతదూరము వఱకు దిగిన తరువాత సామల్ పండితుఁడు "శివసింగూ! శివసింగూ కొంప మునిఁగిపోయినది. వేగము రా! రా!" అని పిలిచెను. పాపము వాని కచ్చట నేమి యపాయము వాటిల్లెనో యని మన శివసింగు మరల మీఁది కెగబ్రాకి వానిని గలిసికొని యాతురతతో, "అయ్యో! ఏమి? ఏమి? నీ కేమి యాపద సంభవించెను?" అని యడుగ, నా బ్రాహ్మణుఁడు రహస్య ముగ "అబ్బే! ఏ యాపదయును రాలేదు. ఇంకనైనా మాటలాడు కొనవచ్చునో లేదో యడుగవలయునని పిలిచితిని." అని బదులు చెప్పెను. ఈరీతిగ నాతఁడు మాటిమాటికి "ఇంకనైన మాటలాడ నిచ్చెదవా? ఇంకనైన మాటలాడ నిచ్చెదవా?" అని శివసింగు నడుగుచు, కొంతసేపటికి వానితోఁ గూడఁ గ్రిందికిఁ బోయెను. శివ సింగు ఆ బ్రాహ్మణుని తనవెంట నుంచుకొని, అచ్చట తనకై వేచి యున్న భిల్లులఁ గలసి యరణ్యమార్గమునఁబడి పోవుచుండెను. సామల్ పండితుఁడు ఇప్పుడైన మాటలాడుకొన నిచ్చెదవా! నాయనా!" అని శివసింగు నడిగెను. కాని తాను చెప్పినవఱకు నోరెత్తగూడదని యాతఁడు మఱల బ్రత్యుత్తరమిచ్చెను. పర్వత ప్రాంతారణ్యములలో నాయర్ధరాత్రమున శివసింగుపోవుచు భిల్లులకు వడిగా నడువుఁడని యాజ్ఞాపించి కొంతదూరమువఱకు నేగినపిమ్మట బ్రాహ్మణునిఁజూచి నవ్వుచు "పండిజ్జీ! ఇంక నీయిష్టమునచ్చినట్లు మాటలాడు కొన వచ్చును. పట్టణము దాఁటివచ్చుట యొక గండము గడచినట్లున్నది."

అని పలుక విదూషకుఁడు పకపకనవ్వి, "అదృష్టవంతుఁడనే. ఇంత సేపటికి నానోటికి కఱవుదీఱినది." అని భిల్లులకన్నఁ దాను ముందు నడుచుచు, నాయాసమనక, తన యంగవస్త్రమును నడుమునకు గట్టిగఁ జుట్టుకొని, రెండుచేతులతో నభినయముఁ జేయుచు నిట్లు పలుక నారంభించెను.

"వాహ్వా! ఇన్నాళ్ళకు నా యదృష్టము బాగుగా నున్నది! విమలాదేవి యనుగ్రహమున రాజసింహునియొద్ద కావలయు ననునంత ధనము సంపాదించుకొనెదను. కావున రాజసింహునియొద్దకుఁ ద్వరగాఁ బోయెదను. నన్నుఁ జూచినంతనే యాతఁ డాదరించి క్షేమసమాచారము లడుగక మానఁడుగదా! అప్పుడు నావాక్చాతుర్యమంతయుఁ జూపుచు విమలాదేవి స్థితినంతయు రాజసింహున కెఱింగించెదను. అప్పుడు నా బుద్ధిచాతుర్యమున కాతఁడు మెచ్చుకొని తగిన బహుమాన మీయకమానఁడు. ఇంతియకాక, పిండివంటలతో నాకు విందు చేయించును. అప్పుడుగదా నా ప్రతాపమంతయుఁ జూపఱకుఁ జూపుటకుఁ దగినసమయము? నాకు మొగమాటమన్నమాట కలలోనైన లేదు. కావలసిన పదార్థములడిగి వేయించుకొని తృప్తిగా భోజనము చేసెదను. బూఱెలు......క్షీరాన్నము......ఒబ్బట్లు......అబ్బా! ఆ మాటలు దలఁచుకొనిన నా నోటనుండి యూటలూరుచున్నవి. ఇన్నిటికన్న మాషచక్రముల రుచియే రుచిగదా! అట్టిభాగ్యము నా కెప్పుడు గల్గునో?"

ఆ మాటలన్నియు నాలకించుచు శివసింగును, భిల్లులును, పకపక నవ్వుచుఁ బోవుచుండిరి. కొంతదూర మేగునప్పటికి పాపము మన సామల్‌పండితున కాయాసము జనించినందున నడువఁజాలకపోయెను. అప్పుడు శివసింగు వానినిజూచి, "పండిజ్జీ! మీ రలసినట్లు కనఁబడుచున్నారు. ఇంక నడువఁజాలరేమో? ఇచ్చటికి సమీపముననే యొక సరోవరమున్నది. అచ్చట మనమీపూఁటకు బసచేసికొందము. అంత

వఱకు మీరీభిల్లులలో నెవ్వాని భుజముపైనైనఁ గూర్చుండుఁడు. సునాయాసముగఁ బోవచ్చును." అని చెప్ప సామల్ పండితుఁడు, "నాయనా! నన్ను మోసికొనిపోయి నాపైఁగల దుఃఖముచే నా సరోవరములోఁ బడవేయుటకా మీ ప్రయత్నము? లేక లేకకల్గిన కుమారుఁడను మాయమ్మకు నేనొక్కరుఁడనే! మొన్ననే నాగృహిణి కాఁపురమునకు వచ్చినది. ఇంటఱనువిడిచి నే నెట్లు చనిపోవఁగలను? నన్నెట్టులైన మోసపుచ్చవలయునని మీ రందఱు ఆలోచించుకొను చున్నారు. కాని యీ మాయలకు లోఁబడువాఁడనుగాను. సామల్ పండితుఁడన నెవ్వఁడని యోజించుకొనుచుంటిరో? నాకు దివ్యదృష్టి విస్తారముగాఁగలదు. జాగ్రత్త. అన్నిసంగతులు నే నెఱుఁగుదును." అని పలికెను.

పిమ్మట శివసింగు వానిమాటలకు నవ్వి వానితో సహాసార్థముగా మాటలాడుట కారంభించెను.

"అయ్యా! మీకు దివ్యదృష్టికూడ నున్నదా యేమి? అట్లైనచో ముందున కేమిజరుగునో చెప్పఁగలరా?"

"ఓ! చెప్పలేకేమి? ఇదిగో వినుము.

ఉ. శ్రీయుతమూర్తియైన నృపసింహుఁడు వీరుఁడు రాజసింహుఁడే
ప్రాయసమూని రూపనగరంబునకుం జనుదెంచి లావుమై
నా యవురంగజేబును మహాహవరంగమునందు గెల్చి యా
తోయజపత్త్రలోచనను దోడ్కొనిపోవు నిజమ్ము నమ్ముమా!"

"వాహ్వా! నిక్కమైనమాటఁ జెప్పితిరి. దీనికేమిగాని రాజసింహుని వివాహమునకు మీరే పురోహితులా? లేక......"

"అందులకు సందేహమేల? పూర్వము కృష్ణున కెట్లు పెండ్లి చేసితినో? రాజసింహుని పెండ్లిఁగూడ నట్లు చేసెదను."

"అప్పుడు రాజసింహుఁడు మీ కేమి బహుమానమిచ్చునో చెప్పగలరా?"

"ఓ! బహుమానమన్న బహుమానమా!

ఉ. రమ్మని పిల్వఁడా కనికరమ్మున మేల్ జలతారుసాలువుల్
గొమ్మని యీయఁడా మురుగులున్ బహుమానముగా నొసంగఁడా
కమ్మను దెచ్చినందులకుఁ గా ధనరాసులనిచ్చి పంపఁడా
యమ్మహనీయు పెండ్లిసమయమ్మున నాకుఁ గొఱంతగల్గునా ?"

అట్లు పోవఁ బోవ వారొక సరోవరమువద్దకు వచ్చి చేరిరి. అప్పుడు జాము ప్రొద్దెక్కుటచే నచ్చట బసచేసికొని భోజనముచేసి పోవలయునని యెంచి శివసింగు వారినందఱ నచ్చటనాఁపెను. రాత్రి యంతయు నడచినందున తమ యాయాసమంతయు దీరునట్లు భిల్లు లందఱు నా సరస్సులోని చల్లనినీరు ద్రాగి కొంతసేపు శ్రమఁదీర్చు కొని వంటచేసి భోజనముఁజేసిరి. శివసింగును సామల్ పండితుఁడును గూడ భోజనముఁజేసి చెట్టునీడను కొంతసేపువిశ్రమించిరి. వారాపూఁట నచ్చటనేయుండి సాయంకాలమున మరలఁ బ్రయాణ మారంభించిరి.

కొంతదూరముపోయినతరువాత మార్గమధ్యమున నొకవృక్షము క్రింద నొకపురుషుఁడు మూలుగుచు కాళ్ళను చేతులును దగ్గఱఁ జేర్చుకొని పరుండియుండెను. శివసింగు వానిని జూచి, జాలివహించి, "ఓయీ నీవెవ్వఁడవు ? మూల్గుచు నీవృక్షముక్రిందఁ బరుండియుండు టకుఁ గారణమేమి ? మాకుఁ జేతనైనంత సాహాయ్యము జేయఁగలము చెప్పుము." అని పలుక నాపురుషుఁడు "అయ్యా ! మీ రెవ్వరో నాపాలిదైవమువలె నున్నారు. నేను పొరుగూరికిఁ బోయి మరల మాగ్రామమునకు వచ్చుచుండ త్రోవలో నాకాలు బెణికి యిఱుకు పట్టి నన్ను నడువఁజాలకుండఁ జేసినది. ప్రొద్దుననుండియు నిచ్చటనే పడియున్నాను. నాకిచ్చట నెవ్వరును దిక్కులేదు. మీరె తల్లి దండ్రులు. నన్నెట్టులైనఁ గొంతవఱకు మీతోఁగొనిపోయిన

మీమేలు మఱువఁజాలను ” అని ప్రార్థింప, శివసింగునకు వానిపైఁ బూర్ణానుగ్రహము జనించినందున, వానిని భుజముపైఁ గూర్చుండఁ బెట్టుకొని రావలయునని యా భిల్లులలో నొక దృఢమైనవాని కాజ్ఞాపించెను. వెంటనే యందొక భిల్లుఁడు వానిని మోసికొని పోవుచుండెను.

పాప మాపురుషుఁ డెంత బాధపడుచుండెనో తెలియదుగాని, వాని మూలుగుమాత్ర మొక్కవిధముననేగాక, పరిపరివిధములఁ బరఁగుచుండెను. శివసింగు మొదలైనవా రెవ్వరైన మాటలాడు కొనునప్పుడు వాని మూలుగించుక తగ్గుచుండెను. వారూరకుండి నప్పుడు ఆమూలుగు హెచ్చుచుండెను కాని వారలెవ్వరు నది గని పట్టలేదు. వారు దమలోఁ దాము మాటాడుకొనునప్పు డామాటలు వినవలెననికాఁబోలు రోగి మూలుగు మానుచుండెను. కాని సామల్ పండితుని ప్రలాపములవలన వానికామాట లంతగా వినఁబడలేదు. మాటలాడకుండ నొక్కక్షణ మూరకుండిన సామల్ పండితున కాక్షణ మొక యుగమేకదా ? రోగి తనకుఁ దల నొప్పివెట్టుచున్నదనియు, బ్రాహ్మణుని అల్లరి చేయవలదనియు చెప్పుమని శివసింగును బతి మాలుకొనెను. అప్పుడు విదూషకునితో “ అయ్యా ! ఒక్కతడవ అల్లరిసేయ కూరకుండుఁడు. పాప మాతనికిఁ దలనొప్పి వెట్టుచున్న దఁట ” అని శివసింగు చెప్పెను. కాని సామల్ పండితుఁడు “ నావల్ల కాదు. మాటలాడకూరకుండిన నాకుఁగూడ రోగము వచ్చును ” అని బదులు చెప్పెను. ఇట్లు వారందఱుఁ గొంతదూరము పోయిన పిమ్మట నారాత్రి యెందైనఁ బరుండవలయునని యొక చెట్టుక్రింద నిలిచిరి. భిల్లుఁడు తనభుజముపైనున్న రోగిని మెల్లగాదించి యొకచో బరుండబెట్టెను. పిమ్మట శివసింగును బ్రాహ్మణుఁడు దగిన సదుపాయము లను జేసికొని యచ్చట నిద్రించిరి.

తెల్లవాఱినంతనే అందఱికన్న ముందుగ రోగిలేచి మెల్లగ కుంటుచు నిట్టునట్టు నడచుచుండెను. అప్పుడు మేల్కాంచిన కొందఱు భిల్లులు వానిఁజూచి యాతఁడెవఁడాయని తలపోసికొనిరి. ఇంతలో శివసింగుగూడ లేచి మరల ప్రయాణమునకు సన్నద్ధుఁడయ్యెను. అప్పుడు రోగి వానిని జూచి, "అయ్యా! నాశరీర మించుక త్రోవ లోనికి వచ్చినది. ఆయాస మంతయుఁ బోయినది. కాళ్ళు కొంచెము సాగి నడచుటకు వీలుగనున్నవి. ఇంతకన్న మీకుఁ బ్రయాస గలిగింపఁ జాలను. కావున నేనే మెల్లగఁ బోయెదను" అని చెప్పెను. అట్లేయని శివసింగు తనవారితో గలసి తనదారినిఁ బోవుచుండెను. వారు కొంత దూరము పోవుటఁజూచి రోగి యేరికిఁ గానరాకుండ పారిపోయెను.

# ఇరువదియవ ప్రకరణము

## పావుర మెచ్చటికిఁ బోయెను ?

పద్మ నెట్టులైన మోసపుచ్చవలయునని యెంచి, కుంద, పావురము మెడలోని కాగితమునువిప్పి చదివి యందులకు వ్యతిరేకముగ జవాబువ్రాసి విడుచుటయు, నాపావుర మెప్పటియట్టు లంబరమార్గమున నెగిరి పోవుటయుఁ జదువరులకుఁ దెలిపియేయున్నవి. ఆ దినమున సాదతు ఖాను తనగుడారములో ద్వారముచెంతనే కూర్చుండి హుక్కా పీల్చుచుండెను. వాని కించుకదూరమున హుక్కాయుంచి సేవకుఁ డొకఁడు అగ్నిని వలయునప్పు డూదుచుండెను. దానిననుసరించియున్న గొట్టము తననోటియొద్దనుంచుకొని సాదతుఖాను మాటిమాటికి పీల్చుచు, నోట నుండియు నాసికారంధ్రములనుండియు విశేషముగఁ బొగ విడచుచుండెను. గొట్టములోనుండి ధూమమును నాతఁడు పీల్చునప్పుడాహుక్కాలోనుండి యొకవిధమైన గుడుగుడు శబ్దముగూడ వెలువడుచుండెను. హుక్కాపీల్చుచు నమితానందహృదయుఁడై సాదతు ఖాను మీఁదివైపు తనదృష్టినిలిపి తనలో నేమేమో యాలోచించుకొనుచుండ నప్పు డాకస్మికముగ నాకాశమార్గమునఁ బోవుచున్న పావురము వానికంటఁ బడియెను. తోడనే యాతఁడు తన లక్షణవిద్యను బరీక్షించుకొనుటకై తుపాకితోఁగొట్టి దానిని బడనేసి, పావురము క్రిందబడినంతనే సాదతుఖాను పోయి దానిని బట్టుకొని చూడఁగా పావురము మెడలోఁ గట్టఁబడిన కాగితము వానికి గోచరమయ్యెను, తాను సహజముగఁగూల్చిన పావురమువలనఁ దనకేదియో

శత్రుపుల గొప్ప రహస్యము తెలియనున్నదని సంతసించి యా కాగిత మును విప్పెను. కాని అందలి యక్కరములు మహారాష్ట్రభాషలో లిఖింపఁబడియుండుటచేఁ దనకు దెలియనందున, చెంతనున్న యొక హిందూభటునకిచ్చి సాదతుఖాను చదువుమనెను. అప్పు డాతఁ డాయుత్తరమును జూచి, "మీరు రానక్కఱలేదు. రావలసిన సమయము వచ్చినప్పుడు మీకు నేను తెలియఁజేసెదను. అప్పుడు వచ్చుటకుమాత్రము మీరు సిద్ధముగ నుండవలయును." అని చదివెను.

ఆ యుత్తరము వినినతోడనే సాదతుఖానున కనేక సందేహములు గల్గినవి. కోటలో విజయసింహుఁ డేదియో పన్నుఁ బన్నుచు, ప్రబలమైన ప్రయత్నము సేయుచున్నాఁడనియు, నంతియకాక యాతఁడు రాజపుత్రుల సాయమును గోరుచుండెననియు, ఇట్టు లెన్నాళ్లనుండియో విజయసింహునకును రాజపుత్రులకును రహస్యముగ నుత్తర ప్రత్యుత్తరములవలన వ్యవహారము జరుగుచుండె ననియు, ఇంక రాజపుత్రు లెప్పుడో యాకస్మికముగ వచ్చి తనపైఁ బడక మానరనియు, నాతఁడు నిశ్చయించుకొని భీతచిత్తుఁడయ్యెను. మఱియు "మీ రిప్పుడు రానక్కఱలేదు." అను వాక్యము వలన, విజయసింహుఁడు కొలుత రసపుత్రుల సాయము నపేక్షింపకయే తన్నును తన సైన్యములను నోడింపఁ దగిన మహాప్రయత్న మేదియో చేయుచుండెననియు, నట్టి తఱిని రాజపుత్రులుగూడ వానికి సాయము వచ్చినచో నింక తనకు జయము గల్గుట దుర్ఘటమనియు నెంచి సాదతుఖాను మఱింత భయమును సందేహమును జెందెను. వెనుకనుండి రాజపుత్రులును, ముందునుండి విజయసింహుని సైన్యములును బోరాటము సలుప, తాను తన సైన్యములును మధ్యను జిక్కి యెట్టి సంకటమైన నొందవలసి వచ్చునని పరిపరి విధములఁ దలపోయుచుండెను.

తన కిన్ని కష్టములు సంభవింపకమును పే జాగ్రత్త వహింపవలయునని యెంచి, తన భటులను గొందఱను నలువంకలకుఁ నంపి, కొంత దూరమువఱకుఁ బోయి, యెవరైన శత్రువులు వచ్చుచుండిన

యెడల సత్వరముగఁ దన కెఱింగింపవలయునని యాజ్ఞాపించెను. ఆతఁ డదివఱకే యెందఱినో పంపుచు, పంపిన వారలు తిరిగివచ్చి తమకు రాజపుత్రు లెవ్వరును వచ్చుచుండినట్లు దోఁపలేదని చెప్ప సాదతుఖాను వారిని శిక్షించుచుండెను.

ఇట్లుండఁగా నొకనాఁడు శాత్రవాగమన విలోకనార్థ మేగిన భటవర్గములో నొక భటుఁడు తిరిగివచ్చి సాదతుఖానునకు సలాములు చేసి "అయ్యా! భవదాజ్ఞానుసారముగ నేనుపోయి యొక విశేషము గనుఁగొని వచ్చితిని. ఎవఁడో యొక రాజపుత్రుఁ డొక బ్రాహ్మణుని వెంటఁ బెట్టుకొని కొందఱు భిల్లులతో నరణ్యమార్గమునఁ బోవుచుండెను. వారి సమాచారమంతయుఁ జూడ వా రుదయపురమునకుఁ బోవుచున్నట్లు నాకుఁ బొడగట్టెను." అని పలుక సాదతుఖాను వానిపై నమితానుగ్రహము వహించి "శబాసురా! నీ వొక్కఁడవె యిందఱిలోఁ దెలివి గలవాఁడవు, సరే కాని వారు తమ రహస్యములు నీయెదుట వెల్లడించిరా? నీ వెట్లు కనుఁగొంటివి." అని యడుగ నా భటుఁడు "నేను మార్గమధ్యమున రోగివలె మూల్గుచుఁ బరుండి వారిని జూచి నడువఁజాల ననియు, నా మోఁకాలిలో బెణికి యుండెననియుఁ జెప్పి కొంత సాహాయ్యమును వారిని వేడితిని. ఆ రసపుత్రుఁడు జాలి వహించి నన్నుఁ గొంతదూరము వఱకు తన సేవకునిచే మోయించెను. ఇంతకన్న మీ కెక్కుడు వృత్తాంతమే తెలియఁజేసియుందును గాని యా రాజపుత్రుని వెంటనున్న బ్రాహ్మణుఁడు మాటిమాటికి కేకలు వేయుచు, వారాడుకొనిన మాటలను నన్ను సరిగా విననీయలేదు. కోటలోని వారే యా రాజపుత్రుని కేదియో సంగతిఁ జెప్పి, యుదయపురాధీశుఁడైన రాజసింహుని యొద్దకుఁ బంపి యుండవచ్చునని నాకుఁ దోఁచుచున్నది." అని పలుక సాదతుఖాను ఆశ్చర్యస్వాంతుఁడై తత్క్షణమే రెండువందల సైనికుల నుదయపురము తట్టుఁ బంపి, ఉత్తరము గొనిపోవుచున్న వారిని దాఁకి, వారిని నా యుత్తరమునుగూడ సత్వరముగ గొని రావలయునని యాజ్ఞాపించెను. అంతతో నూరకుండక

"రాజపుత్రులు విజయసింహునకుఁ దోడుగ వచ్చుచున్నారు. వెనుక నుండి వారును ముందునుండి విజయసింహుని సైన్యములును బోరాడిన మనకు జయము గల్గుట దుర్లభము. కావున వెంటనే నాలుగువేల సైనికులను బంపవలయును. లేనిచో నపాయంబు జేకూరును." అని యొక జాబు వ్రాసి తన సేనకున కొకనికిచ్చి ఔరంగజేబునకు బంపెను.

సాదత్ ఖాను పంపిన సైనికు లుదయపురము దెసఁ బోవుచుండిరి. పూర్వమువలెనే సామల్ పండితుఁడు శివసింగు మొదలైన వారందఱు నానందముగఁ దమ దారిని నేగుచు నుదయపురమున కించుక సమీపమును లోనికిఁ బోయిరి, సామల్ పండితుఁడు శివసింగును జూచి "ఓయీ! మీరింక పోవచ్చును. నే నుదయపురమునఁ జేరఁగలను నాకు భయము లేదు." అనిచెప్ప శివసింగు నవ్వి "పండిజ్జీ! త్రోవలో నెవరైన మిమ్ము మోసపుచ్చెదరేమో" అని పలుక, సామల్ పండితుఁ డాగ్రహమొంది "నేనంత చేతఁగానివాఁడ ననుకొంటివా యేమి? నా పరాక్రమము ధైర్యము నీ వెఱుఁగవేమో? నూఱు గ్రద్దలను నాలుగు వేల ఎలుకలను, ఆఱువందల ముప్పదిరెండు గ్రామసింహములను, బరిమార్చిన జగదేక వీరుడను." అని యుగ్గడించెను. భిల్లులును శివసింగును వాని మాటలకు నవ్వుచుండిరి. ఇంతలో సాదత్ ఖాను పంపిన సైన్యములు వచ్చి వారిని దాఁకెను. భిల్లులును శివసింగును వారితో హోరాహోరిగఁ బోరుచుండిరి. సామల్ పండితుఁడు వారినిజూచి గడ గడ వణఁకుచుండెను. భిల్లులు తమ యాయుధములను దురకలపై విడిచి వారిని నొప్పించుచుండిరి. శివసింగు తన పరాక్రమ మంతయుఁ జూపు చుండ గొంతసేపటికిఁ మహమ్మదీయులు చెల్లాచెదరై నలువంకలకుఁ బారిపోయిరి.

పిమ్మట సామల్ పండితుఁడుగూడ వారి కెచ్చటను గాన రాలేదు. భిల్లులును శివసింగును వానికై కొంతసేపు వెదకఁగా నాతఁ డొక చెట్టుచాటున దాఁగి యుండెను. అప్పుడు శివసింగు వానిని పట్టు కొని "పండిజ్జీ! ఇదేనా మీ ధైర్యము?" అని పరిహాసముఁ జేసెను.

సామల్ పండితుఁడు వాని మాటలు వినక ఇంకను శత్రువు లెవరైన నుండిరేమో యని, నలువంకలుఁ జూచుచు వారివెంటఁ బోవుచుండెను. పిమ్మట కొంత దూరమేఁగిన తరువాత శివసింగు నాజ్ఞానుసారముగ భిల్లులు వాని నుదయపురముఁ జేర్చి రాజసింహుని కప్పఁజెప్పి మరల తమ దారిని బోయిరి. పిదప రాజసింహుఁడా బ్రాహ్మణుని సగౌరవంబుగ నాదరించి, యాసనముపైఁ గూర్చుండఁబెట్టి, క్షేమ సమాచారము లడిగెను. సామల్ పండితుఁడు చెప్పవలసిన వృత్తాంతమంతయు వానికిఁ జెప్పి యుత్తరము వాని కిచ్చెను. రాజసింహుఁ డా యుత్తరమును జదువుకొని, విచారము, సంభ్రమము, నాగ్రహము, నొక్కమాఱు తన హృదయమున నుప్పతిల్లఁ దన భావ మిట్లు వెల్లడి చేయ నారంభించెను.

"ఎంత సాహస మెంత సాహసము? పరాక్రమ శాలులగు రాజపుత్రు లందఱును గాజులు తొడిగించుకొని యూర కుండెదరని యేమో పాదుషా యభిప్రాయము? తా నెన్ని దుష్కార్యము లాచరించినను, ఇన్నాళ్లవఱకు శాంతించి యూరకుంటిని. కాని వాని దారుణ కృత్యము లంత కంతకధిక మగుచుండె."

అని యుత్తరమును జూచి,

"కాకికి రాజహంసి సతిగాఁ గలదే తలపోయ భూధవా!"

ఔరౌరా! ఔరంగజేబు మానవతీ సేనుల పాలిటఁ గాలుఁ డయ్యెఁ గదా? విచార కరంబులగు నీతలోదరి వాక్యంబులు, నా హృదయంబును గరఁగించి నన్నుఁ బురికొల్పుచున్నయవి."

అని మరల జాబును బరికించి,

"తనయ నిచ్చెదవో యుద్ధముఁ జేయ నెంచెదో
యని జాబు మా తండ్రి కంపినాఁడు,"

ఏమీ! పాదుషా యింతటి పోటు మనిసియా! నిరంతర క్షత్రియ ధర్మాచరణ కుతూహలులై, శాంతమూర్తులై, మా రాజు లందఱు నూరకుండుటచే తనకు వెఱచిరని యభిప్రాయ మొంచున్న

వాఁడు గాఁబోలు. తనయనే యిచ్చునో యుద్ధమే సేయునో తొందర వడిన కార్య మెట్లగును? భయంకరాహవ రంగంబున ఖడ్గపాణియై తన యెదుటకు వచ్చి యప్పుడు గదా విజయసింహుఁడు వానికిఁ దగిన ప్రత్యుత్తర మిచ్చును?”

చేతిలో నున్న యుత్తరమును జూచి,

“ఎల్ల రాజులఁ గెల్చి ఢిల్లీకిఁ గొనిపోయి
నన్నుఁ బెండ్లాడంగ నున్న వాఁడు,”

ఓ వెఱ్ఱిదానా! విమలా! ప్రచండ మార్తాండుఁడు త్రోవఁ దప్పి చరించినను, భూమండలం బంతయుఁ దలక్రిందైనను, ఇట్టి యౌరంగజేబులు వేయిమంది వచ్చినను, నీ కేమియును భయము లేదు. చాల కాలమునుండి పాదుషా నన్ను మఱచి యున్నవాఁడు. ఈ సారి వానిని దాసోహ మనిపించి, ముప్పు తిప్పలు పెట్టి కలకాలము నన్ను మఱవ కుండఁ జేసెదను చూడు.”

అని మరల లేఖ నవలోకించి,

“శ్రీవరుఁ డల్ల రుక్మిణినిఁ జేకొని నట్టులు నీవు గూడ నో
భూవర! చేరఁ దీసి వడిఁ బ్రోవవె! లోకము నుద్ధరింపవే?”

అయ్యో! ఆమె యెట్టి యాపదలో నుండినఁ గాని, పరపురుషుఁడ నగు నాకిట్టి యుత్తరము వ్రాయఁ గలదు. క్షత్రియ వీరుఁడనై నిక్కముగ రాజసింహుఁడనే యైన యెడల మహమ్మదీయుల నోడించి, యీ మానవతీ లలామను రక్షింపకున్న నా జన్మ మేల?”

అని యనేక విధములఁ బలుకుచుండ సామల్ పండితుఁడు వానిని జూచి “అయ్యా! ఇంక నాలస్యము సేయక సైన్యముల సిద్ధము గావించుకొని మా విమలను రక్షింపుము. ఆమె నీకై దినదిన మెదురు సూచుచుండును, కాలయాపనము చేసిన కార్యము భంగమగును.” అని పలికెను. రాజసింహుఁడు వానిని లోనికిఁ గొనిపోయి విందు చేయించి, యప్పటి నుండియుఁ దాను యుద్ధ ప్రయత్నము లెక్కుడుగా సేయుచుండెను.

# ఇరువదియొకటవ ప్రకరణము

## మోహ ప్రభావము

మఱునాఁడు ఛోటుసింగు వచ్చునేమో అని, యిందిర వానికై యెదురు చూచుచుండెను. కాని యాతఁడు రాలేదు. అందులకు నిజమైన కారణమేమో మన యిందిర యింకను నెఱుంగదు కదా ? రెండు మూఁడు దినముల నాతఁడు వచ్చువఱకు నేమో యని యడియాస వహించి యామె కాలము గడపెను. వాని వృత్తాంతము గనుఁగొన వలయు నని తనకు సాధ్యమైనంత వఱకుఁ బ్రయత్నము జేసెఁ గాని యందు వలన నేమియుఁ గార్యము గాన రాలేదు. క్రమక్రమముగా నామె హృదయమున ననుమానము జనించి బాధించుచుండెను. ఇట్లొకవారము గడచిన పిమ్మట ఛోటుసింగు మఱి రాఁడని నిశ్చయించు కొని, నిద్రాహారములు మాని వానికై శుష్కించుచు నిట్లు తలపోయఁ జొచ్చెను.

"మఱునాఁడే వచ్చెద నని చెప్పిపోయిన వాఁ డిన్నాళ్లవఱకును రాకుండుటకుఁ గారణ మేమై యుండును ? ఆతఁడీ యంతఃపురము నుండి పోవుచున్నప్పుడు పురుషుఁ డని వానిని రాజభటులు పట్టి, పాదుషా యెదుటఁ బెట్టి రేమో ? అట్లే అయినచో ఆ వృత్తాంతము పాదుషా యుగయప్పురి కెఱింగింప కుండునా ? ఆమె యెఱింగిన నాకుఁ దెలియు టెంత మాత్రము ? కాదు. ఒకవేళ నాతఁడు మార్గమును గనుఁగొన లేక యెచ్చటికైన పోయి యుండును. ఎచ్చటికిఁ బోఁగలఁడు ? ఈ నగరముననే యుండును గదా ? మహమ్మదీయులు వాని

కేమైన మోస మొనర్చి యుండు రని యను కొనెదనన్న, తన చమత్కారమునఁ జెక్కిన ప్రతిమ లందఱకు నొసంగుటవలన నీ నగరమున నున్న తురక లందఱు వానికిఁ బ్రాణ మిత్రు లగుదురు. అంతటి సాహస మొనర్చు పరమ శత్రువు వాని కెవఁడు కలఁడు ? మరల వచ్చి యుదయపురిని దర్శించు కొనుటకీ జనానాలోని కెట్లు రా వలయునో మార్గముఁ గనుఁ గొనఁ జాలక యుండ వచ్చును. ఏమీ ! ఇది వఱకొక సారి చూచిన వాఁ డింకొక సారి యీ మార్గమునుఁ గనుఁగొన లేఁడా ? ఆతఁడు చిన్నప్పటి నుండియు శేముషీ శ్రేయుఁడు గాని వివేక హీనుఁడు గాఁడే ! ఈ కారణము లేమియునుగావు. వాని కేదో యాపద సంభవించెను. లేదా మరల జనానా లోనికిఁ బోయిన యెట్టి కీడు సంభవించునో యని యెంచియైనను రాకపోయి వుండ నచ్చును."

అని యనేక విధముల నిందిర తనలో నాలోచింపఁ జొచ్చెను. తన సంశయము లెల్లఁ దీర్చు కొన నెంచి యామె మసావదుచే ఛోటుసింగును వెతకింప వలయు నని నిశ్చయించు కొనెను. ఉదయపురి ప్రేరేపణమున మసావదు, మోహపిశాచా వేశ పరవశుఁడై యిందిరకు దానాను దాసుఁ డయ్యెను. ఇందిర సమ్మతింపనిదే యామెను బలవంతముగఁ బెండ్లాడినవాఁడు జ్యోతిష శాస్త్ర ప్రకారముగ పది దినములలోఁ జచ్చునని, నాఁడు ఛోటుసింగు చెప్పుటచేత, మసావదు ఎట్టులైన నిందిర యనుగ్రహమును బడసి యామెను వివాహ మాడ వలయునని, చెప్పిన పనులెల్లఁ జేయుచు నష్ట కష్టములు బడుచుండెను. ఎచ్చటికిఁ బోయినను ఆ మూర్ఖుఁడు ఇందిర వెనువెంటనే కుక్కవలెఁ దిరుగుచుండెను. మార్గమధ్యమున నామె గనఁబడిన ఱెప్ప వాల్పక యామెను జూచి, యమందానంద మొందుచుండెను. ఒక వేళ నామె తన్నుఁ జూచిన యెడల చిఱునవ్వు నవ్వి మొగము వాల్చు కొను చుండెను. కాని మూర్తీభవించిన కలి పురుషుఁడో యన వానివికారాకారమునఁ జూచిన నెట్టి వారికైన భీతి జనింపక మానదు.

అతఁడు మోహాంధ కారమునఁ బడి క్రిందుమీఁదును గానక సంచరించు చుండెను.

కార్యోపాయములు చక్కఁగ నెఱుఁగును గావున నిందిర మసావదు చేతనే ఛోటుబేగం వృత్తాంతమును గనుఁగొన నెంచెను. ఆమె తన కార్యము విషయమై యోజించుచుండ నింతలో మసావ దచ్చటికి వచ్చెను. ఇందిరను జూచి నంతనే వాని మొగమున నానంద మొలుకుచుండెను. ఇంతయేల ఇందిరను జూచుచుండినంత వఱకు, వాని కేలోకముపై జ్ఞానమే లేక యుండెను. అట్టి సమయమున ఇందిర వానిని మాటలవలన మెప్పించి కార్యము గొనసాగించు కొనవలయు నని "ఓహో! మసావద్! నీవేనా?" అని పలుకరించెను. "హా - హా - హాఅవును నేనే నేనే" అని వాఁడు ప్రత్యుత్తర మిచ్చి ఆమె తన్నుపిల్చినందున తనపై నామె కనురాగ ముండె నని భావించుకొని సంతసించుచుండెను. ఇందిర వాని ముఖ లక్షణము లవలోకించి వానితో నిట్లు మాటలాడసాగెను.

"మసావద్! నీ విప్పు డెచ్చటికిఁ బోవుచున్నావో చెప్పెదవా?"

"ఎచ్చటికిఁ బోవుటకు నాకేమి పని యున్నది? మిమ్ములను జూచుటకే వచ్చుచున్నాను."

"మసావద్! అబద్ధ మాడఁగూడదు సుమా నిజము చెప్పు."

"అయ్యో! మీయెడల నే నబద్ధ మాడెదనా? ఉదయపురి బేగమ్‌గారి యనుగ్రహ ముండినచో నా బ్రతుకంతయు ముందునకు మీ తోడనేయున్నది కదా?"

ఆ మాటల కిందిర యేమియుఁ బ్రత్యుత్తర మీయక,

"మసావద్! నా హృదయమున నొక విషయమై విచారము జనించి బాధించు చుండి నందున నా కేమియుఁ దోఁప కుండ నున్నది."

"అట్లులైన నాతో నేల చెప్ప లేదు ? నే నుండఁగ మీ కింకొక విచారము రా నిచ్చెదనా ? అదేదియో సెలవిచ్చితి రేని మీయాజ్ఞ నా శిరమున ధరించుకొని నిముసములో నిర్వహించెదను."

"ఓయీ ! నాఁడు నీవు తోడ్కొని వచ్చిన ఛోటుసింగను చిత్రకారుఁడు మఱునాఁడే వచ్చెద నని చెప్పి, పోయెను. కాని నేఁటి వఱకును రాలేదు. ఆ కారణమున నా కేమియుఁ దోఁప కున్నది."

ఆ మాటలకు మసావ దేదియో యనుమానము జనించి నట్లు నటించి, యించుక యోచించి,

"ఏమేమీ ? నే నుండఁగ మరల ఛోటుసిం గెందులకు ?" ✓

"ఓయీ ! నీవు మఱి యొకతీరున భావించి సందేహింపకుము. ఆతఁడును నేనును, నొక గ్రామములోనే పుట్టి పెరిఁగితిమి. చిన్నప్పటి నుండియు వానికిని నాకును బరిచయము గలదు. అందుచే మా తల్లి దండ్రుల వార్తలు వాని నడిగి తెలిసికొన వలయునని యెంచితిని. కాని యాతఁడు మఱల నాకుఁ గాన రాలేదు. ఈ పట్టణమునఁ జిత్ర కారులలో ధనికుఁ డగు వర్తకుఁ డొకఁడు కలఁడు. వాని యొద్దకుఁ బోయి యడిగితి వేని ఛోటుసింగు వృత్తాంతము నీకుఁ దెలియఁ గలదు. నీ వెట్లులైన నీ కార్యము చేయక తీరదు"

"సరి ! ఈ పని యన నా కెంత ? మీ యాజ్ఞాను సార మిప్పుడే పోయి వాని వృత్తాంతము గనుఁగొని వచ్చెదను. కాని ఛోటుసింగు విషయము నాకుఁ గూడ నాశ్చర్యముగ నున్నది. ఆనాఁడు పాదుషా గారు వచ్చుచున్నారనియు, నాయన పోవువఱకు నిందుండు మనియుఁ జెప్పి వాని నొకగదిలో రహస్యముగ నుంచితిని. నే నేదో కార్యము మీఁదఁ బోయి వాని మాటయే మఱచితిని. కాని మరల నేను పోయి చూచుసరికి యాతఁ డందు లేఁడు. ఒక వేళ తన కేమి యాపద సంభ వించునోయని భయపడి పాఱిపోయి యుండవచ్చును. ఎన్నఁడైన నిట్టి

జనానాలు చూచెనా యేమి ! ” అని పలికి యాతఁడు ఛోటుసింగును వెదకుటకై బయలు దేఱెను.

పాప మాతఁడు ఢిల్లీ నగర మంతయు వెదకి వెదకి యెంతో ప్రయాసపడెను గాని ఛోటుసింగుమాత్రము వాని కెచ్చటను గోచరము కాలేదు. కడ కాతఁడు విసిగి యేమియును జేయ నేరక తిన్నగ వర్తకుని యింటికిఁ బోయి ఛోటుసింగు వృత్తాంత మేమైన నీకుఁ దెలియునా యని వాని నడిగెను. ఆ వర్తకుఁడు మసావదును జూచి “ అయ్యా ! వాని వృత్తాంతము నా కేమియుఁ దెలియదు. అతఁడు నానోటిలో మన్నువేసి పోయినాఁడు. వలదు వలదని యెంత చెప్పినను వినక నాచేత రెండువేల రూకలు వెచ్చము చేయించినాఁడు. నా గ్రహచార మిట్లున్నది. జనానాలోనికిఁ బోయి యిప్పుడేవచ్చెద నని చెప్పి నేఁటికిఁ బది దినములైనను రాలేదు. ” అని వర్తకుఁడు మసావదును జూచి రోదనము సేయ నారంభించెను. పాపమా వర్తకునకు నాఁటనుండి రాబడి క్షీణించి పోవుచుండెను. ఛోటుసింగు తనవద్ద నుండినంత కాలము నాతఁడు తన రెండుచేతులతోడను ద్రవ్యము సంపాదించు కొనుచుండె. తనకట్టి యైశ్వర్యము గలుగునని యాతఁడు కలలోనైన ననుకొనలేదు. కాని కలిగిన యైశ్వర్య మెల్లకాలము నిలుచునో నిలువదో యను ననుమానము మాత్రము లేకపోలేదు. మసావదు వాని నోదార్చి ఇందిర మొగ మెట్లుచూడఁగలనని విచారించుచు దీనాననుఁడై యింటికి వచ్చి, ఛోటుసింగు వృత్తాంత మేమియుఁ దెలియలేదని యిందిరతో మెల్లఁగాఁ జెప్పెను. ఆమాటలు విని యిందిర దైవసంకల్ప మెట్లులున్నదో తెలియదని సంతాప మొందుచుండెను.

# ఇరువదిరెండవ ప్రకరణము

## ఔ ర ం గ జే బు ఖా యి లా

ఔరంగజేబు చెల్లెలగు రోషన్ ఆరాకును, ఉదయపురికిని నానాఁటికి వైర మధికమగుచుండె. వారివివాదములు విచారణ సేయుటకు పాదుషాతప్ప వేరెవ్వరును లేరు. ఒకరి మహాలులోని కొకరి సేవకులు పోవుట లేదు. సమయము వచ్చినప్పుడొకరిపై పగ నింకొకరు తీర్చుకొనవలయునని క్రూరసర్పములవలె వేచియుండిరి. వారిహృదయముల రోషాగ్ని దినదినముఁ బ్రజ్వలింపసాగెను. ఇట్లుండఁ గొన్నినాళ్లకు దేహారోగ్యము దప్పి కాలవశమున నౌరంగజేబునకు జబ్బు సంభవించెను. అప్పటినుండియు నాతఁడు దర్బారునకుఁ బోవుట మాని, రాజ్యాంగవిషయము లితరులపైఁ బెట్టి, తానౌషధములు పుచ్చుకొనుచు జరుపుచుండెను. కాని అంత కంత కారోగ మధికమై బాధింపఁ జొచ్చెను. ఉదయపురి కాసంగతి దెలిసినందునఁ జింతాక్రాంత చిత్తయై నిద్రాహారములులేక పరితపించుచుండెను. ఔరంగజేబునకు రోగము క్రమముగా వృద్ధిలోనికి వచ్చి యెట్టియుపద్రవము సంభవించునో యనుభీతి గల్గించెను. అప్పుడు రోషన్ ఆరా తనకోరిక నెఱవేర్చుకొనవలయునని యితరులెవ్వరు లోనికి రాకుండఁ దన సేవకుల నౌరంగజేబు మందిరముచుట్టును గాపుంచెను. వైద్యుఁడును తాను దప్ప తదితరులెవ్వరును పాదుషాను జూడఁగూడదని యామె నిశ్చయము. దివానులును, సరదారులును, సామంతరాజులును మొదలగు వారందఱుఁ బాదుషాను జూచుటకై బయలుదేఱి భటులు

తమ్ముఁ నడ్డగించినందునఁ దిరిగి పోవుచుండిరి. పాప ముదయపురికిఁ గూడ నచ్చుటకిఁ జోవుట కాజ్ఞ లేదయ్యె. తనమగని యవస్థ యెట్లుండెనో యని యామె యంతకంతకు విచారించి కుమిలించుచుండెను. రోగపీడితుఁడై యున్న పాదుషాను జూడవలయునని యామె యెన్నియో విధములఁ బ్రయత్నించెనుకాని సాధ్యముకాలేదు. ఎందఱు వైద్యులువచ్చి చూచినను, ఎట్టి యౌషధము లొసంగినను రోగ మధికమగుటయే గాని క్షీణించుట యెన్నఁటికినిఁ గానరాకున్నది. వాని శరీరస్థితి నిశ్చయముగా రోషన్ఆరాకు దక్క యితరులెవ్వరు నెఱుఁగరు. ఆమె మాయలాఁడి యగుటచే, ఒకొక్కప్పుడు పాదుషాకు సన్నిపాతము సంభవించెననియు, నింకొకప్పుడు చనిపోయెననియు, మఱియొకప్పుడు రోగము కుదిరినందున సౌఖ్యముగ నున్నాఁడనియు, ననేక విధముల వదంతులు పుట్టించుచుండెను. ఈ వార్తలన్నియు నాలకించుచుండినందున నుదయపురి హృదయ మల్లకల్లోల మగుచుండె.

క్రమక్రమముగాఁ గొన్నాళ్లకుఁ బాదుషా బ్రతుకుట దుర్లభమని రోషన్ఆరాకు సందేహము జనించెను. ఇందువలన నామెకు విశేషముగ దుఃఖముండకపోలేదు. కాని, రాజ్యమెట్లైనఁ దనకు స్వాధీనముచేసి కొనవలయునని ప్రయత్నముసేయ నారంభించెను. పాదుషా సేవకులనెల్లఁ దనవశము చేసికొనియెను. అతఁడు గతించిన పిమ్మట తనకు రాజ్యము లభించుటయం దెంతమాత్రము నడ్డులేకుండ, తొలుతనే సామంతరాజులను లోఁబఱచుకొనవలయునని యామె తలంచెను. జయపురపు రాజైన జయసింగు తన కీకార్యమునందు, సహాయపరుఁడై యుండినఁ గొనసాగునని యెంచి, సహాయమునకై వాని కుత్తరము వ్రాసెను. కాని జయసింగు పాదుషా మని యుండెనో గతించెనో యెఱుఁగనందున నాతఁడేమియుఁ బ్రత్యుత్తర మియ్యక యూరకుండెను. పాపము పాదుషా కీలోకముపై జ్ఞానములేక స్మృతిఁ

దప్పి పడియుండ నదేసమయమని రోషన్ ఆరా వాని వ్రేలియుంగరమును మెల్లగఁ దీసికొని, ఔరంగజేబు వ్రాసినట్లు రాజులందఱకు నిట్లుత్తరము వ్రాసెను.

"రాజపుత్రులారా! సరదారులారా!

నే నీలోకమును విడిచి పోవుచున్నాను. నాకై మీ రింక విచారింపవలదు. శరీరములు క్షణభంగురములుగాని కలకాలము నిలుచునవిగావు. కావున నా పెద్దకుమారుఁడగు మఃఅజమ్ బహూ క్రూరుడు గాన రాజ్యమును వాని కీయక నా రెండవకుమారుఁడగు అజీమునకుఁ బట్టముగట్టి నన్ను సేవించినట్లే వానిని గూడ సేవింపుఁడు. ఇందులకు మీ రెంతమాత్రమును సందేహింప వలదు.

అల్లమీరు పాదుషా"

అని యీ యుత్తరమున పాదుషా ముద్రనైచి పంపెంచెను. మఃఅజమ్ వయస్సునందు పెద్దవాఁడగుటచే వానికి రాజ్యము వచ్చిన నాతఁడు తాను జెప్పినట్లు నడువక తనకు లొంగి యుండఁడని భావించి, బాలుఁడును రాజ్యమన్న నేమియు నెఱుఁగనివాఁడునునగు అజీమునకుఁ బట్టముకట్టిన నాబాలుఁడు పెద్దవాఁడగు వఱకుఁ దా నే రాజ్య మేలనచ్చుననియు, నీలోన వానిని దన వశము చేసికొనిన తనయాటలే యెల్లప్పుడు సాగఁజేసికొనవచ్చుననియు దురాలోచనముచేసి రోషన్ ఆరా యిట్టియుత్తరమును వ్రాసెను.

సామంతరాజు లందఱు నా యుత్తరమును జూచి, యాశ్చర్య మొంది యేమియు మాఱుపలుకకుండిరి. కొందఱు రాజులు పాదుషా యొక్క నిజమైన సమాచారము గనుఁగొనవలయునని యచ్చటి సేవకులకు లంచమిచ్చి వేలకొలఁది ధనము వెచ్చించిరి. కాని వారి కా కార్యము సాధ్యము కాలేదు.

ప్రాణములుండఁగ పాదుషా నొకసారి చూచుట సంభవించునో సంభవింపదో యని యుదయపురి విషణ్ణహృదయయై రాత్రింబవళ్లు

పరితపించు చుండెను. ఇందిర నెట్టులైన మంచి మాటలాడి యామెను వశము చేసికొనిన నేమైన నుపాయమాలోచించి చెప్పనేమో యని యామెను బిలిచి "ఇందిరా! కార్యములు కొనసాగించుటయందు నీ కెవ్వరును సాటిలేరని పాదుషాగా రెన్నియో మాఱులు చెప్పఁగా నేను వింటిని. శత్రు వర్గమునుండి చంద్రావతి నెంతో చమత్కారముగఁ దప్పించి నీ రాజభక్తి లోకంబున వెల్లడించితివఁట. కావున నేఁడు నాకుఁ గూడ నొక కార్యమునం దించుక సాహాయ్య మొనర్పవలయును. నీకుఁ దగిన బహుమానము నే నొసంగెదను. పాదుషాగా రెట్టి సంకటములో నుండిరో నీ వెఱుఁగుదువు కదా? ప్రాణములు విడువక యున్నా యనను ఒకసారి చూడవలయునని యున్నది. కాని రోషన్ ఆరా పెద్దపులివలె నాకడ్డముగా నుండుటంబట్టి యేమి చేయుదమన్న సాధ్యము కాకున్నది. నీ వేమాయోపాయమునైనఁ జేసి నన్నొక్కసారి నా మగనియొద్దకుఁ గొనిపోవలయును. నీ వెచ్చటికిఁ బోయినను అడ్డులేనట్లు నేనాజ్ఞ యొసంగెదను. నీకుఁ గావలయునంత ధనం బిచ్చెదను." అని కన్నీరు గార్చుచు వచింప సహజ మృదు మానస యగు నిందిర జాలివహించి యట్టులే చేసెదనని యోదార్చి ధైర్యము చెప్పి కొంత ధనముఁగైకొని ఆదినము రోషన్ ఆరా సేవకులందఱను వశము గావించుకొని వారితో స్నేహము చేసెను. ఆ మఱునాఁడు వారికి లంచములిచ్చి "నేఁటిరాత్రి రోషన్ ఆరా నిద్రపోయిన తరువాత నుదయపురి బేగమ్‌గారి కొక్కసారి పాదుషాగారి దర్శనము చేయింపవలయును." అని బతిమాలెను. ధనాశచే నా సేవకులు సమ్మతించి యట్టులే విడిచెదమని యొప్పుకొనిరి. ఈవార్త నుదయపురి కెఱిఁగించి, ఇందిర ఆ నాఁటి రాత్రి యామెను లోనికంపఁబోవునపుడు సేవకులందఱ మెడలలోను ముత్యాలహారములు వేసెను. వారందఱు సంతసించి మాఱు మాటఆడక యామెను లోనికిఁ బోనిచ్చిరి. ఉదయపురి ఔరంగజేబు వద్దకుఁబోయి యాతని శరీర మంతయుఁ దట్టిచూచెను. ఆహారము లేకుండుటచే వానిశరీరము

శుష్కించి నరములు గానవచ్చుచుండెను. ఆమె వాని చెంతఁ గూర్చుండి వాని పాదము లొత్తుచుండఁ గొంతసేపటికి ఔరంగజేబు కన్నులు విప్పి, యుదయపురినిఁ జూచి కసిపగార్చి "ఇన్నాళ్లివఱకు నెందులకు రాలేదు" అని సంజ్ఞలతో నడిగెను. "మహారాజా! నేనేమి సేయుదును. రోషన్ ఆరా మమ్మెవ్వరిని మీ దర్శనము చేయనీయలేదు" అని ఉదయపురి బిగ్గరగా పలికెను. కాని ఔరంగజేబు వెంటనే కన్నులు మూసికొని స్మృతి దప్పియుండుటచే నామె మాటలు వాని చెవికెక్కలేదు. అచ్చటికి సమీపముననేయున్న గదిలో రోషన్ ఆరా మేల్కొనియుండ ఉదయపురికంఠమును వినెను. చేయవలసిన కార్యము లనేకములుండ రోషన్ ఆరా కెట్లు నిద్దురగల్గును? రాజ్యమంతయుఁ దనవశము జేసికొనవలయునని యనవరతమును నామె యుపాయము లాలోచించుచునే కాలముగడపుచుండెను. తన మందిరమునుండి యుదయపురి మాటలాలకించినంతనే, తోఁక త్రొక్కిన త్రాచుపామువలె నదరిపడి లేచి పరుగుపరుగున వచ్చి, యుదయపురి సిగఁబట్టి క్రింది కీడ్చెను. తోడనే యామె మహాగ్రహమొంది, క్రిందఁ బడినను మఱల లేచి రోషన్ ఆరా యొక్క సిగఁబట్టి తానుఁగూడ లాగఁజొచ్చెను. కొంతసేపటికి వారు ముష్టి యుద్ధమును గూడఁ జేయఁ దొడఁగిరి. సేవకులెల్లరు రోషన్ ఆరాకు వెఱచి నలువంకలకుఁ బాఱిపోయిరి. ఉదయపురి గడు సుకుమారి యగుటచే నామె దెబ్బల కోర్వలేక కొంతసేపటికి గ్రిందఁబడి మూర్ఛిల్లెను. తత్క్షణముననే దుష్టురాలగు రోషన్ ఆరా ఆమెను ద్వార మావలి కీడ్పించెను. అప్పుడు ఇందిర వచ్చి యామె కుపచారము చేసి మెల్లగ లేవఁదీసి లోనికిఁ గొనిపోయి, శయ్యపైఁ బరుండఁబెట్టెను. ఉదయపురి ఆ కలహములో మిగులఁ శ్రమఁ జెందినందున గాఢమైన నిద్దుర వహించెను.

పిదపఁ దాము గావించిన నేరమునకై రోషన్ ఆరా తమ కెట్టి శిక్షఁ గావించునోయని సేవకు లందఱుఁ బ్రాణములపై నాశవదల్లి

గుండెలు దడదడఁ గొట్టుకొన భీతిల్లుచుండిరి. ధనాశచే వారిట్టి కార్యమున కొడంబడిరి గాని రోషన్ ఆరా తమపాలిట మృత్యుదేవత యను సంగతి వారందఱు నెఱుఁగుదురు. కాని యేకారణముననో ఆమె మాఱుపలుకక, మొగముఁ జిట్లించుకొనుచు మఱలఁ దన గది లోనికిఁ బోయెను.

ఆ మఱుసటి దినమున నుండియు నౌరంగజేబునకు రోగ మించుక కుదురనారంభించెను. క్రమక్రమముగా నౌషధ మొంటఁ బట్టుటయు, నించుక యన్నముపై రుచిగల్గుటయు, తదనుకూలమైన జవము వానికి సంభవించెను. పిదప రెండు మూడు దినముల కాతఁడు శయ్యపైనుండి లేవఁజాలి కొంచెమటు నిటుఁ దిరుగుట కవకాశము చిక్కెను. ఈ సంగతు లుదయపురి విని యమందానంద భరితయయ్యెను. రోషన్ ఆరా చేసినపరాభవ మామెహృదయమున నాటి, యామె నెట్టి సాహసము చేయుటకైనఁ బురికొల్పుచుండెను. ఆ నాఁటిరాత్రి యిందిర తనకుఁ గావించిన సాహాయ్యమునకామె పొందిన యానంద మపరిమిత మయ్యెను. తనకు రోషన్ ఆరాతోఁ బోట్లాట సంభవించినను, మఱియొకతీరున నెన్నక యిందిర నెన్నో విధముల . సమ్మానించెను. అప్పటి నుండియు నుదయపురి యిందిరపై నధికానురాగముగల్గి యే కొంతయుఁ గొరంతయుఁ గల్గనీక, "ఇందిరా! నీవు రాచబిడ్డ వగుటచేఁ గడు సుకుమారివి. ఇంచుకైనను గష్టముల కోర్వఁజాలవు. నీ వేమియుఁ బనులుసేయుట నేరకున్న మానెగాక. నీవు మాత్రము నన్నెడఁబాయక నాయొద్దనే యుండుము. నీ కెట్టిలోపమును రానీయను. ఇంక పాదుషాగారివలన నీ కే భయమును లేదు." అని యనేక విధములఁ బెంచుచుండెను.

ఔరంగజేబునకుఁ బూర్ణముగ నారోగ్యము గల్గి యెప్పటి యట్లు కానున్నను, అప్పుడప్పుడు రాజ్యాంగ విషయములఁ బరిశీలించు చుండెను. తనకు రోగము వచ్చినప్పటినుండియు, తనయెడల రోషన్ ఆరా

చేసిన దురాలోచనములును, రాజ్యార్జనార్థము గావించిన మరాలోచనములును, రాజులకు వ్రాసిన యుత్తరములును, మొదలగు విషయము లన్నియు, నుదయపురి మొదలగువారివలన నెఱింగి, యాతఁడెంతో యాగ్రహము దెచ్చుకొనెను. కాని తనకుఁ జెల్లెలగుటచేతను, నామె వలన ననేక యుపకారములు పొందినవాఁడగుటచేతను, నామె మొగము ముందఱ నేమియు ననఁజాలఁడయ్యె. ఔరంగజేబునకు దేహారోగ్యము గల్గినతరువాత నామెచేసిన కుటిల వృత్తులకు రోషన్ ఆరాను నిందింపని వారెవ్వరును లేరు. ఆమెపై నసూయవహించి పాదుషా యామె మహలులోనికిఁ బోవుట మానివేసెను. రోషన్ ఆరా తన చారులవలన నీ వృత్తాంతములన్నియు నెఱింగి, కీడ్రాలోచనము సేయఁదొడఁగెను. ఉదయపురి తనపై నెన్నియో కొండెమును బన్ని పాదుషాకుఁ జెప్పక మానదని యామె నిశ్చయించుకొనెను. తాను జేయఁదలఁచిన కార్యములలో నొకటియుఁ గొనసాగనందున నామెకు దుఃఖము నాగ్రహముగూడ జనించెను. కావున ఎల్లప్పుడు నామె తనలోనేదియో తలపోయుచునే నుండుచుండెను. ఉదయపురిపై నామెకుఁగల రోస మధికమగుటచే నీయాలోచనము లన్నియు నెందులకో మీరే గ్రహింపఁగలరు. ఆమెపై నెట్లునెనఁ బగ దీర్చుకొనక మాననని రోషన్ ఆరా తనలో నొక ప్రతిజ్ఞఁ జేసికొనియెను. ఉదయపురికిఁగూఁడ రోషన్ ఆరాపై నింత యాగ్రహముండకపోలేదు. కాని ఆమె సేవకులవలెఁ దనసేవకు లంతచాకచాక్యము నన్ని మాయోపాయములు, నెఱిఁగినవారు కారు. అట్లులని యూరకుండక సమయము చిక్కిన నొక్కవలయునని యుదయపురిగూడ వేచియే యుండెను. రోషన్ ఆరావలనఁ దనకపాయము సంభవించునేమో యనుభీతి యుదయపురికిఁగలదు కాని, ఎట్టి మోసము సంభవించినను, కానోపాయము లెఱింగించుటకు తనయొద్ద నిందిర యున్నదికదాయని ధైర్యముతో నుండెను.

# ఇరువదిమూడవ ప్రకరణము

## ఛో టు సిం గు

మనము ఛోటుసింగును కారాగృహం బున విడచి పెక్కుదినములు గావచ్చెను. ఔరంగజేబు వచ్చు చున్నాఁడని వానికంటఁబడకుండ మసావదు, ఛోటుసింగు నొకగదిలోఁ బెట్టి దాఁచి వుంచుట చదువరులెఱుంగుదురు. ఆనాఁడు మసావదేదియో కార్యముమీఁద పోయి ఛోటుసింగు మాట మఱచి రాత్రి తొమ్మిదిఘంటలకు జనానాలోనికి వచ్చెను. ఇంతలో ఛోటుసింగు తనకు జ్ఞప్తికి వచ్చినందున, వానిని తా నుంచిన గదిలోనికిఁ బోయి చూఁచినంతనే ఛోటుసింగు వానికిఁ గానరాఁడయ్యె. మసావదు వానికై కొంతసేపు వెదకి "ఎన్నఁడైన నిట్టి జనానాలు చూచి యెఱుఁగునా యేమి: తన్నెవ్వరేమి చేసెదరోయను భయమున సన్న సన్నగ నెచ్చటికో పాఱిపోయి యుండును." అని తనలో ననుకొని వానివిషయమై ప్రయత్నమ్మును మానుకొనెను.

తొలుత ఛోటుసింగు ఉదయపురిజనానాలోనికి వచ్చుచుండి నపుడు రోషన్ఆరా ముఖ్యసేవకుఁడగు ఫరక్షైరు తనచేత నొక వీణఁ గైకొని వానికెదురై ఛోటుసింగు వ్రాసిన ప్రతిమలుచూచి సంతసించి ఆతఁడు కోరినప్రకారము వీణను వానిచే బాగుచేయించి, యిప్పుడే వచ్చెదనని చెప్పి పోయెనుగదా ? ఫరక్షైరు వీణను గైకొని జనానా లోనికిఁ బోయినంతనే రోషన్ఆరా ఆ వీణనుజూచి "అప్పుడే వీణను సరిచేయించితివా ? ఎంత వేగిరము ? ఓహో ! ఎవ్వఁడోగాని యీ వీణ నెంత బాగుచేసెను ?" అని సంతోషింపఁగా, ఫరక్షైరామాటలు

విని "దేవీ! ఛోటుసింగను నొక చిత్రకారుఁ డుదయపురి మహాలు లోనికిఁ బోవుచున్నాఁడు. వాని సంగతులన్నియుఁ జూడ నాతఁ డవతార పురుషుఁడని తోఁపకమానదు. ప్రతిమలు వ్రాయుటయం దంతటి మహానుభావుఁడు మది పుట్టఁబోవు. ఆతఁడొక దంతపు విసన కఱ్ఱను దయారుచేసి, అందుపై నుదయపురిని, పాదుషాగారిని, ఎంత చమత్కారముగఁ జెక్కెనో చూచి తీరవలయును. ఆ వీవనపై నుదయ పురిని సర్వాభరణములతో నలంకరించినాఁడు. వానికి సంగీతమందుఁ గూడఁ బ్రవేశమున్నట్లున్నది. ఈ వీణ నాతఁడే బాగుచేసెను. తాను గావించిన వీవన నుదయపురికొసంగి యేమైన బహుమానము గొనవలె నని వచ్చినాఁడు" అని ఛోటుసింగు వృత్తాంతమంతయు నెఱింగింప రోషన్ఆరా వానినిఁ జూచి "ఏమేమీ? ఆ ఛోటుసింగునకుఁ గన్నులు నెత్తికెక్కెనా యేమి? తొలుత నాదర్శనముఁజేసి నావలన బహుమాన మొందకుండ నుదయపురి వద్దకేల పోవలయును? ఇదినాకెంత యవ మానకరము? ఇందువలన రోషన్ఆరా తనకంత నీచమైనదనిగదా వాని యభిప్రాయము? ఉదయపురియన్న నల్లాకుఁ గూఁతురను కొనియెను గాఁబోలు?" అని మండిపడియెను. తన ప్రతిమను జక్కఁగా వ్రాసి యిచ్చుటవలన ఛోటుసింగుపై నెంతయో యభిమాన మున్న వాఁడగుటచే ఫరక్ షైరు వాని నెట్టులైన రోషన్ఆరా బారినుండి తప్పింపనెంచి, "దేవీ! ఇంతమాత్రమునఁ దమరాగ్రహము వహింప రాదు. ఆతఁడు తమ దర్శనముగూడఁ జేయవలెనని యెంతో వుత్సాహ ముతో నున్నాఁడు. తమవద్ద కెట్లులైనఁ దన్నుఁ దోడ్కొని పొమ్మని నన్నెంతో, ప్రార్థించినాఁడు. ఇంతియకాక యాతఁడింక నుదయపురి మహాలులోనికిఁ బోయి యుండఁడు. తొలుత తమ దర్శనమునకే వచ్చునేమో? నాకుఁ దెలియదు." అనిచెప్ప, రోషన్ఆరా తన యాగ్రహమున కించుక శాంతిఁ గలుగఁజేసి "ఓరీ! ఫరక్ షైర్!

నీవుపోయి యీ క్షణముననే మా ఛోటుసింగు నచ్చటికిఁ దోడ్కొనిరమ్ము." అని పంపెను. తత్క్షణంబుననే షరక్ఖైరు, రోషన్ ఆరా యాజ్ఞ శిరంబున ధరించుకొని బయలుదేఱి యుదయపురి జనానా వంకకు వచ్చుచు, నాచుట్టును గల ప్రదేశమంతయు వానికై వెదకెను. కాని, యంతకు మునుపే మసావదు ఉదయపురి వద్దనుండి వచ్చి ఛోటుసింగు నామెకడకుఁ గొంపోయినందున షరక్ఖైరు వృథా తిరిగి పోవలసి వచ్చెను. ఆతఁడు మరల రోషన్ ఆరాను సమీపించి తనకు ఛోటుసింగెందును గానరాలేదని భయపడుచు మెల్లగఁ బలికి నంతనే యామె, విపరీత రోషారుణ లోచనయై యప్పుడే తన సేవకులనిరువురను బిలిచి "మీ రిరువురు నుదయపురి జనానా యొద్దకుఁబోయి అచ్చటనే కాచియుండి, ఛోటుసింగు మఱలి వచ్చుచున్నప్పుడు బలిమినిఁబట్టి మన కారాగృహంబునఁ ద్రోయుఁడు. అప్పుడుగాని రోషన్ ఆరా మహాత్మ్యము వానికిఁ దెలియదు." అని యాజ్ఞాపించి పంపఁగా వా రచ్చటికిఁ బోయి ద్వారమువద్ద వేచియుండిరి. కొంతసేపటికి మసావదు వానిని దీసికొనిపోయి పాదుషా వచ్చుచుండెనని సమీపముననున్న యొక గదిలో బెట్టుట వారు చాటుననుండి కనిపట్టి, సాయంకాలమై చీఁకటి పడువఱకు నందేయుండి పిదప రహస్యముగఁ బోయి వాని నోటిలో గుడ్డలు గ్రుక్కి మోసికొనిపోయి కారాగృహమునఁ బడవేసిరి.

పాపము షరక్ఖైరు వానినెట్లులైనఁ దప్పింప వలయునని ప్రయత్నించెను గాని విఫల మనోరథుఁడయ్యెను. అట్లని తన విశ్వాసము ఛోటుసింగు నెడలఁ జూపకుండ నూరకుండలేదు. చెఱసాలలో నున్న వానికిఁ దగిన సదుపాయములు గలుగఁజేయుచు, తఱచుగ నచ్చటికిఁ బోయి వలయు పదార్థములు వాని కొసఁగుచు ధైర్యముఁ జెప్పుచుండెను. ఒక్క షరక్ఖైరే యననేల ? ఛోటుసింగుచే ప్రతిమలు వ్రాయించి పుచ్చుకొని యమందానంద భరితులైన రోషన్ ఆరా సేవకు లందఱుఁగూడ ననేకవిధముల వాని కేకొఱంతయుఁ గల్గనీయక

చెఱలోఁ గాపాడుచుండిరి. కాని అందఱికన్న నెక్కుడుగ ఫరక్ఖైరు ఛోటుసింగు నాదరించు చుండుటచే, వాని విశ్వాసమున కాతఁ డెంతయో సంతసించు చుండెను.

ఇట్లుండ నొకనాఁడు మధ్యాహ్నము రోషన్ఆరా భోజనము చేసినపిమ్మట నొక యాసనముపైఁ గూర్చుండి, కొంతవఱకేమియో తలపోసి ఛోటుసింగును చెఱసాలలోనుండి తీసుకొనిరమ్మని ఫరక్ఖైరున కాజ్ఞాపించెను. తోడనే యాతఁడు పోయి బేగమ్‌గారి సెలవైనది రమ్మని ఛోటుసింగును కారాగృహమునుండి కొనివచ్చి, ఆమె యెదుటఁ బెట్టెను. ఛోటుసింగు తన్నా క్రూరాత్మురా లేమి చేయునో యని తొలుత భీతిఁ జెందెను గాని, మఱలఁ దన హృదయమున ధైర్యము వహించి తన భారమంతయు దైవముపై వైచి యామె కట్టెదుట నిలువఁబడెను. రోషన్ఆరా కొంతవఱకు రెప్పవాల్పకుండ నా పాదమస్తకము వానిని విలోకించి, మాయవేషమును ధరించుకొనిన యొక రాజపుత్రుఁ డీతఁడై యుండవచ్చునని తనలో నిశ్చయించుకొనెను. పరుల యాకారములఁ జూచి వారిని గుర్తించుటయందు, రోషన్ఆరా కెవ్వరును సాటిలేరు. అట్లు చూచి చూచి, యాగ్రహము వహించి, కన్నులెఱ్ఱఁజేసి, వానితో నిట్లు సంభాషింపఁ దొడఁగెను.

"ఓయీ! నీ వెవ్వఁడవు? ఉదయపురి మహాలులోనికిఁ బోవుటకు నీకేమి యవసరమున్నది? మా కెఱింగింపుము.

"అమ్మా! నేనొక చిత్రకారుఁడను, దంతముతో వీవనలు మొదలైనవి చమత్కారముగఁ దయారు చేసి, మీ యట్టి వారికి సమర్పించుకొని అందుమూలమున జీవనము చేయవలయునని వచ్చితిని."

"ఛీ! మూర్ఖా! అనృత మాడకుము. నీ వుదయపురి మహాలులోని కేలపోయితివో చెప్పుము. ఆమెతో నీకేమి సంబంధ మున్నది?"

"ఇప్పుడే చెప్పితిని గదా? దంతముతోఁ జేసిన విసనకఱ్ఱ నామెకిచ్చి యేమైన బహుమాన మొందవలయునని పోయితిని. ఇంతకన్న నిజమేమున్నది? ముమ్మాటికి నిదియ నిజము."

"ఓరి! దుర్మార్గుఁడా! నీకుఁ బ్రాణములపై నాశ కలదేని నిశ్చయమైన వృత్తాంత మెఱింగింపుము. నీ చరిత్రనంతయు మేమిది వఱకే వింటిమి. నీ వెవ్వఁడవో కూడ మే మెఱుఁగుదుము. అయినను నీవు నిజము చెప్పెదవో లేదో యని నిన్నుఁ బరీక్షించుటకై యిట్లడుగు చున్నాము. కాని మాకుఁ దెలియక గాదు. జాగ్రత్త!"

"తెలిసినను తెలియకున్నను, ఇంతియ నిజము. నేనొక నిఱుపేద కుమారుఁడను. జీవనమునకు జరుగక మీాయండిఱ యనుగ్రహమున నీ పట్టణములో నెట్లులైన బ్రతుకవలయునని వచ్చితిని. కాని నేఁటికి నా దురదృష్ట మిట్లున్నది."

"నీకుఁ దగినశిక్ష విధించినఁగాని నిక్కమెఱిఁగింపవని తొలుతనే మే మెఱుఁగుదుము. అయినను, అడిగిన వెంటనే చెప్పిన నీకుఁ గావింపనున్న శిక్ష కొంచెము తగ్గింపవలయునని యెంచితిమి. కాని నీయదృష్టము బాగుగా లేదు. మే మేమి చేయఁగలము?"

అని ప్రక్కకుఁ జూచి "ఫరక్షైర్! వీనిని మరలఁ గారాగృహమున నుంపుము" అని యాజ్ఞాపింప వెంటనే యాతఁడు ఛోటు సింగును గొనిపోయెను. పిమ్మట రోషన్ ఆరా తనలో నేమేమియో ఆలోచించుకొనుచు, చీకాకు పడుచు, కనుబొమ్మలు దరిఁజేర్చి మీాఁది నైపునకుఁ దన దృష్టి సారించి, యెట్లులైన ఛోటుసింగు నాధారముగఁ జేసికొని యుదయపురిపై లేని నేరము లెన్నియేని పన్ని యామెకు పాదుషావలన ఘోరపరాభవము గావింపవలయునని యుక్తులఁ బన్నుచుండెను. వానినిఁ బట్టి కారాగృహమున నుంచుట చక్కని పనియే చేసితిననియు, నీసారి యుదయపురి గర్వమంతయుఁ బూర్ణముగ నశింపఁ గలదనియు నిశ్చయించుకొని, ఫరక్షైరును రావించి "ఓరీ! నీవు పోయి పాదుషాగారి నొకసారి యెట్లున్న నట్లు రావలసినదని నేను చెప్పినట్లు చెప్పి త్వరగా దీసికొని రమ్ము" అని యాజ్ఞాపింప ఫరక్షైరు వెంటనే పోయి, కొంతసేపటికి మరలి వచ్చి, "అమ్మా!

పాదుషాగా రుదయపురి మహాలులో నున్నారు" అనిచెప్పెను. ఆ మాటకు రోషన్ ఆరా, మిక్కిలి కోపము దెచ్చుకొని "ఓరీమూర్ఖా! ఆతఁడు వచ్చువఱకు నచ్చట వేచి యుండక మరల నేల వచ్చితివి?" అని వానినిఁ గొట్టఁబోయెను. ఫరక్ షైరు భయపడి మరలఁ బరుగునఁ బోయి, యుదయపురి జనానా వద్ద వేచియుండెను.

ఆనాఁడు ఔరంగజేబు రాత్రి యగు వఱకుఁ బైటకురాలేదు. అంతవఱకు నాతఁడచ్చటనే యుండి, పాదుషా రాకఁజూచి సలాము చేసి, రోషన్ ఆరా చెప్పిన మాటలు చెప్పెను. అందులకు పాదుషా "సరే! యిప్పుడు తొందరగాఁ బనిఁ బూని పోవుచున్నాను. ఒక గంటలో నచ్చెదనని చెప్పుము." అని వాని నంపివేసెను. ఫరక్ షైరు పోయి, రోషన్ ఆరా కాసంగతి యెఱింగింప నామె యమితాగ్రహ మొంది తనలోనే మేమో గొణుఁగుకొనుచు వాని నావలికిఁ బొమ్మని చీకాకుతోఁ జెప్పెను.

# ఇరువదినాల్గవ ప్రకరణము

## జు ట్టు ప న్ను

ఔరంగజేబెప్పటివలె నారోగ్యవంతుఁడై సుఖముగా నుండెను. ఎట్టి యాయాసమును లేకుండ నెప్పటి వలె తనకార్యములన్నియు నాతఁడు నిర్వర్తించుకొనుచు, రూపనగరముపైఁ బంపుటకుఁ గ్రొత్త సైన్యముల నేర్పాటుసేయుచుండెను. తన కారోగ్యము గల్గిన తరువాత నాతఁడు వైద్యుల కెంతయో ధనము బహుమాన మిచ్చుటయే కాక, దానములు, ధర్మములు ననేకములు గావించి, ఫకీరులకుఁ దృప్తిగ విందులు చేయించి, క్రొత్తక్రొత్త మసీదులు గట్టించి విశేషధనము ఖర్చుపెట్టెను. తన కింతరోగము వచ్చుటకుఁ గారణము, హిందువుల దృష్టి దోషమువలననే యని యెంచి తనకు వ్యయమైన ధనమంతయు వారినుండి గ్రహింప నెంచి, "జిజియా" యను జుట్టుపన్ను నొక దాని నేర్పఱిచెను. ఈ పన్ను జుట్టుగల ప్రతి మనుష్యుఁడు నిచ్చుకోవలసిన దగుటచే, ఆబాల వృద్ధ పర్యంతమును హిందువు లందఱును జెల్లింప వలయుననియు నణుమాత్రమైన జుట్టులేని వారగుటచే మహమ్మదీయు లీయనవసరము లేదనియు, నెంచి దీనిని "జుట్టుపన్ను" అని సార్థక నామకరణ మొనర్చితిమి. ప్రతి హిందువును, బీదవాఁడైనను గొప్పవాఁడైనను, తనకు గొన్ని రూకలు చెల్లింపవలయునని పాదుషా కఠినముగా విధించెను. కొందఱు నిఱుపేదలందులకు సమర్థులు గానందునఁ దమయిండ్లలోని సామగ్రి విక్రయించి యా ధనము వాని కొసంగు చుండిరి. తనయాజ్ఞ ప్రకారము జుట్టుపన్ను

చెల్లింపనివారి యిండ్లలోఁ బ్రవేశించి, వారి సామానులు కొల్లగొనవలయునని చెప్పి, పాదుషా తన సేవకులచే హిందువులకనేక బాధలు కల్గించుచుండెను. ఇంతియకాక, తన భటులను ప్రతి గ్రామమునకుఁ బంపి బలవంతముగ నాతఁడు జిజియా వసూలు చేయించుచుండెను. లక్షలకొలఁది జనులిది యన్యాయమని వానితో మొఱ పెట్టుకొనిరి. పాదుషాకు ప్రతిశుక్రవారమును జుమ్మామసీదునకుఁ బోవుట ఆచారమై యుండినందున, ఆనాఁడు బ్రాహ్మణులందఱు సంగవస్త్రములు గట్టుకొని, పంచాంగము కట్టలఁ జేతుల నిడికొని మార్గమధ్యమున వానికెదురై, దుర్భరమైన జిజియాపన్ను నూడఁదీసి బీదకుటుంబముల నెట్టులైనఁ గాపాడవలయునని మనవిఁ జేసికొనిరి. కాని పాదుషా వారి మాటలఁ బెడచెవినిఁబెట్టి, యాగ్రహము వహించి, యా బ్రాహ్మణోత్తముల నేనుఁగులచేఁ ద్రొక్కించెను. తత్కారణమున హిందూ సంఘమునకెల్ల నొక్కసారిగ వానిపై ద్వేషమంకురించెను.

జిజియాపన్ను నొసంగక పాదుషాతో నకారణ కలహమేల తెచ్చుకొనవలయునని యెంచి, ఆల్వార్ భరతపుర జయపుర బుందీ ప్రభృతి సంస్థానాధిపులు వానికి ముడుపులు సమర్పించుకొనిరి. కాని ఉదయపురనాథుఁడగు రాజసింహుఁడు మాత్రము పన్ను నడుగవచ్చిన తురకల నదిలించి, వారిని తన గ్రామమున నుండనీయక వెళ్లఁగొట్టెను. రాజసింహుఁడన్న ఔరంగజేబునకుఁ బ్రక్కలోని బల్లెము గావున పాదుషా వానిపై క్రోధమువహించియు న్నప్పటికి మాత్రమేమియుఁ జేయ నేరకూరకుండెను.

బ్రాహ్మణుల నేనుఁగులచేఁ ద్రొక్కించుటయు బీదసాదల నుండి జిజియాపన్ను బలవంతముగ వసూలు సేయుటయు, మొదలుగాఁ గల పాదుషా క్రూరకృత్యములన్నియు నాలకించి, రాజసింహుఁడు వానిపై నెంతయుఁ గ్రోధము వహించి హిందువుల దురవస్థకు జాలి

వహించి, ధర్మమార్గ ముపదేశించుచు నొకయుత్తరము వ్రాసినప్పటి
కైన పాదుషా తన దుష్కార్యములు విడిచి సన్మార్గపరుఁ డగునేమో
యని యెంచి వారికిట్లొక జాబు వ్రాసి యంపెను.

" ......... నేను మీ రాజసభకు వచ్చుట మానివేసితిని, రాజభక్తితో మీ కేప్పుడును, సాహాయ్యము చేయవలయుననియే యున్నది. కాని మీకు నే నొనరించు సాహాయ్యము హిందూదేశము లోని రాజులందఱకును, సరదారులకును, సంస్థానికులకును, నవాబులకును ఉపయోగకారియై వారియాత్రి తావస్థకుఁ గారణము కావలయును. ఇంతియకాదు. నేనుచేయు సహాయము ఈరాన్ (పర్శియా) తురాన్, రూమ్, (టర్కీ ఇన్ యూరోప్), శామ్ (టర్కీ ఇన్ ఏసియా) మొదలైన సప్తద్వీపములలోని, జనులకును జలస్థలమార్గములఁ బ్రయాణముచేయు బాటసారులకును ఉపయోగించి, వారందఱకును అభేద బుద్ధితో నావలని మేలు కలుగవలయునని నాయొక్క కోర్కి .........మీ పూర్వజుఁడైన మహమ్మద్ జలాలుద్దీనుయొక్క కీర్తిడిండిమ మిదివఱకును లోకమునందంతటను ప్రతిధ్వని లీనుచున్నది. ఇందులకుఁ గారణమేమి? అతఁడు సర్వ జనులయెడ సమదృష్టియుంచి యేఁబదిరెండు సంవత్సరములు రాజ్యముచేసి యక్షయ సుఖస్థానమునకుఁ బోయెను. వీఁడు బ్రాహ్మణుఁడు, వీఁడు హిందువు, వీఁడు మహమ్మదీయుఁడు వీఁడు జైనుఁడు, వీఁడు క్రైస్తవుఁడు అను భేదముచేయక యన్ని మతములవారికిని, అన్ని జాతులవారికిని, సౌఖ్యము కలుగునట్లు రాజ్యముచేసెను. ఆతనికిఁ బక్షపాతము లేనందుననే "జగద్గురు" వను సార్థక నామమువచ్చెను. పక్షపాత రహితప్రవర్తనమును గుఱించిన పాఠమును సకలలోక మాతనియొద్దనుండి నేర్చుకొనఁదగు ......... ఇఁక మీ రాజ్యమును జూచినచో, మీ ప్రవర్తనవలన మీ ప్రజలు, మీ స్నేహితులును మీకుఁబ్రతికూలులునైరి. ప్రతి మనుజునికిని

మీవలన నష్టము కలుగుచున్నది. ఎక్కడఁ జూచినను, దోచుకొనుట, దాఁచుకొనుట గానవచ్చుచున్నది. మీ ప్రజలందఱును, అణఁగఁ ద్రొక్కఁబడుచున్నారు; మీరాజ్యములో ప్రతి ప్రాంతము దారిద్ర్యము నందు మునిఁగియున్నది......ఇఁకఁ బరాక్రమ మున్ననో సున్న! కళాకౌశల్యములను గుఱించియు, వర్తకమును గుఱించియుఁ జెప్ప వలసినది లేదు. మీ రెవ్వరినిగుఱించి మిక్కిలి యభిమానముగా నుండెదరో, యట్టి మహమ్మదీయులుకూడ సంతుష్టులయి యున్నట్లు గానరాదు. మీ రాజ్యమునం దెటు చూచినను, హిందువుల రోషము, మహమ్మదీయుల యసంతోషము వర్తకుల వినాశము, సరదారుల దారిద్ర్యము, సైన్యముల శౌర్యహీనత, యివితప్ప నేమియుఁ గాన రావు.........మీరాజ్యములోని హిందూప్రజల కెవ్వరికిని సాయం కాలము భోజనముసేయునంత స్థిరతయు నుత్సాహంబును లేవు. రాజులవలనఁ బ్రజలకుఁ గలుగు బాధలలో నింతకంటె నెక్కుడు బాధ మఱియేదికలదు? ఇట్టి ప్రజాపీడన కరమైన స్వైరవర్తనముచే మీ రాజ్యమును, సార్వభౌమ పదవియు, నెట్లు నిలుచును? మీరు మీ దరిద్రప్రజలనుండి బలవంతముగా ధనము లాగుచున్నారు. అది మీ కనుకూలముగాఁ బరిణమించునా? బీద బ్రాహ్మణులు, సన్యాసులు, బైరాగులు, మొదలైన యసంసారులగు జోగులయొద్దనుండి పన్ను తీసికొని వారిని బాధపెట్టుచున్నాఁడని మీకీర్తి పూర్వపశ్చిమ దిఙ్మండలములంతయు, వ్యాపించియున్నది. ఈమాట నిజమే యైన యెడల, శౌర్య పరాక్రమౌదార్యములకు విఖ్యాతిఁజెందిన తైమూర్ లంగ్ వంశమున జన్మించిన మీరు వనవాసులును, ఉదాసీనులును, నిరుపద్రవులును, దరిద్రులును, అగు జనులను దోచుకొనుటకంటె నధమ మైనదియు నీచమైనదియునగు వృత్తి మఱియేదికలదు?

మీ రేగ్రంథమును ఈశ్వరదత్త ధర్మ పుస్తకముగా నెంచె దరో యందుఁ జూచినయెడల నీశ్వరుఁడొక మహమ్మదీయుల దేవుఁ

కాక సమస్త మానవుల దేవుఁడని మీరుఁ దెలియఁగలరు. ఈశ్వరునకు మహమ్మదీయులును తదితరులును సమానులు. మానవుల శరీర వర్ణములలోను, స్వరూపములలోను, భేదముండుట ఈశ్వరుని సృష్టి నియమము. వానిసత్తా మాత్రముననే మానవునకు అస్తిత్వము (ఉనికి) ప్రాప్తించును. మీ శూన్యమందిరములలో (మసీదులలో) మీరు జేయుప్రార్థన యాతఁడు వినును; విగ్రహములుగల గుళ్లలో గంట వాయించి చేయఁబడు పూజయు నాతఁడే గ్రహించును. ఇతరుల ధర్మమును గుఱించియు, నాచార వ్యవహారములను గుఱించియు, దురాగ్రహము గల్పించుకొని వారిని బాధించుట ఈశ్వరునకు నసమ్మతము. పటమును వ్రాసిన చిత్రకారునియెదుట, నా పటమును త్రొక్కి చింపివేసినయెడలనాతని కెట్లు కోపము వచ్చునో, యట్లే యితర మతము లను ద్వేషించుట ఈశ్వర క్షోభమునకుఁ గారణము. ఈశ్వరుఁడు అద్వితీయుఁడును, అప్రతిముండును అగునొక చిత్రలేఖకుఁడు. అతఁడీ విశ్వమును విస్తీర్ణ పటముమీఁద నానా మతాచారములు, వివిధ మనుష్య జాతులు, మొదలగు చిత్రములఁ జిత్రించినాఁడు. అందలి కొన్నిటియెడ ద్వేషముపూనుట ఆసృష్టికర్తను ద్వేషించి యాతని కోపమునకు బాత్రులగుటయే. న్యాయ దృష్టిచే విచారించినయెడల మీరు హిందువులపై వేసినపన్ను కేవల మన్యాయము. నిజమైన రాజ్యకర్తృత్వమును, నీతియు, మీయందు లేనందునకు నిది నిదర్శనము... ...

ఆ యుత్తర మంతయుఁ బూర్తిగఁ జదువుకొని పాదుషా మండిపడుచు, పండ్లు పటపటగొఱికి తన పాదములతోఁ గట్టిగ నేలఁ దన్నుచుఁ దన యాగ్రహమంతయు వెల్లడించెను. అదివఱకే రాజసింహుఁడు చంద్రావతీరక్షణార్థము సైన్యము లంపుటయు, విజయసింహునకు సాహాయ్యముగ రూపనగరమునకు రానుండుటయు, పన్ను నొసంగక తన భటులను బరిభవించుటయు మొదలుగాఁగల సంగతులన్నియు

నింధములై పాదుషా రోషానలంబును నలువంకలఁ బ్రజ్వలింపఁ జేసెను. రాజసింహు నణఁగఁ ద్రొక్కకున్న నిట్లే మాటిమాటికిని దన కార్యముల కడ్డుపడుచు విఘ్నములు గలిగించు చుండునని యెంచి పాదుషా తద్విషయమై శ్రద్ధతో సైన్యముల సిద్ధముఁ జేయుచుండెను. ఆతఁడు గావించు సమర సన్నాహ మంతయు ముఖ్యముగ రాజ సింహుని నాశము సేయుటకే యైనను, పాదుషా తన యుద్దేశమును తనకుఁ దప్ప నితరులకుఁ దెలియనీయక పైకి మాత్రము రూపనగర ముపై దాడివెడలుట కని చెప్పుచుండెను.

రాజసింహుఁడు పాదుషాయుద్యమ మంతయును దెలిసికొని అతని యుద్దేశ మెప్పటి కెట్లుండునో యని తలఁచి, వివేకవంతుఁ డగుటచేఁ దానుఁ గూడ మున్ముందుగ నందులకుఁ దగిన ప్రయత్న ములలోనుండి, తన కార్యమునకుఁ దోడు రావలయునని రాజుల కందఱకు నుత్తరములు వ్రాసెను. ఆతని గౌరవమును పరాక్రమమును నెఱిఁగిన వారగుటచే రాజపుత్రులు అనేకులు వానికి సహాయులగుటకు సమ్మతించిరి.

# ఇరువదిదియైదవ ప్రకరణము

## గోలకొండ

అరుణోదయమై తూర్పునఁ దెల తెల వాఱుచుండెను. శుకపిక శారికాది పక్షులన్నియు నస్పష్ట మధుర నాదములతో గానము చేయఁదొడఁగెను. తూర్పుదిక్కున నాకాశమంతయుఁ జిత్ర విచిత్రములయిన రంగులతో నిండి చూచువారి కమితాహ్లాదమును కలిగించుచుండెను. నిముసములో నీలమురంగును, క్షణములో నెఱ్ఱసిరంగును, గడియలోఁ బసుపుపచ్చని రంగును – ఇట్లు అసంఖ్యములయిన వర్ణములుగా మాఱి, యాకాశమంతయు నొకప్పుడు సువర్ణమయముగను, మఱియొకప్పుడు వెండి పూఁతపూసినట్టులును, ఇంకొకప్పుడు ఇంద్రధనుస్సునందుఁ గానవచ్చెడి వివిధవర్ణముల మిశ్రణముచేఁ జిత్రించినదిగను గానవచ్చుచు నుషఃకాలమున లేచి తూర్పువంకఁ జూచువారి కన్నులకుఁ గనుపండుగు చేయుచుండెను. పచ్చని తివాసీల మీఁద రవలు వెదచల్లఁబడినట్లు సమభూముల మీఁది పచ్చికలపై హిమబిందువులు తళతళ ప్రకాశించుచుండెను. దారము కత్తిరింపఁబడి నందున హారములోని యొక్కొక్క ముత్యము టప్ప్ టప్ప్, అని క్రిందఁబడినట్లు వృక్షముల మీఁది హిమంబువులు క్రిందఁ బడుచుండెను. తెరచాటునకుఁ బోవు నాటక పాత్రములవలె నాకసములోని చుక్క లొకదాని తరువాత మఱియొకటి క్రుంకు చుండెను. చంద్రుఁడు కాంతి తగ్గి, రాత్రియంతయు విశ్రాంతి లేక పనిచేసిన వాఁడు సొమ్మసిలినట్లు వెల వెలఁ బాఱఁజొచ్చెను. లోక బాంధవుని రాక ఆతని సారథియైన యరుణునివలనఁ దెలిసికొని

మూ చీకట్లు దిగంతములకుఁ బాఱిపోవు చున్నందునఁ గ్రమక్రమ ముగా వెలుతురు హెచ్చుచోడఁగెను. చల్లని తూర్పుగాలి మెల్ల మెల్లగా విసరుచు నొడలెఱుంగక నిద్రించు వారిని లెమ్మని లేపు చుండెను. హిందూ దేవాలయములలోని ఘంటానాదములును ప్రాభోధిక ప్రార్థనలును, తురకల మసీదులలోని నమాజుధ్వనులును స్పష్టముగా వినవచ్చుచుండెను.

అట్టి ప్రాతఃకాల సమయమునందు, గోలకొండ పట్టణమునకు నైలుదూరమున నున్న తోఁటలోని కొలనిలో నొక బ్రాహ్మణుఁడు 'జయ్ శంకర్, జయ్ మహాదేవ్,' అని నామస్మరణ చేయుచు స్నానము చేయుచుండెను. తెల్లని చంద్రకాంత శిలలతో గట్టఁబడిన మెట్ల మీఁదఁ గూర్చుండి శరీరమంతయు శుభ్రముగ దోముకొని యథేష్టముగా స్నానముచేసి గట్టుమీఁదికి రాఁగానే యచ్చటఁ గునికి పాట్లు పడుచున్న యాతని శిష్యుఁడదరి లేచి తన యొద్దనున్న మూట గురువుల వారి కందిచ్చెను. అందుండి యా బ్రాహ్మణుఁ డొక బట్టఁ దీసి యొడలు తుడుచుకొని యొక దోవతి కట్టెను. తరువాత భస్మము తీసికొని ముఖమునను, దేహమునను, త్రిపుండ్ర రేఖలు ధరించెను. మెడలో రుద్రాక్షమాల వేసికొని, శిరస్సునకు సాలువు చుట్టి, యా బ్రాహ్మణుఁడు హిందూస్థాని భాషతో 'మనము సూర్యోదయ మగువఱకు పట్టణముఁ జేరవలయును' అని శిష్యునితోఁ బలికి, వెంటనే బయలుదేఱెను. శిష్యుఁడును గురువులవారు విచ్చిన దర్భాసనము మూటను మరల గట్టి చంకలోఁ దగిలించుకొని గురువులవారి వెంట వెడలెను. ఇట్లు తొందర తొందరగాఁ బోవుచున్న గురుశిష్యుల కిట్లు సంవాదము జరిగెను.

"గురూజీ! ఇది కుతుబ్ శాహి యనఁబడు తురుష్కుని రాజ్యము. ఇందు మీరు శుద్ధ శ్రోత్రియ బ్రాహ్మణునివలెఁ దిరుగు చుండిన మోసము కలుగునేమో యని భయము కలుగుచున్నది"

"గట్టూ! ఇచ్చటి నవాబగు 'తానీషా' యొక్క వృత్తాంతము నీ వెన్నఁడును వినలేదా యేమి? ఆతఁడు తురుష్కుఁడయినను బ్రాహ్మణులకంటెఁ బవిత్రాచరణము కలవాఁడు. వీరు తురుష్కులనియు వీరు హిందువులనియు భేదము లేక ప్రజలనందఱను బుత్రులవలెఁ బాలించుచుండును. ప్రజల కష్టసుఖములనే తన కష్టసుఖములుగా నెంచుచుండెను. ఇతఁడు మౌలవీలను, బ్రాహ్మణులను, ఫకీర్లను సన్న్యాసులను సమాన భక్తితో నాచరించుచుండును. ఇట్టి రాజు తురకయైననేమి? హిందువైన నేమి?" మరియెవ్వఁడైన నేమి?

"గురూజీ! ఈతఁడు తురక యయ్యును ఇట్టి సత్త్వగుణములు కలవాఁడగుటకుఁ గారణమేమి?"

"వేఱు కారణమేమున్నది? పూర్వపుణ్య సంచయము. పెద్దలీతని విషయమై యొక కథ చెప్పెదరు. ఇతఁడు పూర్వజన్మమందు బ్రాహ్మణుఁడు. సర్వేశ్వరుఁడగు శివునిఁ గూర్చి పండ్రెండు సంవత్సరములు తపస్సు చేసెను. ఎంతకును శివుఁడు ప్రత్యక్షము కానందున విసిగి యొక నాఁడితఁడు అభిషేకమునకై నింపి తెచ్చిన కడవ లింగమూర్తి శిరస్సుపై నెత్తివేసెను. అంత శివుఁడు ప్రత్యక్షమై నీకు ఏమి కావలెనని యడుగఁగా 'రాజ్యము కావలయు' నని యాతఁడడిగెను. అంత పార్వతీ ప్రియుఁడు 'నీవు కొలఁదికాలము శాంతి వహించియున్న యెడల నేను ప్రత్యక్షమై యుందును. కొలఁదిలో తొందరపడితివి. కావున నీకోరిక యీ జన్మమున ఫలింపదు. రాఁబోవు జన్మమందు నీవు తురుష్కుఁడవై పుట్టి గొప్ప రాజ్యవైభవము ననుభవించెదవు.' అని చెప్పి జగదీశ్వరుఁ డంతర్ధానముఁ జెందెను. ఆ బ్రాహ్మణుఁడే యిప్పుడు తానీషాయై పుట్టెను."

ఈ కథ విని యెంతయు నాశ్చర్యముఁ జెంది శిష్యుఁడు.

"గురూజీ! ఆమహానుభావునిఁ జూచుటకేనా మనమిప్పుడు వెళ్లుట?"

"కాదు. కాదు. నవాబుతో మనకిప్పుడు పనిలేదు. అతని ముఖ్య మంత్రియు, రాజకార్య ధురంధరుఁడును, హిందూ మతాభిమానియునగు మాదన్న పంతులవారిని జూచినఁ జాలును. ఆతనియొద్దకే మనమిప్పుడు వెళ్లుచున్నాము. ఇట్లు మాటలాడుచుఁ బోయిన లాభము లేదు. సూర్యోదయము మొదలుకొని జాము ప్రొద్దెక్కువఱకు నా మహానుభావుఁడు శివపూజ చేయుటయు పురాణము వినుటయు మొదలయిన మత విషయక కార్యములను చేయును. ఆ కాలమందుఁ బండితులును, విద్వాంసులును, గవులును, గాయకులును, నిరాటంకముగా నచ్చటికిఁ బోవచ్చును; తమ తమ విద్యాప్రభావముఁ జూపి బహుమతులు వడయవచ్చును. కావున త్వరత్వరగా నడువుము."

అని యా శ్రోత్రియ బ్రాహ్మణుఁడు మిక్కిలి వడితో నడవసాగెను. పాపమానడి వయస్సులోనున్న కుఱ్ఱవాఁడుకూడ నాముసలివానితో సాటి నడువలేక పరుగెత్తసాగెను. వారిట్లు పోయి పోయి యూరు సమీపింపఁగా వారికి మిక్కిలి పెద్దదియగు భవనమొకటి తగిలెను. ఆయింటికిఁ జుట్టును తాటిచెట్టంత యెత్తుగల రాతిగోడ యుండెను. ఆ గోడమీఁదినుండి మనుష్యులు దాఁట కుండఁగఁ గాఁజులును మీఁదిభాగమున గాజు తునుకలు గ్రువ్వఁబడి యుండెను. ఆ భవనమునకు నినుముతోఁ జేయఁబడిన పెద్దద్వారమొకటి వుండెను. అది యమదూతలకంటెను నతి భయంకరులై పగలుచూచిన రాత్రి కలలోనికి వచ్చు సిద్దీభటులచే సురక్షితమై యుండెను. తొందరతో వెళ్లుచున్న మన శ్రోత్రియ బ్రాహ్మణుఁడు మొదట నా భవ్యమందిరమును గాని ఆ యమభటులనుగాని, చూడకయే పోవుచుండెను. కాని యింతలో నామందిరములోనుండి.

"అంతా రామ మయం – బీజగ – మంతా రామమయం ॥అంతా॥
అంతరంగమున – నాత్మారాముఁడ

నంత రూపమున - వింతలు సలుపఁగ ॥నంతా॥
సోమ సూర్యులును - సురలు తారలును
ఆ మహాంబుధులు - నవనీ జంబులు ॥అంతా॥
అండాండంబులు - పిండాండంబులు
బ్రహ్మాండంబులు - బ్రహ్మలు మొదలుగ ॥అంతా॥
నదులు వనంబులు - నానా మృగములు
విదిత కర్మములు - వేద శాస్త్రములు ॥అంతా॥
అష్ట దిక్కులు - నాది శేషుఁడును
సప్త వసువులు - సరి షడ్వర్గము ॥అంతా॥
ధీరుఁడు భద్రా - చలరామదాసుని
కోరిక లొసఁగెడు - తారక నామము ॥అంతా॥ "

అను కీర్తన విష్ణుభక్తియందును సాహిత్య విద్యయందును అపారప్రేమ గలవాఁడెవ్వఁడో పాడుచున్నట్లు వినఁబడెను. మన శ్రోత్రియ బ్రాహ్మణునకుఁ దెలుఁగు దెలియకపోయినను పైకీర్తనలోని వన్నియు సంస్కృతపదములయి నందున దాని తాత్పర్యము గ్రహించి భక్తాగ్రేసరుఁ డెవ్వఁడో లోన నున్నాఁడని తలఁచి యాతఁ డా భవన మెట్టిదని చక్కఁగఁ బరికించెను. దాని లక్షణములనుబట్టి వెంటనే యాతఁడది కారాగృహమనియు నెవ్వఁడో భక్తుఁడందుఁ జిక్కెననియు నూహించి, వివరము తెలిసికొనవలెనని, పహరాయిచ్చు సిద్దీవాండ్ర యొద్దకుఁబోయి లోనఁ బాడుచున్న వాఁడెవ్వఁడని యడిగెను. మొదట వాండ్రా బ్రాహ్మణుని బెదరించి యదల్చిరి. కాని మన శ్రోత్రియ బ్రాహ్మణుఁడు జగత్తును చక్కఁగ నెఱిఁగినవాఁడు కావున, వెంటనే యొక రూపాయితీసి వారిచేతిలోఁ బెట్టెను. ఆ తెల్లదేవత పూనిన తోడనే భట్టుల కోప తాప హావభావము లెట్లో పాఱిపోయి వాండ్రు బ్రాహ్మణుని దాసులై "ఈ పాడుచున్నవాఁడు భద్రాచలము

చెప్పుచున్నారు. ఆతఁడేదో యొక హిందూరాజ్యమును వంచుటకు యత్నించుచున్నాఁడన్నమాట వాస్తవము. కావున హిందూరాజ్యముల కన్నిటికిని ఈ వార్త తెలిపి జాగ్రత్తగా నుండవలసినదిగాఁ జెప్పుట యొక పనిగాఁ బెట్టుకొని నేను బయలుదేఱి రాజపుత్ర రాజుల కందఱకుఁ జెప్పి, బుందెలు ఖండములోని ఛత్రసాలు మహారాజును, పనహాళా దుర్గము మీఁది శంభాజీ మహారాజును, మందలించి యిచ్చటికి వచ్చినాను. ఇచ్చట బ్రాహ్మణ ప్రభువులగు మీరు సర్వాధికారులుగ నుండుట వలనను నవాబుసజ్జనుఁడై హిందువులను తురుష్కులను సమానముగాఁ జూచు చున్నందునను ఈ రాజ్యమును నేను హిందూరాజ్యముగానే భావించెదను. కావున ఈ సంగతి చెప్ప వచ్చితిని మీతోఁ జెప్పి నాఁడను ; నాపని తీరినది. నేనువెళ్లు చున్నాను. ఊరక యున్న యెడల మీ దర్శనము కాదని మీ పూజా సమయమున నా విద్యను జూపి మీ దృష్టి నాకర్షించితిని. ఇంతియ గాక నాకు వేఱు మనవిలేదు."

ఆ బ్రాహ్మణుఁడు తమ యనుగ్రహమును కోరి వచ్చినాఁడను కొని చూడఁగా నాతఁడు తమ్మనే యనుగ్రహించుటకు వచ్చిన సమాచారముఁ జూచి యక్కన్న మాదన్నగార్లు ఆశ్చర్యాతిరేకము చేత నేమియుఁ జెప్పఁదోఁపక అర్థపూర్ణ దృష్టితో నాబ్రాహ్మణుని వంకను ఒకరి వంక నొకరును కొంతసేపు చూచుచునుండిరి. తరువాత అక్కన్నగా రిట్లనిరి.

'అయ్యా! బ్రాహ్మణోత్తమా! నీవు మాకు మనుష్య మాత్రుఁడవుగాఁ గాన్పించుట లేదు. మమ్మనుగ్రహింప నవతరించిన దేవగురువు బృహస్పతి వలె నున్నావు. నీ నామమును నీవు వాస ముండుటచేఁ బవిత్రమైన స్థలమును మాకుఁ దెల్పి మమ్ముఁ గృతార్థులఁ జేయఁ బ్రార్థితుఁడవు.'

'మంత్రిశ్రేష్ఠులారా? నా కులగోత్రములతోడను ఊరుపేరుల తోడను, మీకు నేమి ప్రయోజనము? నేను చెప్పిన విషయమును

గుఱించి మీరు తగు జాగ్రత్తతో నుండినఁ జాలును. నేను వచ్చినపని యైనది. వెళ్లివచ్చెదను.'

అని ప్రత్యుత్తరమిచ్చి యా శ్రోత్రియ బ్రాహ్మణుఁడు ప్రయాణమయ్యెను. ఒక్కదినమైనను ఉండి తమ యాతిథ్యముఁ గైకొని నవాబుగారిని సందర్శించి తగిన బహుమతిని బడసి వెళ్లవలసిన దని అక్కన్న మాదన్నగార్లెంత బలవంతము చేసినను వినక ఆ మొండి బ్రాహ్మణుఁడు వెంటనే బయలుదేఱెను. అంతకుఁ బూర్వము గ్రామములోని రాజపుత్రులను గుఱించిన యోగక్షేమము వారికిఁ దెలియకుండఁ గనుఁగొని రమ్మని పంపఁబడిన శిష్యుఁడువచ్చి గురువుల వారిని కలసికొని వారిద్దఱును వచ్చినత్రోవనే పోయిరి.

అద్భుతుఁడైన యా బ్రాహ్మణుఁడు వెళ్లినతరువాత అక్కన్న మాదన్నగార్లకిట్టి సంభాషణ జరిగెను.

'అన్నా! ఈ బ్రాహ్మణుని చర్యలన్నియు నద్భుతముగ నున్నవి. పేరు చెప్పఁడు ఒక కాసైనను తీసికొనఁడు. ఉండుమన్న నుండఁడు. ఇందు మోసమేమైనను ఉండదుగదా!'

"అబ్బాయి! నీ కేప్పుడును సందేహములే. ఈ బ్రాహ్మణుఁడు చెప్పినమాటలలో మోసమునకు తావేలేదు. అవురంగజేబు సైన్యము లను చేర్చుచున్నాఁడు. ఎవరిమీఁదికి నే సమయమున వచ్చునో తెలియదు. జాగ్రత్తగానుండుఁడని చెప్పెను. ఇది మనమీఁద నుపకారముగాని మోసముకాదు."

'నాకును మీవలెనే మోసముకాదని తోఁచుచున్నది; కాని రాజ్యాంగవిషయములను గుఱించి విచారించు నప్పుడు మన మన్ని విధములయిన వికల్పములను చర్చింపవలయును.'

'అబ్బాయి! సంశయముమాని ఆ బ్రాహ్మణుఁడు సూచించి నట్లు మనము క్రొత్తసైన్యము చేర్చుకొని యుద్ధమునకు సిద్ధముగా నుందము, సందేహము మానుము.'

'అట్లుగాదు. గోలకొండ మీఁదికి దండెత్తివచ్చుటకు అవురంగ జేబు ఎదురు చూచుచున్నాఁడని మీ రెఱుఁగుదురు. కాని యాతనికి గారణమేమియుఁ గానవచ్చుటలేదు. కావున నిది యాతఁడు చేసిన యుక్తి కాదుకదా!

'నీ మాటకు నాకర్థము తెలియకున్నది.

'ఈ బ్రాహ్మణుఁడు వచ్చి యీప్రనివలెఁ జెప్పిన మాటలువిని మనమొక గొప్ప సైన్యమును సిద్ధపఱుచుకొనినయెడల నదియె సాకుగఁ జేసికొని, మనమీఁదికి రావచ్చునని ఔరంగజేబుచేసిన యుక్తియేమో యిదియని నాకు సంశయము కలుగుచున్నది. అనావశ్యకముగా ఢిల్లీశ్వరునివంటి శత్రునిఁబిలిచి యింటి మీఁదికిఁ దెచ్చుకొనుట మంచిది కాదుగదా!'

'నీయూహ దారముపట్టుకొని స్వర్గమునకుఁ బ్రాఁకినట్లున్నది. నీయూహ నిజమైనను మనము యుద్ధసన్నాహముఁ జేయకతప్పదు. ఎన్ని లక్షల సైన్యము కావలసినను పది దినములలోఁ గూర్చెదను.'

'సరి! మీకుఁ దోఁచినట్లే చేయవచ్చును. కాని కొన్నిదినముల వఱకును లోలోపలనే చేయవలసినది. ఇంతలో నొక చారునిఁబంపి ఢిల్లీలోని నిజమైన వృత్తాంతము తెలిసికొందము. అచ్చటి సమాచారము తెలిసిన తరువాత బహిరంగముగా యుద్ధసన్నాహము చేయ వచ్చును.'

ఇట్లు సంభాషించుకొని యా మంత్రిపుంగవులు ఢిల్లీ కెవ్వనిఁ బంపఁదగునోయని యాలోచించి తమ యొద్దనున్న రూపసింగ్ అను రాజపుత్ర సరదారునిఁ బంప నిశ్చయించిరి.

రూపసింగు ముప్పది ముప్పదిరెండు సంవత్సరముల వయస్సు గలయొక రాజపుత్ర వీరుఁడు. పది పండ్రెండు సంవత్సరములక్రింద రాజపుత్రస్థానమునుండి గోలకొండకువచ్చి యచ్చటి సైన్యములో సిపాయిగాఁ బ్రవేశించెను. కాని తన యప్రతిమశౌర్యముచేఁ గ్రమ

క్రమముగా నభివృద్ధిఁ జెంది యిప్పుడు నాలుగువేల సైనికులకును, వేయి గుఱ్ఱములకును అధిపతిగానుండెను. ఇంతియగాక మాఱు వేషములు వేసికొని యాతఁడు రాజ్యములో మఱి యితరులకు దొరకని దొంగలను అనేక పర్యాయములు పట్టుకొన్నందున నవాబునకును, అక్కన్న మాదన్నగార్లకును ఆతనియందు మిక్కిలి యనురాగము కలిగెను. ఇదియుఁగాక యాతఁడంతకుఁ బూర్వము ఢిల్లీపట్టణములో నున్నవాఁడు. ఇన్ని కారణములనుబట్టి, ఢిల్లీకిఁబోయి మాఱువేసములు వేసికొనియో మఱి యేయుపాయముచేతనో ఔరంగజేబు నుద్దేశము, ఢిల్లీలో సైన్యములు చేర్చుటకుఁ గారణము తెలిసికొని తమకు దెలియఁ జేయుటకు రూపసింగుతప్ప మఱియొకఁడు తగినవాఁడు లేఁడని మాదన్న పంతులుగారు రూపసింగును ఆపనిమీఁద ఢిల్లీకిఁబంపిరి. ఆతఁడును మిక్కిలి సంతోసముతోఁ బోయెను.

# ఇరువదియాఱవ ప్రకరణము

## మొగలాయి చెఱసాల

ఎంతటి స్వల్పమగు తప్పు చేసినను, ఔరంగజేబు ఆ తప్పుచేసినవారిని కారాగృహమునఁ బెట్టించుచుండెను. కాని యెన్ని సంవత్సరములు గడచినను మఱల వారిని బైటికిఁ దీయుంచుట కలలోనివార్త. చెఱసాలలో నున్నవారు చచ్చిరో బ్రతికిరో కనుఁగొను వారెవ్వరును లేకుండిరి. తన కర్మవశమున నయనపాలుఁడు చెఱలో నునుపఁబడి కాలము గడపుచుండెను. ఎన్నటికైన నౌరంగజేబు తన్ను క్షమించి కారాగృహవిముక్తునిఁ జేయునేమోయని పేరాసవహించెను కాని యెన్ని నాళ్లకును వానిగండము గడచుట గానరాలేదు. కడకాతఁడు నిరాశ వహించి ఔరంగజేబు తనకుఁ గావించిన మోసము దలంచుకొనుచు, తన యవివేకమును నిందించుకొనుచు నిట్లు పశ్చాత్తాప మొందఁ దొడఁగెను

"అయ్యో! ఎంతటి బుద్ధిహీనుఁడ నైతిని? ఉత్తమ రాజపుత్రుఁడనయ్యు స్వకులధర్మమును విడిచి మహమ్మదీయులతో స్నేహము చేసినందుననఁగదా నాకిన్ని కష్టములు చేకూఱెను? ఇందఱు సేనానాయకులుండ చంద్రావతిని గొనిరమ్మని పాదుషా నన్నే పంపనేల? పంపినను తెలివిహీనుఁడనై చంద్రావతి గొంతుక తెగని కత్తిని గోయ నేను సిద్ధపడనేల? అట్టి మహాసాధ్వి, నాకు మాతృసమానురాలగు చంద్రావతికి ద్రోహము సేయనెంచిన నా కింతకన్న శిక్ష యే మున్నది? మహాకారం ధురంధరుండగు దుర్గాదాసు మ్రోల

నా యాటలు సాగ నేర్చునా? ఆహా! వాని రాజభక్తియు వాని పరాక్రమమును దలంచుకొనిన నాతఁడు నా యెదుట సాక్షాత్కరించి నట్లు తోఁచుచున్నవాఁడు. ఓ స్వామికార్యనిర్వాహకా! దుర్గాదాస్! నీకు నమస్కారము! నన్ను క్షమింపుము.........అయ్యో! సాటి రాజపుత్రుఁడనయ్యు నా దుర్గాదాసు కాలి గోటికైనఁ బోలని నాజన్మ మెందులకు? త్రినేత్రునకైన నా మహామహుఁడు వెఱచువాఁడు కాఁడు గదా! ఇంక నా జగన్మోహిని యగు నిందిర సంగతి వేఱుగ నుడువనేల? బుద్ధిచాతుర్యమునందును, రాజభక్తియందును. నించుకైన నన్నగారికిఁ దక్కువగాదు కదా? నా మాయ యంతయు నామె యెడల నిరర్థకమయ్యెను. ఆమె ధైర్యమును సాహసమును జూడ నాకే సిగ్గు జనించుచున్నది. ఆమెను చూచియైనను నేను స్వామి భక్తి నేర్చుకొనఁ గూడదా? అందఱు సిపాయిలును గుడారము చుట్టును గాపుండ వారికన్నులఁ గప్పి, చంద్రావతిని, అజితసింగును నిరాటంకముగ నావలికి దాఁటించెను. ఔరా! ఏమిదియామె యుక్తి? ఎంత చమత్కారము! అక్కటా! ఆ సుమసమగాత్రి నకారణంబుగఁ గొనివచ్చి పాదుషా కప్పఁజెప్పితిని. నా యట్టి మూర్ఖుఁ డింక లోకమున నెందైన నుండునా? రాజపుత్రస్త్రీని బలిమినిఁ గొని తెచ్చి మహమ్మదీయుల కప్పఁ జెప్పితినని ముందు ముందు దేశచరిత్రకారులు నన్నెంత నిందించెదరో! పాపమా పాటలాధరకు పాదుషా యెట్టి సంకటములు గల్గించుచుండెనో?.........ఎంత సరిపుచ్చుకొన్నను నేను చేసిన ద్రోహమునకుఁ బశ్చాత్తాపము కలుగకున్నయది. నా దుర్గతి కంతకును కారకుఁడైన పాదుషాపై నెట్లు పగఁదీర్చుకొనఁ గలను? సకుటుంబముగ వానికి మహా పరాభవము గావించినఁగాని, క్షణక్షణమును వృద్ధియై నా హృదయమునఁ బ్రజ్వలించుచున్న రోషానలంబు చల్లారదు. వాని నెట్లైన నమ్మించియే మోస మొనర్ప వలయును గాని, ధుమసుఁదనంబునఁ గార్యము కొనసాగుట దుర్ఘటము..

అయ్యో! నే నెంత యవివేకుఁడను? పాము నోటిలో నున్న కప్ప యెదుట నున్న పురుగును దినుటకై ప్రయత్నించునట్లు, గాఢాంధకార బంధురంబైన యీ కారాగృహంబునం బడి దిక్కులేక చరించుచు, పాపమాయంత వానికి మోసము సేయ నెంచు చున్నాను. ఎంత చిత్రము? దైవానుగ్రహమున నెట్లులైన నీ చెఱసాలఁ దప్పించుకొని యావలఁబడినఁగదా నా కార్యములు ఫలించుట కవకాశముండును? ఏమీ? ఔరంగజేబంత వానిని సకుటుంబముగ మోసపుచ్చఁ జూచుచున్న వాఁడ నీ కారాగృహము మాత్రము దప్పించుకొను సదుపాయము చేసికోనలేనా? ఇందిరను గాపాడుటకై నా ప్రాణములైనను వెచ్చించి తీరవలయును." అని తనలో నేమో కొంతవఱకు ఆలోచించి......"సరి! తెలిసినది. ఆహా! ఇందిర నామస్మరణ మొక్కసారి యాచరించినంత మాత్రమున నా యవివేకమంతయుఁ దొలంగి నాకొక చక్కని యుపాయము దట్టినది. ఇట్టితఱి, స్వాతంత్రముగ నిందిర పన్నిన కార్యోపాయములకు గలనైన నడ్డంకి యుండునా? ఆపదలు వచ్చినప్పు డెల్లవారును నింకమీఁద శ్రీయిందిరాదేవిని స్మరించుకొనుచుండెదరు గాక! ఆమెయెడల నేను చేసిన ద్రోహమునకు నా పశ్చాత్తాప మంతయుఁ దీరునట్లు పాదుషా గృహమునుండి తప్పించి, ఆమె యన్నయగు దుర్గాదాసున కామెను భద్రముగ సమర్పింపకున్న నా బ్రతుకంతయుఁ గాల్పనా? అయ్యో! ఎన్ని యుపకారములు చేసినను, ఎంతసేవించినను, ఎన్నిదినములకైన నా యిందిరా దుర్గాదాసులు నన్ను నమ్మెదరా? వారి యనుగ్రహము నకుఁ బాత్రుఁడనగు భాగ్యము నా కెన్నఁడైనఁ జేకూఱునా?......సరియే! ఇప్పు డీసంగతులేల? పిదపఁ జూచుకొనవచ్చును. తొలుతఁ జేయవలసిన కార్యమును గూర్చి ప్రయత్నింపవలయును."

ఇట్లు తలంచి నయనపాలుఁ డానాఁటి నుండియు, తత్కారాగృహాధికారితో మంచి మాట లాడుచు, మెల్లగ వానితో విశేషముగఁ

బరిచయము చేసికొనెను. కొన్నిదినములకు నయనపాలుఁడు తన యుద్దేశమును వానికెఱింగించి, తన్నెట్టులైన నెవ్వరును జూడకుండఁ గారాగృహంబున నుండి విడుదలచేసిన యెడల విశేషధనము బహుమానమిచ్చెదనని వాగ్దత్తము చేసెను. కాని పాపమా యధికారి నయనపాలుని విడిచిన ఎన్నటికైన పాదుషా వలన తనకపాయము చేకూడునేమో యను భయమున, వానిని విడుచుట కంగీకరింపఁ డయ్యె. రానున్న యంత ధనము విడువలేఁ డయ్యె. ఇట్లు మంచి చెడ్డలు కొంతవఱకుఁ దనలో నాలోచించుకొని, నయనపాలుఁడు కారాగృహమునఁ బడి యాఱుమాసములైనందున వాని వృత్తాంతము పాదుషాకు జ్ఞాపకమే యుండదనియు, అదివఱకు సంవత్సరముల నుండియు చెఱలోనున్న వారి విషయమై మాత్రము పాదుషా తలంచెనా యనియు, అందువలన నయనపాలుని విడిచినంత మాత్రమునఁ దనకు కీడు సంభవింపదనియు, యావజ్జీవము బ్రతుకుటకుఁ జాలిన ధనమేల విడువ వలయుననియుఁ దలపోసి వానిని విడుచుటకు నిశ్చయించుకొనెను. ఇంతియకాక తన జైలులెక్కలలో నయనపాలుఁడు కాలము చేసినట్లు వ్రాసిన తనకింక నేవిధమైన ముప్పై యధికారి వలన చేకూఱదని కూడ నెంచెను. పిదప నయనపాలుఁడా పట్టణములోనున్న తన బంధుగృహము గుర్తు నెఱింగించి యా చెఱసాలనాయకుని నాయింటికిఁ బంపి తన బంధువులలో నొకని రావించి యేమో మాటలాడి యప్పటికిఁ గొంతధన మాతని కిప్పించి మిగిలిన ధనము తన్ను విడిచిన పిమ్మట నిచ్చెదనని చెప్పెను.

ధన పిశాచ మావేశించి నంతనే యా భటుఁ డమందానంద మొందె, తనకప్పటికి నయనపాలుఁ డిచ్చిన దాని కన్న నీయఁబోవు ధనమెంతో యెక్కువ యని యుప్పొంగుచు, త్వరలోనే నయనపాలుని విడుదలచేసి యా ధనము స్వీకరింపవలెనని చూచుచుండెను. ఇట్లుండ నొకనాటి రాత్రి రెండుజాములకు విశేషముగ గాలి వీవ నారం

భించెను. మహమ్మదీయ భటులందఱును గాఢముగ నిద్రవహించి యుండిరి. కోటలో నెచ్చటను దీపములు లేకుండ నారిపోయినవి. దుర్మార్గుడైనయధికారియుఁ దన కృత్యములు దలంచుకొని పశ్చాత్తాప మొంది, సన్మార్గమునఁ బడెను గదా యని సంతసించి, నయనపాలుఁడు చెఱఁ దప్పించుకొని పోవునప్పు డితరుల కంటఁ బడకుండ వలయునని, మేఘుఁ డంబరసీమను బ్రవేశించి లోకమంతయు నమితాంధకార మయమొనర్చెను. అప్పు డాబందిగపు ఱేఁడు తగిన సమయమని యెంచి చెఱసాల తలుపులను దీసి నయనపాలునిఁ బైటికి విడిచెను. అనేక సంవత్సరములా కోటలో సంచరించిన వాఁడగుటచే నాతని కొరులు త్రోవజూపి యావలికిఁ దిగబెట్ట నవసరము లేకుండెను. కాని క్రొత్తవారైనచో మూఁడుదినములు ప్రయత్నముచేసినను, ఒకరి సహాయము లేకుండ బైటఁబడుట దుర్లభము, ఆ సమయమున నయనపాలుఁడు దర్బారుదాఁటి ద్వారములన్నియుఁ గడచి తిన్నఁగఁ బాఱిపోయెను. అధికారి నయన పాలుని వెనువెంటనే పోక కొంతసేపు వేచి పిమ్మట తానుగూడ బయలుదేఱి నయనపాలుని గృహంబునకేగి వానివలన తనకు రావలసిన ధన శేషమును స్వీకరించి సంతసించెను.

ఇంక నయనపాలుఁడు పూర్వపు నయనపాలుఁడుగాఁడు. తనకుఁ జేసిన ద్రోహమునకు పాదుషా నెట్టులైన మోసపుచ్చి తనపగఁ దీర్చుకొనవలయునని చెఱలోనుండి తప్పించుకొని వచ్చినప్పటినుండియు యోచింపసాగెను. ఇందిర నెట్టులైనఁ దప్పించి దుర్గాదాసున కప్పగింప వలెనని వాని ముఖ్యాభిప్రాయము గావున, నా మఱునటిదినమున నుండియు, నాతఁడు మాయవేషములు ధరించుకొని జనావాలోనికిఁ బోయి యచ్చటి సంగతులు గనుఁగొనుచుండెను. అన్యవేష ధారుఁడై తిరుగుచుండి నందున ఢిల్లీనగరమున నెవ్వరును వానినిఁ బోల్చుకొనఁ జాలరైరి.

# ఇరువదియేడవ ప్రకరణము

## కపట నాటకము

ఔరా! ఎంత సాహసము? అమ్మాయలాడి వలలోఁజిక్కి, చెల్లెలగు నన్ను సైతము పాదుషా కన్నెత్తి చూడకున్నాఁడు. ఒక్కసారి రమ్మని కబురంపిన నిప్పుడే వచ్చెదనని చెప్పిపోయెనఁట. ఎంత చిత్రము? ఆతఁడెన్నఁడైన నామాట కిట్టు లెదురాడెనా? అయ్యో! పాపము వాని నేటి కనవలయును? వానిచిత్తమును దన స్వాధీనము గావించుకొని, తోలుబొమ్మవలె వాని నాడించుచున్న ఆ టక్కులాడియే కదా యింతకును గారణము? తన మగఁడు నన్నేమో యురిఁదీయునని కాఁబోలు లేనిపోని నేరములన్నియు నా పైఁగల్పించి వానితోఁ జెప్పుచుండును? ఇంత మాత్రమున నెఱచుటకు రోషన్ఆరా సామాన్యురాలు కాదని యెఱుఁగదేమో? షాహజహాన్ అంత వానిని రాజ్యపదభ్రష్టునిఁ జేసి, ఔరంగజేబునకు రాజ్యమిప్పించిన నాకీమాయలాడి యొక లెక్కయా? ఈ సామ్రాజ్యమున కంతకును దానే పట్టపురాణి యని మిన్నును మన్నును గానక సంచరించుచున్నది. కానిమ్ము, నేనే రోషన్ఆరా నైనచో దాని గర్వమంతయు నణఁగఁద్రొక్కనా? తా నెవ్వని నమ్ముకొని యతిశయ మొందుచుండెనో వానిచేతనే పరాభవము గల్గింపనా? ఈ కార్యము కొనసాగుటకు ఫోటుసింగొకఁడు నాకు ముఖ్యాధారమై యున్నవాఁడుకదా? వీనినిఁ బట్టియే నే నాడింపఁ దలంచిన కపట నాటకమంతయు జరిపించెదను అప్పుడుగదా ఉదయపురి

త్తుళ్లిపాటడంగుటయు, రోషన్ ఆరా సఫలీకృత మనోరథయై సంతో
సించుటయు సంభవించును ? ”

అని రోషన్ ఆరా తన మందిరమునఁ గూర్చుండి యుదయపురిపైఁ
గల ద్వేషమంతయు వెల్లడిసేయుచుండెను. ఎన్నియో కుట్రలును
మాయలును నెఱింగిన యామె యెట్టి సాహసకార్యమునకైన వెనుదీయు
దని చెప్పవచ్చును. ఉదయపురిపై పాదుషాకు ద్వేషము పుట్టించి
యామె కెట్టులైన పరాభవమును మోసమును గల్గింపవలయునని
రోషన్ ఆరా ముఖ్యాభిప్రాయము. అట్లామె తనలోఁ దానేవియో
కుట్రలు బన్నుచు దలపోయుచుండ, నింతలో పాదుషా భోజనముచేసి
ఆ మహాలులోనికే వచ్చి ఆమెచెంతనొక యాసనముపైఁ గూర్చుండి
యిట్లు ప్రసంగించెను.

“ అమ్మాయీ ! నీ మొగముఁజూడ నీవు విచారించుచున్నట్లు
తెలియవచ్చుచున్నది. కారణమేమియో ? ”

“ ఏమికారణమైన నేమి లాభమున్నది ? భాయీ ? దీనికేమి
గాని, నేను మక్కాకుఁబోయెదను. ఇంక ఢిల్లీనగరమున నుండుట
నాకిష్టములేదు. ”

“ ఏమీ ? ఢిల్లీనగరమున నుండుట నీ కిష్టములేదా ? పోనిమ్ము
అట్టులైన నేనుగూడ వచ్చెదను. మన మిరువురమును గలసియే
పోవుదము. ”

“ నీవేలవచ్చెదవు ? వచ్చుటకైనను రాకుండుటకైనను నీ
యిష్టములోఁ జేరినపని గాదుకదా ? ”

“ సరియే ! కాని, మక్కాకుఁ బోవుటకుఁ గారణమేమియో? ”

“ అస్వతంత్రపు జీవనము చేయుచు, పట్టణములో నుండుటకన్న
స్వాతంత్రముగ నడవిలో వసించుట సౌఖ్యముకదా. ”

“ అదేమమ్మా ! ఏ విషయమున నీకు నేను స్వాతంత్ర్య
మీయలేదో చెప్పరాదా ? ”

" అన్ని విషయములను నీవు నా కధికారమిచ్చి కోటలాడ యుంటుల కేమియు నడ్డంకి లేకుండ నుండ వలయుఁగదా " కోనికిఁ

" అవును. నీ కార్యముల కెవ్వరు విరోధముగా నడచుచుం చెప్పుము. నేను దండించెదను. " ను

" వారిని దండించుట యసత్యముగాని, నిజము చెప్పిన నీవు నన్ను దండింపక మానవు. "

" అబ్బా ! అక్కఱకురాని మాట లెందుకమ్మా ? ఏమి జరిగి నదో యొక్కమాటలో చెప్పుము ! "

" అన్నయ్యా ! చెప్పుట కేమున్నది ? మన మహమ్మదీయ వంశమున కపయశంబు రానున్నదికదా యని విచారించు చుంటిని. "

" ఏమీ ! పవిత్రమైన మన వంశమునకే యపకీర్తి రానున్నదా? ఇంతటి దారుణకృత్య మెవ్వరివలననో చెప్పు "

" భాయీ ! నీ సేవకు లందఱు నా స్వాధీనమున నుండరు కదా ? ఇంతియకాక అంతఃపురములోనికి ... పోనిమ్ము. నా కెందుకు ? అట్టి మాటలు నేఁ జెప్పఁగూడదు, నీవు వినఁగూడదు. "

" అమ్మాయీ ! అంతఃపురమని యూరకుండెద వేల ? ఏమి జరిగెనో వచింపుము. నా కష్టములు నీయవి కావా ? "

" అవును గాని సమయము మంచిదికాదు. రాజపుత్రులు పరాయి వేషములువేసికొని ప్రవేశించుచున్నారు. "

" దుర్మార్గులైన రాజపుత్రులు నాయంతఃపురముననే ప్రవేశించు చున్నారా ? నీ వెఱిఁగియు, వారి నేల దండింపలేదు. "

" ఒకరికి సమ్మతమైన కార్య మింకొకరు వారించినఁ గొన సాగునా ? "

ఈ కార్య మెవ్వరికి సమ్మతమైనది ? "

" నీకు నాపైఁ గోపము జనించినను నింకఁ జెప్పక తప్పదు కదా ! మన యుదయపురికే ! "

త్రుళ్ళుపా? ఏమీ ? ఉదయపురికిని రాజపుత్రులకును నేమి సంబంధ
మించుటని ? "

"ఏమి సంబంధమున్నదో నీవు గ్రహించుకొన వలయును
గాని, ఆఁడుదాననైన నే నేమి చెప్పఁగలను ? ఇంతకు నేరము నీయది
గాని యామెయందు లేదు. ఇందఱు మహమ్మదీయాంగన లుండఁగా
రజపూత కన్యను నీవేల వివాహము చేసికొనవలయు ? ఇప్పుడే కాదు.
ఆమె కీదుర్బుద్ధి పుట్టి యిదివఱ కెన్నోదినములైనవి. రాజపుత్రస్త్రీ
గావున స్వమతాభిమాన మూరకయ పోవునా? నీ కిందులకు దృష్టాంతము
చూపెదను చూడుము."

అని తన శక్తికొలఁది నెన్నియో కొండెములుబన్ని పాదుషా
కుదయపురిపై యనుమానమును బుట్టించి, చెఱసాలలోనున్న ఛోటు
సింగు నచ్చటికి రప్పించెను. పాదుషా వాని యాకారమంతయుఁ జూచి,
అంతకు మున్నెప్పుడో యాతనినిఁ జూచి యుండినట్లు కొంచెము
యోజించి రక్తానను(డై యపరిమితాగ్రహ మొంది ఛోటుసింగును
క్రూరదృష్టితో కొంతవఱకుఁజూచి, పిదప "అమ్మాయీ ! ఈతఁ
డెవఁడు" అని రోషనఆరా నడిగెను. "ఎవఁడని యడుగనేల? ఉదయ
పురి స్నేహితులలో నీతఁ డొకఁడు. ఇట్లు మాఱువేషమును ధరించు
కొని, యంతఃపురమునఁ జొరఁబడుచుండ నేను వీనిని బట్టించి నీకుఁ
జూపవలెనని కారాగృహంబునఁ బెట్టించి యుంచితిని. ఇట్టి యనే
చిత్యములు మన యంతఃపురములోఁ గలవని యూరక నీకుఁ జూపితిని
గాని, యింతమాత్రమున నా కుదయపురిపై ద్వేష మున్నదని నీవు
భావింప వలదు. పాపమామె నిర్దోషురాలు. ఏమియు నెఱుఁగదు.
రాజపుత్ర సౌఖ్యము చిన్ననాఁటనుండియు నెఱుఁగ నందున నిట్టి నీచ
కృత్యమున కొడఁబడినది. ఇంతకు నామె చిన్నదికదా ? మంచిచెడ్డ
తెలియఁగదు." అని కసినంతయుఁ దీర్చుకొనుట కనేక విధముల
నుదయపురిపై పాదుషాతోఁ జెప్పుచుండెను. ఆ మాటలన్నియుఁ

బాదుషా యాలకించి, యాశ్చర్యమొంది కొంతసే పేమియు మాటలాడ లేక, ఛోటుసింగును వెంటఁ బెట్టుకొని యుదయపురి జనానాలోనికిఁ బోయెను.

అప్పుడుదయపురి యిందిరతో ముచ్చట లాడుచు కాలక్షేపము సేయుచుండెను. పాదుషారాకను జూచినంతనే వారిరువురును తటాలున లేచి వెనుకకుఁ బోయిరి. పాదుషా వెనుకనున్న ఛోటుసింగును ఇందిర చూచి యక్కజ మొంది, ఔరంగజేబు స్వయముగ వానిని వెంటఁ బెట్టుకొని వచ్చుటచే నేమైన మోసముండి యుండునని తలంచి, యొక తలుపు చాటున నిలిచి చూచుచుండెను. పాపము, ఛోటుసింగు మొగము వెలవెలఁబోయి విచారమున్నట్లు తెలియఁ జేయుచుండె. ఇందిరను జూచి యాతఁడు మొగము వాల్చుకొని యూరకుండెను. తన మహాలులో నౌరంగజేబు ప్రవేశించినంతనే యుదయపురి వానిని గౌరవించి యధిష్ఠింప నాసనముఁ జూపెను. కాని పాదుషా కీమర్యాద లెల్లఁ బూర్వమువలె మనస్కరింపవు గదా! ఆతని హృదయతలంబున రోషన్ ఆరా నాటిన విషబీజ మంకురించి యెంతవఱకు వృద్ధియగునో పరిశీలించెదము. పాప ముదయపురి నిర్మల హృదయ యగుటచే నేకర్మ మెఱుంగదు గావున పూర్వము వలెనే వాని నాదరింపఁ దొడఁగెను. పాదుషా చిత్తమామె యెడల నెంతనిర్మలముగ నుండెనో రోషన్ ఆరా చేసిన దురుపదేశముల వలన నిప్పుడంత విరోధముగాఁ బరిణమించెను. దుష్ట స్వభావంబువలన నెంతటి వారైన దురాచారు లగుట లోకంబున సహజమే కదా! తన హృదయ మన్యథా ప్రవర్తించు చుండినందున నుదయపురి చేయు నుపచారముల స్వీకరింపక పాదుషా యామెను క్రూరదృష్టితోఁ జూడసాగెను. ఆతఁడెప్పుడును నట్టి సమయమున మహాలులోనికి వచ్చుట వాడుక లేనందున పాదుషా వచ్చుచుండెనని తెలిసినప్పుడే యుదయపురి కొకతీరైన యనుమాన మును భీతియు జనించినవి. అట్టునను నంతమాత్రమున నామె

లక్ష్యముసేయక మోహము నెల్లడించుచు నాతనిని కేరడా సాక్ష్యమించుచుండ పాదుషా దూరముగఁ దొలంగి,

"ఓసి క్రూరులారా! ఆఁగు ఆఁగు. పూర్వాచారములన్నియు నింకఁ గట్టి పెట్టుము. నే నడుగు ప్రశ్నములకు సముత్తరము లిచ్చి పిదప నీ టక్కులు వలపులు జూపుము." అని ఛోటుసింగును జూపుచు, "నీతఁ డెవ్వఁడో నీ వెఱుఁగుదువా?"

"ఎవ్వఁడో దారిఁ బోయిన వానినిఁ గొనివచ్చి యీతఁ డెవ్వఁడని యడిగిన నే నేమి సమాధానము జెప్పఁగలను?"

"ఓసీ! నీవు జాణవని నేను తొలుతనే యెఱుఁగుదును! శనిగ్రహమువలె మా మహమ్మదీయ వంశమునఁ బ్రవేశించి మాకపయశంబు గల్పింపనెంచితివా?"

"మహారాజా! మీ రిట్లకారణంబుగ నాగ్రహము నహింప నేనేమి సమాధానముఁ జెప్పఁగోనఁగలను? కారణమేదియో యెఱిఁగింప కున్న నా కింకేది దిక్కు?"

"దుష్టురాలా! ఈ ఛోటుసింగునీ యంతఃపురమునకు వచ్చుటకుఁ గారణ మేమి?"

"దేవా! ధన్యురాలనైతిని. ఇంక వినుఁడు. ఈతఁడొక చిత్రకారుఁడు. నిఱుపేదయై తన పొట్టఁ బోషించుకొనుట కీయూరు వచ్చినాఁడట. దంతముతో నొక వీవనఁ దయారుచేసి యీతఁడు కొన్నిదినముల క్రిందట నాకుఁ గొనివచ్చి యిచ్చెను. మఱుసటి దినము వచ్చినచోఁ దగిన బహుమానమిచ్చెదనని చెప్పి పంపివేసితిని గాని యీతఁడు నేఁటి వఱకును రాలేదు. దేవరవారి కా వీవనఁ జూప మఱచితిని. మీ యనుమానము దీరునట్లు, వలయునేని యా విసన కఱ్ఱను జూడ వచ్చును."

అని లోనికిఁ బోయి వీవన గొని వచ్చి వానికిఁ జూపెను. పాదుషా ఆ విసనకఱ్ఱను జూచి దాని సౌందర్యమునకును, నగిషీపను

లకును, సంతసించుట సహజమే కాని, ఆ సమయము మాత్ర మందుల కనుకూలమైనది కాదుగదా? కావున నాపీవన నామె మొగముపైఁ దడవైచి,

"ఓసి మూర్ఖురాలా! రాజపుత్రుల మాఱువేషములు వేయించి యీ జనానా లోనికి రప్పించుకొను చుంటివా? ఈ యవమాన మంతయు నాయదిగాని నీది కాదు. ఇట్టి దారుణము లొనర్చుచున్న నిన్ను మా నగరమున నుంచుకొనుటకన్న నింకేమి పాపమున్నది? యశోరాశియైన మా మహమ్మదీయ వంశమునకు నేఁటికి నీవలనఁ గళంకము గల్గినది."

అని పలుకుచుండ నా కఠినోక్తు లన్నియుఁ దన హృదయమున శూలములవలె నాట నుదయపురి యేడ్చుచు,

"మీ యనుమాన మంతయు నాకుఁ దెలిసినది. మీ కిట్టి దుర్నీతి యెవ్వతె బోధించెనో అది గూడ నే నెఱుఁగుదును. ఇంక నాలస్యము చేయక నన్ను మీ ఖడ్గమునకు బలి యిచ్చి త్వరలో నామె కోర్కె నెఱవేర్పుఁడు. లేదా, న్యాయాన్యాయములు వలయు వారేని జరిగిన నిక్కువంబు దెలిసికొని యుక్తాయుక్తముల యోచింపుఁడు. అంతకన్న ఛోటుసింగు విషయమై నే నేమియు నెఱుఁగను. ఇం దేమైన నన్రుతమున్నదని తోఁచినచో మసావదు నమగ వచ్చును."

అని రోదన మొనర్చుచు వచించుచుండ దురాగ్రహపరుఁడైన పాదుషా ఆమె మాటలఁ బాటిసేయక,

"ఓసీ! నోరుమూలంది నేల వదరెదవు? నీ దురాచార మంతయు నిదివఱ కెన్నాళ్లనుండియో జరుగు చున్నదఁట. మేము నిన్నింక క్షమింపము. ఇదిగో నీకుఁ దగిన శిక్ష యిప్పుడే గావించెదను."

అని కోపము నాఁపుకొనలేక, కరవాలమును బైకెత్తి ఖండింప నుద్యుక్తుఁడై యామెపైకి వచ్చుచుండెను. తోడనే యుదయపురి

వాని భీకరాకారమును జూచి భయాకులచిత్తయై దుఃఖాతిశయమున నేలపైఁబడెను. అంతవఱకు వెలవెలఁబోయి తలుపుచాటున నిలిచియుండి, యా దంపతుల యన్యోన్య సంభాషణంబాలించుచు నున్న ఇందిర, ఇట్టి సమయమున నూరకుండుట పాడిగాదని, నిర్దోషియైన యుదయపురి యకారణంబుగ బలవన్మరణ మొందనున్నది కదాయని తలంచి, తనవలన తనశత్రువులకైన నాపద సంభవించుట చూచి సహింప నేరనిది గావున ధైర్యము వహించి, యుదయాపురిని గడ తేర్చుటకై వచ్చుచున్న పాదుషా కడ్డముగఁ బోయి నిలిచి,

"ఓ యలమ్గీరు పాదుషా! శాంతింపుము. శాంతింపుము నా మాటలు గూడ కొన్ని విని పిదప నీ యిచ్చ వచ్చినట్లు చేయవచ్చును. ఏవీరుఁడు తన నిరుపమాన పరాక్రమంబున శాత్రవ భయంకరుండని పేరు వడసెనో? ఏ మహామహుఁడు, మహారాణా యశవంతసింహుని వంశ వృక్షమును గాపాడెదనని కంకణము గట్టుకొనెనో? ఏ ధీరుఁడు కాబూలు దేశంబున సమస్త శాత్రవ వర్గంబు నివారించి దుర్భరంబగు ప్రజా కలహంబు మాన్పెనో, ఏరాజపుత్త్రుఁడు తన్ను మోసపుచ్చ వచ్చిన నయనపాలుని మోసంబున బడకి తిరుగ వానికే మోసము గావించెనో? ఏ పరాక్రమసింహుఁడామీపర్వత ప్రాంతమున దేవర వారి సైన్యముల నెల్ల నిముసమాత్రమున నోడించి పాఱఁదోలెనో? ఆ జగదేకవీరుఁడగు దుర్గాదాసే యిప్పుడు మీయెదుట నున్నవాఁడు! ఇంకఁ దాఁపనేల? ఇందుండి నన్నెట్టులైనఁ దప్పింప వలయునని మాయన్నగారిట్లు మాయ వేషమును ధరించుకొని ఛోటుసింగని నామకరణము చేసికొని చిత్త్రకారునివలె నిచ్చటకు వచ్చిరి. ఇంతియ కాని యేపాప మెఱుఁగని యుదయపురిపై లేశమంతైన నేరము లేదు. మా రహస్యమును మేమే వెల్లడి చేసికొనిన మీరు మాకుఁ గఠిన శిక్ష విధించెదరని యెఱింగియు, నిష్కారణంబుగ నీమె యపనింద పాలై ప్రాణములు గోల్పోవ నున్నదని నే నిట్టి సాహసము వహించితిని. మే మెట్టి కష్టములైనను

భరించెదము గాని మావలన నొరులకుఁ గాసంత యాపద సంభవించినఁ జూడఁజాలము. మీరింక నెంత మాత్రమనుమానమొంది యీమెను శిక్షింపరాదు. నేనును నాయన్నయు మీకు వశమైతిమి. మీరు మమ్మింక నేమిచేసినను చేయవచ్చును. మీ శిక్షకై మేమిరువురమును సిద్ధముగ నున్నాము. కాని పాప మీయమమాత్రము నిర్దోష – నిర్దోష– నిర్దోష – ముమ్మాటికిని నిర్దోష." అని యిందిర నిర్భయముగఁ బలికెను.

ఆహా! ఇందిర భూలోకమున నవతరించిన ఇందిరయే కదా? ఆమె సదయ హృదయ మెంత వర్ణనీయము? ఆమాటలన్నియుఁ బాదుషా విని దిగ్భ్రమఁ జెంది, మారు మాటాడలేక, యుదయపురిని నఱకుట కెత్తిన చేతినట్టులే యుంచి తనకడ్డముగ నిలువఁబడి గంభీర ముగాఁ బలుకుచున్న యిందిరవైపే తన దృష్టినంతయు సారించి కొంత సేపటివఱకు మైమఱచి యుండెను. ఇందిర పలుకులవలన నుదయపురి కేవలము నిర్దోషురాలనియు, నీ పన్నుగడ యంతయును రోషన్ ఆరా పన్నినదే యనియు గ్రహించి వెంటనే తన యనుమానమంతయును విడిచెను. తన యెదుటనున్న ఛోటుసింగు మాయావేషధారుండైన దుర్గాదాసని విన్నంతనే యాతని పరాక్రమమును శౌర్యమును నదివఱ కెన్నోమారు లాకర్ణించుటచేతను, అనేక యుద్ధములలో నాతఁడు చూపిన యద్వితీయ పౌరుషమెఱిఁగి యుండుటచేతను, వాని యొడలెల్ల నొక్కసారిగ 'జల్లు'మనెను. ఇంతియకాక మాఱువేషమును ధరించుకొని జనానాలోఁ బ్రవేశించి దుర్గాదాసొనరించిన ప్రత్యక్ష సాహసకృత్యము నకుఁ గూడ నాతఁడెంతయో యాశ్చర్యమొందెను. పాదుషా సూక్ష్మ బుద్ధిఁ గలవాఁడును, కార్యానుకూల చతురోపాయవిచక్షణుండును నగుటచే దుర్గాదాసునకెట్టి శిక్షయుఁ గావింపక, అంతటి పరాక్రమ వంతుఁడు తనకుఁ గల్గియుండిన తాను చేయందలంచుకొను కార్యము

లన్నియు నిర్విఘ్నముగఁ గొనసాగగలవని తలంచి, వానినెట్టులైన మంచిమాటలచేఁ దన వశము చేసికొనవలయునని నిశ్చయించెను. మఱియుఁ నాతఁడప్పుడు యుద్ధప్రయత్నములలో నుండుటచే, దుర్గాదాసును లోఁబఱచుకొని వానిని సైన్యములతోఁ బంపిన శత్రువులు నిమేషమాత్రమున వశంవదులగుదురనియు, వాని మూలమున రాజుల నెల్ల క్షణములో సాధింపవచ్చు ననియు, నింక ద న్నెదిరించువాఁడు నూటికొక్కఁడైన నుండు టరుదనియు నెంచి దుర్గాదాసు నవలోకించి "ఓయీ! దుర్గాదాస్! నీ పరాక్రమమును, చాతుర్యమును మే మెన్నియోమాఱు లాకర్ణించితిమి. ఇంతియకాక యశవంత సింహుని సైన్యములలో నిన్ను నే ననేకమాఱు లవలోకించితిని. యశవంత సింహునితోఁ గూడ బయలుదేఱి, యనేక యుద్ధములలో జయమొంది మాకార్యము లెన్నియో చక్కఁజేసి నీ రాజభక్తినంతయు మా యెడలఁ జూపినందున మే మెంతయో సంతసించినారము. ఎట్టివారైనను మా సేవకులందఱు రాజభక్తి నీ యెడఁగదా నేర్చుకొనవలయు? కావున నేఁటినుండియు నీవు మమ్ము సేవించుచు యశవంతసింహునివలెఁ జూచుకొనుము. నీ కెంతమాత్రమును గొఱఁత గలుగదు నీకుఁ బంచహాజారీ మన్సబ్‌దార్ పదవి నొసంగెదము." అని వచింప, "అయ్యా! యశవంతసింహుఁడు మరణమొంది నప్పటి నుండియు నే నితరుల సేవింపనని వ్రతముఁ బట్టితిని. దుర్గాదాసు ప్రాణములు గూడ నాతనితోడనే పోయెనని భావించి నన్ను క్షమింపుఁడు."

అని దుర్గాదాస్ ప్రత్యుత్తరమిచ్చెను. ఆ మాటలకుఁ బాదుషా చిఱునవ్వు నవ్వుచు "సరే! ఇంతలో తొందర లేదులే! నీవును నీ చెల్లెలును కలిసి యాలోచించుకొనుఁడు. మంచిచెడ్డలను దెలిసికొని మీ యభిప్రాయమును మా కెఱింగింపవలయును?' అనిచెప్పి వాని నొకసౌధములో నుంచి యెట్టి లోపమును రానీయక సుఖకరముగఁ

గాపాడుచు దుర్గాదాసునెందును బోనీయకుండ తన భటుల నచ్చటఁ గాపుంచెను.

రోషన్ ఆరా గావించిన మోసమును పాదుషా గ్రహించిన వాఁడైనందున, తాను వహించిన దురాగ్రహమునకుఁ బశ్చాత్తాప మొందుచు నుదయపురిని సమీపించి తన యవివేకమును క్షమింపుమని యనేకవిధముల బతిమాలుకొనెను. రోషన్ ఆరా తన కుదయపురి జనానాలోఁ బరాభవము సంభవించినదనియు, తాను పన్నిన కపట వ్యూహమంతయు నిందిరవలన ధ్వంసమయ్యెననియు, దెలిసికొని విఫల మనోరథయయ్యు, మఱింత యాగ్రహమును, పౌరుషమును వహించి యుండెను.

# ఇరువదియొనిమిదవ ప్రకరణము

## ఫ కీ రు

ఉదయపురిపై నెన్ని యోకొండెములు పన్ని రోషన్ ఆరా పాదుషాతోఁ జెప్పెను గాని, పాప మామెకోర్కి కొనసాగలేదు. ఉదయపురి జనానాలో, పాదుషాకును, ఉదయపురికిని, ఇందిరకును, ఛోటుసింగునకును జరిగిన సంభాషణమును, అచ్చటఁ దనకుఁ బరాభవము సంభవించుటయు, తన కుటిల ప్రవర్తనమంతయు, పాదుషా గ్రహించుటయు, నాదిగ నెల్ల వృత్తాంతమును గనుఁగొని, యామె దీర్ఘవిచార మొందుచుండెను. మధ్య నిందిర యుండి యుదయపురి ప్రాణమ్ములు గాపాడెను గాని, లేకున్న యెడలఁ దన కార్యము గొనసాగియే యుండునని ఆమె వెంటనే గ్రహించెను. ఆ కారణమున నిందిర నెట్టులైన మోసపుచ్చి యామెపై గసిఁ దీర్చుకొనవలయునని ఆమెయొక ప్రతిజ్ఞ గావించెను. ఎన్నిమాఱు లెన్ని మాయోపాయములు పన్నినను నించుకంతైన ఫలింపక నిరర్థకము లగుచుండుటచే నెల్లవిధముల నామె హృదయ ముల్లకల్లోల మగుచుండెను ఆ కలహములో నుదయపురియే జయమొందితన్నాడుచుండిన మాటలన్నియుఁ దనచారులవలన వినినందున రోషన్ ఆరా హృదయమగ్ని లేకుండఁగనే ప్రజ్వలించు చుండెను.

ఇట్లుండ నొకనాఁ డొక ఫకీరు కోటలోఁ బ్రవేశించి జనానాలోనికిఁ బోవుచుండెను. పాదుషా జనానాలోనికి సాధారణముగా నెవ్వరును బోవుటకు వీలు లేకపోయినను, స్వమతోద్యోగ నిరతుఁడగు పాదుషా ఫకీరులను మాత్రము గొంతవఱకుఁ బోనీయవచ్చునని తన

సేవకుల కాజ్ఞాపించెను. వాని యాజ్ఞానుసారముగ నెందరు ఫకీరులు వచ్చినను, ద్వారపాలురు వారి నడ్డగింపక లోనికిఁ బోనిచ్చుచుండిరి. అట్లే మన ఫకీరు కావలివారియడ్డంకి లేకుండ స్వేచ్ఛగా లోనికిఁబోయి జనానాయొద్ద సంచరించుచుండెను. కాషాయ వస్త్రములు ధరించి, పలు రంగుల పూసలదండలు మెడలోన వైచుకొని, తెల్లని గడ్డముతో నున్న యా ఫకీరును జూచి మహమ్మదీయ సేవకులందఱు వానికి సలాములుచేసి పిడప డబ్బులును, బియ్యమును, నిచ్చుచుండిరి. ఆతఁడు అరబ్బీ హిందీ పారసీ పద్యములు చదువుచు, ఎల్ల మహమ్మదీయులును, ప్రతిదినము ఖురాన్ పఠించు చుండవలయు ననియు, తగిన వేళల యందు రెండు చెవులలో ద్రేళ్లిడుకొని, అల్లాకు వినఁబడునట్లుగ మసీదులలో నఱచుచు నమాజు చేయవలయు ననియు, ఫకీరుల నందఱి నాదరింప వలయుననియు, నాతఁడు బోధించుచు లోనికిఁ బోవుచుండెను. అందఱు ఫకీరులవలెఁగాక ఆతఁడు దివ్యజ్ఞానము గలవాఁడని సేవకులందఱును భావించి, వానికనేక బహుమానము లొసంగుచు మిగుల గౌరవించుచుండిరి. ఫకీరు కొంత సేపటివఱకు నిట్టునటు సంచరించి క్రమముగా నుదయపురి జనానాను సమీపించి యచ్చటఁగూడ నేమేమో పాడుచుండెను. అప్పు డుదయపురి ఇందిరతోఁగూడ మేడపై నుండి, ముచ్చటించుకొనుచు నా ఫకీరునుజూచి, వాని పాటలకును పద్యములకును సంతసించి, అతనికిమ్మని యిందిర చేతికొక మొహరీ యిచ్చి క్రిందకిఁబంపెను. ఇందిర ఆ మొహరీ తన చేతిలోనే వుంచుకొని ఫకీరునొద్దకువచ్చి, "ఫకీర్ జీ! మా యుదయపురి రాణిగారు మీకిది బహుమానముగా నిచ్చిరి గైకొనుఁడు" అని వానిచేతిలో నుంచెను. ఫకీరు ఆ మొహరీ గైకొనెను గాని ఇందిరను జూచినప్పటి నుండియు వాని ముఖ వికాస మొకతీరున మాఱినది. ఆతఁడు కొంత నడుమ మఱుకుఁ దనలో నేమేమో విచారించి కడకుఁదన హృదయమును బట్టలేక నామెతోఁ నిట్లు సంభాషించెను.

"బాలా! నీ వెవ్వతెవు ?"

"ఉదయపురి బేగమ్‌గారి దాసిని"

'నీవు ముసల్‌మాన్ పడుచువా? లేక హిందూ పడుచువా?'

"నేను హిందువుల పడుచునే !"

"అట్లులైన నీ విచ్చటి కేలవచ్చితివి ?"

"నేను రాలేదు. నా గ్రహచారమే న న్నిచ్చటికిఁ దెచ్చెను."

అంతటితోఁ దృష్టివహింపక ఫకీరామె నింక నేమేమియో యడుగఁ దలంచెను గాని ఇంతలో నిందిర యచ్చట నుండనొల్లక ఫకీరులతో నేమి మాటలని లోనికిఁబోయెను. ఫకీరు దృష్టియంతయుఁ గొంతవఱకు నిందిరవంకనే యుండెను. మొగముఁ జిట్లించుకొని యించుక కన్నులుమూసి మీఁదివైపునకు విలోకించి యోచించుచు తన కేదియో సంగతి జ్ఞప్తికివచ్చిన ట్లాతఁడు నటింపఁ దొడఁగెను. ఆదినము నుండియు ఫకీరు తప్పక ప్రతిదినము జనానాలోనికి భిక్షకై వచ్చుచుండెను. అచ్చటి ద్వారపాలకులును సేవకులును వానికి స్నేహితులై భక్తివినయములతోఁ జూచుచున్నందున నా ఫకీరప్పు డప్పుడు ఇందిర విషయమై వారితోఁ బ్రసంగించుచుండెను. తన చమత్కారమున నా ఫకీరు వారికెట్టి యనుమానమును గలుగనీయక యే, యేమో మాటలవరుస కడిగినట్లడిగి మెల్లమెల్లగ నెల్ల వృత్తాంత మును సంగ్రహించుచుండెను. ఇందిర దూరముగ నొక మందిరమున వసించి యుండెననియు, ఉదయపురి ముట్టిన పదార్థము లెవ్వియు భుజింపదనియు, జనానాలో నుండి తన యింటికిఁ బోయినతరువాత స్నానము గావింపకయే యశనంబు గుడువదనియు, మహమ్మదీయుల జనానాలో నుండినను, స్వకులాచారముల కించుకంతయు లోపము గల్గనీయక మెలఁగుచుండె ననియు. నా ఫకీరువిని, యిందిర సద్వర్తన మున కెంతయో సంతసించెను. ఆ సంగతులతో పాటుగ, దుర్గాదాసు చరిత్రముగూడ నాతఁడెఱింగి, యాతఁడు మాఱువేషము వేసికొని

ఢిల్లీనగరమునకు వచ్చుటయు, జనానాలోఁ బ్రవేశించుటయు, మొదలు కొని యాతఁడు చెఱలోఁ బెట్టఁబడిన వఱకు విన్నంతనే ఫకీరు దుర్గాదాసు సాహసమున కెంతయో యాశ్చర్యమొందెను. ఇందిరా దుర్గాదాసుల నెట్లులైన శత్రువులనుండి తప్పింపవలెనని మన ఫకీరు దృఢనిశ్చయుఁడై, అందు విషయమై దినదినము తన శక్తికొలఁదిఁ బ్రయత్నించుచుండెను. అతఁడు కడు బుద్ధిశాలియై యింతఁ జెప్పిన నింత గ్రహించుకొనువాఁ డగుటచేతను, ప్రతిదినము జనానాలోనికి వచ్చుచుఁ బోవుచుండుటచేతను, అచ్చటి సేవకులతోఁ దఱచుగఁ బ్రసంగించు చుండినందునను, తదితర సంగతులుగూడ నెన్నియో ఫకీరు గనిపట్టెను. అందువలన రోషన్ ఆరాకును, ఉదయపురికిని గల వైరమును, మసావదుయొక్క స్వభావమును, ఫరక్ షైరునకు మనసులో నున్న కోరికయు, మొదలుగాఁ గల రహస్య వృత్తాంతము లన్నియు నాతనికి స్పష్టములైనవి. వేయేల? జనానాలోని విశేషములేమని యొక్కొక్కప్పుడు మహమ్మదీయ సేవకులే వాని నడుగుచుండిరి. ఆ ఫకీరు అద్వితీయ ప్రజ్ఞాధికుఁడనియు, మహానుభావుఁడనియు, త్రికాలజ్ఞుఁడనియు, ఇంతటి మహాత్మ్యముగల ఫకీరు నింకెందును జూడమనియు, ఆతఁడనేక విద్యలు నేర్చుకొనిన ఘటకుఁడనియు, దృఢముగా నమ్మకము జనించినందున మహమ్మదీయ సేవకులందఱు వానికిఁ బూర్ణముగా వశులైరి. సేవకులతో సంభాషించి నప్పుడెల్ల నా ఫకీరు తన జేబులోని కాగితమును దీసి అందుపై నేమియో వ్రాసికొనుచు మరలఁ దన జేబులోఁ బెట్టుకొనుచుండెను.

ఇట్లు సంచరించుచు నా ఫకీరు తన నిత్యాచారాను సారముగ నొక దినముదయపురి మహాలులోనికిఁ బోయెను. ఆ నాఁ డాజనానాలోఁ గడు కల్లకల్లోలముగ నుండెను. సేవకులందఱుఁ దత్తఱపడుచు నలు వంకలకుఁ బరుగిడఁ దొడంగిరి. విచారాయత్తచిత్తయై యుదయపురి నోటమాటరాక కన్నీరు గార్చుచు నొకమూల వగచుచుండెను.

పరిచారికలందఱును కేకలు వేయుచు నిటునటుఁ దిరుగుచుండిరి. మఱి కొందఱు భటులు గూతులును గోతులును వెదకఁజొచ్చిరి. అప్పు డే దివియో కార్యముపైఁ బోయి, మసావ దెచ్చటనుండియో వచ్చుచు, నా కలకలమంతయు నవలోకించి, యక్కజమొంది యంతఃపురములోఁ బ్రవేశించి, యేమి జరిగెనో చెప్పుమని యొకదాసి నడుగ నామె విచారించుచు, "నాయనా! ఇంకేమున్నది? మన యిందిర యెచ్చటను గానరాకున్నది. ఈ నగరమంతయు వెదకితిమి. దేవిగారు భోజనము చేయక ఆమెకై విచారించుచున్నారు." అని నుడివెను. ఆ మాటలన్నియు మసావదునకు బిడుగులవలెఁ దోఁప రెండుచేతులతోడను గుండెలు బాదుకొనుచు "హా! ఇందిరా! ఇందిరా!" అని నేలఁబడి పెద్దరోదనము సేయుచుఁ బొర్ల నారంభించెను.

ఈ సంగతు లన్నియుఁ గనిపట్టి, ఫకీరు భయభ్రాంతుఁడై ఇందిర యే మయ్యెనాయని తనలో నిట్లు వితర్కింప సాగెను. "ఔరా! ఎంత చమత్కారము? ఇంతలో నిందిర యేమగును? నిన్ననేకదా యామెను జూచితిని? జనానాలోనుండి తప్పించుకొని యెచ్చటికైనఁ బాఱిపోయి యుండునా? ఏమీ? అట్లు పాఱిపోవుట కేమియుఁ గారణము గానరాదే? ఉదయపురి యామెననేక విధములఁ బోషించుచుండ నింత యాకస్మికముగఁ బోవుటకుఁ గతమేమి? ఒకవేళ పాఱిపోయె ననుకొనెదనన్న దనయన్నయగు దుర్గాదాసునుగూడ నెట్టులైనఁ దప్పించి తనవెంటఁ గొంపోవును గాని తా నొక్కతయె పోవునా? కావున నిట్టు లెంతమాత్రమును జరిగియుండదు. ఆమె నే దుర్మార్గురాలైన మోసపుచ్చి యుండవచ్చును. ఎవ్వరు మోసపుచ్చెదరు? ఆమె కిందు శత్రువు లెవ్వరును లేరే?... సరియే! తెలిసినది ఉదయపురిపై బద్ధవైరము వహించి రోషన్ ఆరాయే యీ కార్య మొనర్చి యుండును. కాకున్న నితరు లింతటి సాహస మొనర్పరు. ఉదయపురిపైఁ దన కసిఁ దీర్చుకొనవలయునని యెంచి,

యామెకుఁ బ్రియసఖివలె చరించుచుండిన యిందిర కేమియో మోసము గావించియుండును. ఇంతియకాక రెండు మూఁడు దినముల నుండి ఫరక్ షైరు ఉదయపురి జనానాయొద్దకు వచ్చి, యచ్చటఁ గొంత సేపుండి తొంగి తొంగి చూచుచుఁ బోవుచుండుట నేను రెండుసారులు కనిపట్టితిని. ఏమో యనుకొంటిని గాని వాని దొంగచూపులకుఁ గారణము గ్రహింపఁజాలక పోయితిని. రోషన్ఆరా తన సేవకులలో నెవ్వరిపైనిఁ దనకు నమ్మకములేనందున, తనకు ముఖ్య సేవకుఁడగు ఫరక్ షైరుచేతనే యిట్టి రహస్యమైన కార్యములు చేయించును. కావున నీ మోసముగూడ ఫరక్ షైరు వలననే గావింపఁబడినదని యూహించెదను. వాని నెట్టులైన వశము గావించుకొంటినా నిజమేమియో తేలఁగలదు. అయిన నా మూర్ఖుని నావలలో నెట్లు వేసికొనవలయు ? ......సరియే ! తెలిసినది. తనపై రోషన్ఆరా కనురాగము జనింపవలయునని ఫరక్ షైరు ఎన్ని దినములనుండియో ప్రయత్నించుచుండెనుగదా ? కావున నీ కోరిక నెఱవేర్చెదనని వానికత్యంత దురాశఁ గల్పించి, మార్జాల నఖములచేఁ దయారుచేయఁబడిన యుంగరములు వానికొసంగి మెల్లమెల్లగ నా వలలో వేసికొనెదను.”

అని ఫకీరు తనలో నిశ్చయించుకొని యుదయపురి జనానాలో నుండి బయలుదేఱి, ఆరబ్బీ హిందీ పద్యములు బిగ్గరగఁ జదువుచు, మామూలుకన్న నా దిన మెక్కుడుగఁ బాటలుపాడుచు, “అల్లా మిమ్ము రక్షించుగాత” మని యెల్లర దీవించుచు రోషన్ ఆరా మహాలులోనికిఁబోయెను. ఆతఁడామహాలులోఁ బ్రవేశించినంతనే ఫరక్ షైరు వానికెదురై భక్తి వినయములతో సలాములుచేసి కట్టెదుట నిలువఁబడెను. ఫకీరు వానినిఁజూచి చిఱునవ్వు నవ్వుచు “ఫరక్ షైర్ ! మాకానందమైనది. నీవు కడు బుద్ధిమంతుఁడవు. స్వామిని యాజ్ఞయన్న శిరమున ధరించుకొని తత్క్షణమే నిర్వర్తించుచుందువు. నీ స్వామిని కింక నీపైఁ బూర్వముకన్న నెక్కుడుగ ననుగ్రహము జనించును.

నీకు మంచిదినములు సంప్రాప్తమైనవి. మేము రమల్ లెక్కచూచి చెప్పుచున్నాము. నీ హృదయమునఁ బెక్కునాళ్ల నుండి యున్నకోరిక త్వరలోనే నెఱవేఱును. నీకొక గొప్పదశ కొలఁదికాలములోఁ బట్టనున్నది" అని వచింప, ఫరక్షైరా మాటలన్నియు విని నవ్వుచు నూరకుండెను. అంతట ఫకీరు "ఏమి నవ్వెదవు? మే మనృత మాడుచుంటి మనుకొంటివా యేమి? నీ ముఖము చూచినంతనే నీ హృదయమునఁ గలకోరిక మాకుఁ దెలిసిపోయినది. వలయునేని నీ కెఱింగించెదము రా." అని వానిచెవిలో నేమో రహస్యముగఁ జెప్పెను. తోడనే ఫరక్షైరత్యద్భుత మొంది వెలవెలఁ బోయి "అరే! యీతఁడు సామాన్య ఫకీరులవలెఁ గానరాకున్నాఁడే! నా మనసునఁగల రహస్యము వీని కెట్లు తెలిసినది? ఈతఁడు సాక్షాత్తుగ అల్లాయొక్క యవతారమని చెప్పుటకు సందియము లేదు. ఇదివర కెందఱనో ఫకీరులను జూచితిని గాని, అందఱును ధనముస కాశించెడు వారే! ఇట్టి మహానుభావుఁడు నా కెచ్చటను గానరాలేదు. వీనితో నెక్కువగ స్నేహముఁ జేసికొని వీని యనుగ్రహమునకుఁ బాత్రుఁడనైనచో నా కోరిక ఫలించుటకు సందియములేదు."

అని భావించుకొని, వానికి మరల సలాములుచేసి, "స్వామీ! తమ రెన్నిదినము లీగ్రామమున నుండెదరు?" అని యడిగెను. అందులకు ఫకీరు, "ఎన్నిదినములో మాకు నిర్ణయమున్నదా యేమి? ఎప్పుడు బుద్ధి పుట్టిన నప్పుడు మఱియొక గ్రామమునకుఁ బోయెదము. ఎచ్చటెచ్చట భక్తులుండినను వారి కోరికలు తీర్చుచుండ వలయునని మాకు మా గురువుగారి యాజ్ఞయున్నది. కావున భక్తులయొక్క మనోభీష్టములు దివ్యదృష్టివలన గ్రహించి నెఱవేర్చి వారిని సంతోష పెట్టుచు నూరూర సంచరించుచుందుము. నిన్నుఁ జూచినంతనే నీ సంగతి యంతయు మాకుఁ దెల్లమయినది. ఈ జనానాలో నున్న సేవకులందఱికన్న నీవు బుద్ధిమంతుఁడవు. అల్లాపై నీకు విశేషముగ భక్తి

కలసు. ప్రతిదినమును దప్పక నమాజు చేయుచుందువు. నీయట్టి భక్తుని మే మెక్కడను జూడలేదు." అని యింక నేనేమియో చెప్పుచుండ ఫరక్ షైరు కోరించెను రహస్యము మాటాడవలసియున్నది గాన తన గృహమునకు విచ్చేయవలయునని వినయముగ వాసిని బిలిచి, వానితో గూడ తన గృహమునఁ బ్రవేశించి యొకగదిలో రహస్యముగ వానితో నిట్లు సంభాషించెను.

"ఫకీర్జీ! తిమరు సాక్షాత్తుగ నల్లాయనుటకు సందేహము లేదు. మిమ్ము నాశ్రయించిన భక్తుల నెందఱనో వారికోరికలు దీర్చి రక్షించినారు. కాని నే నందఱవంటి వాఁడనుగాను. మీ బిడ్డఁడను. కావున తమ రెట్టులైన ననుగ్రహించి నా వాంఛ గూడఁ దీర్చి కాపాడ వలయును. నా కార్యము ఫలించిన పిమ్మట చంద్రునకొక నూలిపోఁగువలె భక్తి పూర్వకముగఁ దమకేదైన బహుమానము సమర్పించుకొనెదను."

ఆ మాటలకు ఫకీరు నవ్వుచు,

"ఓయీ పిచ్చివాఁడా! మే మట్లు లంచములు పుచ్చుకొను వారముకాము. భక్తులయొక్క కోరికలు దీర్చుటయే మాకువిధి. లంచములు పుచ్చుకొనకయే పరోకార మొనర్పవలసినదని మా గురువులు మాకాజ్ఞాపించినారు. మేము చెప్పినట్లు నడచుకొను వారికెట్టి కోరికలున్నను తీరకమానవు."

"అ దెఱింగియేకదా మిమ్మింతగా బ్రార్థించుట? తమరెట్టులైన నీ దీనునిఁ గటాక్షింపక తప్పదు. తమరు సెలవిచ్చినట్లు నేను నడచు కొనెదను."

"ఓయీ! నిష్కారణ మేల శ్రమపడెదవు? మే మొక యుంగర మిచ్చెదము. అది వ్రేలి కిడికొని యెంతమాత్ర మన్నృత మాడకూడదు. అట్టులైన తత్క్షణమే వారికోరిక నెఱవేఱును. కాని యట్టులుండుట దుర్లభముగదా.

“అబ్బబ్బా! తమ కెంతమాత్ర మట్టి యపోహ గలుగవలదు: తమ సెలవైనచోఁ బ్రాణములు పోయినను నే నొక్క యబద్ధమైన నాడెదనా?”

“ఫరక్‌షైర్! నా మాటవిను. మేమిచ్చు నుంగరము ధరించుకొని యనృతమాడినచో నెన్నోకష్టములు చేకూఱి పదిదినములలోఁ దప్పక మరణము సంభవించును. మానవజన్మ మెత్తిన తరువాత పరిహాసమునకైన నొక్క యనృతమాడకుండ నుండలేముకదా! పిదప నీ యిష్టము! నీవే యోచించుకొనుము”

ఫకీర్జీ! నన్ను మీ రేల నమ్మరు? అనృతమాడుటకు నాకేమి యవసరమున్నది? తమ సెలవు ప్రకారము కలలోనైన ననృత మాడక సంచరించెదను. ఇంక నా కా యుంగరమును సమర్పింపుఁడు.”

“ఉంగర ముంగరమన్న మాటలమీఁద నున్నదా యేమి? దాని ప్రభావమెట్టిదియో నీ వెఱుంగుదువా? ఒకవేళ నీవే యాయుంగరము ధరించుకొని మీ బేగముగారి యొద్దకుఁ బోయితి వేని యామె కంటికి నీవొక దివ్య సుందర పురుషునివలెఁ గనఁబడెదవు. వెంటనే యామె నిన్ను మెచ్చుకొని తన నెత్తిపైఁ బెట్టుకొనును. కావున నిట్టి మహాత్మ్యముగల యుంగరము పుచ్చుకొన్నంతనే సంతోషము గాదు. అందులకు వ్యతిరేకముగ నడచిన రెండు వారములలో నీవు మృత్యుదేవత కాహారమయ్యెదవు. ఒకవేళ నీసంగతి మాగురువులవారికిఁ దెలిసిన అట్టి నీచునకట్టి యుంగరమేల యిచ్చితివని నాపై కోపము వహింతురు. కావున నిద్దురలోనైనను ఎవ్వరనృత మాడరో వారే యీ యుంగరము గైకొనుట కర్హులు.”

“ఫకీర్జీ! అనృత మాడనని యింకెంతగా మీకు నేను నమ్మకము గల్పింపఁ గలను? అయ్యో! మీ రేల నమ్మరు? కావలయునేని మీరు నన్నుఁ బరీక్షింపవచ్చును. నే నెప్పుడును

నబద్ధమాడను – ఆడను – ఆడను. ముమ్మాటికి నబద్ధమాడను మీా పాదములు సాక్షి."

"షరక్‌షైర్! నీ వస్మృత మాడవని నాకిప్పుడు కొంచెము నమ్మకము గల్గినది. అయినను నిన్నుఁ గొంచెము పరీక్షించినఁ గాని యీా యుంగరమీాయను. కావున నే నడిగెడు ప్రశ్నలకు నిక్కమైన ప్రత్యుత్తరము లిమ్ము."

"చిత్తము, తమ రడుగవచ్చును. నేను నిక్కమే వచించెదను."

"సరియే! నీ వానాఁడు మీా బేగమ్‌గారి చంద్రహారముల హరించి యేమిచేసితివో చెప్పుము"

అని యడుగ షరక్‌షైరు తన దొంగతనము ఫకీరు గ్రహించి నందుకు ఆశ్చర్యమొంది యాతఁ డద్వితీయుఁడని మఱింత నమ్మకము వహించి,

"స్వామీా! అవి చంద్రహారములు కావు, సూర్యహారములు. అవి గొనిపోయి నే నొక వర్తకునకు రహస్యముగ విక్రయించితిని."

"అవునోయి! అవి చంద్రహారములు కాక సూర్యహారములని తెలియదా? నీ వొక వర్తకునకు విక్రయించి ధనము దెచ్చుకొంటివని తెలియదా? ఊరకే నిన్నుఁ బరీక్షింప వలయునని యడుగుచుంటిని. ఇంకొకటి వినుము. మీా రోషన్ ఆరా బేగమ్‌గారు ఎందఱు సేవకులను బట్టి తన చెఱలోఁ బెట్టెనో చెప్పుము."

"అయ్యా! ఇరువది ముగ్గురు."

"షరక్‌షైర్! ఇదిగో చూడుము నీకు దాఖలా చూపించెదను."

అని ఫకీరు తన జేబులోనున్న యొక కాగితమును దీసి అందుపై వ్రాసిన పంక్తులన్నియు వాని కగపడకుండ తన చేతితో మూసి యొక్క పంక్తి మాత్రము వానికిఁ జూపి "చదువుము" అని వాని నడిగెను. అప్పుడు షరక్‌షై రాకాగితమును జూచి "రోషన్ ఆరా చెఱలోఁబెట్టి యుంచిన సేవకు లిరువదిముగ్గురు" అని చదివి "అతి

రహస్యముగ జనానాలో జరుగుసంగతులు గూడ నీతఁ డిదివఱకే గ్రహించెనే! ఆహా! వీని దివ్యదృష్టి యెంత వర్ణనీయము" అని యద్భుత మొందెను. పిదప ఫకీరు వానినిఁ జూచి,

"ఫరక్ షైర్! నిన్నరాత్రి నీ స్వామిని యాజ్ఞప్రకార మేమి చేసితివో చెప్పుము."

అని యడిగెను. కాని యా మాటలకుఁ బ్రత్యుత్తర మీయక ఫరక్ షైరు తనలో నేమియో యోచించుచుఁ గాలయాపనము సేయుచుండెను. అప్పుడు ఫకీరు వాని వికారములు గని పట్టి "ఏల సందేహించెదవు? మీ స్వామిని యాజ్ఞ నీ వెన్నఁడును దాఁటవని నే నెఱుఁగుదును. కావున నిన్న రాత్రి యేమి జరిగెనో నిక్కమెఱింగింపుము. సన్న సన్నగ పోయి, తీసికొని వచ్చి, తరువాత నేమి చేసితివి? నాకుఁ దెలియక యడుగుచుంటి ననుకొంటివా యేమి? దివ్యదృష్టివలన సంగతులన్నియు నే నిదివఱకే గ్రహించితిని. అయినను నిన్నుఁ బరీక్ష సేయవలెనని యడుగుచున్నాను చెప్పుము." అని యడుగుచుండ, ఫరక్ షైరు తన హృదయమునఁ గొంతవఱకు శంకించి దివ్యజ్ఞానమువలన జరిగిన దంతయు నదివఱకే ఫకీరు గ్రహించినాఁడనియు, తాను రహస్యమును జెప్పకున్నమాత్ర మేమిలాభమున్నదనియు, తన్నుఁ బరీక్షించుట కడుగుచున్నాఁడనియుఁ జెప్పకున్నఁ దన కుంగరము లభింపదనియు నెంచి "ఫకీర్జీ! నాయందు మీకు నమ్మకము లేదేమో చెప్పెదను వినుఁడు. ఉదయపురి పైఁగల యమునాయచే నామె దాసి యైయున్న హిందూపడుచు నెట్టులైనఁ బట్టి చంపింప సమకట్టి మా బేగమ్‌గారు సమయము చిక్కినప్పు డామెను బట్టి రహస్యముగఁ జెఱలో నుంపవలయునని నా కాజ్ఞాపించినారు. ఇదివఱకు రెండు మూఁడు దినములనుండి యామెను బట్టికొనుటకై ప్రయత్నించుచుంటిని గాని వీలైనదికాదు. నిన్నరాత్రి ఆమె యొంటరిగ నెచ్చటికో పోవుచుండెను. అప్పు డెవ్వరును సమీపమున

లేనందున చీకటిగ్రైయుండుటచేతను, నామెను బలిమిని బట్టుకొని నోటిలో గుడ్డలు గ్రుక్కి కాళ్లు చేతులును గట్టి మా చెఱలోనుంచితిని మా బేగమ్‌గారి సంగతి యెవరితోడను జెప్పవలదని నాకుఁ గఠినముగ నాజ్ఞాపించినారు.

"శబాస్! యజమానుని శాలియందు నీ కెంత భక్తియున్నదిరా బాబా? మంచిపని చేసితివి. ఇంతయును కాఫరులు కడు దుర్మార్గులు, వారి నేమి చేసినను చేయవచ్చు."

"ఫకీర్జీ! ఇంక తమ యనుమానము దీఱిపోయినదా?"

"ఏ మనుమానములే! నీ సంగతినే నెఱుఁగనా యేమి? నీ యదృష్టము మిక్కిలి చక్కఁగ నున్నది. మాయొద్దనున్న యుంగరములు సంపాదింప వలెనని యిదివర కెందఱో మాకు సేవఁ జేసిరి. కాని అందఱును నీవలె సదృష్టవంతులు కాలేదు. పోనీ ఈ యుంగరమును పెట్టుకొని నీకోరిక తీర్చుకొనుము పో."

అని తన సంచిలోనున్న యొక యుంగరమును దీసి వాని కీయఁబోయి, "ఫరక్‌షైక్! ఎందులకు ప్రయాసపడెదవు? ఇంత మట్టునకు నీవు నిజమే పల్కినను, ఇఁకమీఁదఁ గూడ నిట్లే యుండ వలయును, అది బహుకష్టము. ఇదియుఁగాక నీ వెక్కడ? నీస్వామిని యెక్కడ? నీపై నామె కనురాగము జనించు టెక్కడ? వృథా ప్రయాస మొంది ప్రాణముమీఁదికిఁ దెచ్చుకొనకు. మామాటవినుము. పొరఁబాటుచేసైనను నొక యబద్ధ మాడవలసివచ్చును." అని పలుక ఫరక్‌షై.రాతురతతో "అమ్మమ్మా! యెంత మాటెంతమాట! నేనింక నెన్నఁడు నసత్యమాడను. తప్పక నా కీ యుంగరము దయ చేయుఁడు" అని పలికినంతనే ఫకీరుసందేహించు చున్నట్లునటించి "సరే! బాబా! నా చేతులతోడనే నీ కీ యుంగరముఁ బెట్టెదనురా!" అని యా యుంగరము వాని వ్రేలికిఁ బెట్టెను. పిల్లిగోళ్లతోఁ జేయఁబడిన యుంగరములు సాధారణముగా ఫకీరులవద్దనుండును. ఆ యుంగర

ములు ఫకీరులు తమచేతులతో నిచ్చిన యెడల నందెంతయో మహత్త్వ ముండుననని మహమ్మదీయులకు నమ్మిక. ఇంతియకాక జ్యోతిషము నందుఁ గూడ వారికి విస్తారముగ విశ్వాసము గలదు. ఆ కారణమున ఫరక్షైరు తోడనే అమందానంద మొంది ఫకీరున కెన్నియో సలాములు చేసి, "ఫకీర్జీ! నే నింక జనానాలోనికిఁ బోవచ్చునా?" అని యడిగెను. అందులకు ఫకీరు, "మీ స్వామిని యేమిచేయుచున్నది? నిన్నెప్పుడు రమ్మనెను?" అని వానినడుగ "స్వామీ! ఉదయమునననే రావలసినదని నిన్నరాత్రియే నా కాజ్ఞాపించినారు. ఇప్పుడింత ప్రొద్దెక్కెను. పోయినచో నా పనియేమగునో" అని ఫరక్షైరు భయపడుచుఁ బలికెను. తోడనే మన ఫకీరు "అరే బాబా! మఱల నీ కిట్టి పిచ్చిసందియము లేలరా? నీ కంత యనుమానముండిన నొక్కసారి మీ రాణిగారివద్దకుఁ బోయిరా! ఉంగరము ప్రభావమంతయు నీకుఁ బూర్ణముగాఁ దెలియఁగలదు. నీవు వచ్చువఱకు నే నిందే యుండెదను. వేగముపో! పిదప మాటలాడుకొనవచ్చును."

అని చెప్పినంతనే ఫరక్షైరు మఱల నిప్పుడే వచ్చెదనని చెప్పి రోషన్ఆరా మందిరమునకుఁ బోయెను. అప్పుడు రోషన్ఆరా తన మందిరమునఁ గూర్చుండి, తన యాజ్ఞానుసారముగ గతరాత్రి ఫరక్షైరు గావించిన సాహసకృత్యమును దలంచుకొనుచు "వాహ్వా! ఇన్నినాళ్లకు నా మనోభీష్టము కొంతనెఱవేఱినది. ఇంక నామాయలాడి తుళ్లుపాటంతయు నడఁగును. ఇంకను గసిదీర్చుకొని యా దుర్మార్గురాలిని పాతాళమున కణఁగఁ ద్రొక్కకున్న నేను నిద్దురపోయెదనా? న్యాపైఁ గొండెములు గల్పించి తన మగనితోఁ జెప్పినంతమాత్రమున నా దుర్మార్గురాలు నేను భయపడెదనని యనుకొనెను గాఁబోలు. దాని అతిశయ మంతయునింక నెన్నాళ్లో చూచెదను. ఫరక్షైరొకఁడు నా ఆజ్ఞలోనుండి యెంతటి సాహసమైనఁ గావించునుగదా? ఇందిర నెట్టులైనను జంపించునంతవఱకు వానినెప్పుడు మంచిమాట

లాడవలెను. ముఖస్తోత్రము చేసినవాఁ డెంతయో యుప్పొంగుచుం డును. ఇదిగూడ నాకార్యమునకు సహకారియేకదా" అని యామె యోచించుచుండ నింతలో ఫరక్షైరు రోషన్ఆరాను సమీపించెను. అప్పుడామె చిఱునవ్వు నవ్వుచు నాతనిని జూచి "ఓహో! ఫరక్షైర్! శబాసురా! నీ చాతుర్యమునకు నేను మెచ్చితిని. నీయట్టి సేవకుఁడుండ మాకేమి కొదువ? ఇతరుల కేరికిఁ దెలియకుండ నిన్నరాత్రి నీవుచేసిన సాహసమునకు నే నెంతయో యద్భుతమొందితిని. బళే! బళే! ఈ కాసులపేరును నీవు బహుమానముగఁ గైకొనుము. నీకెట్టి లోపమును నేను రానీయను. నీ కోరికలన్నియు నేను దీర్చెదను. నీకుఁ గావలసిన దేదియో నన్నడుగుము" అని యెన్నోవిధముల వాని కానందము గల్గఁజేసెను. స్వామిని యిచ్చిన కాసులపేరు తనమెడలో వైచుకొని ఆమె మాటలకుఁ దనకాయ ముప్పొంగ "ఆహా! ఉంగరము ప్రభావము!" అని సంతోషించుచుండెను.

రోషన్ఆరా ఎంతటి క్రూరురాలైనను నేదైననొక కార్యముఁ జేయఁ దలపెట్టినప్పుడు తన సేవకులఁ దేనెలొలుకు పలుకుల సంతసము గలుగఁజేసి వారివలనఁ దనకార్యము చేయించుకొనుట ఆమెకు స్వభావమై యుండెను. ఈ సంగతి మన ఫకీరదివఱకే యెఱుంగును గావున, ఆ తొలినాఁటిరాత్రి యిందిరను ఫరక్షైరు చెఱలోనుంచి నందుకు వానిని రోషన్ఆరా ఎంతయో కొనియాడుచుండునని ఎంచి ఫరక్షైరు నామెవద్దకు బంపెను. కాని యా మూర్ఖుఁడీ మర్మమెఱుం గఁడు గావున నంతయు నుంగరము ప్రభావమేయని నమ్మికొనెను.

అట్లు రోషన్ఆరా ఫరక్షైరునెంతో మెచ్చుకొని వానితోఁ గొంతవఱకు సంభాషణముఁజేసి ఇందిరను చంపువిషయమును గూర్చి వానికిఁ దెలియఁజేసెను. వినయముగ ఫరక్షైరు ఆమె చెప్పినట్లు చేసెదనని యొప్పుకొని, ఫకీరుతనకై వేచియుండునని యెంచి కొంత సేపటికి మఱల వానివద్దకువచ్చెను. వాని ముఖలక్షణములును, మెడలో

నున్న కాసులపేరును జూచి ఫకీరు చిఱునవ్వు నవ్వుచు, దూరమున నుంచియే "షరక్షైర్! చూచితివా? నీతో నేను తొలుతనే చెప్పితిని గదా? నీ స్వామిని నిన్నెంత గౌరవించెను! ఎంత మర్యాదగ మాటలాడెను! బళే! ఈ కాసులపేరు ధరించుకొని క్రొత్త పెండ్లి కొడుకువలె నున్నావే." అని పలికెను. ఆ మాటలకు షరక్షై రాశ్చర్యమొంది, "అరే! ఈ ఫకీర సాధ్యుఁడుగ నున్నాఁడే! నే నేమియుఁ జెప్పకమునుపే జరిగినదంతయు నీతఁడే చెప్పుచుండెను! ఓహో! వీని ప్రభావ మద్వితీయమైనది." అని తనలో ననుకొనుచుండ ఫకీరు మరల వానినిజూచి, "ఏమట్లాశ్చర్య మొందుచుంటివి? ఆమె నీతోఁ గొన్ని రహస్యములు గూడఁ జెప్పినది. ఆ రహస్యము లేవియో నే నెఱుఁగుదునుజుమా."

"ఫకీర్జీ! మీరు సాక్షాత్కరించిన యల్లావలె నున్నారే! ఆమె నాతోడ రహస్యములు చెప్పిన సంగతిగూడ మీ రెఱుఁగుదురా? ఆహా! మీ యుంగరము నన్నెంత ధన్యునిఁజేసెను. మా బేగమ్‌గారు నన్నుఁజూచినంతనే యెంతో గౌరవముజేసి యీ కాసులపేరు బహుమానమిచ్చిరి. ఇంతకన్న నాకేమి కావలయు?"

"ఓయి వెఱ్ఱివాఁడా! ఇంత మాత్రమునకే సంతోషించెదవా? నీవల్ప సంతోషివలె నున్నావే! రెండు మూఁడు రోజులవఱకు నూరక యుండుము. ఈ యుంగరము ప్రభావమంతయు నీ శరీరమునంతను నిండినంతనే ఆమె నిన్నుఁజూచి కౌఁగిలించుకొనుట గూడ నారంభించును."

"హీ - హీ - హీ - (అని నవ్వుచు) అద్ది - అద్ది - నాకింకేమి కొదువ? క్రమ క్రమముగా నేను పాదుషా నయ్యెదను గాఁబోలు."

"సందేహమేమి? ఇంకొక యుంగరము నాయొద్దనున్నది. అది పెట్టుకొని పాదుషావద్దకుఁ బోయితివేని అతఁడు నిన్ను వెస నెమలిగద్దియపైఁ గూర్చుండఁబెట్టి నీకు సేవచేయును. కాని కొన్నిదినములు పోయినఁగాని నీకాయుంగరమియ్యను."

"వాహ్వా ! వాహ్వా ! ఇంక నేను ఢిల్లీకి పాదుషానే ! అప్పుడు నేను వందలకొలఁది స్త్రీలను బెండ్లాడెదను."

"సరి ! ఇది బాగుగానున్నదే ! నీకెందుకంత ప్రయాస ? నీ సొమ్ము ఖర్చుపెట్టుకొని నీవు పెండ్లాడ వలయునా ? మఱియొక యుంగరము నావద్దనున్నది. అది పెట్టికొంటివేని నిన్నుఁజూచిన ప్రతి స్త్రీయును తన్నుఁ బెండ్లాడుమని నిన్నుఁ బ్రార్థించును."

"ఓహోహో ! ఇంక నేను మానవ మాత్రుఁడనుగాను. ఫకీర్జీ! ఆ యుంగరము లన్నియు నాకెప్పు డిచ్చెదరు ?"

"అబ్బా ! నీ కెందులకీ తొందర ? నీ సంగతి పూర్ణముగా నేను గ్రహించి ఆ యుంగరము లిచ్చెదనుగాని, యిప్పుడే ? అబద్ధములు మాత్రమాడకుము. ఏదీ ? మీ స్వామిని నీతో నేమేమి రహస్యములు మాటాడెనో చెప్పుము ! నీవు నిజము చెప్పెదవో లేదో మఱియొకసారి పరీక్షించెదను."

"అమ్మమ్మా ! (నోరు మూసుకొని) ఇంకను నన్నృతము లాడెదనా ? ఇదిగో వినుఁడు. ఆ హిందూపడుచు నెట్టులైనఁ జంపింప వలయునని మా యజమానురాలు నన్నుపాయ మడిగెను. నేను క్రూరాత్ముఁడనుగాను కావున, మెడ మాత్రమునఱికి భూమిలోఁ బాతి పెట్టెదనని చెప్పితిని కాని యందునకామె సమ్మతింపలేదు."

"సమ్మతింపకయేమన్నది ?"

"ఒకవేళ నుదయపురి తనదాసి కనఁబడలేదని పాదుషాతోఁ జెప్పకమానదనియు, పాదుషా తన సేవకులచే నెల్లెడల వెదకించు ననియు, నాసేవకులు తన మహాలులోఁగూడఁ బరికించి కానరానందున నేలత్రవ్వి చూచెదరనియు, నందువలన మోసము గలుగుననియుఁ జెప్పి భూమిలోఁ బాతిపెట్టకుండ, నొక త్రాడుగట్టి యమునానదిలో విడువుమని మా బేగమ్ నాకాజ్ఞాపించెను."

"త్రాడు కూడ నెందుకురా ? దంపుగ, సరే ! సగముచెప్పి యూరకుంటివేమి ? తుదకేట్లు చేయుటకు నిర్ణయించెను ?"

"నదిలోఁ బడవేయుటకే ! త్రాడు కట్టిక నొక్కమాఱు మేడ మీఁదనుండి నదిలోఁ బడవేసిన నీటిలోఁ బడినంతనే చప్పుడగుననియు, అదెవ్వరైన వినెదరేమోయనియు, ననుమాన మొంది, ఆమెనడుమున కొకత్రాడుగట్టి నేఁటిరాత్రి మేడపై దక్షిణపుదిక్కుననున్న బురుజుపై నుండి మెల్లగ నదిలో రెండుజాముల కాలమప్పుడు విడువుమని ఆమె నాకాజ్ఞాపించెను.

"ఈ రాత్రియేనా ! లేక రేపురాత్రియ ? అబద్ధమాడఁ గూడదుసుమీ ! జాగ్రత్త !"

"ఓహో ! నేఁటిరాత్రియే యీ కార్యము జరుగునని దివ్య జ్ఞానమువలన మీరెఱిఁగియు నేనబద్ధమాడెదనో లేదోయని నన్నిట్లు పరీక్షించుచున్నారా ? మీ చమత్కారము నే నెఱుఁగుదును. కాని ప్రాణములు పోయినను ఒక్క యనృతమాడెదనా ?"

"శబాసురా బాగుగ గ్రహించితివి ! నీకింత తెలివిగల్గుటకుఁ గూడ నీ యుంగరమే కారణము. సరేకాని, రెండు జాములరాత్రి యప్పుడే నదిలో విడుచుటకుఁ గారణమేమి ? మేడపై దక్షిణపుదిక్కున నున్న బురుజుమీఁద నుండియే విడువవలయునా ? మఱియొక చోటఁ గూడదా."

"ఫకీర్జీ ! మీ కెంత యనుమానమున్నది ? రెండు జాముల రాత్రి కాపనిఁజేసిన దెవ్వరికినిఁ దెలియదు. అప్పుడందఱు నిద్రించి యుందురుకదా ? ఇంతయకాక ఆబురుజు ఒక మూలనున్నది. అచ్చట జనసంచారము విశేషముగ నుండదని ఆ ప్రదేశ మేర్పఱుచుకొంటిమి. సరి ! ఈ సంగతికేమిగాని, ఫకీర్జీ ! నేనిట్టి క్రూరకృత్యములు చేయు చున్నాను. ఇందువలన నాకెంత పాపము సంభవించునోకదా ?"

"ఏమియు భయములేదు. ప్రభువుల యాజ్ఞ దిరస్కరించిన పాపముగాని లేకున్న నెట్టి కార్యముచేసినను పుణ్యముగలుగును. ఈ సంగతి ఖురాన్‌లో వ్రాయఁబడియున్నది. మన పైగంబరుగూడ నీ సంగతియే చెప్పినాఁడు. ఇంతకు నీ యుంగరము నీ వ్రేలనుండ నీ కెట్టిపాపమును నంటదు. కావున మీ స్వామిని యాజ్ఞచొప్పున నేఁటిరాత్రి సరిగా రెండు జాములకే యీ కార్యమును నీవు చేయ వలయును."

"మీ సెలవైనచో నాకేమియు సందేహముండదు. నేఁడు రెండు జాములరాత్రికే యొక్క నిముసమైన నెక్కువ తక్కువగాకుండ నా స్త్రీని నదిలోఁబడవేసెదను. మా యజమానురాలి యాజ్ఞ ప్రకారము సంచరించిన నాకేమియుఁ బాపముండదుకదా."

ఇట్లు ఫకీరు ఫరక్‌షైరువలన రహస్యములన్నియు గ్రహించి మఱల రేపువచ్చెదనని చెప్పిపోయెను. ఫరక్‌షైరుగూడ వానిని వీడ్కొని తనదారి నేగెను.

# ఇరువదితొమ్మిదవ ప్రకరణము

## ఆ బూ ప ర్వ త ము మీ ఁద

విమల వ్రాసిన యుత్తరము చూచి నప్పటి నుండియు రాజసింహుఁడు తన హృదయ మామెయందే యిడికొని తగు ప్రయత్నములు సేయుచుండెను. ఆతఁడు విమలకుఁ బ్రత్యుత్తరము వ్రాసి యొక సేవకుని చేఁ బంపెను. కాని మార్గ మధ్యమున నిరువురు మహమ్మదీయులు వానినిఁ బట్టి యా యుత్తరమును గ్రహించిరి. సామల్ పండితునిఁ దోడ్కొని శివసింగు భిల్లులతో వచ్చుచుండ నాతని నెదిరించి యోడి పాఱిపోయిన మహమ్మదీయులలో నిరువురుమాత్రము, ఆ బ్రాహ్మణుఁడు మఱల జవాబుగైకొని యొంటరియై వచ్చునని యూహించి, శివసింగును భిల్లులును వేఱొకమార్గమున నెచ్చటికో పోవుటఁ జూచి మఱింత ధైర్యము వహించి, మార్గమధ్యమునఁ గాచియుండి సామల్ పండితుని బట్టి యుత్తరము గొనవలయునని యచ్చటనే వేచియుండిరి. రాజసింహుని సేవకునిఁ బట్టి వానినుండి జాబును సంగ్రహించిన వారా మహమ్మదీయభటులే! వారా యుత్తరమును కడు జాగ్రత్తతోఁ గొనిపోయి, తమ యేలిక యగు సాదతుఖానున కొసఁగ నాతఁడా యుత్తరమును చెంతనున్నయొక సరదారుచేఁ జదివించెను. అందువలన సాదతుఖా నా యుత్తరము రాజసింహుఁడే వ్రాసెననియు, నాలుగైదు దినములలో విజయసింహునకు సహాయముగ వచ్చి, విమలను దోడ్కొని పోవక మానఁడనియు దెలిసికొని, భయాకుల చిత్తుఁడై కార్యోపాయముకొఱకు కొంత విచారించి, సైన్య సమేతుఁడై రాజ

సింహుఁడు వచ్చిన యెడలఁ దన సైన్యము స్వల్ప మగుటచే నప జయంబు జేకూఱునేమో యని శంకించి, తత్క్షణమ నాలుగువేల సైన్యములఁ బంపవలయు ననియు లేకున్న రాజపుత్రులవలనఁ గడు మోసము సంభవింపక మానదనియు నొక యుత్తరము పాదుషాకు వ్రాసి, తన సేవకునిచేఁ బంపెను. అప్పటినుండియు నేక్షణమున వచ్చి రాజసింహుఁడు తనపైఁ బడునోయని భీతిల్లుచు, నా సేనానాయకుఁ డతి జాగరూకత వహించి తనసైనికని కాయమును భద్రముగఁ జూచుచుం డెను.

ఉదయపురమున మన రాజసింహుఁడు గూడ సమర ప్రయత్న ముల శ్రద్ధనహించి నిరంతరమును బాటుపడు చుండెను. క్షత్రియ ధర్మాచరణమును, విశేష పౌరుషమును, పరోపకారమును నాతనికి సహజగుణము లగుట నన్నెల జేడు సకల మహమ్మదీయ సేనా వార్ధంబు నోడించి విమల నెట్టులైనఁ గాపాడ వలయునని పట్టు బట్టి యుండెను. ఆతఁడు లిఖించి యంపిన లేఖల నవలోకించి రాజపుత్రు లందఱుఁ బెండ్లికిఁ బ్రయత్నము సేయునట్లు యుద్ధవిషయమై ప్రయత్న ములు సేయుచుండిరి. వారందఱు రాజసింహునకుఁ బ్రత్యుత్తరములు వ్రాసి తమ ప్రయత్నములన్నియు వాని కెఱింగించిరి. రాజసింహుఁ డేకార్యముజేయఁబూనినను, వైకుంఠయోగి కెఱింగింపకయ గావింపఁడు గావున, నొకనాఁ డాతని దర్శించుటకై అచలేశ్వ రాలయంబునకుఁ బోయెను. ఆతఁడు పోవుసరికి, యోగి సమాధిలో నుండుటచే రాజసింహుఁ డా దేవాలయమునఁ గల యొక మంటపముపైఁ గూర్చుండి యాతనికై వేచియుండెను. ఇట్లుండఁ గొంత సేపటి కొక భిల్లాంగన, యొక పసిపాపని నెత్తుకొని ముద్దులాడుచు, ఏమేమో పాటపాడి యా బాలుని బుజ్జగించుచు, నంబర మార్గమునఁ బోవు పక్షులను వానికిఁ జూపుచు నా పర్వతమున నటు నిటుఁ దిరుగుచు నాలయము సమీపమునకు వచ్చెను. రాజసింహుఁ డా బాలునిఁ

జూచి, యాతఁడెవఁడా యని పరికించుచు, వాని వృత్తాంత మంతయు యోగివలనఁ దెలియఁగలదని వేచి యుండెను.

ఇంతలో యోగి జపము చాలించి, కన్నులు దెఱచి, యెదుట నున్న రాజసింహునిఁ జూచి, తనలోఁ జిఱునవ్వు నవ్వుకొనుచు తన జపమాల నొక గోడకొయ్యకుఁ దగిలించి, కమండలు వొకమూల నుంచి, వ్యాఘ్రాజినముఁ జుట్టఁ జుట్టి తలుపుసందునఁ బెట్టి, విబూది పండును గూఁటిలో నుంచి, దీపకళిక నచలేశ్వర స్వామివారి సమీపమున నుంచి, యందొక మూల వెలుఁగుచున్న యగ్ని హోత్రమున మఱిన్ని కట్టెలు వైచి, తన పాదుకలు దొడిగికొని, గర్భాలయము తలుపులను జేరవైచి యీవలికివచ్చెను. తోడనే రాజసింహుఁడు వాని పాదములకు నమస్కరించి తనభక్తి నంతయు వానియెడల వెల్లడిఁజేసెను. యోగి వానిని దీవించి ఆలయము వెనుకనున్న మంటపముపైఁ గూర్చుండి మాటలాడుకొన వచ్చునని రాజసింహు నచ్చటికిఁ దోడ్కొని పోయెను. ఆ మంటపముపైఁ గూర్చుండి యెవ్వరెట్టి రహస్యములు మాటాడు కొనినను పరులకుఁ దెలియుట దుర్లభము. చల్ల చల్లగ వీచు పిల్లగాలులకు హాయిఁ జెందుచు నాయోగి పుంగవుఁడును రాజ పుంగవుఁడును దమలో నిట్లు సంభాషించు కొనిరి.

“దేవా! నేనీ యాలయములో మంటపముపైఁ గూర్చుండి యుండ నొక భిల్లాంగన యొకబాలు నెత్తుకొని యచ్చటికి వచ్చెను. ఆ బాలుఁ డెవ్వఁడో?”

“రాజసింహా! నీ వెఱుఁగనే యెఱుఁగవా? ఆతఁడు జోధపుర నాయకుఁడు.”

“ఏమీ! చంద్రావతి కుమారుఁడా? అజితసింగా?”

అని యాతురతతో నడుగ, యోగి నయనపాలుఁడు చంద్రావతి యెడలఁ జేసిన మోసమును, ఇందిరా దుర్గాదాసుల ధైర్య శౌర్య ములును, పద్మచేసిన చమత్కారమును మొదలు గాఁగల వృత్తాంత

మంతయు సవిస్తరముగ వాని కెఱింగించి, 'యింకను గొన్నాళ్లు వఱకు నా బాలునిఁ దనయొద్దనే యుంచుకొనవలసి యున్నదని చెప్పెను. ఆ చరిత్రమంతయు విని, రాజసింహుఁడు నిశ్చేష్టితుఁడై పాదుషా దుర్నయమున కెంతయు రోషము వహించెను. పిదప నైకంఠయోగి వానిని జూచి,

"కుమారా! నీరాక కేదియో కారణ ముండవచ్చును."

"పరాభిప్రాయజ్ఞులగు మీ రెఱుఁగని సంగతు లేమున్నవి? రెండు మూడు దినములలోనే నౌరంగజేబుపై దండెత్తఁ బోవు చున్నాను."

"ఏమేమీ! రెండు మూడు దినములలోనా? కారణమేమి?"

"యోగీంద్రా! ఎఱుఁగుదురు కదా రూపనగరాధీశుఁడైన విజయసింహుని? ఆతని కూఁతురగు విమలాదేవిని బలవంతముగఁ గొనిపో వలయునని యెంచి పాదుషా తన సైన్యముల రూపనగరముపై కంపి పట్టణమును ముట్టడింపించెను. సహజ పౌరుష చిత్తుఁడగు విజయ సింహుఁడు వెఱవక ప్రాణంబులుండినంత వఱకు క్షత్రియవంశంబున కపయశంబు రానీయననిశపథముచేసి, తనకుఁ దోడుగ రమ్మని రాజులందఱ కుత్తరము లంపెను. పిదప విమల మృదుమధుర వచనంబులఁ దన యవస్థ నంతయుఁ దెలుపుచు తన తండ్రికిఁ దోడై తురకలకుఁ జిక్కకుండఁ దన్నుఁ గాపాడ వలయుననియు, లేకున్నఁ బ్రాణత్యాగ మొనర్చెదననియు నా కుత్తరము వ్రాసెను. నేనా యుత్తరముఁజూచుకొని తత్‌క్షణముననే రాజులందఱకుఁ దోడు రావలయు నని కఠినముగ జాబులు వ్రాసి, జవాబులు దెప్పించుకొని యుద్ధపు యత్నమంతయు సిద్ధముచేసికొని తమ కీ వృత్తాంత మెఱింగింప వలయునని యిచ్చటికి వచ్చితిని."

"ఆహా! పాదుషా యెంతటి క్రూరకృత్యమున కొడిగట్టు కొనెను?"

"యోగీంద్రా! ఇంతకన్న నొకచిత్రము వినుఁడు. హిందువు లందఱిపైని జిజియాయను నొక పన్ను నేర్పఱచి ధనములాగ నారంభించెను. నిఱుపేదలందఱును తమ గృహములలోని సామగ్రి విక్రయించి వాని కా ధనము సమర్పించు కొనుచుండిరి."

ఆ మాటలు విని యోగి నవ్వుచు.

"రాజసింహా! నీవుగూడఁ బన్నొసంగితివా?"

"దేవా! మీ యనుగ్రహ ముండవలయును గాని, ఇట్టి యౌరంగజేబులు నూఱుగురకైనను వెఱచు వాఁడను గాను. పన్ను నడుగవచ్చిన తురకల నెదిరించి పంపివేసి పాదుషాకు సిగ్గు వచ్చునట్లొక యుత్తరము వ్రాసితిని."

"సరియే! దీనికేమి! విమల వ్రాసిన యుత్తరములో నింకేమైన సంగతులున్నవా? ఉన్న యెడలఁ జెప్పుము."

"దేవా! ఇంతకన్న విశేషము లేమియును లేవు. ఉన్న యెడలఁ జెప్పక దాఁచెదనా."

"అదేమి నిశ్చయము? చెప్ప కూడని రహస్యము లుండఁ గూడదా?"

ఆ మాటలు విని రాజసింహుఁడు చిఱునవ్వు నవ్వుచు మొగము వాల్చుకొని యూరకుండెను. పిమ్మట వైకుంఠయోగి,

"కుమారా! విమలను వివాహము చేసికొనుట నీ కిష్టమేనా? ఆమె నెప్పుడైనఁ జూచితివా?"

"తమ సెలవైనచోఁ దప్పక వివాహము చేసికొనెదను. నేను చిన్నప్పుడు చూచితిని. అప్పుడామెకుఁ బదేండ్ల ప్రాయము."

"ఆమె చిన్నతనములోనా ఆమెను జూచితివి? ఇటీవలచూడనే లేదా? అయినను జ్ఞాపకముఁ దెచ్చుకొనుము"

"లేదు లేదు. తరువాత నామె నెన్నఁడును జూడలేదు"

"పోనిమ్ము. ఈ మత్స్యసీ యుంగరము నీవెవ్వరికైన నిచ్చినట్లు జ్ఞాపకమున్నదా ?"

"నేనొకనాఁడు వేటకై యరణ్యమున కేగఁగా నచ్చట గొందఱు మహమ్మదీయ భటులు నన్నడ్డగించి నాకు మోస మొనర్ప నెంచిరి. నేను వారినెదిరించి పోరాడుచుండ నెవ్వరో యిద్దఱు రాజపుత్రులు తురంగారూఢులై పరుగు పరుగునవచ్చి నాకు సహాయ్యులై తురకలను బాఱఁదోలిరి. అప్పుడు నాకెంతయో సంతోషముగల్గినందున నా యుంగరమును దీసి యందొకనికి బహుమాన మిచ్చితిని."

"అట్లులైన నీవు విమలను జూడలేదనదవేల ?"

"ఎక్కడఁ జూచితిని."

"రాజసింహా ! పురుషవేషములు ధరించుకొని వచ్చిన వారిరువురును విమలయుఁ బద్మయు నని వేఱుగఁ జెప్పవలయునా ?"

"ఏమీ ? ఆ రాజపుత్రులు విమలయుఁ బద్మయునా ? ఎంత చిత్రము ! నేనప్పుడు వారినించుకైనఁ బోల్చుకొనఁ జాలనైతిని. కాని వారి సౌందర్యమునకు మాత్ర మాశ్చర్య మొందితిని."

"పోనీ ! నీవప్పుడు పోల్చుకొనఁ జాలక పోయినను, నీవే రాజపుత్రున కుంగరమిచ్చితివో ఆ రాజపుత్రుఁడే విమలయని యిప్పుడైన గ్రహింపఁగలిగితివా ?"

రాజసింహుఁ డా మాటలువిని మందహాసమునఁ దనలో నేమో తలపోయు చుండెను. విమలయుఁ బద్మయును పురుషవేషమును ధరించుకొని రాజసింహునకుఁ దోడ్పడిన తరువాతఁ గొన్నినాళ్లకొకనాఁడు వారిరువురును వైకుంఠయోగిని దర్శించుకొనవలయునని విలాసార్థ మచలేశ్వరాలయమునకుఁ బోయిరి. యోగి వారిరాకకు సంతసించి వారినిరువురను దీవించి, ఎన్నియో ముచ్చటలను, కథలను జెప్పి వారి నానందింపఁ జేసెను. విమలయుఁ బద్మయును వాని

బోధన లన్నియు నతిశ్రద్ధతో వినుచుండిరి, ఇంతట యోగి, విమల వ్రేలికిడుకొని యున్న యుంగరమును చూచి దానిపై రాజసింహుని ముద్రయుండుటచే, నా యుంగర మామె కెట్లువచ్చెనో యని తలపోసి "అమ్మాయీ ! నీకీ యుంగర మెట్లు వచ్చినది ?" అని యడిగెను. కాని విమల సిగ్గుచేఁ దలవంచుకొని యేమియుఁ బ్రత్యుత్తర మీయ లేదు. అప్పుడు పద్మ ఆ యుంగరము సంగతి నంతయు యోగి కెఱింగింప నాతఁ డెంతయో సంతసించెను. పిదప విమలయుఁ బద్మయును యోగివద్ద సెలవుగైకొని తమనగరమునకుఁ బోయిరి.

ఈ వృత్తాంత మేమియు రాజసింహుఁ డెఱుఁగనందున నా రాజపుత్రు లిరువురును మాఱువేషములు ధరించుకొనిన విమలయుఁ బద్మయు నని యోగి కెట్లు తెలిసెనో యనియు, నా యోగివసిష్టుల వారి యవతారమనుట కెంతమాత్రమును సందేహము లేదనియు నెంచి వాని ప్రభావము దలపోయుచుండెను. అప్పుడు వైకుంఠయోగి వానిని జూచి,

"రాజసింహా ? ఏమట్లాలోచించు చుంటివి ? విమల సౌందర్యము నీ హృదయమున కెక్కెనా ?"

"దేవా ! ఆమె యుత్తరమును జూచినప్పుడే ఆమె సౌందర్యము నా హృదయమున కెక్కె, నా చిత్త మామెయందు లగ్నమైనది."

"ఉత్తరము చూచినంత మాత్రముననే సౌందర్యమెట్లు గ్రహించితివి ? లేక తన రూప మిట్లుండునని విమల తన యుత్తరమున వర్ణించు కొనెనా యేమి ?"

"తాపసోత్తమా ! పతిభక్తియు, విద్యయు, పరోపకారమును, స్త్రీలకు సౌందర్యములు గాని దేహ సౌందర్యము సౌందర్యము గాదు."

"శబాసు ! రాజసింహా ! నీ చాతుర్యమునకు మెచ్చితిని. తప్పక నీవా కన్యాలలామను వివాహమాడ నర్హుఁడవు. రాజులందఱను వెంటఁబెట్టుకొని, సపరివారంబుగ సత్వరంబుగ రూపనగరంబున కేగి

యాకన్నియ నుద్ధరింపుము. త్వరలోనే నీకీర్తి రాజపుత్ర స్థానమును దాటఁగలదు. రాజపుత్ర వంశమును గాపాడుటకు నీవు దక్క వేఱెవ్వరు లేరు. భీతచిత్తులై రజపుత్రులెల్ల నింతకాల మూరకుండి నందున, నింతకంతకుఁ బాదుషా మేరమీఱి, ఇంతెంత ఘోరములు సేయ సమకట్టుచుండెను "

"మునిపుంగవా! నిక్కము! నిక్కము! క్రమక్రమముగ వాని క్రూరకృత్యము లధికమగుచుండెను గాని యెన్నఁటికిని తగ్గుట గానరాదు. ఎన్నాళ్లని వాని దుండగములు సహింపఁగలము? నేను గూడ నేదేని కారణముఁ గయ్యమునకుఁ గల్పించుకొని వాని గర్వ మడఁగింప వలయునని యూహించుచుండ దైవమిట్లనుకూలపడెను. మనకింక జయము గల్గుటకు సందియము లేదు.

అని యిట్లు సంభాషించుకొనుచుండ నెవ్వరో దేవాలయము తలుపులు తెఱచినట్లు చప్పుడయ్యెను. అది విని యోగిరాజు "రాజ సింహా! ఎవరో ఆలయమునఁ జొరఁబడి నట్లున్నది." చూచివత్తమురా అని వానితోఁగలిసి గుడిదగ్గఱకు వచ్చెను. అచ్చటనొక రాజభటుఁడు నిల్చియుండి ఇటునటుఁ జూచుచు, వైకుంఠయోగినిగాంచి నమస్కరించి, స్వామీ! జోధపురమునుండి చంద్రావతీ మహారాణిగారు తమదర్శనము నకై వచ్చియున్నారు." అని నుడివినంతనే వైకుంఠయోగి సంతసించి యామె యెచ్చట నున్నదని యా భటునడిగెను. కుటీరమునఁ గుమారుని యొద్ద నున్నదని చెప్పి యాతఁడు వారిరువుర నచ్చటికిఁ గొనిపోయి చంద్రావతినిఁ జూపెను.

అప్పుడు కుమారుని యొడిలోనఁ గూర్చుండఁబెట్టుకొని, యా బాలునికై పొందిన కష్టములను దలపోసికొనుచు చంద్రావతి, "హాసు కుమారా! అగణితధర్మ స్వరూపుఁడగు యశవంతసింహ మహారాజునకుఁ బుత్త్రుఁడవై బంగారు తూఁగుటుయ్యేలలోఁ బరుండుటకు మాఱుగ నీ నులక మంచములే విధి నీకువ్రాసెనా? ఈ తాటాకుల గుడిసెయే

నీకు రాజభవనమాయెనా? నాయనా! మీ నాయన బ్రతికియుండినచో నీకిన్ని కష్టములు లేకుండునుగదా? అయ్యో! మనకంతటి యదృష్ట మెక్కడిది? ఔరంగజేబు మనపాలిట యమదూతయై మీ యన్నను మీ తండ్రిని దనపొట్టను బెట్టుకొనెను. అంతమాత్రమునఁ దన పగ దీఱనందున నిన్నుఁగూడ మోసపుచ్చ వలయునని యెన్నివిధములఁ బ్రయత్నము సేయలేదు తండ్రీ! నిన్ను మఱల నేను జూడఁగల్గుదునని యనుకొనలేదు.

సీ. తురకలసేనలు తోలుదొల్త నరుదెంచి
యల్లకాబూల్ దరి నాఁపినపుడు
"ఔరంగజేబు నిన్గోరినాఁడఁట" యంచు
మనయిందిర వచింప వినినయపుడు
గొల్లవేషము దాల్చుకొని యామెయే నిన్నుఁ
బుట్టలోఁ బెట్టి గొంపోవునపుడు
భిల్లాంగనకు నిన్నుఁ బెంచుకొమ్మని యిచ్చి
జోధపురంబు నేఁ జొచ్చునపుడు
దక్కుదువా నీవు నాకింక దక్కవొక్కొ
ఋణము దీఱెనో నీకు నాకును నటంచు
నెంతవిలపించితినో దైవమే యెఱుంగు
నపరిమితసుందరాంగ! నాయజితసింగ

అని వగచుచుండ వైకుంఠయోగి యామెనోదార్చెను. చంద్రావతి బాలునెత్తుకొని యీవలికి వచ్చినంతసే రాజసింహుఁడా బాలు నందుకొని యెత్తి ముద్దాడి మరల నామె కొసంగెను. రాజసింహుఁడు తనకు వానికన్న యగుటచే నాతనిఁ జూడఁగల్గినందులకుఁ జంద్రావతి మిక్కిలి సంతసించెను. రాజసింహుఁ డామెపొందిన కష్టములకు విచారించినను, ఆమె ధర్మమార్గమున కెంతయో యానందమొందెను. అప్పుడు వైకుంఠయోగి చంద్రావతిని జూచి అమ్మా! యీ మన

రాజసింహుఁడు రెండు మూడు దినములలోఁ దురకలపైకి యుద్ధమునకుఁ బోవుచున్నాఁడు." అని యీ వృత్తాంతమంతయుఁ జెప్పి యాతనికి సహాయముగఁ దన సైన్యముల పంపవలయునని యామె నడిగెను. ఆ మాటలకుఁ జంద్రావతి "యోగీంద్రా! కరుణాయత్తచిత్తుఁడైన రాజసింహుఁడు తన సైన్యములఁ బంపకుండినయెడల నాఁడు మాగతి యేమైయుండునో కదా? నేనీతని ఋణమెట్లు తీర్చుకొనఁగలను? నా సైన్యములఁ బంపుమని యింత యడుగవలెనా? కడకు పాదుషా మా విమలనుగూడ బాధపెట్టఁ దొడఁగెనా! ఔరా! వాని దుర్మార్గమునకు మితిలేదు గాఁబోలు!" అని పలికెను.

రాజసింహుఁడు తనకుఁ బోవేళ యైనందున యోగిని సెలవిమ్మని వేఁడికొన, నాతఁడు సంతసించి, జయముగల్గుఁ గాక యని దీవించి, చంద్రావతిని జోధపురమునఁజుకు దిగఁబెట్టి పిదపఁ బోవలయునని యాజ్ఞాపించెను. "అమ్మా! చంద్రావతీ! నీవెప్పుడు నిట్టి సాహస కృత్యము లొనర్పకుము. నీవిచ్చటికి వచ్చుచున్నప్పుడు మార్గమధ్యమున శత్రువులకంటఁ బడితివేని, యెంతటి యాపదయైన సంభవించును. నీ కుమారుఁడింకఁ గొన్నినాళ్లవఱకు నిచ్చటనే యుండవలయును! ఆతఁడు నాచెంత నున్నంతకాలము వానికెట్టి కొఱఁతయు రానీయను. నీవింక బాలుని విడిచి వేవేగ బయలుదేఱుము." అని చెప్పఁ జంద్రావతి కుమారుని విడువలేక యూరక వానిని బలుమాఱు ముద్దులాడుచు వాని చెక్కిలి గఱచుచు నెట్టకేలకు బహుకష్టముమీఁద చెంతనున్న భిల్లాంగన కొసంగెను. రాజసింహుఁడామెను వెంటఁబెట్టుకొని, యచ్చటనున్న రాజభటులనితోఁ గలసి యోగివద్ద మజిల సెలవుగైకొని చంద్రావతితోఁ బయలుదేఱెను.

# ముప్పదియవ ప్రకరణము

## మొగలాయి సైన్యము

రాజపుత్రులు విజయ సింహునకుఁదోడు రానుండిరిగాన సైన్యములు త్వరలో సిద్ధముచేసి పంపవలసినదని ప్రతిదినమును సాదత్ ఖాను పాదుషా కుత్తరము లంపుచుండెను. ఆయుత్తరము లన్నియుఁ బాదుషా చదువు కొనుచు, రాజపుత్రులందఱు నొక్కటియై తనపైఁగత్తికట్టి తన్ను మోసపుచ్చ నేవియో గొప్ప ప్రయత్నములు సేయుచున్నారనియు, నాకస్మికముగ నందఱు నొక్కమాఱుగ వచ్చి సాదతుఖానుపై బడక మానరనియు నట్టులైనఁ దన కపజయంబుగల్గుననియు గ్రహించి యందులకుఁ దగినట్లుగ నాతఁడు మున్ముందుగనే జాగ్రత్త నహించు చుండెను. రాజపుత్రులందఱు నొక్కటియై వచ్చుటయేకాక, ఆయుద్ధము నకుఁ బ్రబల సేనాయుతుండయి రాజసింహుఁడుగూడ బయలుదేఱు చున్నాఁడని వినినందున, వాని బలపరాక్రమాతిశయములదివఱకే యెఱింగినవాఁడు గావున సామాన్యముగఁ గొంచెము సైన్యము లంపినఁ గార్యము లేదని తన వద్దనున్న సైన్యములన్నియు సమరమునకు సిద్ధముగ నుంపించెను. వలలోఁబడిన పక్షులవలె రాజపుత్రులును, రాజసింహుఁడునుగూడ నాయుద్ధమునఁ దనకుఁ జేజిక్కినంతనే వందఱను స్వాధీనముచేసికొని నిరాటంకముగ మెలఁగవలెనని పాదుషా తల పంకించుచు మీసము దువ్వుచుండెను. రాజపుత్రసైన్యములు వేనవేలుగ వచ్చుచుండుటచే యుద్ధము కడు భయంకరమగునని తలంచి తన సేనా నాయకుఁడగు సాదతుఖానించుక భీత చిత్తుఁడై వెనుదీయుచుండెనని

తనకుఁ దెలిసినందున పాదుషా తన సైన్యముల ముందుఁబంపి ఆ యుద్ధమునకుఁ దానుగూడ స్వయముగ వెనుకనుండి బయలుదేఱ కృత నిశ్చయుఁడయ్యెను.

ఇంతలో సాదతుఖాను యొద్దనుండి మఱల వాని కొక యుత్తరము వచ్చెను. పాదుషా దానిని జదువుకొని తత్క్షణము సైన్యము లంపకున్నఁ దన వారికిఁ బూర్ణముగఁ బరాభవము గల్గుటకు సందియము లేదని తత్తఱపడఁ జొచ్చెను. పిదప పాదుషా మిక్కిలి ధైర్యము వహించి తన సేనా వారమంతయు సిద్ధముగ నుండినందునఁ దనసేనా నాయకులలో నొకనిచే "ఓసైనికులారా! రూపనగరముపై నేడే దాడి వెడలవలయునని పాదుషాగారు నిశ్చయించుకొనిరి. కావున మీరెల్లరు నేఁటి సాయంకాలము నాలుగుఘంటలకుఁ బ్రయాణమునకు సిద్ధముగ నుండవలెను. ఇది యలమ్గీరు పాదుషాగారి యాజ్ఞ" అని పట్టణ మంతటఁ జాటింపించి యా సేనానాయకునితో "నీవు పోయి నేనెల్లుండియే బయలుదేఱి వచ్చుచున్నానని సాదతుఖానుతోఁ జెప్పుము. అంత వఱకుఁ గడుజాగ్రత్త వహించి సైన్యములను గాపాడు కొమ్మనుము. రాజపుత్రులు వచ్చినంతమాత్రమున భీతిల్లక ధైర్యముతోఁ బోరాడు మనుము. మనకే జయప్రదమగునని వచింపుము" అని బోధించి వానిని బంపివేసెను.

ఈ సమాచార మంతయు నుదయపురికిఁ జెప్పవలయునని యాతఁ డామ్లెమహాలులోనికిఁ బోయెను. కాని, అప్పటికి పాపముదయ పురి హృదయము స్థిమితముగ లేదు. ఇందిర గానరా నప్పటినుండియు నామె నిద్రాహారములు మాని యామెకై పరితపించుచు తనకు సాధ్యమైనంతవఱకు ఢిల్లీనగర మెల్లవెదకించి తన ప్రాణములు గాపాడినందులకు బహుమానమైన నిందిర కీయలేదుగదాయని యుదయపురి నిరంతరమును విచారించుచు నుండెను. చాల కాలమై నందున నిందిర తన బంధుజనములఁ జూడనిచ్చ జనియింప తన్నడిగిన

సెలవిచ్చునో లేదోయని శంకించి చెప్పకుండఁ బాఱిపోయెనని తొలుత నుదయపురి తలంచెనుగాని యామె అట్టి సాహస మొనర్పదని మరల నూహించెను. ఎన్నాళ్లు యోచించినను ఇందిరవిషయమై యామె కేమియుఁ గారణము దోఁపలేదు. అయినను ఎట్టి క్రూరకృత్యము లొనర్చుటకైన వెనుదీయని రోషన్ ఆరా యొకతె యుండెనని యామె యెఱిఁగియే యుండెనుగదా? ఆమెయే యిందిరనేమో చేసియుండ వచ్చునని తలంచి దద్విషయమై ప్రయత్నింపఁ దొడఁగెను. రోషన్ ఆరా సేవకులవలె నుదయపురి సేవకులు మాయలు మర్మములు నెఱింగిన వారుకారు. ఇంతియ కాక, రోషన్ ఆరా సేవకులకు ఆమె యందెంత భయమున్నదో, ఉదయపురి సేవకులకుఁ దమ యజమానురాలి యందంత భయములేదు. ఇందిరను గూర్చి రోషన్ ఆరాపైఁ దన కనుమాన ముండినను, యవివేకులగు సేవకుల నిడికొని యుదయపురి యెట్టి ప్రయత్నములైన నెట్లు సేయఁగలదు? ఎటు చూచినను ఆమెకు మనావ దొక్కఁడు గనఁబడు చున్నవాఁడు. కాని యాతఁ డున్నను లేకున్నను నొక్కటియే! ఇన్ని విషయములఁ దలంచు కొనుచు నుదయపురి విచారించు చుండఁగా నా నాఁడు పాదుషా ఆమె మహాలులోనికి వచ్చెను. కాని ఉదయపురి దీర్ఘాలోచనమున నుండుటచే పాదుషావచ్చి ప్రక్కను గూర్చుండి నంతవఱకు నాతఁడు వచ్చెనని యామె యెఱుంగదు. ఉదయపురి ముఖలక్షణముల నవలోకించి యామె యేమోవిచారించు చున్నదని గ్రహించి యామెతోఁ బాదుషా యిట్లు సంభాషించెను.

"ప్యారీ! ఏమిట్లు విచారించుచుంటివి?"

"మహారాజా! విచారించుటకే మున్నది? రోషన్ ఆరాకు నాపై నింకనుఁ బగదీర లేదు"

"ఏమీ? మరలనేమైనఁ జేసెనాయేమి? చెప్పు! చెప్పు!"

" ఏమియును జేయలేదు. నిన్న రాత్రి నుండియు నిందిర గాన రాకున్నది. ఈ పట్టణమంతయు వెదకించితిని. కానరాలేదు "

" సరియే! ఎచ్చటికో పాఱిపోయి యుండును! ఆమె అసాధ్యమైన యాఁడుది. నిన్ను మోసముచేసి తానిందుండి తప్పించుకొనెను. ఇంతయాత్రమునకు విచారమెందులకు? "

" లేదు లేదు. అట్టులెంత మాత్రమును జరిగియుండదు. ఆమె యీ పట్టణముననే యుండవచ్చును. "

" ప్యారీ! ఈ పట్టణ మంతయు వెదకించితినని యిప్పుడేకదా చెప్పితివి? మరల నీపట్టణమందే యుండవచ్చునని యనెదవేల! "

" ఔను. పట్టణమంతయు నాకు సాధ్యమైన ప్రదేశముల వెదకించితిని. ఆమె కానరాలేదు. "

" ఏమీ? నీకీ పట్టణమున సాధ్యముగాని ప్రదేశములుగూడ నున్నవాయేమి? "

అందుల కుదయపురి చిరునవ్వు నవ్వుచు,

"ఔను. ఉన్నవి. ఇదంతయు దేవరవారి యనుగ్రహమే కదా!"

" ఏదీ! నీకు సాధ్యముగాని ప్రదేశమేదియో చెప్పుము, నేనైన నచ్చట నిందిరను వెదకించెదను. "

" చిత్తము, ఇంతమాత్రము దయ యున్నందులకు సంతసించితినిగాని, యేలినవారికిఁగూడ నా ప్రదేశము ఎంతమాత్రమును సాధ్యముగాదు. "

" పోనిమ్ము. అదేదియో చెప్పరాదా? "

" వినెడువారికి భయము గల్గునో కలుగదో తెలియదుగాని, ఆ నామముచ్చరించుటకు నాకుమాత్రము భీతి పుట్టుచున్నది. "

" అబ్బా! నీవెంతటి జాణవు? చెప్పుమన్నఁ జెప్పవేల? "

" అట్టులైన వినుఁడు. అన్ని ప్రదేశములు వెదకించితిని గాని..." అని యిటునటుఁజూచి యూరకుండును. అంతట ఔరంగజేబు,

"సగముచెప్పి యూరకుండెదవేమి ? చెప్పు చెప్పు !"

"అవును సగమే చెప్పితిని. మిగిలిన సగము చెప్పఁబోవుసరికి నా యొడలంతయుఁ గంపమొందినది"

"అయ్యో ! ప్యారీ ! కడకుఁ జెప్పెదవా లేదా ?"

"చెప్పక తప్పునా యేమి ? వినుఁడు. సైతాన్ మందిరమున మాత్రము వెదకించుటకు నాకు సాధ్యముగాలేదు."

అందులకుఁ బాదుషా నవ్వుచు,

"సైతాన్ మందిరమున నేమి ? నీకుఁ బిచ్చి పట్టినట్లున్నది."

"నా వాక్యమునకు మీరర్థము చేసికొనఁజాలక పోయితిరిగాని నాకుఁబిచ్చి పట్టలేదు. సైతాన్ మందిరమనఁగా రోషన్ ఆరా మందిరమని నా యర్థము. మీకు శక్యమైనచో నచ్చటఁగూడ వెదకింపుఁడు."

"ప్యారీ ! ఆమెకై నీవింత వగవనేల ? వలయునేని నీ కింతకన్నఁ జాతుర్యమెఱింగిన రాజకన్యలను దాసీజనముగా నియమించెదను. నేనొక పనిఁబూని నీ కడకు వచ్చితిని కాని అక్కఱకురాని సంభాషణముఁ బెట్టి నన్నుఁ జెప్పనీయకున్నావు. విమలపై నాగ్రహము వహించి యామెపై నెట్లులైనఁగసిఁ దీర్చుకొనవలయునని నీవు చూచుచున్నావు గదా ? అందుచే నీకోరిక నెఱవేర్ప వలయునని నే నెల్లుండి రూపనగరముపైకి దాడి వెడలనున్నాను. నీవుఁగూడ వచ్చెదవా ?"

"మహారాజా ! మీరు స్వయముగాఁ బోనేల ? సైన్యములను బంపినఁజాలదా ?"

"అట్లుకాదు. రాజపుత్రులందఱు విజయసింహునకుఁ దోడుగ వచ్చుచున్నారు. నేను స్వయముగఁ బోయినఁగాని కార్య మెట్లుండి యెట్లువచ్చునో ? దీని కేమి ? నీ ప్రయాణముమాటఁ జెప్పవైతివి."

"చెప్పుట కేమున్నది ? నేను బ్రతికి యుండవలయునని మీకున్న యెడల నన్నుఁగూడఁ గొంపోవుఁడు."

"ఏ మట్లంటివి ? నిన్ను తప్పక గొనిపోయెదను. ఒకవేళ నిన్నిచ్చట నుంచినమాత్రము నీ కేమి భయము ?"

“ ఏమియును భయములేదు. ఆ సైతాన్ మాత్రము నన్నుఁ జక్కఁగఁ దనపొట్టను బెట్టుకొనును.”

“ అబ్బా! ఎందుకీ యక్కఱకురాని మాటలు? ఎల్లుండి నాతోవచ్చుటకు సిద్ధముగ నుండుము”

అట్లు సంభాషించుకొనుచుండఁగా మసావదు వచ్చి; “ దేవా! దేవరవారి సైన్యములు రూపనగరమునకు బయలుదేఱుచున్నవి. ఈ వృత్తాంతము తమ కెఱింగింప వలయునని వచ్చితి” నని విన్నవింప నా మాటకుఁ బాదుషా “ సరియే! సంతసించితిని. ఇరువది యామడల దూరము వఱకును సైనికులాఁగుటకు వీలులేదనియు, ఒక్కమజిలీ మాత్రముచేసి, త్వరలోఁ బోవలయుననియు నాయాజ్ఞ సేనానాయకున కెఱింగింపుము.” అని చెప్పి ఔరంగజేబు ఉదయపురితోఁ గూడ సైన్యములు విలోకించుటకై తన బురుజుపైకిఁ బోయెను. విస్తారముగ నెత్తుగల ప్రదేశమునుండి చూచుచుండుటచేత వేలకొలఁదినున్న సైన్యము లణుమాత్రములై వారికి వింతగఁ గానఁబడుచుండెను. తమకన్ని సైన్యము లుండుటచేత తమకే జయము గల్గునని పాదుషాయును, ఉదయపురియును దమలో సంతోషించుచుండిరి. ఏడు సముద్రము లేకమై ప్రవహించుచుండెనో యన నా సైన్యములన్నియుఁ బ్రయాణమై పోయినతరువాత, పాదుషా అచ్చటనే కొంతసేపువఱకు నుండి, ఆ దినమున మసీదులోనికిఁ బోయి నమాజు చేయుటకు వేళలేనందున నచ్చటికే జలమును గ్రంథమును దెప్పించుకొని నమాజుచేసి తన మందిరమునకుఁ బోయెను. ఉదయపురియుఁ దన మహాలులోనికిఁ బోయి ప్రయాణమునకు సిద్ధము గావించుకొను చుండెను.

సైన్యములన్నియుఁ గలసి పోవుచుండ పాదుషా యీసారి దిగ్విజయము చేయునేమో యని చూపఱకుఁ దోఁచుచుండెను.

మొదట బారులుగట్టి వేలకొలఁది కాల్బలములును, వాని వెనుక తురంగారూఢులైన సరదారులును, వారి వెనుక నాయుధపాణులై మహమ్మదీయ భటులును, వారి వెనుక భోజన సామగ్రియు, మఱికొందఱు భటులును నడచుచుండిరి. సాదతుఖాను సైన్యములఁ గడుజాగ్రత్తతో నడిపించుకొనిపోవుచుండ, కొంతదూరము పోవుసరికి నొక ఫకీరెచ్చటనుండియో వచ్చి యా సైనికులను గలిసి వారితోఁ దానుగూడఁ బోవుచుండెను. కాని యే కారణముననో ఆ ఫకీరువారిలో నెవ్వరినిఁ బలుకరింపకయే తనదారి నేగుచుండెను.

# ముప్పదియొకటవ ప్రకరణము

## రాజసింహుని ప్రతిజ్ఞ

రాజసింహుని యాజ్ఞానుసారముగ రాజు లనేకులు తమతమ సైన్యములతో నుదయపురమునకు విచ్చేసిరి. జయపురము మొదలైన గొప్ప గొప్ప సంస్థానాధిపులు మాత్రము రాజసింహునకుఁ దోడు రాక పరస్పరముగ నూరకుండిరిగాని, ఆతనికి లోఁబడిన చిన్న చిన్న సంస్థానములవారు అందఱును సంసిద్ధులై బయలుదేఱిరి. వచ్చిన రాజుల నాదరించి, గౌరవముచేసి రాజసింహుఁడు వారికి విడుదు లిప్పించెను. పట్టణము పట్టనందునఁ దత్పుర పరిసర ప్రదేశమందుఁగూడ గుడారములు వేయించి రాజసింహుఁ డెందఱో సైనికుల నందుంచెను. ఆ నాఁటి నుండియు నుదయపురంబున నెందుఁ జూచినను సైనికనికాయంబుల కోలాహలంబును, తురంగారూఢులైన సరదారుల సంచారంబును, రాజపుత్రుల మహోత్సాహంబును, విపరీతములై గానవచ్చుచుండెను. ప్రతిదినమును ఉదయమందును సాయంకాలములయందును, రాజపుత్రులకుఁ దగిన సదుపాయములు జరుగుచు నుండెనో లేదోయని, రాజసింహుఁడు తన మంత్రులఁ బంపి గాని స్వయముగాఁ బోయి గాని తప్పక గనుఁగొనుచుండెను. రాజవీధులయందును, సంతపేటల యందును, సందులయందును, ఎల్లెడల రాజభటులు విచ్చలవిడిఁ గానవచ్చుచుండిరి. ఇట్లెల్లవిధముల లెక్కలేని రాజభటులచే నిండి, ఈ యుదయపురమున జయలక్ష్మి వసింపవచ్చెనా యనునట్లు చూపఱకు వింతయు భీతియుఁ గల్గించుచుండెను.

తత్పట్టణ బాహ్య ప్రదేశమున గుడారములలో వసించియుండిన సేనాసమూహములు గూడ నానంద కందళితహృదయములై స్వేచ్ఛగ సంచరించు చుండెను. వందలకు మీఱిన గుడారములును, వేల నతిక్రమించిన సైనికులును, అసంఖ్యములగు వారణ తురంగములును, చుట్టును నావరించి యుండుటచే పది పండ్రెండు మైళ్లు కైవారముగల ఆ ప్రదేశ మంతయుఁ జూచిన, రెండు మూడు దినములలో నిర్మింపఁబడిన యొక మహానగరమువలె నాశ్చర్యము గలిగింపకపోదు. వాహనంబులపైఁ గూర్చుండి విలాసార్థము నలువంకల షికారు దిరుగువారును, కరవాలంబులు గైకొని, తమ ప్రావీణ్యమెల్లరకుఁ దెల్లమగునట్లు సాముచేయువారును, వృక్షములపై కెక్కి శాఖలపైఁ గూర్చుండి పలువిధములఁ బిల్లనగ్రోవు లూఁదువారును, చల్లచల్లగ వచ్చు మలయమారుతంబు సౌఖ్యంబు గల్పింప తమ గుడారములలో ద్వారములచెంతఁ గూర్చుండి హుక్కాలు పీల్చుచు హాయి హాయి యనువారును, కలహానుకూలకార్యవేదులై తమ ఫిరంగులలోను తుపాకులలోను మందు దట్టించువారును, మృగయావినోదార్థము తత్సమీపారణ్య ప్రాంతముల విహరించువారును, చండకరకాంతిని ధిక్కరించి తళతళ మెఱయు నిశాతఖడ్గములకు మఱింత సానపెట్టుచు వన్నెగల్గించు వారును, అయి ఆ సైనికులెల్లగు నరణ్యమున సంచరించు సింహములవలె నిచ్ఛకొలఁదిఁ ననేకవిధముల వినోదములు సల్పుచుండిరి. ఇంతియ కాక రాజభటులెల్లరు నచ్చటచ్చట గుంపుగుంపులుగఁ గూడి మల్లయుద్ధము చేయుచుండిరి. మఱియొక చోట పూర్వపు రాజుల చరిత్రములు ముచ్చటగల్గించు కథలుగఁ దమలోఁ దాము చెప్పుకొనుచుండిరి. వేఱొకచోటఁ గొందఱు మృదంగములు వాయింపఁ గొందఱు తప్పెటలు వేయ, మఱికొందఱు గానము చేయుచుండిరి.

అప్పుడు పురజనులు గుంపు గుంపులుగఁగూడి అచ్చటికివచ్చి ఆ సైనికులనెల్లర నవలోకించుచు "ఇవి బుందీరాజుగారి సైన్యములు. ఇవి భరతపురాధిపుని సైన్యములు. ఇవి ఆల్వార నాయకుని సైన్యములు అవి జోధపురము చంద్రావతీ మహారాజ్ఞిగారి సైన్యములు." అని తమలోఁదాము చెప్పుకొనుచు మితిమీఱిన సైనికుల సంఖ్యకద్భుత మొందుచుండిరి. ఇట్లుండ వారందఱితోఁగూడ నొకనాఁడు సైన్యములు చూచుటకై దుర్గాచరణజోస్యులుగూడ నచ్చటికి వచ్చెను,

దుర్గాచరణ జోస్యులు జ్యోతిష శాస్త్రమందారితేరిన ఘటకుఁడు. జ్యోతిషము చెప్పుటయం దంతటివాఁడు మరి లేఁడని ఆ కాలపు జనులు చెప్పుకొనుచుండిరి. ఆతఁడేమాట చెప్పినను సత్యమని రాజులెల్లరు విశ్వసించు చుండెడివారు. అట్లే వారికి ఫలములుగూడ గనఁబడుచుం డెను. ఆ కారణమున రాజసింహుఁడుగూడ వానిపై మిక్కిలి మక్కువ వహించి వానిని తన యాస్థాన జ్యోతిషికునిగా నుంచుకొని చాలకాలము నుండి పోషించుచుండెను. రాజసింహుఁ డేకార్యముమీఁద పోవునప్పు డైనను దుర్గాచరణ జోస్యులను రావించి తనకార్యము వాని కెఱింగించి శుభము గల్గునని యాతఁడు చెప్పినంతనే పోవుచుండెను.

ఆ నాఁ డాతఁడు పౌరులతోఁగూడ సైనికుల వినోదములు చూచుటకై గుడారములవద్దకు వచ్చెనుగాని యందఱవలెఁ దానుగూడఁ జూచుచు నూరకుండలేదు. తన జ్యోతిష ప్రభావమంతయు వెల్లడించి సైనికులను బ్రోత్సాహ పఱుపవలెనని యెంచి యా రాజభటుల మధ్యకుఁబోయి "అన్నలారా! మీకు జయము కల్గును! మీకు జయముకల్గును! నేను జ్యోతిష శాస్త్రముచూచి మీ ఫలములు చెప్పుచున్నాను" అని బిగ్గరగ వచించుచుండ, అదివిని రాజభటులు కొందఱు వానిచుట్టును గుమిగూడి యాతఁడు జ్యోతి శ్శాస్త్రజ్ఞుఁడని గ్రహించి "అయ్యా! జోస్యులవారు! నా చేయిచూచి నాకు వివాహ మెప్పుడగునో సెలవిచ్చెదరా" అని కొందఱును "నేను

తలంచుకొనిన కార్యము ఫలించునా" యని కొందఱును, "నా భార్య యెన్నాళ్లలోఁ గాఁపురమునకు వచ్చు" నని మరికొందఱును ఆ బ్రాహ్మణుని పీడించుచుండిరి. జోస్యులు వారివారి జన్మదిన నక్షత్రాదుల నడిగి తెలిసికొని చక్రములు వేయుచు వారందఱకు సాధ్యమైనంత వఱకు ఫలములు చెప్పుచుండెను. వందలకొలఁది రాజభటులా వినోదము చూచుటకై తమ వినోదములు గట్టిపెట్టి యచ్చటికేవచ్చి బ్రాహ్మణునిఁ జూచుచు తమ హృదయములఁగల కోరికలకు ఫలము తెలిసికొని సంతసించుచుండిరి. ఇట్లుండఁ గొంతసేపటికి మన సామల్ పండితుఁడు గూడ నచ్చటికే వచ్చుట తటస్థించెను. ఆతఁడు రాజసింహుని యింటఁ బ్రవేశించి నప్పటినుండియు వానికిని జోస్యులకును మైత్రిగల్గి నానాఁటికిని వృద్ధియగుచుండెను. జోస్యులుగూడ వాని హాస్యోక్తుల కానందించుచు ఎల్లప్పుడును వానితోడనే కాలము గడుపుచుండెను. ఎచ్చటికైనఁ బోవలసివచ్చిన వారిరువురును గలసియేపోవుచుండిరి. కాని ఆనాఁడుమాత్రము జోస్యులు తన్నెడఁబాసి పోయినందున సామల్ పండితుఁడు వానికై కొంతసేపు వెదకి పట్టణమావలనున్న రాజుల గుడారములవద్దనుండు నేమోయని వానికై యచ్చటికి వచ్చెను. సామల్ పండితుఁడు అచ్చటికి వచ్చుచున్నప్పుడు మార్గమధ్యమునఁ దనలో దానే మాటాడుకొనుచు, రెండు చేతులతో నభినయము చేసి సంగీతము పాడుచు రాజభటులను సమీపించెను. పైనుండియే ఆతఁడు జోస్యుల కంఠమువిని తనమిత్రుఁడాసమూహమునకు మధ్యనుండి జ్యోతిషము చెప్పుచున్నవాఁడని తెలిసికొని తానుగూడ లోపలికిఁబోయి జోస్యులను కలసికొనవలెనని యెంచెను. కాని జనసమ్మర్దము విశేషముగ నుండుటచే లోనికిఁబోవుట కాతనికి కష్టతరమయ్యెను. అయినను మన విదూషకుఁ డూరకుండక జనులను బలవంతముగ దప్పించుకొనుచు చొరవఁజేసి ఆ మూఁకలో జొరఁబడెను. తన కడ్డముగా నిలువఁబడిన వారిని బలిమిని ప్రక్కకు ద్రోసివేయుచుఁ బోవుచుండ వాని మూర్ఖత్వమున కలిగి యొకరాజభటుఁడు "ఎవరయ్యా మీరు ?" అని

తిరస్కారముగా వానినడిగెను. అప్పుడు సామల్ పండితుఁడు "నేనా? నేనుత్తమబ్రాహ్మణుఁడను. సకల శాస్త్రసంపన్నుఁడను. తృప్తిగా భోజనము చేసెదను. మోమోటము నాకులేదు." అని బిగ్గరగఁ బ్రత్యుత్తరమీయ నామాటలచ్చటనున్న హారందఱు విని పక్కున నవ్వి, ఆతఁడెవ్వఁడాయని యటునిటుఁ జూచుచుండిరి. అప్పుడు వాని నడ్డగించిన రాజభటుఁడుగూడ నాతఁడెవఁడో పిచ్చివానివలె నున్నాఁడని తలఁచి వానితోఁగూడ కొంత వినోదము సలుపనెంచి సామల్ పండితుని మెల్లగా నామూఁకలోనుండి తప్పించి జ్యోతిషికుని వద్దకుఁగొనిపోయెను. జోస్యులు వానినిజూచి "పండిజీ! వచ్చినారా! దయచేయుఁడు" అని వానిని దనవద్దఁ గూర్చుండబెట్టుకొనెను. సామల్ పండితుఁడచ్చటఁ గూర్చుండి జోస్యులు జాతకము చెప్పుటయు రాజభటులందఱు సంత సించుచుండుటయుఁ జూచి, తానుగూడ నందఱికన్న నెక్కుడుగ నానందించుచు "పండిజీ! పంక్తిలో పక్షపాతము వహింపఁగూడదు కావున నాకుఁగూడఁ గొన్నిఫలములు చెప్పవలెను." అని జోస్యుల నడిగెను. జోస్యుఁడు వానిమాటలకు నవ్వి "అయ్యా! అభ్యంతర మేమి? సెలవిండు" అని పలుక వారిరువురకు నిట్లు సంభాషణము జరిగెను.

"అయ్యా! జోస్యులూ! నేనిప్పుడు నా హృదయమున నొక కార్యము దలంచుకొంటిని. దానికి ఫలము చెప్పుము"

"నీవు తలంచుకొనిన కార్యము ఫలించును. ఆ యుద్ధమున నీకే జయము గలుగును!"

"సరియే! బాగుగానున్నది! నేను తలంచినదొకటి. మీరు చెప్పినదొకటి. రూపనగరమునుండి యిచ్చటికి బయలుదేఱుసరికి మా యింటిలోనున్న యావుచూలుతోనుండెను. అది యీనినదా లేదా అని మనసులోఁ దలంచుకొంటిని. కడకు ఆవు ఈనిన సంగతిపోయి యుద్ధములోనికి దింపితివి. దీనినిబట్టి చూడఁ గొంతసేపటికి మన ఇరువుర కీవాగ్వివాదములో ముష్టియుద్ధము గలుగునని తోఁచుచున్నది.

పోనిమ్ము, సంగతియేమో చెప్పితివిగదా ? ఆ యావు ఎట్లుండునో రూపము చెప్పఁగలవా ? ”

“ సరే విను ! అయావు నల్లగానుండును. మొగముపైఁ దెల్లని మచ్చలున్నవి. కొమ్ములు కుఱుచలు...... ఏమి యూరకుండెదవు ? నిజమేనా ? ”

“ ఓ ! నిజము కాకేమి ? మీరు చెప్పినట్టి యావులు లోకమున వందలకొలఁది నున్నవి. నే నీకన్నులతోఁ జూచితిని. ”

“ అబ్బా ! లోకములోనున్న యావులసంగతి కాదయ్యా ! నేను మీయావుసంగతి చెప్పితిని. ”

“ సరెసరి ! మూఁడు పురుషాంతరములనుండి మా వంశమున ఆవు లేనే లేదు. ”

“ మఱల నిట్లనెదవేల ! మాయింటిలోని యావు అని ఇప్పుడే కదా చెప్పితివి ? ఇంతలోనే యబద్ధమా ? ”

“ అవును. మా యింటిలోని వస్తువయిన నది మా వస్తువే అని శాస్త్రమున్నదా యేమి ? ఒక బ్రాహ్మణుఁడు మా యింటిలో నద్దెకున్నవాఁడు. అది వానిదిగాని మాదికాదు. ”

“ పోనిమ్ము ! ఆ బ్రాహ్మణుని దైనను నేనుచెప్పిన రూపములతో నుండెనా ? ఆ సంగతి చెప్పుము. ”

“ మీరు చెప్పిన రూపములతో నుండుటకది ఆవు అయినఁగదా! అది గేదెకాని ఆవుగాదు. ”

కొంతసేపటికి జోస్యులు ప్రాణము విసిగినందుల మాటాడక యూరకుండెను. సైనికులెల్లరును పకపకనవ్వుచు వినోదము చూచుచుండిరి. మరికొంద ఱుత్సాహముకొలఁది చప్పటలు చఱచుచు, ఆ విదూషకునకు ఫలహారములు దెచ్చి సమర్పించిరి. సామల్ పండితుఁడు మాఱుమాటాడక ఆ ఫలములన్నియు నారగించి జోస్యులతోఁగూడ నింటికిఁ బోయెను.

ఆనాఁటి సాయంకాలమున రాజసింహుఁడు కొందఱు రాజపుత్రులతోఁ గూడఁ దనమేడపైఁ జల్లగాలిలోఁ గూరుచుండి వారితో యుద్ధవిషయమై ప్రసంగము సలుపుచుండెను. అప్పుడొక సరదారుఁడొకవారువముపైఁ గూరుచుండి కొంతదూరమునుండి యుదయపురము వచ్చుచుండినట్లు రాజసింహునకుఁ గనఁబడెను. రాజసింహుఁడు తన చెంతనున్న రాజపుత్రులతోఁ బ్రసంగించుచుండియు నా సరదారుని వైపే చూచుచుండెను. రాజపుత్రులు గూడ తమ దృష్టి ఆ వైపునకే సారించి అతఁడెవఁడో యని పరికించుచుండిరి. ఇంతలో నా సరదారుఁడు క్రమక్రమముగాఁ బట్టణమును బ్రవేశించి, వాయువేగమునఁ దన వారువమును బరుగెత్తించుచు రాజమార్గము లన్నియు దాఁటి రాజసింహుని మందిరమువద్దకు వచ్చి యచ్చట తన గుఱ్ఱముపైనుండి దిగెను. ఆ సరదారుఁడు మందిరములోఁ బ్రవేశించి "మహారాజుగా రెక్కడ?" అని యడుగుకొనుచు నొక సేవకుఁడు దారిఁజూప, తిన్నగ మేడమీఁదకుఁ బోయి రాజసింహుని సమీపించి వినయ విధేయుఁడై వానికి నమస్కరించెను. అప్పుడు రాజసింహుఁడు వానిని జూచి "ఓయీ! విశేషములేమి?" అని యడుగ నా సరదారుఁడు "దేవా! ఢిల్లీ నగరంబున విశేషంబులు గనుఁగొంటిని. పాదుషా నిన్ననే ప్రచండములగు తన సైన్యములన్నియు రూపనగరముపై కంపెను. అతఁడు గూడ రేపే స్వయముగ బయలుదేఱ నున్నాఁడు. పాదుషా తొలుత రూపనగరమునకుఁ బోయి విజయసింహు నోడించి పిదప నచ్చటనుండి మన పట్టణము మీఁదకు వచ్చునని నాకుఁ దెలియవచ్చినది." అని వచింప రాజసింహుఁడు పాదుషా సైన్యములఁ బంపెనని విన్నతోడనే తనలో నేమియో ఆలోచించి మహమ్మదీయ సైన్యములును పాదుషాయును, రూపనగరము జేరకమున్నె తాను రాజపుత్రులతో బయలుదేఱి పోయి సాదతుఖాను నోడించి ముట్టడినిమాన్పి విమలను, దీసికొని వచ్చి యుదయపురమున నుంచి తరువాత శత్రువుల నెదుర్కొన వలయు

ననియు, అట్లు తొందరవహింపకున్న రూపనగరంబునకు మోసము సంభవించుననియు, నెంచి, ఆ విషయమై యచ్చట నున్న రాజపుత్రులతో నాలోచించెను. వారుగూడ నా యుపాయము కడులెస్సయని పలికి రాజసింహుని యుక్తి కెంతయు సంతసించిరి. పిదప రాజసింహుఁడు ఏది ఎట్లయినను తత్క్షణము బయలుదేఱి శత్రువుల జయించి వచ్చిన దాఁక నుదయపురము కంటఁ జూడననియు తానాపట్టణమునుండి సకల సైన్య సమేతుఁడై బయలుదేఱినఁగాని అంతవఱకు భోజనము చేయననియు ప్రతిజ్ఞపట్టి, కొందఱు సేనానాయకులను రావించి వారితో మంత్రాంగముసలిపి "రాజపుత్రులారా ? సరదారులారా ! ఉదయపుర సంరక్షణార్థమై నియమింపఁబడిన నాలుగువేల భటులుదక్క తక్కిన రాజభటులును, సరదారులును, సేనానాయకులును, రాజపుత్రులును గూడ యుద్ధ సన్నద్ధులై నేటి రాత్రియే బయలుదేఱవలయు. సూర్యోదయమగు సరికి ఉదయపురమున నొక్క సైనికుఁడైనను ఒక్క రాజపుత్రుఁడైనను ఉండఁగూడదు ఇది మహారాణాగారి యాజ్ఞ" అని పట్టణం బంతటఁ జాటింపించెను.

రాజసింహుఁ డదివఱకే రూపనగరమునకు ససైన్యముగ బయలుదేఱ వలసియుండెను గాని, రాజపుత్రు లొకరితరువాత నొకరు ఉదయపురమునకు వచ్చుచుండుటచేతను, అప్పటి కింకను తనకుఁ దోడురావలసిన రాజపుత్రులు గొందఱు మిగిలి యుండుటచేతను, ఆతఁడు వారికై వేచియుండెను. అంతయే కాక ఎందఱు రాజపుత్రులెన్నెన్ని సైన్యములతోడ వచ్చినను, ఆ సైన్యములన్నియుఁ గూడ, రారాజైన యౌరంగజేబు సైన్యములలో నాల్గవ వంతునకైన సరి గావయ్యె. అందుచే రాజసింహుఁడు కొంచెము కాల యాపన మొనర్పవలసి వచ్చెను. అయినను క్రొత్తసైన్యములు వచ్చినను రాకున్నను రెండు మూడు దినములలో తప్పక బయలుదేఱ వలయునని యాతఁ డదవఱకే నిశ్చయించుకొనెను.

ఆ నాఁటి సాయంకాల మాతఁడట్లు తనలో నొక ప్రతిజ్ఞ చేసి తాను ముందు బయలుదేఱిన రాజపుత్రు లందఱుఁగూడఁ దనవెంట వచ్చెదరని యా నాఁటిరాత్రియే రాజసింహుఁడు కొన్ని సైన్యములను వెంటఁబెట్టుకొని యొక సమదగజ రాజుపై నెక్కి ఎఱ్ఱని మఖమలు పఱుపులతో నుండిన బంగారపు టంబారిలోఁగూరుచుండి, వారణంబుల బృంహితంబులును, వారువంబుల హేషలును, ఢంకానగారాల నినాదంబులును, వందిమాగధ బృందంబుల స్తోత్రపాఠములును, పౌరవారంబుల జయ జయ ధ్వనులును, భూసురగ్రామణుల యాశీర్వచనంబులును, బల్లకుల యోంకారారావంబును నేకమై మిన్నంట నుదయపురమునుండి పటు సంరంభముతో బయలుదేఱెను.

వెంటనే రాజపుత్రులందఱు తాము గూడ త్వరత్వరగ తమ తమ సేనాసమూహములను యుద్ధ సన్నద్ధములు చేసి యొకదానివెనుక నొకటి, సైన్యముల రాజసింహుని వెనుకఁ బంపుచుండిరి. తొలుత రణదుందుభులును సింహనాదంబులును దిగ్గజములు బెగ్గడిల మ్రోయించి, పిమ్మట తళతళ మెఱయు కరవాలంబులు గైకొని మహోత్సాహముతో కాల్బలములు బయలుదేఱెను. ఆ వెనుక నసంఖ్యములగు పారసీక తురంగములపైఁ గూరుచుండి ఆయుధ పాణులై కొందఱు సరదారులు వెడలిరి. తరువాత నేనుఁగులపైఁ గొందఱును, పల్లకులఁ గొందఱును, కూర్చుండి సామంత నృపాలు రందఱును గూడ వెడలిరి. ఈ ప్రకార మానాఁటిరాత్రి యంతయును, కాల్బలములును అశ్వికులును యుద్ధ సన్నద్ధులై బయలుదేఱి పోవుచుండ నుదయపురంబున నొక గొప్ప యుత్సవమువలెఁ దోఁచు చుండెను. పౌరు లెల్లరు నా నాఁటి రాత్రి నిద్దురమాని మేడలపై నుండియు మిద్దెలపై నుండియు నావింతచూచుచుండిరి. సూర్యోదయ మగునప్పటి కుదయపురంబున ముచ్చటకైనను జూతమన నొక్క సైనికుఁడైనఁ గానఁ గానరాఁడయ్యె.

# ముప్పదిరెండవ ప్రకరణము

## యమునానది

ఫరక్ షైరును మాయలలోఁ బడఁ
ద్రోసి, వానివలన, రోషన్ ఆరా ఇందిరకుఁ గావింప నెంచిన మోసమంతయు ఫకీరు స్పష్టముగ తెలిసికొనియెను. నదిలోఁ బడకుండ నిందిర నెట్టులైన నానాఁటి రాత్రిఁ దప్పకఁ గాపాడి తీరవలయునని నిశ్చయించుకొని యాతఁ డావిషయమై తగిన యుపాయము కొఱకు వెదకుకొనుచుండెను. కాల మతిక్రమింపక మునుపే చక్కని యుపాయమును బన్ని కార్యము కొనసాగించుకొనవలయునని, ఫరక్ షైరునకు సెలవిచ్చి పంపివేసి నప్పటినుండియు దీర్ఘాలోచనము సేయుచువచ్చుచుండ, నయనపాలుఁడొక ఫకీరువలె వేషము వేసికొనివచ్చుచు జనానా సమీపముననే వాని కెదురయ్యెను. చెఱలోనుండి తప్పించుకొనినప్పటి నుండియు పాదుషాకుఁ జిక్కియున్న యిందిర నెట్టులైనఁ గాపాడవలయునని యనేక వేషములు ధరించుకొనుచు జనానా లోనికిఁ బ్రతిదినమును బోవుచు నయనపాలుఁ డందుల సంగతులు గనుఁగొను చుండెను. మాఱువేషములతో దిరుగుచుండిన నయనపాలుఁడును ఫకీరును, పెక్కు మాఱులు జనానాలోఁ గలిసికొనిరి, కాని యొండొరులఁ బలుకరించు కొనలేదు. ఫకీరు కొన్ని నాళ్లవఱకు నాతఁ డెవ్వఁడో గ్రహించుకొన లేదుగాని, తాను రానాతఁడు నయనపాలుఁడనియు, నిందిరను రక్షించుటకుఁ బ్రయత్నించుచుండెననియు, తెలిసికొనియెను. కాని సమయము వచ్చినప్పుడు పలుకరించి వానిసాయమును గోరవలయునని యూహించి తనసంగతి

నేమియు వానికిఁ జెప్పకుండ ఫకీరూరకుండెను. ఆనాఁడు ఫకీరువేష ముతో నయనపాలుఁడు వాని కెదురైన తోడనే వానితోఁ జెలిమి జేయుటకదియే తగిన యదనని వానినిఁజూచి ఫకీరిట్లు సంభాషించెను.

"ఓహో! ఫకీర్జీ! సలామ్! ఎచ్చటికిఁ బోవుచుంటిరి?"

"మేము జనానాలోనికి బిక్షకై పోవుచున్నాము."

"మీరీ ఫకీరు వ్రతము పూని యెన్నాళ్లయ్యెను?"

"ఇప్పుడా సంగతు లెందుకోసము?"

"బాబా! నీపూర్వ వృత్తాంతమంతయు నే నెఱుఁగుదును. నీ విట్లు మాఱువేషము వేసికొని జనానాలోని కేకార్యమునకై పోవు చుంటివోకూడ నాకుఁ దెలిసిన విషయమే! నీకు సహాయపడవలయునని నాకుఁ గోరికయున్నది. ఇంక దాఁపక చెప్పుము."

ఆ పలుకు లాలకించినతోడనే ఫకీరు తన వృత్తాంతమంతయు గ్రహించెనేమో యని నయనపాలుఁడు శంకాన్విత స్వాంతుఁడై చూచుచుండ, ఫకీరు "బాబా! నీ వనుమానింపకుము. నీ సంగతి పూర్ణ ముగ నేను దెలిసికొంటిని. ఇంక దాఁపనేల? నీవు నయనపాలుఁడవుకావా?" అని చెప్పినంతనే నయనపాలుఁడు వానిచేతులు పట్టుకొని "స్వామీ! నా గుట్టుఁ బైటఁబెట్టవలదు. నన్ను మీరు రక్షింప వలయు." అని బతిమాలుకొనఁగా ఫకీరు "భయములేదు. భయములేదు. నీగుట్టు బైటఁబెట్టి నిన్ను మోసపుచ్చవలయునని నా యభిప్రాయము గాదు. నీ హృదయమునఁగల కోరిక నే నెఱిఁగినందున నీకుఁ దోడ్పడ వలయు నని నాకుఁదోఁచెను." అని వచించెను. ఆ మాటలాలించి నయన పాలుఁ డప్పుడే వానిచేయి పట్టుకొని కొన్ని సంగతులు మాటాడవలసి యున్నవని వానినొక రహస్యప్రదేశమునకుఁ గొనిపోయి యిట్లు ప్రసంగించెను.

"అయ్యా! తమ కాఁపుర మేపురము?"

"ఓయీ ! ఫకీరుల కొకచోటఁ గాఁపురమని నియమమున్నదా యేమి ? ఊరూరఁ దిరుగుచు నెవ్వరికెట్టి మోసము సంభవించినను గాపాడుటయే మాపని. నిన్నుఁ జూచినంతనే నీవొక రాజపుత్రుఁడవని గ్రహింపఁజాలితిని. ఇంక నిశ్చయమైన సంగతికూడఁ జెప్పెదను వినుము. ఇందిర నెట్టులైన జనానాలోనుండి తప్పించి యామెను గాపాడవలయు నని నీవు ప్రతిదినమును జనానాలోనికి వచ్చుచుఁ దాపత్రయ మొందు చున్నావు. కాని ఇందిర ప్రస్తుత ముదయపురియొద్ద లేదుసుమా ?"

"ఏమీ ? తప్పించుకొని పాఱిపోయెనా యేమి ? అట్లులైన నే ధన్యుఁడనే !"

"పారిపోలేదు. రోషన్ ఆరావద్ద నున్నది."

"ఉదయపురి యూడిగముమాని రోషన్ ఆరాకు సేవచేయు చుండెనా ? ఆదుర్మార్గురాలిందిర కెట్టిమోసము గావించునోకదా ?"

"లేదు, లేదు. రోషన్ ఆరా ఆమెచే సేవచేయించు కొనలేదు"

"ఏమి ? ఆమెను సౌఖ్యముగనే పెంచుచుండెనా ?"

"అవును చెఱలో."

"చెఱలోఁ బెట్టించెనా ? ఎంతసాహస మెంతసాహసము ? ఆమెకింక దిక్కెవ్వరు ?"

"యమునానదియే యామెకుదిక్కు."

"ఫకీర్జీ ! రోషన్ ఆరా ఆమెపై నేమైనఁ గుట్రఁబన్నినా యేమి? దయచేసి చెప్పుఁడు."

"ఓయీ ! సంగతులన్నియుఁ దరువాత స్పష్టముగఁ జెప్పెదను. ముఖ్యమైన సంగతివిను. రోషన్ ఆరా ఇందిరను నేఁటిరాత్రి రెండు జాములకు నదిలోఁ బడవేయించి చంపించుటకు సిద్ధముగ నున్నదని నాకుఁ దెలిసినది. అయినను నా కీయూరిలోఁ బరిచితులెవ్వరును లేనందున నేమి చేయవలయునాయని యప్పటినుండియు యోచించు చున్నాను. మాటలలోఁబడి మనమిట్లు కాలయాపనముఁ జేసినకార్యము

లేదు. కావున త్వరలోనే యొకపడవను నీవెచ్చటనైన సంపాదింప వలయును. మన మిరువురము నాపడవ యెక్కి యమునలోనుండి రోషన్ ఆరా బురుజువద్దకుఁ బోయి యామె ప్రాణములు గాపాడుదము లెమ్ము!"

"అయ్యా! పడవను సంపాదించుట కేమి ప్రయాస మున్నది? నే నిప్పుడే దానికై ప్రయత్నించెదను."

"అట్లులైన వే వేగ లెమ్ము! మన పనిఁ జూచుకొందము."

అని వారిరువురు నచ్చటనుండి వెడలిపోయిరి. ఇంతలోఁ గ్రమ క్రమముగా సూర్యుఁడు పశ్చిమాద్రి నలంకరించెను. కిలకిలారావములు పక్షిసంతానములు తమ గూండ్లఁజేర పక్షములు విప్పుకొని గగనమార్గ మున వలయాకారముగఁ బోవుచుండెను. ఆకాశమను మహారణ్యమున పడమటి దిక్కను రసాలవృక్షము, అరుణపల్లవ సముదాయ మనుసాంధ్య రాగముచే నిండి కడుమనోహరముగ నుండెను. కాని, ఇంతలో గాఢాంధకారమను మదపుటేనుఁగు ప్రవేశించి యాలేఁజిగుళ్లఁగడుసార మెక్కి త్వరలో నిర్మూలము గావించెను. గగన తలంబున పొడమిన తారకల కాంతియైనను లేకుండఁ గొంతసేపటికిఁ జిన్నచిన్న మబ్బు లెల్లెడల నావరించి యొకరిమొగ మింకొకరి కగపడకుండు లాగున నావెను జీకటిని మఱింత దట్టపఱిచెను.

ఎంతటి ధైర్యశాలుల కైనను పెనుభూతమువలె భీతి గల్గించు చున్న యీ మహాంధకారములో నానాఁటిరాత్రి యమునానది చూపఱకు మఱింత భయంకరముగఁ దోఁచుచుండెను. "దుష్కార్య ములు చేయఁబూనినవారి హృదయములు, దమ కార్యములు సఫల మగునో లేదోయని యెల్లప్పుడు నిట్లే వ్యాకుల మొందుచుండు" నని లోకమునకు బోధించు చుండెనోయన, యన్నదీ తరంగంబు లల్లకల్లో లమై యుబ్బి పొరలుచు ఘోషించుచుండెను. అన్నిశాసమయంబు గాఢాంధకార బంధురంబై యుండుటచే యలలచప్పుడు వినఁబడుట

దక్క, నీలివర్ణముగ నున్న నదీజలము గోచరము కానందున నెటు చూచినను దిగులు పుట్టించుచుండెను. ఆ నదియొడ్డున ననేక సౌధరాజములు గలవు. వానిలో నన్నిటికన్నను రోషన్ ఆరా జనానా యానదికిఁ గడు సమీపముగ నిర్మింపఁబడినది. ఆమె బురుజుయొక్క గోడకుఁ బ్రక్కనుండియే నది ఘోరముగఁ బ్రవహించు చుండెను.

ఆ నాఁటిరాత్రి రోషన్ ఆరా తన ముఖ్యసేవకుఁడగు ఫరక్ షైరును దక్క, తక్కటి సేవకుల నందఱను నేవో పనులుగల్పించి తన జనానాలో నుండనీయక యెచ్చటికో పంపివేసెను. క్రమక్రమముగా జామున్నర రాత్రి కావచ్చినందున ఢిల్లీనగరమంతయు జోకొట్టినట్లు హాయిగా నిద్రించుచుండెను. ఏవంక దిలకించినను మనుష్య సంచారము గానరాలేదు. అప్పుడిరువురు పురుషులొక పడవపైఁ గూర్చుండి యమునలో నొకప్రక్కనుండి బయలుదేఱి వచ్చుచుండిరి. అలల తాఁకుడుచే నాపడవ మాటిమాటికి నిటునటు నూఁగుచున్నందున వారు తమ ప్రాణములను పిడికిళ్లలో నుంచుకొని బహు ప్రయాసతో వచ్చుచుండిరి. ప్రవాహవేగముచేత నాపడవ యేమూలకుఁ గొట్టుకొని పోవునోయని పాపమాపురుషులిరువురు భయాకులచిత్తులై, యష్టకష్టము లొందుచు నాపడవ నెట్టులో యీడ్చుకొని వచ్చుచుండుటఁజూడ, పడవ నడపుట యందు వారికదియే ప్రథమ ప్రయత్నమని చెప్పవలసియున్నది. కొంత సేపటి కాపడవ రోషన్ ఆరాయొక్క దక్షిణపుబురుజు గోడను సమీపించెను. అప్పుడు వారు తమ పడవ నచ్చటనాఁపి కొంతవఱకు వేచి యుండిరి. ఇంతలో నాబురుజుపై నేదియోయొక శబ్దమై, ఎవరో మాటలాడుకొను చుండినట్లు క్రిందపడవలో నున్నవారికిఁ వినఁబడెను. కాని చీఁకటి దట్టముగ నుండుటచేఁ గ్రిందివారు మీఁదివారికిని, మీఁదివారు క్రిందివారికిని గనఁబడుట కవకాశము చిక్కలేదు. అయినను ఆ పురుషులిరువురును తమదృష్టి బురుజుమీఁదికే సారించి యుండిరి. అప్పుడాబురుజుపైనుండి యేదియోయొక వస్తువు మెల్లగజాఱి

క్రిందికి వచ్చుచుండినట్లు వారికిఁ బొడగట్టెను. తోడనే వారిరువురును దమలో నేమేమియో గుస గుస లాడుకొని తమ పడవను బురుజు గోడకు మరింత దగ్గఱగఁ జేర్చిరి. క్రమ క్రమముగా నా వస్తువు క్రిందికి జాఱి జాఱి నీటికిఁ దాఁకినంతనే అందుతో ననుసరించియున్న యొక పెద్ద త్రాడుగూఁక పైనుండి నదిలోఁబడెను. అప్పుడు నదిలోనున్న పురుషు లిరువురు దటాలున నా వస్తువును బట్టుకొని తమ పడవలో నిడికొని తమచేతులతోఁ దట్టి చూచి, "అరే! ధరించుకొనిన అంగీయును కాళ్లకుఁగల పాయి జమాయును జూడ నీతఁడొక పురుషుని వలె నున్నాఁడే" అని రహస్యముగఁ దమలో ననుకొని వారిరువురు నా పురుషుఁడు మూర్ఛిల్లియుండెనని యెంచి తడిసిపోయిన బట్టలను దీసి పొడి బట్టలను గట్టి యా పడవలో నొక మూలఁబరుండ వెట్టి యాతఁడు ప్రాణములఁ బాసెనేమో యను శంకచే వానిగుండెలపైఁ జెయివైచి చూచి ,దడదడఁ గొట్టుకొనుచుండినందున మూర్ఛయే వహించెనని నిశ్చయించుకొనిరి. ఇంతలోఁ బూర్వమువలెనే యా బురుజుపైనుండి మరల నేదియో యొకవిగ్రహము క్రిందికి జాఱి వచ్చుచుండినట్లు వారిరువురుఁ గనిపట్టి "మన మనుకొన్నదిదియే కాఁబోలు" అని తమలో రహస్యముగఁ జెప్పుకొనిరి. ఆ విగ్రహము నదీజలంబులకుఁ దాఁకకుండ తమ చేతులను జాఁచి పట్టుకొనవలెనని వారిరువురును సిద్ధముగ నుండిరి. రానురానా విగ్రహము తమ్ము సమీపించినంతనే వారు క్రిందఁ బడకుండ తటాలునఁ బట్టుకొనిరి. తోడనే యొక పెద్దత్రాడు క్రిందికి విడువఁబడెను. వా రామెను చూచినంతనే యిందిరయని తెలిసికొని యానంద మొంది, ఆమె నాడిని బరీక్షించి ప్రాణములతోడనే యున్నదని యెంచి మూర్ఛిల్లి యున్న యిందిరను పడవలో నింకొకమూలఁ బరుండఁబెట్టి, ఇంక నెవ్వరైన బురుజుపై నుండి నదిలో విడువఁబడుదురేమో యని కొంత

నిరీక్షించి పిదప నెవ్వరును గ్రిందికి జాఱి రాకుండుటయేకాక, యాబురుజు పై మాటల సందడియు శబ్దము నణంగినందున వారు తమపడవను అచ్చటనుండి మరల నడిపించుకొనుచు బయలుదేఱిరి.

పడవలో మూర్ఛిల్లియున్న స్త్రీకిని పురుషునకును నా యిరువురలో నొకఁ డుపచారములు సేయుచుండెను. రెండవవాఁడు మెల్లగాఁ బడవ నడపుచుండెను. అట్టులారాత్రియంతయు వారానదిలోఁ బ్రయాణముచేసి కొంతదూరము పోయినతరువాత, తమ వద్దనున్న చెకుముకి రాయిదీసి అందువలన నగ్నిఁ బుట్టించి యాకాంతిలో మూర్ఛిల్లియున్న రెండు విగ్రహములను జూచి, ఇందిరా దుర్గాదాసులని పోల్చుకొని తమ కార్యమునుకొనిన దానికన్న నెక్కుడుగ ఫలించెనని యెంతో సంతసించిరి. అంతవఱకు నిందిరా దుర్గాదాసులకుపచారము సల్పుచుండిన పురుషుఁడు పడవ నడపుచుండిన వానినిఁజూచి "ఓయీ! నాకుఁ జేయవలసిన తొందర కార్యము లనేకములున్నవి. నేనింక నీతోఁ రాఁజాలను. మనము ఢిల్లీనగరముదాఁటి యెంతోదూరము వచ్చితిమి. ఇచ్చటికి సమీపముననే నీ గ్రామమున్నది. వీ రిరువురను నీతోఁ గొనిపోయి జాగ్రత్తగఁ గాపాడుము. తెల్లవాఱు జాము గావచ్చినది. నేనింక నిచ్చట నుండరాదు పోకతప్పదు." అని పలికినంతనే ద్వితీయ పురుషుఁడు "అయ్యా! పోయి వచ్చెదరా? మీ యుపకారమును నే నెన్నఁటికిని మఱవఁజాలను. మీరు నాపాలిట సాక్షాత్కరించిన భగవంతునివలెఁ దోఁచుచుంటిరి. మీ సెలవు ప్రకారము నేనీ ఇరువురను గడుజాగ్రత్తగఁ గాపాడెదను." అని బదులుచెప్పి పడవను నది యొడ్డునకు దీసికొని పోవనాతఁడు గట్టుపైకి దాఁటి తనదారి నెచ్చటికో పోయెను. తరువాత నాపురుషుఁడు పడవ నెప్పటివలె నదిలోనుండి నడపించు కొనుచుఁ బ్రయాణము సేయుచుండెను. కొంతసేపటికింపిరయు దుర్గాదాసును మూర్ఛనుండి లేచి తెలివిఁదెచ్చుకొని నలువంకలును బరికించి, ఎటు చూచినను భూప్రదేశము గానరాక అంతయు

జలమయమై యుండుట కద్భుతమొంది వెల వెలఁబోవుచు చూచుచుం డిరి. అప్పుడు పడవ నడుపుచున్న పురుషుఁడు వారియాందోళనము చూచి "మీరు విచారింపకుఁడు. మీ ప్రాణములను నేను గాపాడితిని. లేనిచో క్రూరాత్ములగు రోషనారా మిమ్ము చంపించియే యుండును." అని ధైర్యము చెప్పెను. అప్పుడు దుర్గాదాసు లేచి పడవ నడపుచున్నవానిని జూచి యిట్లు ప్రసంగించెను.

"నాయనా! మమ్ముఁ గాపాడిన నీవెవ్వఁడవు? నీకు మేమేమి యుపకారము చేయఁగలము?"

"ఓయీ! నే నెవ్వఁడనైన నేమి? మీ కపకార మొనర్చిన వాఁడనే కాని యుపకారము చేసిన వాఁడనుగాను. నా బ్రతుకంతయు నిరర్థకమయ్యెను. నాయట్టి పరమదుర్మార్గుడు జీవించియుండుట మీ యట్టి సజ్జనులకుఁ బ్రాణసంకటముగ నుండును. నేను మీ యెడలఁ జేసిన నేరమునకు ఎన్నాళ్లు మీ సేవఁ జేసినను మీయనుగ్రహమునకుఁ బాత్రుఁడఁగా నేరను. ఇంక నాకీనీచపుఁ బ్రాణములపై నాశ లేదు. మీ రిరువురు నెచ్చటికైనఁ బోయి భద్రముగా నుండుఁడు. నేనీ నదిలోఁ బడి ప్రాణత్యాగముఁ జేసికొనెదను."

"ఓయీ! నీ సాహసమునకుఁ గారణమేమి? నీ వెవఁడవు? నీకంఠస్వర మెచ్చటనో విన్నట్లున్నది. ఒక్క నయనపాలుఁడు తక్క మమ్ము మోసపుచ్చిన వారెవ్వరు లేరు"

"అయ్యా! అంధకారమింకను బూర్ణముగఁ దగ్గకుండుటచే మీరు నన్నుఁ బోల్చుకొనఁ జాలకుండిరిగాని మీకు ద్రోహము చేసిన నయనపాలుఁడను నేనే! నా వృత్తాంత మెఱింగించెద నాలకింపుఁడు. చంద్రావతిని దీసికొనిరాలేదని పాదుషా నన్నుఁ గారాగృహమునఁ బెట్టించెను. కాని నేను కొన్ని దినములుమాత్రమే చెఱలోనుండి మీ యిరువురకుఁ జేసిన మోసమునకిదియె ఫలమనుకొని, పాదుషా నెట్టులైన మోసపుచ్చవలయునని సంకల్పించుకొని కారాగృహాధి

కారితో స్నేహముఁజేసికొని తప్పించుకొని బైటఁబడితిని. ఆ మఱుసటి దినమునుండియు, పాదుషాకుఁజిక్కియున్న యిందిర నెట్లులైనఁ గాపాడి నా పశ్చాత్తాపమును బాపుకొనవలయునని పెక్కుమాఱు వేషములు ధరించుకొని జనానాలోనికిఁ బోవుచు నచ్చటి విశేషము లరయుచుంటిని.

ఇంతలో నా పాలిదైవమువలె నెవఁడోయొక ఫకీరువచ్చి నాతో స్నేహముఁజేసి నేఁటిరాత్రి రోషన్ఆరా ఇందిరను నదిలోఁ బడఁద్రోయించునని నా కెఱింగించెను. అప్పుడు నే నాశ్చర్యమొంది వాని సాహాయ్యమునుగోరి యొక నావికునకు లంచమిచ్చి యీ పడవను సంపాదించి మే మిరువురమును నింటఁగూర్చుండి రోషన్ఆరా బురుజు నద్దకుఁబోయి నదిలోఁ బడకుండ మిమ్మిరువురమును గాపాడఁజాలితిమి. ఇందిరయే కాక దైవానుగ్రహమున నీవుగూడఁ బ్రతికితివి. ”

“ నయనపాలా ! ఆఫకీరెచ్చట నున్నాఁడు ? ”

“ మీ యిరువురను నాకప్పఁజెప్పి తొందర కార్యములున్నవని యాతఁడిప్పుడే పడవ దాఁటిపోయెను.

“ అయ్యో ! మాకింత యుపకార మొనర్చిన యాతనిదర్శనము మాకు లభింపదయ్యె ”

ఇందిరను నదిలోఁ బడఁద్రోయించి చంపించినయెడల నీ వృత్తాంత మెట్లులైనఁ దుర్గాదాసునకుఁ దెలిసినచో నాతఁడు, దన కేమైన మోసముఁజేయక మానడని రోషన్ఆరా యెంచి ఆనాఁటిరాత్రి, యప్పటికప్పుడు దుర్గాదాసునుగూడ చంపింపవలయునని నిశ్చయించు కొనెను పాదుషా ఆతని నొక సౌధములోనుంపించి తన భటులను జుట్టును గాపుంచుటచే నామె తన సేవకుఁడగు ఫరక్ఖైరునంపి తద్భటులకుఁ గొంతధనము లంచమిప్పించి, అప్పుడు రాత్రి ఎనిమిది ఘంటల కాలమై యుండినందున నిద్రపోవుచున్న దుర్గాదాసు నోటిలోగుడ్డలు గ్రుక్కించి కాళ్లును చేతులును కలయఁ గట్టించి ఇందిరతోఁ గూడ యమున కర్పించుటకుఁ దనజనానాలోనికి

రప్పించెను. ఈ సాహస కార్యముఁ జేయుటకు పాదుషా భటులు వెఱచిరిగాని, అది అతిక్రమించుటకు శక్యముగాని రోషన్ ఆరా యాజ్ఞ యగుటచేతను, ఒకవేళ పాదుషా దుర్గాదాసు విషయమై కనుఁగొనిన యెడల నాతఁడు తప్పించుకొని పాఱిపోయినట్లు పాదుషాకుఁ జెప్ప వలయునని యామె ఫరక్ ఖైరువలన భటులకుఁ గబురంపుటచేతను, వారు దుర్గాదాసును విడువ వలసివచ్చెను.

నయనపాలుని స్వభావమంతలో మాఱుటకు ఇందిరా దుర్గాదాసు లెంతయో ఆశ్చర్యమొందిరి. అప్పుడు దుర్గాదాసు వానినిఁజూచి, "నయనపాలా! నీ విఁక విచారింపకుము. నీ విదివఱలో మాకుద్రోహముఁ జేసితివని పశ్చాత్తాపమొందకుము. దైవాజ్ఞమీఱుట యెవ్వరికిని సాధ్యముగాదు. మేలుకల్గినను గీడు కల్గినను వాని యాజ్ఞచేతనే! కావున మించినదానికై విచారింపనేల? తెల్లవాఱు చున్నది. మనము వేవేగ పోవలయును. అచలేశ్వరాలయమునకుఁ బోయి, అచ్చట వైకుంఠయోగిని దర్శించుకొని, అజితసింగునుజూచి, పిమ్మట భావికృత్యముల యోచింతము." అనిపలుక, నయనపాలుఁడు, "అయ్యా! ఇదిగో మాగ్రామము సమీపించినది. మనమిచ్చట దిగి, యొక పూట శ్రమదీర్చుకొని బయలుదేఱుదము" అని చెప్పి ఆ యూరివద్దనే తన పడవ నొడ్డునకు నడపించి ఇందిరా దుర్గాదాసుల మెల్లగ నొడ్డునఁజేర్చి తాను గూడ గట్టుమీఁదికి దాఁటెను. వారు ముగ్వురును రహస్యముగ నాగ్రామముననే యుండి ఆ నాఁడు సాయంకాలమే యాబూపర్వతమునకు బయలుదేఱిరి.

# ముప్పదిమూడవ ప్రకరణము

## జోహారు

రూపనగరమున సంగతు లెట్లుండెనో మనము గనుఁగొని చాలదినములుగా వచ్చెను. సాదతుఖాను తన సైన్యముల నా పట్టణము చుట్టును భద్రముగాఁ గాపుంచెనని వ్రాయుట క్రొత్త సంగతిగాదు. రాజపుత్రు లెవ్వరైన విజయసింహునకుఁ దోడుగ నరుదెంచుచుండి రేమోయని పాపమాతఁడు క్షణక్షణము దిగులు పడుచుండెను. ఆ కారణమున నాతఁడు తనభటులను గొంతదూరమువఱకునంపి వార్తలు కనుఁగొను చుండెనని యిదివఱకే వ్రాసియున్నారము. పాదుషా సైన్యములతో నెన్నఁటికైన వచ్చునేమో యని యెదురుచూచుచు నాతఁడు క్షణ మొకయుగముగ గడుపుచుండెను. ఒకనాఁడాతఁడు ఔరంగజేబు సైన్యములతో వచ్చుచున్నాఁడనియు, నీ ప్రాణములింక దక్కవనియు, కావున విమల నొసంగి పాదుషాతో సంధిఁజేసికో వలసినదనియు, విజయసింహునకు వర్తమానముంపెను. ఆ రాజపుత్ర వీరుఁ డావార్తను తన సైనికుల కెఱింగించి వీరులైనచోఁ బౌరుషము వహించి ప్రాణములపై నాశవహింపక మహమ్మదీయులతోఁ బోరుఁడు." అని యాజ్ఞాపించెను. వాని సైనికులందఱు నామాటలవిని క్రొత్తధైర్యమును క్రొత్త శౌర్యమును వహించి, కోట బురుజులపైకిని గోడలపైకిని, ఎక్కి ఫిరంగులతోడను తుపాకులతోడను సాదతుఖానంపిన వార్తకుఁ బ్రత్యుత్తర మిచ్చుచుండిరి. కాని యానాటిదినము మహమ్మదీయులు రాజపుత్ర సైన్యముల కోపానలమును భరింపఁజాలరైరి. మొదలే సాదతుఖాను

యొక్క సైన్యములు స్వల్పములు; అందులో నిద్రాహారములు లేక యాఱు మాసములనుండి రూపనగరమును ముట్టడించియున్నవారు. ఈ రెండు కారణములచేతను, తగినంత బలమును శౌర్యమును లేక శుష్కించి యుంటచేత వారాదినమునఁ బూర్ణముగ నోడిపోవలసి వచ్చెను. సాదతుఖాను గడుఁజతురుఁడగుటచే నప్పటికి యుద్ధముఁ జాలింప వలయునని వెంటనే తనసైనికుల కాజ్ఞాపించెను.

ఎప్పటికిని పాదుషాసైన్యము లంపకుండుటచేతను, తన సైన్యము లన్నియు నాఁడోటు వహించుటచేతను, రాజపుత్రు లేవంకనుండి యేక్షణమునఁ దనపైఁ బడుదురోయను భీతిచేతను ఆతని హృదయ మన్నివిధముల నల్లకల్లోలమగుచుండెను. ఆతఁడు మాటిమాటికి నులికిపడుచు రాజపుత్రుల జయించు వెరవుగానక పరితపించుచుండెను. అయినను సాదతుఖాను మిక్కిలి బుద్ధిశాలిగావున నేదేని చమత్కారమైన యుక్తిఁబన్ని రాజపుత్రసైన్యములను భయపెట్టి అందుమూలమున వారిని గెలువ వలయుననియు, ఇంకఁ బౌరుషము వహించి యెదురుగఁ బోరాడుటయన్న కష్టసాధ్యమనియు, నెంచి తద్విషయమై కార్యోపాయ విచారమునందు మగ్నుఁడై యుండెను. అట్లు యోచించి యోచించి సాదతుఖాను ఆనాఁటిరాత్రియే పాదుషా సకలసైన్యసమేతుఁడై వచ్చెనని, విజయసింహుఁడు వాని సైన్యములు భీతిఁజెందునని యెంచి వదంతి పుట్టించెను. ఆ వదంతివిని విజయసింహుఁడు తన సైన్యముల నెల్ల మఱింత భద్రముగా నుంచి తగిన జాగ్రత్తతో నుండెను. ఇంతలో వేఁడి వేలుపు పడమటి సముద్రమందుఁ గ్రుంకినందున వెలుతురంతయుఁ గ్రమక్రమముగ క్షీణించి జగంబునందంతట నంధకారంబునకుఁ దావొసంగెను.

నాఁటిరాత్రి సాదతుఖాను తన సైన్యమంతయు నెన్నియో భాగములుచేసి, మూఁడునాలుగు మైళ్లు విస్తీర్ణమయిన ప్రదేశమున

నచ్చటచ్చట గుంపుగుంపులుగ నుంచి ఆయాచోటులఁ గాగడాలు వెలిఁగించెను. కొందఱు సైనికులతోఁ దానుమాత్రము పట్టణము సమీపముననే కాచియుండెను. ఆతఁడు తన సైన్యములట్లు భాగములు చేసి యచ్చటచ్చట నుంచుటకు రెండు కారణములు గలవు. రాజపుత్రులేవంకనుండి వచ్చినను పట్టణముఁ బ్రవేశించి విజయసింహునకుఁ దోడుగాఁ జనకుండ నాఁపి వేయవచ్చుననియు, తన సైన్యములు గొంచెముగా నుండుటచే ఒక్కచోటుననే గుమిగూడి యుండినయెడల తనగుట్టు బైటఁబడును గావున నచ్చటచ్చటనుండిన యెడల దీపముల కాంతిచే నానిశాసమయంబున నెందఱో సైనికులు క్రొత్తగా ఢిల్లీనగరమునుండి వచ్చిరని భావించుకొని తన శత్రువులు భీతిఁజెందెదరనియు, నెంచి యీ రెండుకారణములచే సాదతుఖాఁ నాయుక్తిఁ బన్నెను. ఇంతియకాక యాతఁడు రణదుందుభులును జయభేరులును మ్రోయించుచు నట్టహాసము సేయుచుండెను. వాని యుద్దేశానుసారముగ ఠాపనగర సైనికులు పాదుషా పెక్కుసైన్యములతో వచ్చెనని నిశ్చయించుకొనిరి. అయినను, ప్రాణములాశింపక, చావునకుఁ దెగించి ఎందఱు శత్రువులు వచ్చినను పోరాడవలయునని యుంకించుచుండిన వారెగాని, భీతిల్లి వెనుదీసిన వాఁడొక్కఁడైన రాజపుత్రసైనికులలోఁ గానరాఁడయ్యె.

విజయసింహుఁడుగూడ పాదుషాయొక్క రాక నిక్కమనియే నమ్మికొని ధైర్యముతోడనే యుండెనుగాని, తనవద్దనున్న సైన్యములు శత్రువుల నెదిరించుటకుఁ జాలవేమోయని యనుమానముమాత్ర మొందుచుండెను. రాజులందఱును మూర్ఖచిత్తులై తనకుఁ దోడుపడ రాకుండిరిగదా యని యాతఁడు వారినెంతయో దూఱఁదొడంగెను. ఎందఱు శత్రువులు తన పట్టణముపైఁ బడినను ఆతఁడు పరులకు వెన్నుఁజూపువాఁడు కాఁడు. తన కంఠమునఁ బ్రాణము లున్నంత కాలమును మహమ్మదీయులతోఁ బోరుట కాతఁడీవఱకే నిశ్చయించు

కొనెఁ గదా! అయినను శత్రువుల నెట్టులైనఁ దన పట్టణమునుండి యావలికిఁ బాఱఁదోల వలయునని యాతఁడుపాయము లాలోచించు చుండెను. ఎంత యోచించినను లావుకొలఁదిఁ బోరుట దక్క వేఱొక్క యుపాయ మేమున్నది? రూపనగరము మంటి పాలొనరించి యైనను, రాజపుత్రవంశము లోకంబున నిర్మూలముఁ జేసి యైనను విమలను గైకొనక మాననని పాదుషాయును, ముల్లోకంబులు దలక్రిందైనను దేశంబునఁ గల వీరులందఱు నేకీభవించి తన పైకి దండెత్తి వచ్చినను తనకూఁతును పాదుషాకుఁ జిక్కనీయనని విజయసింహుఁడును, గంకణములు గట్టుకొని యుండ, వారిరువురకు నెట్లు సంధియగును? విజయసింహుఁ డెట్టి సంధులకైన సమ్మతించును గాని తన వీరక్షత్రియ ధర్మమునకు మాత్రము భంగము గలుగ నీయఁడను మాట యింక నిశ్చయమేకదా? ఆనాఁటి రాత్రి యాతఁడు కోటలో బురుజుల మీఁదను గోడల మీఁదను సంచరించుచు అందందుఁ గల సైనికులకు ధైర్యము గఱపుచుఁ దగిన యేర్పాటులు సేయు చుండెను.

అప్పుడు విమలయు నెన్నియో ప్రయత్నములు సేయుచు ఎన్నియో యుపాయముల నాలోచించి సైనికులకుఁ దెలియఁ జేయుచు, యుద్ధసామగ్రి విశేషముగ సిద్ధము గావించుచు తన తండ్రితో గూడ నెంతయో తొందరపడు చుండెను. ఎన్ని ప్రయత్నములు సేయుచుండినను ఆనాఁడు మాత్రమామె ముఖవికాస మించుక తగ్గినది. ఆ కారణమున నామె తనవలనఁ దన తండ్రికిని రూపనగరమునకును ఎట్టి కీడు సంభవించునో యని విచారించుచుండెనని చెప్ప వచ్చును. కొన్నినాళ్ళవఱకును రాజసింహుఁడు వచ్చి తన్ను రక్షించునని ఆమె ఎంతయో యాశతో నుండెను గాని, ఎప్పటికిని ఆతఁడు రాకుండుటచే ఆ యాశ సర్వమును క్రమక్రమముగ క్షీణించెను. కడపటఁ దాను వ్రాసిన యుత్తరమునకుఁ బ్రత్యుత్తర మొసంగుటకుఁ గూడ సమ్మతింపని రాజసింహుఁడు వచ్చి తన్ను గాపాడునా యని

విమల తానావిషయమై ధైర్యము మానుకొనెను. "రాజపుత్ర స్థానమునఁ గల రాజపుత్రు లింతటి కఠిన చిత్తులని నే నెఱుంగనైతి." అని యామె యనుకొని వారిని నిందించు చుండెను. ఆమెకుఁ బ్రాణ సఖి యగు పద్మ మనసులో నధైర్యము వహించియు వెలుపలికిఁ దోఁప నీయక ఎన్నో కథలను జెప్పుచు యామెకు ధైర్యము గఱపు చుండెను.

ఆనాఁటి రాత్రి విమలయు, పద్మయు, విజయసింహుఁడును మొదలగు వారందఱు మాటి మాటికి మేడపైకిఁ బోయి శత్రు సైన్యములఁ జూచుచు, అందులకుఁ దగినట్లుగ తమ సైన్యములలో యుద్ధ సన్నాహముఁ జేయుచుండిరి. ఆ నిశాసమయంబున దీపముల కాంతిని మొగలుల సైన్యములు భయంకరములై లెక్కకు మీఱి యుండినట్లు వారికిఁ దోఁచెను. అప్పుడు విమల తన చెంతనున్న పద్మను జూచి,

"పద్మా! నేఁటి రాత్రి శత్రువులు లెక్కకు మిగిలియున్న వారు. ఢిల్లీ నగరమునుండి నేఁడు క్రొత్తసైన్యములు వచ్చినట్లున్నది."

"అమ్మా! అయిన మాత్ర మేమి భయము? మన సైన్యములు మాత్రము సామాన్యముగ నున్నవా? భీతిల్లకుము?"

"చెలీ! రాజసింహుని సాహసముఁ జూచితివా? కడకుఁ బ్రత్యుత్తరమైనను వ్రాయలేదు. ఇంతకు నొకరి సాయము మన మేల యపేక్షింప వలెను? మనయంతట మనమే శత్రువులతోఁ బోరాడి గెలువ వలయును"

"విమలా! తొందర పడినఁ గార్యమగునా? ప్రత్యుత్తరమే కాదు. ఆతఁడే వచ్చును."

"చెలీ! ఆ యుత్తరము వాని కందినదో లేదో యని నాకను మానము గల్గినది. త్రోవలో నెవరైన సామల్ పండితుని కొట్టి యా జాబుఁ గ్రహించిరేమో?"

" అట్టి సందేహము నీ కవసరము లేదు. నేనెంతయో తగిన యేర్పాటు చేసి వాని నంపితిని. ఆ యుత్తరము తప్పక రాజసింహునికందియుండును. "

" పద్మా ! ఉత్తరమే అందిన యెడల నాతఁ డిట్టు లూరకుండ చేయువాఁడు కాఁడే ! అతని సద్గుణములు మన మిదివఱలో వినలేదా?"

" విమలా ! అతఁ డెట్టి చిక్కులలోఁ బడి యుండెనో మన మేమి యెఱుఁగుదుము ? "

అట్లులైన నాతఁ డింక రాఁడని నిశ్చయమే కదా ? "

" అట్లు చెప్పుటకు వీలులేదు. "

అని యిట్లిరువురును సంభాషించు కొనిరి.

అంత కంతకు విమల హృదయంబున నాందోళన మెక్కుడగుచుండెను. ఆమెకు ధైర్యముగఱపు చుండెను గాని పద్మగూడ తనలో విచారించుచునే యుండెను. ఆనాఁటిరాత్రి కోటలో నొక్కరైనను నిద్రనపొంప లేదు. రాత్రియంతయుఁ గ్రమ క్రమముగా ముగియుచుండెను. ఏక్షణమున నే వైపునుండి శత్రువులు పైఁబడుదురోయని కంటిపై రెప్పవాల్పక రాజపుత్ర సైనికులందఱును గడు జాగ్రత్తతో దుర్గమును గాపాడు చుండిరి. ఇంతలో తెల్లవాఱుజాము కావచ్చినది. కాని చీఁకటులు మాత్రము పూర్ణముగఁ దగ్గలేదు. అప్పుడు త్తరపుఁ దట్టునుండి కొన్ని సైన్యములు కాగడాలతో రూపనగరము వైపు వచ్చుచుండెను. నేల యీనినట్లు లాసైనికుల సంఖ్య మితిమీఱి యుండెను. మేడపైనుండి విజయసింహుఁడు విమల పద్మ మొదలైన వారందఱు నా సైన్యములఁ జూచి ఢిల్లీనగరమునుండి సైన్యములు వచ్చుచుండెనని నిశ్చయించుకొనిరి. శత్రుసైన్యములు విశేషముగ వచ్చుచుండెననియు తన యొద్దనున్న సేనలు స్వల్పములనియు నెంచి విజయసింహుఁడు తన కపజయము చేకూఱుట స్థిరపఱుచుకొనెను. మొగల్ సేనలు సేర్గమును భేదించి లోనఁ బ్రవేశింపకమునుపే స్త్రీల

మానములు గాపాడు ప్రయత్నములు చేయవలయునని విజయసింహుఁడు విమలను సమీపించి ధైర్యముతో,

"అమ్మాయీ! విమలా! నేటితో మనకును రూపనగరమునకును ఋణము దీఱిపోయినది. పాదుషా స్వయముగ గొప్ప సైన్యములతో వచ్చినాఁడు. ఇంకను శత్రువులు వేలకొలంది ఢిల్లీ నగరమునుండి వచ్చుచున్నారు. ఇన్నాళ్లనుండియుఁ బోరిపోరి కృశించియున్న మన సైనికులు శత్రువులనింక నెదిరించుట దుష్కరము. మనకు జయముగలుగుట కలలోనివార్త. ఏ రాజైనను తోడు పడఁడాయని నే నిన్నాళ్లవఱకును ఎదురు చూచుచుంటిని. కాని యందువలన నేమియు లాభము లేకపోయెను. అయినను నాకావిషయమై యెంతమాత్రమును విచారములేదు......"

అని యింక నేమేమొ చెప్పఁబోవుచుండఁగా, విమల "నాన్నగారూ! మీరు చెప్పఁదలంచిన సంగతి నంతయు నేగ్రహించితిని. మీరింక నెంతమాత్రమును హృదయమున విచార ముంచుకొనరాదు. మహమ్మదీయులు మిమ్ముఁ బరిమార్చి కోటలోఁ బ్రవేశించి మా మానములకు భంగము గలిగింపక మున్నే మేమందఱము నగ్నిహోత్రుని శరణు వేఁడుకొనెదము. కావున నింక త్వరపడవలయును. ఆలస్యముచేసిన శత్రువులకు మాన మర్పింపవలసి వచ్చును. మన సైన్యములనెల్లఁ బరిమార్చి పాదుషా కోటలోనికి వచ్చునరికి వాని కెందుఁజూచినను భస్మరాసులు దక్క యొక్క రాజపుత్ర స్త్రీయైనను వానికంటఁ బడరాదు. మనముగూడ మన పూర్వులవలెనే క్షత్రియ ధర్మమును బాలింపవలయును. మహమ్మద్ గోరీ రాజ్యమేలు కాలమున రాణిసంయుక్తయు, అలాయుద్దీను కాలమునఁ బవిత్ర చరిత్రయగు పద్మినియు, అక్బరు కాలమున మీరాభాయియు, శత్రువులచేఁ బరాభవ మొందకుండఁ దమ ప్రాణచయంబు లగ్ని భగవానునకు సమర్పించి మానములఁ గాపాడుకొని జగంబునందంతట శాశ్వతమైన

కీర్తిని బడసిరి. కావున ఔరంగజేబు కాలమున విమలగూడ వారివలెనే క్షత్రియధర్మమునకుఁ గళంకము గలుగనీయక గాపాడెనని నేనుగూడ కీర్తివహించెదను. ఈ యంతఃపురమునఁగల స్త్రీలందఱతోఁగూడ మా ప్రాణములు వీతిహోత్రునకు సమర్పించెదము. మీరు సత్వరముగఁ బోయి ప్రాణములు పోవుదాఁక రణరంగమును విడువకుఁడు. మనము స్వకులోచిత ధర్మాచరణ వ్రతం బవలంబించి యున్నవారము గావున నిట్టి సమయంబున నెంత మాత్రంబును విచారింపఁగూడదు. అన్యచింతలతో నింక కార్యములేదు. నే నగ్నిహోత్రమును త్వరలోఁ బేర్పించి నామానముతో పాటుగ నందఱ స్త్రీల మానములు గాపాడి నాతోఁగూడ వారిందఱకు మోక్షము గలుగునట్లు చేసెదను. తండ్రీ ! నిన్నిదియే నేను కడసారిచూచుట. ఇదియే కడసారి మాటలాడుట." అని ధైర్యముగాఁ బలుక కుమారితమాటల కెక్కడలేని శౌర్యమును వహించి విజయసింహుఁడు "అమ్మా ! విమలా ! నే నిప్పుడే యుద్ధభూమికిఁ బోవుచున్నాను. త్వరలోనే మనమందఱము మఱల వీరస్వర్గమునఁగలసి కొనెదము. ఇంక నీవు జోహారు గావింపుము." అనిచెప్పి యాతఁ డచ్చట నుండక యుద్ధమునకు బయలుదేఱి పోయెను.

జోహారనఁగా రణరంగమునఁ దమకు నిక్కముగఁ బరాజయంబు వాటిల్లునని తోఁచినప్పుడు తమ కాంతాజనము శత్రువులకుఁ జిక్కి వారివలన మానభంగ మొందకుండ, తొలుత వారినిఁ గడతేర్చి పిదప పురుషులందఱును ధైర్యముతో నొక్కపెట్టున రిపువర్గముపైఁబడి సమరతలంబున ప్రాణంబులువిడుచుట. ఈ అచారము మన తెనుఁగు దేశమునఁ గూడ గలదు. ఫ్రెంచివారు బొబ్బిలికోటను ముట్టడించి నప్పుడు రణరంగవీరుఁడగు రంగారాయఁడు అంతిపురజనములనెల్లఁ జంపించుట ఎల్లరకును విశదమైన సంగతియేకదా.

విజయసింహుఁడు యుద్ధభూమికి బయలుదేఱి పోయినంతనే విమల అన్యచింతలతో నింక కార్యములేదని త్వరలో నగ్నిఁ బేర్పింపు

మని పద్మకు నియమించెను. పద్మ తత్క్షణమున నేపోయి యొకవిశాలమగు ప్రదేశమున వందలకొలఁది గట్టెలు దెప్పించి యందుఁ బేర్పించెను. ఇంతియకాక కోటలోఁగల గంధపుఁ జెక్కలును, కపురంపు రాసులును కడవలకొలఁది ఘృతంబును గూడఁ దెప్పించి ఆకట్టెలపై వేయించి నిప్పునంటించెను. త్వరలోనే రజపూత కాంతలమానము గాపాడ వలయునని కాఁబోలు తత్క్షణముననే అగ్నిహోత్రుఁడు నలువదియడుగుల పొడవుదాఁక భయంకరముగఁ బ్రజ్వలించుచుండెను. అప్పు డంతఃపుర మునఁగల స్త్రీలెల్లరు రక్తాంబరములు ధరించుకొని తమకుఁగల యాభరణము లన్నియు నిడికొని పసుపు కుంకుమములతోఁ బళ్లెరములు చేతులలోఁ బెట్టుకొని యచ్చటికి వచ్చి అగ్నిచుట్టు నిలువంబడిరి. విమల తానందఱ కన్నను వీతిహోత్రునకు సమీపమున నిలువంబడి యమ్మానవతీలలామ లందఱు వినుచుండ బిగ్గరగ నిట్లనియెను.

“ ఓ క్షత్రియాంగనామణులారా! మనము క్షత్రియ వంశంబున జనించిన దాది నేఁటివఱకు మన మానముల కెట్టిభంగమును రానీయక గాపాడుకొంటిమి. పూర్వ మెందఱో సతీమణులు తమ మానములఁ గాపాడుకొని నిర్మల యశంబు వహించిరి. మనముగూడ క్షత్రియ ధర్మము ననుసరించి పవిత్రచరిత్రలమై యగ్నిహోత్రుని [illegible]యమునఁ బరమపదముఁ బడయుదము. అకలంక ప్రవర్తనలమై మానరక్షణమే యిప్పు డవశ్యకర్తవ్యముగఁ జూచుకొన వలయుఁగాని క్షణభంగురము లగు శరీరములపై నెంతమాత్రము నాశవహింపరాదు. కావున మన మందఱమును బూర్ణానందముతో నుండవలయును. ఇట్టి సమయంబున మీ హృదయంబులయం దెట్టి కోరికలు నుంచుకొనరాదు. ”

ఆ మాటలన్నియు విని రాజస్త్రీలెల్లరు ప్రాణములకుఁ దెగించి వివాహోత్సవమువలె మహోత్సాహముఁజెంది ధైర్యము వహించి,

అందఱును చేతులను జోడించి ఆ యగ్నికుండము చుట్టును ముమ్మాఱు ప్రదక్షిణము చేసి "ఓయగ్ని భగవానుఁడా! సర్వభక్షకా! లోకాధారా! శరణు!" అని యగ్నిలోఁ బడ నుద్యుక్తులైరి. కాని తత్క్షణముననే "ఓ వీరాంగనలారా! వలదు వలదు, సాహసంబువలదు. రాజపుత్రులే జయించిరి. మీరింక నగ్నిలోఁ బడవలదు." అని అగ్నిలోఁబడనున్న రాజపుత్రస్త్రీలకు నాకస్మికముగ వినఁబడెను. ఆ పలుకులు విని, ముందునకు దుముకఁబోవుచున్న స్త్రీలెల్లరు తటాలున నాఁగి ఆశ్చర్యమొంది, యిటునటుఁ జూచుచుండిరి.

# ముప్పదినాల్గవ ప్రకరణము

## రాజసింహుఁడు

రాజసింహుఁడు రూపనగరమునుండి తన సైన్యములతో బయలుదేరి రాజులను వెంటఁబెట్టుకొని మిక్కిలిత్వరితగతి రూపనగరమును సమీపించెను. అప్పుడు మహమ్మదీయ సైనికులును విజయసింహుని సైనికులును హోరాహోరిగఁ బోరాడు చుండుటఁజూచి రాజసింహుఁడు త్వరలో నడచెంచి శత్రువులఁ దాఁకెను. సాదతుఖాను తన సైన్యములన్నియు నెన్నో భాగములుచేసి యచ్చటచ్చటనుంచి నందున తురకలందఱుఁ గలిసి యొక్కమాఱుగ రాజసింహునిఁ దాఁకుటకు వీలులేకపోయెను. రాజపుత్ర సైన్యములు దమకుఁదోడుగ వచ్చుటఁజూచి, విజయసింహుని సైన్యములు క్రొత్తధైర్యమును క్రొత్త పౌరుషమును వహించి మహమ్మదీయులతో వెనుదీయక పోరాడసాగిరి. ఒక ప్రక్కనుండి రాజసింహుని సైన్యములును రెండవ ప్రక్కనుండి విజయసింహుని సైన్యములును ఘోరముగఁ గలహించు చుండుటచే మహమ్మదీయ సైన్యములు వానిని భరింపలేక, కొంతసేపటికి నలువంకలకుఁ జెల్లాచెదరై పారిపోయెను.

ఇంతలో రాజసింహునకు మింటిపొడవునఁ బ్రజ్వలించుచున్న మంటలు కంటఁబడ వెంటనే యంతఃపుర స్త్రీలు అగ్నిప్రవేశ మొనరించి జోహారు గావింప నున్నారని గ్రహించి యితరుల నెవ్వరినైనఁ బంపిన నాలస్యముచేసెదరని తాను స్వయముగనే కోటలోఁ బ్రవేశించి ఘోషాగల స్త్రీలపాలి కేఁగఁగూడదని యెఱింగిన వాఁడయ్యు వారి ప్రాణములు గాపాడుటకొఱకు పరుగు పరుగునఁ బోయెను.

అంతకుమున్న స్త్రీలందఱితోడను సగ్ని ప్రవేశ మొనర్చెదనని విమల చెప్పినతోడనే ధైర్యము వహించి విజయసింహుఁడు యుద్ధ సన్నద్ధుఁడై బయలుదేఱి, శత్రువులతో నొక నైపునఁ బోరాడు చుండెను. వృద్ధుఁడయ్యు యౌవన పురుషుని కన్న నెక్కుడుగ ప్రాణములపై నిరాశఁజెంది రిపుల నల్లకల్లోల మొనర్చుచుండెను. విజయసింహుఁడు తన ప్రాణము లింక విడువక తప్పదుగదాయని నిశ్చయించుకొని, శత్రువులకుఁ జిక్కకుండ తనవలెనే విమల మొదలగు వారందఱుఁ బ్రాణత్యాగ మొనర్చు చున్నారని మఱింత ధైర్యమువహించి "నా ప్రాణములు గాపాడుకొని యింటికిఁబోయి నేనింక నెవ్వరిని జూచెదను." అని తలంచి శత్రుమధ్యంబున నాతఁడచలుండై కదలకుండెను. కాని చాల కాలముననుండి తన్నెడఁబాసి పోయిన తన కుమారుని మాత్రము ఒక్కసారి చూడవలయునని యాతనికిఁ గోరికజనించెను. అయినను నాఁటనుండి నేఁటివఱకు నెచ్చటను జాడలేని కుమారునిఁ జూచుభాగ్యమెట్లు కల్గునని తలంచి యాతఁడు తద్విషయమై గూడనిరాశఁ జేసికొనెను. అట్లన్ని విషయముల నే కోరికయుఁ దన హృదయంబున నిడికొనక అప్పటికి పౌరుషంబే ప్రధానంబుగఁ దలంచి యుద్ధము సేయుచుండ నొక ప్రక్కనుండి శివసింగు శత్రువులతోఁ బోరాడు చుండినట్లు వాని కంటఁబడియెను. కాని మరల వానినిఁ జూడవలెనన్న విజయసింహుని కాతఁడు గాన రాఁడయ్యె. అప్పుడే యా రాజపుంగవుఁడు తన దృష్టి మార్చుకొని "లోకంబున మనుజునిఁ బోలుమనుజు లెందఱుండరు? వట్టి భ్రమ చేతఁ గుమారునిఁ జూచినట్లు నాకుఁ బొడగట్టెను గాని యీవగరంబునఁ జేరవలదని నేనాజ్ఞాపింప నాతఁడేల వచ్చును?" అని యాతఁడు తలంచెను. తన వంశక్షయమునకుఁ గారకుఁడు ఔరంగజేబె గదాయని యా రాజవీరుఁడు ప్రచండ మార్తాండ బింబంబువలె భయంకరుఁడై శత్రు సంకులంబున నిలిచి ఎడతెఱపి లేకుండ రిపుల నొప్పించుచుండెను. వేయేల? "విజయసింహుని పైఁదృష్టినిలిపి పోరుసల్పినఁదప్ప

ఇటునటుం జూచితిమేని ప్రాణములు దక్కవు” అని యెంచి మొగలాయీ లెల్లరు భీతిఁజెందునట్లా వీరుఁడు యుద్ధము సేయుచుండెను. కొంతసేపటికి తురకల సైన్యములు నలువంకలకును బాఱిపోయినంతనే మాతఁడద్భుతి మొందఁజూచుచుండెను. అప్పుడొక రాజభటుఁడు వాని సమీపమునకు వచ్చి “రాజేంద్రా! ఎవఁడో యొక రాజకుమారుఁడు తన సైన్యములతో వచ్చి వెనుకనుండి మొగలసేనలతోఁ బోరి వారిని బాఱఁదోలెను” అని చెప్ప విజయసింహుఁ డా రాజపుత్రుఁ డెవఁడోయని యాలోచించుచు తన కే జయముగల్గినదని సంతసించుచు జోహారు మాన్పవలెనని కోటలోనికిఁ బరుగునఁ బోవుచుండెను. అప్పుడు మఱియొక రాజభటుఁడు పరుగు పరుగున వచ్చి “దేవా! రాజకుమారుఁ డొకఁడు స్త్రీల ప్రాణములు గాపాడవలయునని యంతఃపురములోనికిఁ బోవుచున్నాఁడు” అని చెప్పెను. విజయసింహుఁడా మాటలు విని తానుగూడ త్వరత్వరగ నంతఃపురమునకుఁ బోవుచుండెను.

అటు రాజసింహుఁడు మానవతీ ప్రాణ రక్షణార్థము అంతిపురములోనికిం జని “వలదు, వలదు సాహసంబు వలదు, రాజపుత్రులే జయించిరి” అని కేకలువేయుచు వచ్చుచుండ అగ్నిలోఁ బడఁ బోవుచున్న స్త్రీలెల్లరు నా మాటలు విని యొక్కమాఱు వెనుకకు దిరిగి పరుగిడుచుఁ దమ వంకకు వచ్చుచున్న రాజపుత్రునిఁ జూచి యాతఁ డెవఁడోయని తలపోయుచుండిరి. ఇంతలో రాజసింహుఁడు వారిని సమీపించి, అందఱికన్న ముందుగ నగ్నిలోఁబడ నుద్యుక్తురాలై యగ్నిహోత్రమునకు సమీపముననే నిలిచియున్న విమల చేయి పట్టుకొని యీవలికి లాగివేసెను. ఇంతలోఁ గొందఱు రాజభటులు వేవేగవచ్చి ఆ యగ్ని హోత్రమును పూర్ణముగఁ జల్లార్చిరి.

పర పురుషుని కరస్పర్శవలన హృదయంబున విచారంబును, అట్టి శుభవార్త నెఱింగించి అందఱ ప్రాణములు రక్షించినందున

సంతోషమును గూడ విమలకప్పుడు జనించెను. ఆమె రాజసింహునిఁ బెక్కునాళ్ల క్రిందటఁజూచి యుండుటచేతను ఆ సమయము తెల్లవారుజాము అయి అప్పటికింకను కొంచెము చీకటియుండుటచేతను విమల తటాలున రాజసింహునిఁ జూచి పోల్చుకోనఁజాలక పోయెను. అందుచే నామె వానిని,

"అయ్యా! మీరెవ్వరు? అన్యకాంతల నిట్లు ముట్టవచ్చునా?"

అని యడుగ రాజసింహుఁడా మాటకుఁ జిఱునవ్వు నవ్వుచు.

"నీ వవివాహితవుగదా? అన్యకాంత వెట్లు లయ్యెదవు?"

"అయ్యా! అవివాహితనైన మాత్రమేమి? లోకంబున నొక కన్య యొకపురుషుని వరించినప్పుడు ఆమె వాని ధన మైనట్టులే కదా!"

"అవునవును. లోకంబున రాజకన్యకలు అనేక విధముల ననేక ప్రదేశములయందు తమకంటఁబడిన సుందరపురుషులను వరించుచుందురు. ఉద్యానవనములయందు విహరించు నప్పుడును, పురుష వేషముల వేసికొని యరణ్యములకు వేటకై వచ్చి యచ్చట నెవఁడైన రాజపుత్రుఁడు గనఁబడిన యెడల వాని నుండి యుంగరము తీసికొను నప్పుడును, పలువిధముల నీ యాచారము జరుగుచున్నది. అప్పుడా కన్య వాని ధనమైనట్టులే! ఇందులకు నే నొప్పు కొంటిని."

అని రాజసింహుఁడు వచించి నంతనే విమల తత్క్షణముననే వానినిఁ బోల్చుకొని రాజసింహునిగా నెఱింగి ఎక్కడ లేని సిగ్గు దల కెక్క చెంతనున్న పద్మ వెనుకకుఁబోయి దాఁగుకొనెను. ఆ రాజ మార్తాండుని సందర్శనమున విమల హృదయకమలము పూర్ణముగ వికసించెను. ఆమెపొందిన యానంద మింతింత యన నలవిగాదు. తక్కిన రాజపుత్రాంగనల దుఃఖ బాష్పములన్నియు నానంద బాష్పములుగ మారెను. వారి మరణ ప్రయత్నములన్నియు బెండ్లి ప్రయత్నములయ్యెను. సిగ్గుచేఁ దన వెనుక దాఁగియున్న విమలను పద్మ జూచి చిఱునవ్వు నవ్వుచు "చెలీ! నీ వెవ్వనిని ఉత్తరము

వ్రాసి రప్పించుకొంటివో యాతఁడే వచ్చి నిన్నుఁ గాపాడెను కావున వాని వెనుక నుండక నాటగ్గఱ కేల వచ్చితివి ?" అని పరిహాసము చేసెను. ఆ మాటలకు విమల మందహాసమున మొగము వాల్చుకొని యూరకుండెను.

ఇంతలో విజయసింహుఁడు గూడ నచ్చటికే వచ్చెను. అతఁడు రాజసింహునిఁ జూచిన తోడనే యమందానంద మొంది "ఓహో! రాజసింహా! నీవా? నీవు గాక మాకింతటి యుపకార మొనర్చు వారెవ్వరు కలరు? నీవు సకల సైన్యములతో మాకుఁ దోడు గావలయునని వచ్చుచుండ, చీఁకటిలోఁ జూచినందున మే మందఱము పాదుషా సైన్యములు వచ్చుచున్నవను కొని ప్రాణములపై నాశ విడిచితిమి. ఆహా! మే మెంత యదృష్ట వంతులము?" అని వానిని గౌఁగిలించుకొని యాతఁ డొనర్చిన యుపకారమున కనేక విధముల నానిని గొనియాడి, యిట్లు సంభాషించెను.

"రాజసింహా! రూపనగర వంశము నుద్ధరించిన మహాను భావుఁడవు నీవేకదా? నీకీర్తి లోక ప్రఖ్యాతము కాఁగలదు."

"పెద్దలయ్యుఁ దమరిట్లు నన్నుఁ బొగడుట ధర్మము గాదు. ఇంతకు నేను చేసిన దేమున్నది? మే మందఱమును పెద్దలైన మీ యాజ్ఞ ననుసరించి మెలంగ వలసినదే! మీకుఁ దోడుగ వచ్చుట ఆలస్యమైనందులకు నన్ను క్షమింప వలయునని ప్రార్థించుచున్నాను.

"సరే దీని కేమిగాని, పాదుషా సైన్యములతో వచ్చు చున్నాఁడు గదా? ఈసరికి సమీపమునకే వచ్చి యుండును. కావున మన విమల నెట్టులైన నీ నగరమునుండి తప్పించి యెచ్చటనైన నుంచ వలయును. దీనికి నీవేమందువు?"

"అవును పాదుషా యీమెకొఱకే వచ్చుచున్నాఁడు గావున ఇచ్చటనుండి త్వరలోఁ దప్పించుటయే యుక్తము. మీ సెలవైనచో నీమె నుదయపురంబునఁ జేర్చి మరల వచ్చెదను. ఆ కోట భేదించుట యెట్టివారికిని సాధ్యముగాదు. నేను మరల నిచ్చటికి త్వరలోనే వచ్చి

పాదుపాను దాఁకెదను. నేను వచ్చువఱకు నీ నగరంబునఁగూడ కొంత సేనావారముంచెదను. ”

“ రాజసింహా ! ఇందుకు నా సెలవు గావలయునా ? ఈమె నీ ధనముగాని యింక నా ధనముకాదు. ఎట్లు కాపాడుకొనెదవో నీదయే భారము. ఆలస్యముఁ జేసిన మోసము సంభవించును. ”

అని పలికి పద్మ వెనుకనున్న విమలను చేయిపట్టుకొని ముందు నకుఁ దీసికొనివచ్చి “ అమ్మా ! విమలా ! నీవు ధన్యురాలవైతివి. నీ కోరినవరుఁడే నిన్నుఁగాపాడెను. కన్నతండ్రినయ్యు నిన్ను నే నాపదల నుండి తొలంగింపఁ జాలనైతిని. ” అని పలికి ఆమె హస్తమును, రాజ సింహుని హస్తమునందుంచెను. స్త్రీలెల్లరునుగూడ వికసితవదనలై విమలను దీవించిరి. అప్పుడు విజయసింహుఁడు పద్మ ముఖ పద్మమును జూచి, “ పద్మా ! నీవు మావంశమునఁ బద్మవలె జనించితివి. చిన్న ప్పటినుండియు నీ ప్రాణసఖి విమల నెన్నోవిధములఁ బెంచి యామె నాదరించుచుంటివి. కావున నీవుగూడ మీ విమలకు సహాయముగఁ బోవలయును, ” అని చెప్పెను.

పిదప విమలయును బద్మయును పురుష వేషములు ధరించుకొని చెరియొక గుఱ్ఱముపైఁ గూరుచుండిరి. రాజసింహుఁడు విజయసింహునకు నమస్కరించి వానివలన సెలవుగైకొని తన వారువముపైఁ గూర్చుండి పోవుచుండెను. వానివెనుక విమలయుఁ బద్మయును జిఱునవ్వులొలుక తమగుఱ్ఱములను నడిపించుకొనుచుఁ బోవుచుండిరి. స్త్రీలెల్లరును మేడల పైనుండి వారిపై పుష్పవర్షమును గురిపించిరి. అట్లు కొంతదూరము పోయిన తరువాత పద్మ తన గుఱ్ఱమును విమల గుఱ్ఱమునకు సమీపముననే నడిపించుచు నామెతో ననేకవిధముల ముచ్చటించుచు “ చెలీ ! రాజసింహుఁడని తెలిసినంతమాత్రమున సిగ్గుచే నా వెనుకఁ జొచ్చినదాన విప్పుడీతనిని వెంబడించి యెట్లు పోవుచుంటివే ? ” అని హాస్యమాడెను. పద్మ జాణతనమునకు విమల సంతసించుచు మొగము వాల్చుకొని యూరకుండెను.

# ముప్పదియైదవ ప్రకరణము

## ముగ్గురు బాటసారులు

శత్రువుల బారినుండి తప్పించి మన విమలను రాజసింహున కప్పఁజెప్పితిమి గావున నాకథనంతయుఁ గొంతవఱకు నట్లుండనిచ్చి మనమొకసారి యచలేశ్వరుని వైకుంఠయోగిని దర్శించుకొందము. రాజపుత్రుల కష్టములన్నియుఁ గట్టెక్కెనని లోకమంతటను జాటుటకుఁ గాఁబోలు వేఁడివేలుపు తూర్పు గట్టెక్కెను. ఆతఁడు తన వేయి చేతులతోడ నచలేశ్వరునకు నమస్కరించుచుండెను. అన్ని జాతుల చిలుకలును తమ తమ గూళ్లనుండి వెలువడి కిలకిలలాడుచు నచలేశ్వరాలయము చుట్టునుచేరి, ఆ స్వామికి నుత్సవముసేయుచుండెనో యన పలువిధముల నాటలాడుకొనుచుండెను. చెట్లపైనుండి కోయిలలు మనోహరముగఁ గూయసాగెను. మయూరములు తమ నేర్పంతయుఁజూపుచు నా పర్వతముపై నచ్చటచ్చట నాట్యమాడుచుండెను.

అప్పుడు ఎవ్వరో మువ్వురుపురుషులు గుఱ్ఱములపైఁగూర్చుండి తమలో మాటలాడుకొనుచు నా పర్వతముపై పునకే వచ్చుచుండిరి. ఆ మువ్వురలో సిద్ధఱించు మించుగ నొక్కరూపుననే యుండి ఒక్క తల్లికిఁబుట్టిన అన్నదమ్ములవలెఁ జూపఱకుఁ దెలియఁజేయుచుండిరి. మూఁడవ పురుషుఁడు ఆ యిరువురిలోఁ జిన్నవానికిఁ దగ్గఱగనే తన గుఱ్ఱమును నడిపించుకొనుచు మాటి మాటికి వానిపై పే చూచుచుండెను. ఆ చిన్నవాఁడుగూడ నప్పుడప్పుడు వానిని విలోకించుచుండెను. తమ గుఱ్ఱములను వడివడిఁ దోలుచు నా పురుషులు మువ్వురును నిట్టూర్పు

విడుచుచు రెండు మూఁడుదినములనుండి ప్రయాణము సేయుచు వచ్చుచుండినట్లు కనఁబడుచుండిరి. పాప మామువ్వురిలోఁ జిన్నవాఁడు మాత్రము అందఱికన్న కడుంగడుడస్సి మొగము కళాహీనమై వాడిపోవ బలహీనుఁడై యూరక విసుగుకొనుచుండెను. ఒడలెల్లఁ జెమటచే మజ్జనమాడినట్లు దడిసిపోవ నా బాలుఁడు తన బట్టకొంగుతో విసరుకొనుచు హోయిహోయి యనుచు నెంతో ప్రయాసమునఁ బోవుచుండెను. తక్కిన పురుషు లిరువురును వానికి ధైర్యముగఱపుచు అప్పుడప్పుడు " ఇంకెంత దూరము ! ఇదిగో ఆ బూపర్వతము ! అచలేశ్వరాలయము కనఁబడుచునే యున్నది ! కావున మఱికొంచెముసేపు శ్రమకోర్చితిమేని ఆలయమునకుఁ బోఁగలము! " అని ఆ చిన్నవానితోఁ బలుకుచుండిరి. పోవం బోవ నమ్మువ్వురు పురుషులును ఆ బూపర్వతమును సమీపించి యచ్చటఁ దమ గుఱ్ఱములను డిగ్గి యొక చెట్టునకుఁగట్టి కొండమీఁదికిఁ బోవసాగిరి.

ఆ పర్వతమెక్కుట అలవాటైన వారికిఁదక్క, ఇతరులకుఁ గష్టసాధ్యము. ఎచ్చటఁ జూచినను ఆపర్వత ప్రాంతమంతయు పైభాగము దక్క తుప్పలతోడను కంటకములతోడను నిండియుండెను. అచ్చటచ్చట గొప్పగొప్ప వృక్షములు క్రూరజంతువుల కాధారములై భయంకరముగఁ గనఁబడుచుండెను. ప్రతిదినమును భిల్లులు తఱచుగా వచ్చుచుఁ బోవుచుండుటచేఁ నాపర్వతమునకుఁ గ్రిందిభాగమునుండి పైభాగమున కొకబాట యేర్పడియుండెను. అయినను ఆబాట కడు సన్ననిదై యిద్దఱు మనుష్యులుమాత్రము పోవుటకుఁ దగినంత వెడల్పు గలిగియుండెను. ఆబాట కిరువంకలఁ దుప్పలును వాడియైన కంటకములును పెక్కులు గలవు. ఆమార్గము కొండమీఁదకుఁ దిన్నగా నేర్పఱుపఁబడి యుండక కొంత దూరమువఱకు మీఁదకుఁబోయి మఱల వంకరగఁ గ్రిందికివచ్చి దానిగుండ పోవువారికి త్రోవఁ దప్పితిమేమో యను ననుమానమును భీతియుఁ గల్గించుచుండెను. ఆ త్రోవకిరువంకలఁ

బుట్టిన వృక్షముల శాఖలు క్రిందికివంగి మఱల మీదివైపునకు బెరిగి వాని క్రిందనుండి పోవువారికి పైనిబడునేమోయను భయమును బుట్టించుచుండెను. ఆ బాట యందచ్చటచ్చట మాత్రము మెట్లు గట్టినట్లు సహజముగ రాతిపలక లొకదానిపై నింకొకటి పుట్టియుండుటచే నాయాభాగములయందు మాత్రము నడచుట అంతకష్టముగా నుండదు. అచలేశ్వర స్వామివారిని దర్శించుకొని యందువలన మోక్షమును బడయఁదలంచి యదివఱకెందఱో ఆ పర్వతము నెక్కఁబోవుచు మార్గమధ్యముననే మెట్లపైనుండి కాలు జాఱినందున రాలపైఁబడి విశేష ప్రయాస మక్కఱలేకుండ సూక్ష్మములోనే మోక్షముఁ బడయుచుండిరి.

పాపము మన బాటసారు లష్టకష్టములొందుచు నెట్టులెట్టులో గట్టులనక మిట్టలనక ముండ్లనక పోవుచుండిరి. ఆ ముప్పురలోఁ జిన్నవాఁడు తొలుతనుండియు నాయాసపీడితుఁడై యుండినందున అందులకుఁ దోడుగనాపర్వత మెక్కుట వానికి మఱింత దుర్భరముగ నుండెను. ఒకరి చేతులొకరు పట్టుకొని తుప్పలుదాఁటుచు, అచ్చటచ్చట నిలువఁబడి మార్గమును దప్పిరేమోయని చూచుకొనుచు ఇంకెంత దూరము పోవలసి యున్నదోయని మీఁదిభాగమును బరీక్షించుచు తమ భారమంతయు నచలేశ్వరునిపై వైచి నడచుచుండిరి. పాప మందులోని చిన్నవాఁ డడుగుదీసి యడుగు వేయుటకు శక్తిలేక మధ్య మధ్య చదికిలఁ బడుచుండెను. ఈరీతి నెట్టకేలకా ముప్పురు పురుషులును పర్వత శిఖరమునకుఁ బోయి నిట్టూర్పులు విడుచుచు నచలేశ్వరాలయమును సమీపించిరి. వారు పోవుసరికి అప్పుడే యోగిరాజు జపమునుండి లేచి యీవలికి వచ్చుచుండెను, వాని జూచినంతనే ముప్పురు పురుషులును భక్తి వినయములతో వానికి నమస్కరించి నిలువఁబడిరి. అందులోఁ జిన్నవానిని బోల్చుకొనఁజాలక పోయినను, రెండవ వానిని మాత్రము గుర్తెఱింగి, మహానందము వహించి యోగి "ఓహో! దుర్గాదాస్!

ఎన్నాళ్లకు నిన్నుఁ జూడఁ గల్గితిని? నీకు క్షేమమేకదా! నీవు ఢిల్లీ నగరమున నుండి యెట్లు తప్పించుకొని వచ్చితివి? మనయిందిర యెచ్చటనున్నది? ఈ పురుషుఁడెవ్వఁడు?" అని యాతురతతో నెన్నియో ప్రశ్నలడుగ దుర్గాదాసు "యోగీంద్రా! త్రికాలజ్ఞులగు మీకుఁ దెలియని సంగతు లేమున్నవి? అయినను వినుఁడు. ఈ పురుషుఁడు నా మిత్రులలో నొకఁడు" అని చెప్పి తాను ఢిల్లీ నగరమునకుఁ బోయినదాది నయనపాలునితోడను ఇందిరతోడను గలసి యచ్చటికి వచ్చినంతవఱకును జరిగిన కథనంతయు సవిస్తరముగ వాని కెఱింగించి "దేవా! తమ దర్శనమును మాబాలరాజు దర్శనమును చేయవలెనని యిట్లువచ్చితిమి" అని పలికెను. యోగి ఆ పలుకులన్నియు విని యద్భుతమొంది తొలుతఁదాను పోల్చుకొనఁ జాలక పోయిన చిన్నవాఁడు పురుష వేషమును ధరించుకొనిన యిందిరయని తెలిసికొని యానందానంద మొంది ఆమెను జూడవలెనని యటునిటుఁ బరికించెనుగాని యెందును గానరాలేదు. పిదప యోగి దుర్గాదాసును జూచి "ఓయీ! రోషన్ ఆరా క్రూరకృత్యము నేనిదివఱకే యెఱుంగుదును. నయనపాలుని సాహాయ్యమున మీరెట్టులో గండము దాఁటివచ్చిరి. అంతియ చాలును" అని పలికి నయనపాలుని వంకదిరిగి వాని చేయిపట్టుకొని "బాబా! నయనపాలా! నీవు తొలుత దుర్మార్గమున సంచరించినను పశ్చాత్తాపమొంది సన్మార్గపరుఁడవైతివని యిదివఱకే విని నేనెంతయో సంతసించినాఁడను జుమా! నాయనా! ఇంకనైన క్షత్త్రియ ధర్మమును నిలిపి పేరొందుము" అని వాని వీపుపై తట్టుచు నభిమానపూర్వకముగ వచింప నయనపాలుఁడు సిగ్గున మొగము వాల్చుకొని యా యోగిపుంగవుని పాదములకు మఱల వినయముగ నమస్కరించెను. యోగి దుర్గాదాసుతో రాజసింహుని వృత్తాంత మంతయుఁ దెలిపి ఆ మఱునాఁ డుదయమున నాతఁడు విమలతో తన దర్శనమునకు వచ్చుననియు, నలయునేని

రాజసింహునితోఁ గలిసి యుద్ధము సేయుటకుఁ బోవచ్చుననియుఁ జెప్పి, యంతవఱకుఁ దన యాలయములో నుండవలసినదని, నయన పాలుని దుర్గాదాసుని యోగి నిర్బంధించెను. కొన్నినాళ్లవఱకు ఇందిరయు బాలభూపాలుఁడును తనవద్దనే యుండవలయుననిగూడ నాతఁడు చెప్పెను. ఆ మాటలువిని దుర్గాదాసు "యోగీంద్రా! తమ సెలవుప్రకారము నడచుకొనుచున్నాను" అని బదులు చెప్పెను. కాని నయనపాలుఁడు మాత్రము తనచేతులను జోడించి విధేయుఁడై యోగిని జూచి "స్వామీ! నన్ను క్షమింపవలయును. నాకుఁ బోవలసిన కార్యము లనేకములున్నవి. ఔరంగజేబు నెట్టులైన మోసపుచ్చ వలయునని నేను నిశ్చయించుకొనుట తమకుఁ దెలిసియే యున్నది. నేను మున్ముందుగఁ బోయి రాజపుత్రులఁ గలసి యా ప్రయత్నములో నుండెద" అని యోగివద్దను దుర్గాదాసు నొద్దను సెలవుగైకొని బయలుదేఱెను.

ఇందిర తొలుత యోగియు దుర్గాదాసును మాటలాడుకొను చుండినప్పుడే యాలయము లోనికిఁ బోయి తన పురుషవేషమును దీసి యచ్చట నొక భిల్లాంగన యొడిలోఁ గూరుచుండి యాడుకొనుచున్న యజితసింగు నెత్తుకొని కఱవుదీర ముద్దులాడు చుండెను. తా నష్ట కష్టములఁ బడి కాపాడిన యా బాలునిఁ జూచినంతనే యామె చిత్త మెట్టు లుప్పొంగెనో వేఱుగ వ్రాయవలెనా? ఆమె యా బాలునిఁ దన యొడిలోఁ గూర్చుండఁ బెట్టుకొని వాని పెక్కు మాఱులు ముద్దు లాడుచు బిగ్గఁ గౌగిలించుకొనుచు నా బాలుని మొగముఁ జూచి యిట్లు విలపింప నారంభించెను.

"హా! సుకుమారా! అజితసింగా! సకల సేనా సమన్వితుండై కాబూలు దేశంబున నయనపాలుఁడు మనల నడ్డగించి నప్పుడు మే మొందిన తాపత్రయ మంతయు, నాయనా! నీ కొఱకే గదా? ఎట్టులైన మా యుపాయంబులకు సమ్మతించి కుమార సహితంబుగ

శాత్రవవర్గంబు నిర్గమించి మమ్ముఁ బాలింపుమని మీ జనయిత్రిని ప్రార్థించుట, నాయనా ! నీ కొఱకే కదా ? చెంతనున్న గొల్లపల్లెకుఁ బోయి కాలగతిచే నెన్నఁ డెఱుంగని గొల్లవేషమును ధరించుకొని ప్రాణంబులకుఁ దెగించి నిర్భయంబుగ శత్రు వితానమునుండి గుడారములలోఁ బ్రవేశించుట నాయనా ! నీ కొఱకే కదా ? ఎన్ని విధముల నయనపాలుఁడు మమ్ము బెదరించినను నించుకైన చిత్తంబున జంకక యాతఁ డెట్టిసంకటములఁ బెట్టినను ఎట్టి దారుణ కర్మ మాచరించినను, దిట్టలమై గుట్టు బెటఁ బెట్టకుండుట నాయనా ! నీకొఱకే కదా ? సైనిక నికాయంబు వెంట నిడికొని నయనపాలుఁడు పరుగుపరుగునవచ్చి సవారి నాఁపి రసపుత్రులతోఁ బోరాడుచుండి నప్పుడు మే మొందిన పరితాపమంతయు నాయనా ! నీకొఱకేకదా ? కుమారా ! నీవు మమ్మందఱ నుద్ధరింపఁ గలవని కొండంతయాశ వహించినందులకు నేఁటికి సఫలమైనది. మేమిన్నాళ్లకు నిర్వర్తిత ప్రజ్ఞులమైతిమి. తండ్రీ ! ఇంక నీవే జోధపురమునకు మహారాజవు ! నిన్నెడఁబాసి నప్పటినుండియు నా ప్రాణములు నీ మీఁదనే యుండెను గదా ? నాయనా ! ఇన్నినాళ్లకు నాకన్నుల కఱువుదీరినది. నా దుఃఖాంధకారమంతయు నీ చిఱునవ్వు వెన్నెలల నేఁడుగదా నశించెను ? నేనింక ధన్యురాలనైతిని. ”

అని యనేక విధముల నిందిర విలపించుచుండెను. కాని యేమియు నెఱుఁగని యా బాలుఁడు ఆమె వదనంబు జూచుచు చేతులును కాళ్లును నాడించుకొనుచు పకపక నవ్వుచుండెను. ఇందిర వాని నవ్వులును నాటలును జూచి తన దుఃఖమంతయును విడిచి, “ నాయనా ! నన్నుఁ జూచి నవ్వుచుంటివేలరా ? ” అని యడిగెను. ఆమాట అంతవఱకు నాలయమునకు వెలుపల దుర్గాదాసుతో నేమేమో సంభాషించు చుండిన యోగి విని వానితో నాలయము లోనికిఁబోయి చిఱునవ్వునవ్వుచు “ అమ్మాయీ ! ఏల నవ్వుచుండెనా?

ఎన్నికష్టములు వచ్చినను ఎట్టి యాపదయుఁ జెందక సౌఖ్యముగనున్న వానినిఁ జూచి సంతసించుటకు మాఱు దుఃఖించుచుంటివిగదా అని యీ బాలుఁడు నిన్నుఁజూచి నవ్వుచున్నాఁడు” అని పలికెను. ఆ మాటలువిని దుర్గాదాసు పకపకనవ్వెను. ఇందిర యోగిని జూచిన తోడనే యొడిలోనున్న బాలుని భుజముపై నిడికొని లేచి వానికి నమస్కరించెను, యోగి ఇందిరను దీవించి “అమ్మాయీ! నీయను గ్రహమున జోధపురవంశము నిలిచినది. నీ చరిత్ర మంతయు విని నేనెంతయో సంతసించినాఁడను. నీ యుపాయములును, నీ బుద్ధి చాతుర్యమును గల మఱి యేకాంత యీ లోకంబునఁ గలదు? సుకుమారి శరీరలగు స్త్రీలుపడరాని కష్టములెల్ల నీవు పడి యశవంత సింహునకు నీ వొనర్చిన యుపకారము వర్ణనాతీతముగదా? నీ ధైర్య మప్రతిమముగదా?” అని యోగి యామెను గొనియాడెను. ఆ మాటలన్నియు విని ఇందిర “దేవా! ఇందు నేను చేసిన దేమున్నది? ఇదంతయు మీ కటాక్షమువలనను, ఈ బాలుని యదృష్టమువలనను, చంద్రావతీ దేవి పాతివ్రత్య మహాత్మ్యము వలనను రాజ్యకార్య నిపుణుఁడగు మాయన్న సాహాయ్యము వలనను జరిగినది గాని నావలనఁ గాదు” అని పలికెను,

అటు నయనపాలుఁడు తనకుఁ జేయవలసిన కార్యము లనేకము లున్నవని యోగివద్ద సెలవు పుచ్చుకొని బయలుదేఱి యా పర్వతము దిగి క్రిందకు వచ్చుచుండెను. అప్పు డాపర్వతమునుండి నయనపాలున కాకస్మికముగ దూరమునుండి పాదుషా సైన్యములన్నియు నొకచోట విడిసియుండినట్లు వాని కంటఁబడియెను. కడుదూరముననుండి గాన్పించు చుండినందున నా సైన్యములన్నియు నణుమాత్రములై చీమలబారు వలె వానికిఁదోఁచుచుండెను. వెంటనే నయనపాలుఁ డచ్చటనే యాగి కదలక తనమోముఁ బైకెత్తి కనుబొమ్మలు దరిఁజేర్చి కనులు చిట్లించి యేమో దీర్ఘాలోచనము సేయుచు తలపంకించుచుఁ దనలో నిట్లనుకొన సాగెను.

"ఇప్పుడు నేనేమి సేయవలయు? సకల సేనాసమన్వితుండై వచ్చిన పాదుషాయును, ఇందిర దుర్గాదాసు అజితసింగు, మొదలైన యిచ్చటివారును నాచేతిలోఁ జిక్కియున్నవారు. నేనిప్పుడెవరిని మోసపుచ్చఁగలను. మరల నిట్లనుచుంటినేల? నన్ను బలవంతముగఁ గారాగృహమునఁ బడఁద్రోసి నానాకష్టములఁ బెట్టిన పాదుషాపైఁ గసిఁదీర్చుకొనవలయు ననిగదా యిన్నిపాట్లు పడుచుంటిని?...... ఏమేమీ? ఔరంగజేబు నాకేమి ద్రోహముచేసెను? ఆతని యాజ్ఞ ప్రకారము చంద్రావతినిబట్టి చానికప్పు చెప్పనందునఁ దప్పు నాయందే కలదు? అట్టితఱి నాతఁడు నన్ను శిక్షింప కూరకుండునా? జోధపుర రాజ్యార్థముగదా నేనెంతో యాశవహించి యుంటిని? అజితసింగు, ఇందిర, దుర్గాదాసు నాకిదివఱకే చేఁజిక్కి యుండిరిగదా. ఇంక నేఁడో రేపో రాజసింహుఁడుగూడ విమలతోఁగూడి తన దర్శనమునకై వచ్చునని యోగి చెప్పఁగా విన్నాఁడను. వీరందరినిబట్టి సునాయాసముగ పాదుషా కప్పఁజెప్పఁగలను. అప్పుడాతఁడు నాకొక జోధపురమేకాదు. ఉదయపురముగూడ నాకే యొసంగును...... రాజ్యాభిమాన మూని రాజపుత్రుల మోసపుచ్చెదనా? లేక స్వామిభక్తాభిమాన మూని పాదుషా మోసపుచ్చెదనా? సరే! యోచించెదను గాక!"

అని నయనపాలుఁడు తనలో నెన్నియో విధములఁ దర్కించుకొనెను గాని కడ కేమి చేయుటకును దన హృదయమున నేమియు నింకను నిశ్చయించుకొనలేదు. ఆతఁడు మాటిమాటికి పర్వతముపైకి జూచి ఏమో యనుకొనుచు, మరల పాదుషా సైన్యములవైపు దిరిగి యేమో గొణుగుకొనఁ జొచ్చెను. పిదప నాతఁ డచ్చటనుండి బయలు దేరి క్రమక్రమముగాఁ గ్రిందకుఁదిగి ఇందిరా దుర్గాదాసులతో నచ్చటికి వచ్చినప్పుడు అచ్చట గుఱ్ఱములుదిగి వాని నేచెట్టునకుఁ గట్టిరో ఆ చెట్టువద్దకుఁ బోయిచూడ నందు వానిగుఱ్ఱము కానరాలేదు. నయనపాలుఁడు తన గుఱ్ఱమునకై యిటునటు కొంచెము వెదకి పిదప

నేలపైఁగాన్పించుచుండిన గుఱ్ఱపుటడుగుల జాడఁబట్టి పోవసాగెను. అట్లు పోయిపోయి యాతఁడొక అరణ్యమునఁ బ్రవేశింప దూరమున నుండి యెవఁడో యొక రాజకుమారుఁడొక గుఱ్ఱముపై నెక్కి వచ్చుచుండినట్లు వానికిఁ గనఁబడ నచ్చటనే యాగి యాతఁడుతన్ను సమీపించినంతనే యిట్లు సంభాషించెను.

" ఓయీ ! నా గుఱ్ఱము నెక్కుటకుఁ గారణమేమి ? నీవెవ్వఁడవో దొంగవలెనున్నావే! నీ వృత్తాంతము జెప్పుము. లేకున్న నిదిగో బాణము సంధించుచున్నాను. "

" అయ్యా ! తొందరపడకుము. నేను దొంగనుగాను. నాపేరు శివసింగు. నీవెవ్వఁడవు ? నిన్నెన్నఁడో చూచినట్లున్నదే ! "

" అయ్యా ! ప్రస్తుతము నా వృత్తాంతము నేను చెప్పకొనఁగూడనిది. కావున పర్వతముపై దుర్గాదాసును ఇందిరయు నున్నవారు; వారిని పోయి గనుఁగొనుము. నీకు తెలియఁగలదు. మాటలాడవలసి యున్నది గాన దుర్గాదాసునొకసారి రమ్మని చెప్పుము. అంతవఱకు నేనిందే యుండెదను. "

ఆమాటలు విని శివసింగు తత్క్షణమే గుఱ్ఱముదిగి బయలుదేరి కొండమీదికిఁ బోయెను. వానిని జూచినతోడనే యోగినియు దుర్గాదాసును అమందానంద మొంది వానిని కౌఁగిలించుకొనిరి. శివసింగు దుర్గాదాసు వలన నయనపాలుని వృత్తాంతమంతయు విని వాని స్వభావముయొక్క మార్పున కాశ్చర్యమొంది దుర్గాదాసును చేయిఁ బట్టుకొని మరల కొండ దిగివచ్చి నయనపాలునిఁ గలసికొనెను.

అంత వఱకును నయనపాలుఁడు ఏమి చేయవలయునా యని పరిపరి విధములఁ దలపోయుచు ఒకప్పుడు పాదుషా పక్ష మవలంబింప వలయుననియు, మఱియొకప్పుడు దుర్గాదాసు పక్ష మవలంబింప వలయు ననియు ననుకొనుచు, ఎవరిని మోసపుచ్చినను చల్లగ మంచి మాటల

తోడనే మోసము సేయవలయును గదాయని యెంచి కడకు తన హృదయమున నేదియో యొక నిశ్చయము జేసికొనెను. ఇంతలో శివసింగు దుర్గాదాసు తన్ను సమీపించినంతనే వారితో నేమేమో సంభాషించి దుర్గాదాసు నొక్కనినే దూరముగాఁ గొనిపోయి వాని చెవిలో నేదో ఒక రహస్యమును జెప్పెను. అదివిని దుర్గాదాసు "నయనపాలా! ఇది మంచియుక్తి." అనిచెప్పి అట్లులే చేసెద నని అట్లులే చేసెదనని యిరువురు ననుకొనిరి. నయనపాలుఁడు తన గుఱ్ఱముపై నెక్కి యెచ్చటికో పోయెను. శివసింగును దుర్గాదాసునుగూడ తమలో మాటలాడుకొనుచు నచలేశ్వరాలయములోనికిఁ బోయిరి.

# ముప్పదియాఱవ ప్రకరణము

## పామును పామే కఱచెను

ఔరంగజేబు తన సైన్యములతో రూపనగర సమీపమున విడిసియుండుటఁ జూచి నయనపాలుఁడు వానినిఁ గలిసికొనవలయునని పరుగు పరుగునఁ బోవుచుండెను. అతఁడు పోవుచు మార్గమధ్యముననేమో గొణఁగుకొనుచునే యుండెను. అతఁడు గుఱ్ఱమును వేవేగఁ బరుగెత్తించుకొనుచు పోయి శిబిరమునకుఁ గొంత దూరమునఁ దన గుఱ్ఱమునుదిగి అచ్చటనొక వృక్షమునకు దానిని గట్టివేసి, నడచియే పోవుచుండెను. అతఁడు గుఱ్ఱముపైఁ గూర్చుండి వచ్చుచుండినప్పుడే ఆ శిబిరములోని సైనికులు కొందఱు వానినిఁజూచి ఎవఁడో శత్రుపక్షమువాఁడు వచ్చుచున్నాఁడని భావించి తమ కత్తులును తుపాకులును బట్టుకొని సిద్ధముగానుండిరి కాని నయనపాలుఁడు తమ్ము సమీపించినంతనే యాభటులు తమ ఆయుధములు క్రిందఁ బాఱవైచి వానినిజూచి యందఱు నొక్కమాఱుగఁ బక్కుననవ్విరి.

పాదుషా శిబిరమంతయు నెన్నియో మైళ్లప్రదేశ మావరించి కడుభయంకరముగఁ దోఁచుచుండెను. ఎక్కడ జూచినను పెద్దపెద్ద గుడారములును మొగలాయి వీరభటులును పెక్కులుగఁ గానవచ్చుచుండెను. నయనపాలుఁడా శిబిరములోఁ బ్రవేశించి వడివడి పోవుచుండ నచ్చటి సరదారులును సైన్యాధిపులును వానినిఁజూచి వానిరాకకద్భుతమొందిరి. పాదుషావద్ద నయనపాలుఁడు పెక్కు సంవత్సరములుండినందున నా పరివారములలో వాని నెఱుఁగని వారెవ్వరును లేరు.

అయినను నయనపాలుఁ డెవ్వరిని బలుకరింపకయే పోవుచుండెను. మధ్యమధ్య వానినాఁపి నయనపాలా! చెఱలోఁబడి మఱల నెట్లు తప్పించుకొని వచ్చితివిరా?" అని కొందఱును, "తప్పించుకొనినవాఁడ వెచ్చటికైనఁ బాఱిపోక మఱలఁ బాదుషాయొద్ద కేలపోయెదవని" కొందఱును, "ఈసారి పాదుషా నిన్నుఁ గఠినముగా శిక్షింపక మానఁడని" కొందఱును "ఆతనితో నీకేమిపనియున్నది?" అని మఱి కొందఱును వాని నాతురతతో నడుగసాగిరి. నయనపాలుఁ డెవ్వరికి నెట్టి ప్రత్యుత్తరమీయక "పాదుషాగా రెచ్చట? పాదుషాగా రెచ్చట?" అని యడుగుచు తన దారిని బోవుచుండెను. వానితోఁ జాలకాలము పరిచయ మున్నందునను, వానివలన నెన్నియో యుపకారములు పడసిన వారగుటచేతను త్రోవలోని భటులెవ్వరును వాని నడ్డగింపక పోనిచ్చుచుండిరి. నయనపాలుఁడు గుడారములన్నియుఁ గడచి పాదుషా గుడారమును సమీపించెను. కాని యచ్చటి భటులు మాత్రము నయనపాలుని లోనికి విడువక నాఁపివేసిరి. నయనపాలుఁడు వారిని భయపెట్టి "నేనిప్పుడు పాదుషాగారితో నతిరహస్యమైన సంగతులు మాటలాడ వలసియున్నవి. ఆయనకుఁ గొన్ని రాజకార్య విషయము లెఱింగింప వలయును. లేకున్నచో ఈ శిబిరమున కంతకును మోసమువచ్చును. పిదపఁ బాదుషాగారు నన్నుపోనీయకుండ నాఁపి వేసినందులకు మిమ్ముఁ గఠినముగా శిక్షించెదరు." అని పలుక నా పలుకులకు ఆ భటులు కొంచెము వెఱచి వానిని లోనికి విడిచిరి.

ఆ గుడారము నందంతటను బట్టుకుచ్చులు వ్రేలాడుచు మిక్కిలి సొగసుగానుండెను. అచ్చటచ్చట జలతారుతోఁ జేయఁబడిన నగిషీ పనులును, చమత్కారముగఁ జిత్రింపఁబడిన ప్రతిమలును, పలువిధము లగు రంగుల పూఁతలును ఆ గుడారమునకు మఱింత వన్నె గల్గించు చుండెను. అచ్చటచ్చట సేవకులు తమకు నియమింపఁ బడిన కార్యములు శ్రద్ధతోఁ గావించుచుండిరి. ఒకప్రక్క నొక సభాస్థలము

వలెఁ గట్టఁబడి చుట్టును ఆసనములు వేయఁబడియుండెను. వానిపై మంత్రులు మొదలగు గొప్ప గొప్ప ఉద్యోగస్థులు గొందఱు గూర్చుండి యుండిరి. ఆ సభాప్రదేశమునకు మధ్యఁ జూచువారి కన్నులు మిఱుమిట్లు గొలుపునట్లు ఒక బంగారపు సింహాసనముండెను. అందుపైఁ గూర్చుండుటకును చేరగిలఁ బడుటకును మిక్కిలి యను కూలముగ నెట్టని మఖమలు పఱపులు వేయఁబడి యుండెను. ఆ సింహాసనముపైఁ బాదుషా కూరుచుండి వినోదముగ హుక్కా పీల్చుచు సభవారితో నేమో ప్రసంగించుచుండెను. నయనపాలుఁ డాగుడారముఁ బ్రవేశించి, పాదుషాకు దూరమునుండియే ఖురునిసాత్ చేసి యెదుటను నయభయముల నిలువఁ బడియెను. అప్పుడు ఔరంగ జేబు వానితో నిట్లు ప్రసంగించెను.

"ఓరీ ! నయనపాలా ! నిన్నది వఱలోఁ జెఱలో నుంచితిని గదా ? మఱల నెట్లు వచ్చితివి ?"

"స్వామీ ! అప్పుడు మీ రాగ్రహమున నన్నుఁ జెఱలో నుంచితిరి గాని యిట్టి సమయమునఁ దమకు సాహాయ్యము గాకుండ నుండఁ గలనా ? అందులకే దొంగతనమున ఖైదు తప్పించుకొని తమకుఁ దోడై యుద్ధము చేయవలయునని యిట్లు వచ్చితిని. నన్ను క్షమింపుఁడు."

ఆ మాటలకు పాదుషా నవ్వుచు,

"అరే ! నీ కెంత సిగ్గు లేదురా ? ఇదివఱకైన పరాభవము చాలక మరలఁ దగుదునని ప్రత్యేకముగఁ జెఱ దప్పించుకొని వచ్చితివా !"

"కాదు మహారాజా ! అట్లుకాదు. రాజపుత్రులు కొందఱు మనపైఁ గుట్రఁ జేయుచున్నారు. వారి రహస్యములు నాకుఁ దెలిసినవి. ఇప్పుడు మనము తొందరపడినఁగాని కార్యములేదు. నేనేమో చెప్పు చున్నాఁడనని భావింప వలదు."

అని కొంప మునిఁగినట్లు చెప్పుచుండఁ బాదుషా యుక్తిపరుఁడగుటచే వెంటనే వాని మాటలు నమ్మక అందుగల సత్యాసత్యములు గనుఁగొనవలయునని భావించి తిరస్కారముగా,

"నయనపాలా! ఇంక నీ డంబములు గట్టిపెట్టు. చంద్రావతిని దెచ్చుటకై బయలుదేఱి నపుడు గూడ నిట్టులే డంబములు పలికి "ఇదిగో తెచ్చెదను" అదిగో తెచ్చెదను. అని బయలుదేరి కడకు చేతులు నలుపు కొనుచు వచ్చినాఁడవు. నీ సంగతి మాకుఁ గ్రొత్త కాదు గదా?"

"దేవా! తమరిట్లు సెలవిచ్చుట ధర్మముగాదు. రాజపుత్రుల కుట్రలన్నియు గ్రహించి తమ కెఱింగింప వలయునని యిట్లు వచ్చినాను. నన్ను మీరు కారాగృహమునఁ బెట్టి యెంతకఠినముగ శిక్షించినను చాలకాలమూ వఱకు మీ యన్నము దిన్నవాఁడను గాన ఆపద వచ్చినప్పుడు మీకుఁదోడగుట నాకు విధియై యున్నది. మీకుఁదోడ్పడి మీ కార్యములెల్లఁ గావించి మీ యనుగ్రహమున నెట్టులైన జోధపురము సంపాదించుకొన వలయునని పుట్టెడాశతో నున్నాఁడను. నేఁడు నేను తమకుఁ గావించు సాహాయ్యము వలన మీమెప్పువహించి నా కోరిక దీర్చుకొనవలయునని యిట్లు వచ్చితిని. ఏలినవా రనుగ్రహించిన కొన్ని రహస్యములు ఏకాంతస్థలమునఁ గూర్చుండి మాటలాడవలసియున్నవి."

ఆ మాటలు విని నయనపాలుఁ డేవియో శత్రురహస్యము లెఱింగించునని యూహించి, పాదుషా ఆ గుడారములో నున్న తన సేవకులను ఉద్యోగులను అవలికిబంపివేసి తానేకాంతముగఁ గూర్చుండి నయనపాలుని దగ్గఱకుఁ బిలిచి యిట్లు సంభాషించెను.

"నయనపాలా! నీ వింక చెప్పవలసిన దేదియో చెప్పవచ్చును."

"మహారాజా! నేను రాజపుత్రులతోఁ గలిసి వారితోఁ గపట స్నేహముచేసి అచ్చట మీకు విరుద్ధముగమాటలాడి దుర్గాదాసు మొదలయినవారి యోచనలన్నియుఁ గనుఁగొంటిని. ఆతఁడు చెఱలో

నుండి తప్పించుకొని తనచెల్లెలితోకూడ నిప్పు డాబూపర్వతము మీఁద నొక యోగి వద్దనున్నవాఁడు. చంద్రావతి కుమారుఁడు అజితసింగు గూడ యోగి వద్దనే యున్నవాఁడు. రేపుదయమాతని దర్శనమునకై రాజసింహుఁడు విమలతోఁ గూడ నాపర్వతము పైకిఁ బోవునఁట. మనము ఇప్పుడు కొంచెము యుక్తిచేసినయెడల వారందఱు మనచేఁ జిక్కెదరు. "

" శబాస్ ! నయనపాలా ! నీ బుద్ధికి నేను గడు మెచ్చితిని. మంచి రహస్యము మాకెఱింగించితివి ? సరియే ! త్వరలోనే మన సైన్యములఁ బంపి వారినిబట్టుకొందము. ఇదెంతసేపు ? "

" దేవా ! అట్లనఁగూడదు ; మనము వచ్చుచున్నట్లు వారికిఁ దెలిసినచో చెల్లాచెదరై పారిపోయి కొండగుహలలో నెచ్చటనో దాఁగుకొనెదరు. అప్పుడు వారినిఁ బట్టుకొనుట మనకు సాధ్యముగాదు. కావున మనము రహస్యముగఁ బోయియే వారిని బట్టుకొన వలయును "

" పర్వతము చుట్టును ముట్టడించిన నెక్కడికి పాఱిపోయె దరురా ? నీకు పిచ్చిపట్టినది ! "

" అయ్యో ! మఱల నిట్లనెద రేల ? ఆ కొండపైఁగల యోగికిఁ దెలిసినన్ని మాయలు ఇతరులకుఁ దెలియవు ఆతఁడు త్రికాలజ్ఞుఁడని యొక పెద్ద పేరు పెట్టుకొని యున్నవాఁడు. ఇంక ఇందిరా దుర్గాదాసుల సంగతి తమకుఁ దెలిసియే యున్నదికదా ? కావున వా రేమాయచేసి పాఱిపోయినను పాఱిపోవచ్చును. "

" అట్లులైన నీ వేమందువు ? "

" అనుట కేమున్నది ? రేపుదయముననే రాజసింహుఁడు విమలతో యోగివద్దకుఁబోవును గాన మనము రేపు మధ్యాహ్న మునసే ఆ పర్వతమును ముట్టడింపవలయును. అట్లులైన వారికిఁ బాఱి పోవుట కవకాశముండదు. ఇదియుఁ గాక ఈ పర్వతప్రాంత మంతయు నరణ్యముతోడను సన్నని కొండత్రోవల తోడను నిండియున్నది.

కాఁబట్టి మన సైన్యముల సన్నసన్నగఁ గొనిపోయి చెట్లచాటున నుండియు, కొండ సందులలోనుండియు పర్వతమును సమీపించి చుట్టును ముట్టడించితిమేని వారికి మనము కనఁబడము. ఆ కొండత్రోవలు నరణ్యమార్గములు నాకుఁ దెలియనివిలేవు కావున నేను మాఱు త్రోవలను బెట్టి చెట్టుపైనున్న పిట్టకైనఁ దెలియకుండ గొనిపోవఁగలను. మీఁద దేవరచిత్తము.”

అని పలికి “ఏలినవారు జోధపురము మాత్రము నాకు దయ చేయవలెను. ఇదియే నాప్రార్థన” అని వేఁడెను. ఔరంగజేబు వాని మాటలన్నియువిని యానందమొంది “నయనపాలా! మఱల మఱల నీవడుగ నక్కఱలేదు ఈకార్యమందు నీప్రజ్ఞఁజూచి నీకు జోధపురము తప్పక నొసంగెదము.” అనిచెప్పి తన మెడలోనున్న ముత్యాలహారము వానిమెడలో బహుమానముగ వేసెను. పిదప పాదుషా తన సేనానాయకు నొకనిరావించి యొకజాములోపుగ సైన్యములన్నియు యుద్ధమునకు బయలుదేఱ సిద్ధముగ నుండవలయునని చాటింపించెను. కాని మొగలాయి సైన్యములు మూఁడు దినములవఱకుఁ బ్రయత్నముఁ జేసినఁగాని యుద్ధమునకు బయలుదేఱఁజాలని స్థితిలో నుండెడివి. సైనికులందఱు నెట్టులెట్టులో తమతమ పరికరములతో సిద్ధమైరి. అంత యాకస్మికముగఁ బయలుదేఱుటకుఁ గారణమేమోయని సైనికులకు సందేహము గల్గెనుగాని, ఔరంగజేబు నెవ్వరును సాహసించి యడుగఁ జాలరైరి. సాదతుఖాను మాత్రము ధైర్యమువహించి పాదుషాయొద్దకుఁ బోయి చేతులుజోడించి “సర్కార్! మనమిప్పుడెచ్చటికిఁ బోవల యును? ఇంత యాకస్మికముగ సేనలను లేవఁదీయుటకుఁగారణ మేమి? సైన్యాధిపతి నగుటచే అడుగవలసివచ్చెను క్షమింపుఁడు.” అని పలుక పాదుషా చీకాకుతో “ఆ సంగతులన్నియు నీకేల? నీ విప్పుడు సైన్యాధిపతివి గావు. నేనే సేనానాయకుఁడను. నే నెచ్చటికిఁబోయిన మీరందఱు నా వెనువెంటనే రావలయును!” అని యాజ్ఞాపించెను.

పిదప నయనపాలుఁడొక గుఱ్ఱముపై గూర్చుండి బయలు దేఱెను. వాని వెనుక నొక పారసీక తురంగము నధివసించి పాదుషాయును, వాని వెనుక సేనావారమును, దాని వెనుక జనానాయును భోజనసామాగ్రియు యుద్ధసామాగ్రియు కొందఱు భటులును వెడలెను. నయనపాలుఁడు మాటిమాటికిని పాదుషాతో నేమేమో ప్రసంగించుచు బోవుచుండెను. పాదుషాయును వాని ననుసరించి పోవుచుండెను. నయనపాలుఁడు ఆ ప్రదేశమునఁగల గట్లును గుహలును, కొండ త్రోవలును, పాదుషాకుఁ జూపుచు "దేవా! నేను ఢిల్లీనగరమునకు వచ్చి తమసేవ చేయకమున్ను ఈ ప్రదేశమందే సంచరించు చుండెడు వాఁడను. ఈ కొండ త్రోవలన్నియు నాకుఁగొట్టిన పిండియే! ఇచ్చట నాకుఁ దెలియని మార్గమొకటియు లేదు." అని యప్పుడప్పుడు చెప్పుచుండెను. క్రమక్రమముగా నయనపాలుఁ డౌరంగజేబుతోఁగూడ నా పర్వతము వంకఁబోవుచు కొంతదూర మేగినతరువాత నొక కొండ త్రోవలోఁ బ్రవేశించెను. సౌఖ్యముగ నడచి పోవుటకు వీలులేక నా లోయయందు రాలు సూదులవలె నుండెను. అప్పుడు పాదుషా! "నయనపాలా! ఇదేమిరా ఈ త్రోవ అంతయు రాలచే నిండియున్నది? ఇందులోనుండి యెట్లు పోఁగలము" అని యడుగ "దేవా! కొంచెము దూరమే యిట్లుండును. తరువాత నంతయు నున్నని రాతినేలయే" అని బదులుచెప్పెను. నయనపాలుఁడును పాదుషాయును వారి వెనుక సైన్యములు నాలోయలోనుండి పోవుచుండెను. జనానాయును, భోజన యుద్ధసామాగ్రులును, కొందఱు భటులును మాత్రము దప్పతక్కిన వారందఱుగూడఁ నాలోయలోఁ బ్రవేశించిరి. మిగిలినవారుగూడ లోనికిఁ బోవుచుండ నింతలో నాకస్మికముగ నెచ్చటనుండియో రాజపుత్రులు పరుగుపరుగున వచ్చి ఆలోయయొక్క ద్వారమున కడ్డముగ నిలిచి మిగిలినవారిని లోనికిఁబోకుండ నాపివేసిరి. పాపము దిగులువడుచు లోనికేగఁజాలక వెలుపలనే యుండిపోయిరి.

# ముప్పదియేడవ ప్రకరణము

## రాజపుత్రుల యుద్ధము

మొగలాయీ లెల్లరుఁ బ్రవేశించిన కొండత్రోవ ఒక లోయవలె నించుమించుగఁ బదిపండ్రెండు మైళ్లు నిడుపుగల్గి యుండెను. ఆ లోయకిరువంకలను మహోన్నతములైన రెండు పర్వతములుండెను. ఆ రెండు పర్వతములకు మధ్యనున్న యాత్రోవయొక్క ద్వారము నలుగురు మనుష్యులుమాత్ర మొక్కసారిగఁ బోవుటకుఁ దగినంత వెడల్పు గలిగి యుండెను. భయంకరమైన యాలోయ కాపర్వతములు రెండును ఇరువంకల నావరించి క్రమక్రమముగాఁ గొంతదూరము పోవుసరికి యొకచోట నొకదాని కొకటి కలిసిపోయి అచ్చటనుండి మఱిపోవుటకు మార్గములేక యుండెను. ప్రారంభముననుండి యీ పర్వత సంధివఱకును నడుమనున్న లోయయంతయు నడచి పోవువారికి వీలులేకుండ గోతులతోడను చిన్నచిన్న రాలతోడను గూడియుండెను. పర్వతములత్యౌన్నత్యము గలిగి వుండుటచేతను వానియందు కంటకములును తుప్పలును విశేషముగఁ బెరిఁగి యుండుటచేతను, ఆలోయలోనుండి ఇరువంకలనున్న కొండల నెక్కుటకుఁ బ్రయత్నించు వారికి మిక్కిలి కష్టసాధ్యమని చెప్పవచ్చును.

ఇట్టి లోయలో సైనికులెల్లరుఁ జిక్కి యుండుటయు పిమ్మటఁ గొందఱు రాజపుత్రు లాకస్మికముగ వచ్చి యా లోయయొక్క ద్వారమడ్డగించి వెలుపలనున్న వారిని లోనికి, లోన నున్నవారిని వెలుపలికిని

రానీయకుండఁ జేసిరనియు తెలిసికొని, ఆనాఁడు నయనపాలుఁ డాబూ పర్వత ప్రాంతారణ్యమున దుర్గాదాసుతోఁ జెప్పిన రహస్యమేమో మా చదువరులు గ్రహించియే యుందురు. రూపనగర ప్రాంతమున విడిసి యుండిన పాదుషా సైన్యములు తనకంటఁ బడినప్పటి నుండియు నయనపాలుని చిత్తమనేక విధములఁ బోవుచుండెను. గాని కడకు దృఢ నిశ్చయుఁడై దుర్గాదాసును రావించి వానిని రహస్యప్రదేశమునకుఁ గొనిపోయి వానితో నిట్లు చెప్పెను.

"దుర్గాదాస్ ! పాదుషా యిప్పుడు తన సైన్యములతో రూప నగర సమీపమున విడిసియున్నవాఁడు. కావున నేనిప్పుడు సత్వరముగ నచ్చటికిఁ బోయి పాదుషాను గలసికొని మెల్లమెల్లగ నా వాక్చాతుర్య మంతయుఁ జూపుచు నెన్నియో డంబములు వలికి, రాజపుత్రుల రహస్యములన్నియు గ్రహించి వచ్చితిననియు, ఈసారి తమకుఁ బూర్ణముగ జయము గల్గుననియుఁ జెప్పి వానికి దృఢమైన నమ్మకముఁ బుట్టించెదను. ఇంతియకాక, ఇందిరా దుర్గాదాసులును, అజితసింగు మొదలగు వా రాపర్వతముపై నుండిరనియు, రేపుదయమునకు రాజ సింహుఁడుగూడ విమలతో నా పర్వతముపైకి వచ్చుననియు, రేపు మధ్యాహ్నము సరికి మనము రాజపుత్రు లెఱుఁగకుండ సన్నసన్నగ కొండను ముట్టడింపవలయుననియు చెప్పి, మొగలాయి సైన్యములతోఁ గూడ పాదుషాను ఈ సమీపముననున్న కొండ త్రోవలోనికిఁ దెచ్చెను. కావున నీ విప్పుడుపోయి తగిన ప్రయత్నములలో నుండి రాజసింహుఁడు వచ్చినంతనే యీ సమాచారము వాని కెఱింగించి, ఉదయపురమున కిప్పుడేగవలదని వాని నాఁపివేయుము, నేను పాదుషాతోఁ గూడ నా కొండలోయలోఁ బ్రవేశించినంతనే సైన్యములుగూడ మాతో లోనికి వచ్చును. అప్పుడాకస్మికముగ మన సైన్యములెల్ల నా పర్వత మార్గమున కడ్డుపడి పైనుండి లోని మొగలాయీలతోఁ బోరునట్లు చేయుము." అని చెప్పి నయనపాలుఁడు పాదుషాయొద్దకుఁ బోయెను.

ఆ మాటలన్నియు విని దుర్గాదాసు ఆశ్చర్యమొంది శివసింగునకీవృత్తాంత మెఱింగించి కొండ మీఁదికిఁబోయి యోగిరాజుతో నాలోచింప సాగెను. ఆ మఱునాఁ డుదయమున రాజసింహుఁడు అచలేశ్వరాలయమునకు వచ్చినంతనే, దుర్గాదాసు మొదలైన వారీసంగతులన్నియు నాతనితోఁ గూడఁ జెప్పిరి. అప్పుడు వారందఱు నాలయములోఁ గూర్చుండి యోగిని సలహా యడుగుచు, నయనపాలుఁ డిట్టి యుక్తిఁబన్నుట తమకు జయము గలుగఁ జేయుటకో లేక మోసము సేయుటకో యని విచారించిరి. నయనపాలుఁడు తమ లాభమునకే యీ యుక్తిఁబన్నెనని వారికిఁ దోఁచినను ముందుగానే జాగ్రత్త వహించి యుండుట అన్నివిధముల మేలుగదా యని తలంచి, ఒకవేళ నాతఁడు మోసమే చేసినయెడల మొగలాయి సైన్యములు పర్వతమును సమీపించి ముట్టడింపక మున్నె వాని నెదుర్కొనుటకై తమ సైన్యముల నన్నియు, చెట్ల చాటునను కొండల చాటునను, తుప్పల చాటునను అచ్చటచ్చట రహస్యముగ నుంచిరి. అంతియకాక మొగలాయీలతోఁ బోరుటకు కొందఱు భిల్లులను రాజపుత్రులను పర్వతముపై నందందుఁగాపుంచిరి. మఱియు నయనపాలుఁడు చెప్పినట్లు మొగలాయీలు లోయలోఁ బ్రవేశించిన తోడనే ద్వారమున నడ్డగించుటకై మఱికొందఱు సైనికులను సమీపముననే గుహాలలోను వృక్షసమూహముల మధ్యను బరులకుఁ దెలియకుండఁ గాపుంచిరి.

ఆనాఁడట్లు మొగలాయీలు ఆ లోయలోఁ బ్రవేశించినంతనే సమీపముననే వేచియుండిన రాజపుత్రులాద్వారము నడ్డగించి పోరాడఁజొచ్చిరి. ఆ లోయయొక్క ద్వారము కడు సన్నని దగుటచే ఒక్కొక్కసారి నలుగురు కన్న నెక్కుడుగ రాజపుత్రులతోఁ బోరుట కవకాశము లేదయ్యె. ఎదిరింప వచ్చిన వారు తత్క్షణముననే రాజసింహుని సైనికులచే నేలఁ బడుచుండిరి. పాదుషా నయనపాలునితోఁ గలసి ముందుగనే యేడనిమిదమైళ్లమీఁద నడచుచుండినందున వాని కేసంగతి యేమియుఁ దెలియలేదు. రాను రా నాపోరు ఘోర

మైనంతనే ద్వారము వద్ద నేమో యల్ల కల్లోలము జరుగుచుండెనని యాతఁడు విని నయనపాలునిఁ జూచి "ఏమిరా! ద్వారము వద్ద నేమియో అల్లరి జరుగుచుండినట్లున్నది!" అని పలుక నయనపాలుఁడు విధేయుఁడై "సర్కార్! చిత్రము! చిత్రము. అదేదియో నేను గనుఁగొని యిప్పుడే వచ్చెదను. ఇంత మాత్రమునకు మీరు భీతిల్ల వలయునా? నేనుండ మీ కెట్టి ప్రమాదమును రాదని ముమ్మాటికి నమ్ముఁడు." అని చెప్పి యాతఁడు వెనుకకుఁ దిరిగి వచ్చుచు కేకలు వేయుచు "ఏమి యీ యల్ల కల్లోలము?" అని మాటిమాటికి సైనికులను బెదరగ నడుగుచు, క్రమ క్రమముగా ద్వారము వద్దకు వచ్చెను. వానినిఁ జూచి యచ్చటి సైనికులు దిగులుమాని ఏ మోస మైనను జేసి ఆతఁడు రాజపుత్రులను బాఱఁదోలునని ధైర్యము వహించిరి. నయనపాలుఁడు ఇరు తెగల వారును బోరుచుండుటఁ జూచి, "హుూత్తు హాత్తు." అని అట్ట హాసము సేయుచు మీ కేమియును భయము లేదని మోగలులతోఁ బలుకుచు నాతఁ డా ద్వారమును దాఁటి యావలికి నిష్క్రమించెను. ఎంతసేపు వేచియుండినను ఔరంగ జేబునకు మఱల నయనపాలుని దర్శనము గాలేదు. అంతవఱకును ద్వారము వద్ద జరుగుచుండిన కలకలము చెలరేఁగి పాదుషా నఱకును వ్యాపించెను. తమ కేదియో మోసము తప్పక సంభవించి యుండునని పాదుషాకు దృఢమైన నమ్మకము జనించెను.

ఇంతలో నా యిరువంకల నున్న పర్వతములపై నుండి భిల్లులును రాజపుత్రులును వేలకొలఁది యా కొండలలోనుండి యప్పటి కప్పుడు పుట్టినట్లు బయలుదేఱి పై భాగముననుండి లోయలోనున్న మొగలాయీలపై వాఁడికోలలు ప్రయోగించు చుండిరి. అప్పటికి పాదుషా యీ సంగతులన్నియుఁ గనిపట్టి, ఇంతయు నయనపాలుఁ డొనర్చిన మోసము గదా యని గ్రహించి తత్తఱపడుచు వెఱ్ఱివాని వలెఁ గేకలువేయుచు నటునిటుఁ దిరుగుచు నేమియుఁ దోఁపనందున

"అరే మహమ్మద్ హుస్సేన్! అరే సాదత్ ఖాన్! అరే మహాభాత్ ఖాన్! అరే మహమ్మద్ లాలీ! అరే! అరే!" అని చిందులు త్రొక్కుచు వ్యాకుల మొందుచుండెను. నయనపాలుఁడు తనకుఁ జేసిన మోసమునకు ఔరంగజేబు పండ్లు పటపటఁ గొఱుకుచు మహాగ్రహ మొంది నయనపాలునిఁ జంపింప సమకట్టెను గాని యాతఁ డెచ్చటికిఁ బోయెనో జాడయే లేదు. పైనుండి భిల్లులు రాలును వాఁడి కోలలును వర్షమువలెఁ గురిపించుచుండిరి. ఆ కలహము సహింపలేక తన కేయుపాయమును దోఁపనందున ఔరంగజేబు "త్వరపడుఁడు! త్వరపడుఁడు. కొండపై కెగఁబ్రాకుఁడు" అని తన సైనికులకుఁ గఠినముగ నాజ్ఞాపించెను. కాని యందువలన నేమియుఁ గార్యము గానరాలేదు. సాధారణముగ నెవ్వరికైన నా లోయలోనుండి పర్వత మెక్కుటయే కష్టము. అందుపైనుండి భిల్లులు రాలును రప్పలు విసరుచుండుటచే నా కార్యము వారి కెట్లు సాధ్యమగును? వారు కొండపై కెక్కఁ బోవుచుండ నడుమ నడుమనే భిల్లులు వారినిబట్టి శిరములు బగులఁ గొట్టుచుండిరి.

ఎచ్చటనైనను మార్గమగపడునేమో యని పాదుషా ఆ లోయలోనుండి కొంతదూరముపోయి చూచెనుగాని యచ్చట నా పర్వతద్వయ సంధి దక్క వేఱు మార్గమేమియు వానికిఁ గానరాలేదు. ఒక పర్వతముపైఁ దనసైన్యములతో దుర్గాదాసును, రెండవ పర్వతముపై భిల్లులతోఁ గూడి శివసింగును నయనపాలుఁడును, ద్వారమువద్ద రాజసింహుని సైనికులును పురుషవేషములతో వచ్చిన విమలయుఁ బద్మయు ఎడతెఱపి లేకుండ నాయుధములు ప్రయోగించుచుండుటచే పాపము పాదుషా సైనికుల కేవంకఁ బోవుటకును వీలు గలుగదయ్యె. వేలకొలఁది వారందఱు నా సందులోఁ జిక్కుకొని సూది బెజ్జము దూరుచోటును మిగులకుండ నిండియుండిరి. పైనుండి భిల్లులు విడుచుచుండిన వాఁడికోలలు గుండెలలోఁ దగుల్కొనఁ

గొందఱు భటులు ప్రాణములు విడుచుచుండిరి. ఎటు చూచినను విరామము లేకుండ శత్రువులు యుద్ధము సేయుచుండుటచేఁ గొంచెము ప్రక్క-ప్రక్కొత్తి గిలుటకైనఁ జోటులేని యాలోయలో మొగలాయీవారెల్లరు భీతచిత్తులై నేఁటితో నూఱేండ్లు నిండెఁగదాయని పరితపించుచుండిరి. చేతులలో నాయుధములు గల్గియుండియు పాపము వారు నిరాయుధులువోలె నిరర్థకులైరి. ఎప్పటికైన నీ చెఱఁదప్పించి అల్లా మమ్ము రక్షించునా యని కొందఱు తమ యిష్టదైవమును ప్రార్థించుచుండిరి. ఏప్రక్కఁజూచినను రాజపుత్త్రులే! ఏతుప్పవెనుకఁ జూచినను రాజపుత్త్రులే! ఆ పర్వతములు రెండును నాఁడు భిల్లుల తోడను రాజపుత్రులతోడను నిండియుండెను. ఉదయపురి ఏమయ్యెనో యెచ్చట నున్నదో ఎవ్వరెట్టి మోసము గావించిరో యని ఔరంగజేబు తన ప్రాణము లామెప్పైఁ బెట్టికొని యుండెను. రాజపుత్రులతోడను భిల్లులతోడను గలసి నయనపాలుఁడును శివసింగును తమ పరాక్రమ మంతయు వెల్లడి సేయుచుండిరి. మొగలాయి సైన్యములను గ్రమ క్రమముగ రూపుమాపుచు రక్తముతోడను, పుఱ్ఱెలతోడను, మొండెములతోడను, వారిరువురు నాలోయ నలంకరించిరి.

ద్వారము వద్ద రాజపుత్రులతోఁ గూడ విమలయుఁ బద్మయు మొగలాయీలతోఁ బోరు సల్పుచుండ దూరమునుండి యేమో అల్లకల్లోలమై యొక విధమైన స్త్రీ యార్తనాదము వారికి వినవచ్చెను. అప్పుడు వారిరువురు నా యల్లరి యేమో యని విచారింప, కొందఱు రాజభటులు మొగలాయి జనానాను జుట్టుముట్టి యెచ్చటికో గొని పోవు చున్నారని వారికిఁ దెలిసినది. వారిరువురును పాదుషాపై ద్వేషమున రాజపుత్రులాతని జనానాకేమి యవమాన మొనర్చెదరో యని వెంటనే బయలుదేఱిరి. ఈ యుద్ధమున కంతకును గారకురాలు ఉదయపురియే యని తనకుఁ దెలిసియు, విమల, తాను తన శత్రువులైనను ఆపద నొందుటఁ జూచి యోర్వనేరనిది గావున తత్క్షణమే

ఆమెను గాపాడవలెనని పద్మతోఁగూడ నచ్చటికిఁబోయెను. ఆమె యచ్చటికిఁ బోవుసరికి, జనానా సేవకులనుబట్టి పెడరెక్కలు విఱిచికట్టి రాజపుత్రులు దాసదాసీజనమును బలవంతముగఁ గొంపోవుచుండిరి. మసాహెదునుగూడ నట్లే బద్ధకరునిజేసి యీడ్చుకొని పోవుచుండిరి. వారి చుట్టును మఱికొంత పరివారముగూడ నుండెను. వారందఱకును మధ్యను ఒకసవారిలో దిగులుపడుచు నుదయపురిగూడఁ బోవుచుండెను. తన పరివారమును తన్నును రాజపుత్రులు చుట్టునుజేరి బలవంతముగఁ గొనిపోవుచుండ సవారిలో నుదయపురి భీతచిత్తయై యేమిచేయుటకును దోఁపక "అయ్యో! నిష్కారణముగ నేనే కోరి కోరి యింతవఱకుఁ దెచ్చుకొంటిని. కుడిచి కూర్చుండలేక ఉత్తరముఁ జూచినంత మాత్రమున మితిలేని రోసమువహించి విమలపైఁ బాదుషాగారి కాగ్రహము పుట్టించిన నాకుఁదగిన యనుభవమైనది." అని తన యవివేకమును దలంచుకొని లోలోనఁ బశ్చాత్తాప మొందుచుండెను.

విమల రాజపుత్రుల సమీపించి వారందఱ నిలువరించి. "ఓ యవివేకులారా! స్త్రీల యెడలనా మీ పౌరుషం బంతయుఁ జూపుచున్నారు ? నిక్కముగ శౌర్యముగల పురుషులైనచో నక్కడికిఁబోయి మగవారితో యుద్ధముసేయుఁడు. చాలుచాలు మీ పరాక్రమమంతయు వెల్లడియైనది. లెండు! ఇఁక మీఁదనిట్టి దుష్టకార్యము లొనర్చినయెడల మిమ్మందఱను కఠినముగ శిక్షింపించెదను." అని గట్టిగఁ బలుక రాజపుత్రులందఱు నామెయాజ్ఞకు బద్ధులై దాసదాసీజనములకుఁ గట్టిన కట్లన్నియు విప్పివేసి వారందఱ బంధవిముక్తులఁ జేసిరి. పిదప విమల ఆ జనానానంతయుఁ గడు భద్రముగ నొకగుడారములో నుంపించి, లోనివారిని వెలుపలికిని వెలుపలి వారిని లోనికిని బోనీయవలదని యా గుడారముచుట్టును కొందఱు భటులను గాపుంచెను. అంతియకాక సదయహృదయయగు విమల ఆ జనానాకు ఏ కొఱఁతయుఁ గలుగకుండ ననేక ఫలములును, కూరగాయ మొదలుగ విశేష

భోజనసామాగ్రి నా గుడారములోని కంపెను. రాజపుత్రులనుండి తన్ను గాపాడుటయేకాక తమకింత మహోపకార మొనర్చినవారెవ్వరో యని యుదయపురి విచారింప యజమానురాలగు విమలయే యని యామెకుఁ దెలిసెను. తోడనే యుదయపురి అట్టి విమలయెడలఁ దాను జేసిన మోసబుద్ధి కెంతయో లోలోన చింతించెను. అచ్చటి పరిచారకులును, పరిచారికలును విమల సద్భావమునకు మిక్కిలి సంతసించి యామెను గొనియాడుచుండిరి.

అచ్చట రాజసింహుఁడును మొగలుల దీనావస్థను జూచి జాలి వహించెనుగాని ఔరంగజేబును పూర్ణముగ లొంగఁదీసినఁగాని వానిని విడుచుటకు నిశ్చయించుకొనలేదు. ఆ కారణమున నాతఁడు పాదుస్తాకొక యుత్తరమిట్లు వ్రాసియంపెను.

"మన యిష్టము వచ్చినట్లు క్రూరకృత్యము లెల్లకాలమును గొనసాగనేరవు. మీరెంతటి చక్రవర్తులైనను రాజపుత్రులమగు మేమంత పనికిమాలిన వారముగాము. దుర్భరమైన జజియాపన్ను నేర్పఱిచి మీరు ప్రజల బాధపెట్టుచుండుట పలుమాఱు ఆకర్ణించితిని. కాని యెన్నఁటికైనను బుద్ధివచ్చి మీరు పశ్చాత్తాప మొందెదరేమో యని యింతకాలమును వేచియుంటిని. అయినను దుర్మార్గ సంచారమును విడిచి మీరు ప్రవర్తించుచుండిరని నే నెన్నఁడును వినలేదు. అన్యాయముగ పృథివిసింగు నేలచంపింపవలె ? పాప మా బాలుఁడు మీ రాజ్యమున కేమి యపకారముచేసెను ? అతని నొక్కనిని జంపినంత మాత్రమున జోధపురము మీకు దక్కుననుకొంటిరా ? తక్కిన రాజపుత్రు లందఱును గాజులు దొడిగించుకొనిరా? ఎచ్చటఁ జూచినను మీ దుర్మార్గమును జెప్పుకొననివారు లేరుకదా? జోధపుర వంశమునకు మీరు పెట్టిన పాట్లన్నియు నిప్పుడు జ్ఞప్తికిఁ దెచ్చుకొనుఁడు. ప్రస్తుతము మీ రొందుచున్న కష్టములన్నియు నందులకుఁ బ్రతిఫలము

లనుకొనుఁడు. కడుపార నాహారమైన లేని నిఱుపేదల బాధపెట్టి జిజియా పన్ను వారినుండి గైకొనుట తలంచుకొని మీరిట్లు ఆహారములేక శుష్కించుచుండుట అందులకుఁ బ్రతిఫల మనుకొనుఁడు. బలవంతముగ రాజపుత్ర కన్యను గొంపోవ నెంచితిరి గాన మీరిట్లు మీభార్యను శత్రువులమగు మాకుఁ గోల్పోవుటగూడ నందులకుఁ బ్రతిఫల మనుకొనుఁడు. అయినను మా విషయమై మీ రెంతమాత్రము నను మానము నహింపరాదు. మీ భార్యయైన యుదయపురి మా రాజ పుత్రులకందఱకును జెల్లెలివంటిది. ఆమె కెట్టి యాపదయు రానీయక మేము గాపాడెదము. మీకు ఢిల్లీనగరముపై నాశగలదేని, మీ సైన్యములనెల్లఁ గాపాడఁ దలంచెదరేని మా కందఱ కనుకూలముగ నీక్రింద వివరించు సంధుల కంగీకరింపుఁడు.

(1) "ప్రస్తుతము మీ స్వాధీనములోనున్న రాజపుత్ర రాజ్యములు ఎవరివి వారికి స్వాధీనము చేయవలెను. (2) మహమ్మదీయ మతమునఁ గలయుఁడని ప్రజల నెవ్వరిపై నెంతమాత్రమును బాధింప రాదు. (3) జిజియాపన్నుఁ బూర్తిగఁ గొట్టివేయవలెను. (4) బలవంత ముగ క్షత్రియకన్యలను వివాహము చేసికొనఁగూడదు." ఈ పద్ధతుల కంగీకరించినయెడల మిమ్ములను మీ భార్యతోడను సకల సైన్యముల తోడను ఢిల్లీ నగరమునకు విడిచెదము. లేనియెడల నీ పర్వత గుహాయే మీకు శాశ్వతమైన నివాసస్థలమని నమ్ముఁడు. ఎల్లకాలమును మీ యాడిన యాటలును పాడిన పాటలును సాగనేరవు. మా యనుమతి ప్రకారము సమ్మతింపనియెడల మీరును మీ వారును ఎన్నాళ్లయిన నీలోయలో నుండువారే! ఇందులకు సందేహములేదు. బాగుపడఁ దలంచితిరేని సత్వరముగ మాతో స్నేహము చేసికొనుఁడు. ఇంతకన్న వ్రాయవలసినవిలేవు. ఇందుపై మీ సమ్మతిఁ గనుఁగొని యందుల కనుకూలముగ మేము చర్య జరిపించెదము."

ఇట్లు వ్రాసి యా యుత్తరము లోయలోని కందిచ్చి ఔరంగ జేబున కందఁజేసెను. అతఁ డా యుత్తర మంతయుఁ జదువుకొని మహోగ్రహమొంది రోషమును బట్టలేక తన కాజాబు నొసంగిన తన భటుని తత్క్షణము కరవాలంబున ఖండించెను. ఎంతసాహసము? పాప మా యుత్తరమును జూచి యందువలనఁ దమకష్టమే మైనఁ దగ్గునేమో యని సైనికులందఱు నాశవహించిరి. కాని పాదుషా తన మూర్ఖపుఁ బట్టు విడువఁడయ్యె. ఔరంగజేబు తనకుత్తరమిచ్చిన వానిని ఖండించె నని విన్నతోడనే రాజసింహుఁడు మిక్కిలి కోపమునహించి వెను దీయక మొగలాయీలతోఁ బోరుఁడని తన సైనికులకుఁ గఠినముగ నాజ్ఞాపించెను. వాని యాజ్ఞప్రకారము రాజపుత్రులును భిల్లులును వారిపై శరవర్షము గురిపించి మగుల నొప్పించుచుండిరి.

అటు నయనపాలుఁడును శివసింగును భిల్లులతోఁ గూడి పర్వతముపైనుండి యుద్ధముసేయుచుండఁగా నొక ఫకీరెచ్చట నుండియో వచ్చి వా రిరువురను గలిసికొనెను. నయనపాలుఁ డాతనిఁ జూచి ఆశ్చర్యమొంది "మహాత్మా! మీ రెప్పుడు వచ్చితిరి?" అని పలుకరించి శివసింగును జూచి "మిత్రమా! ఈయన యెవరో నీ వెఱుంగుదువా? దుర్గాదాసునకును ఇందిరకును ప్రాణదానము చేసిన మహానుభావులు సుమా!" అని చెప్పెను. ఆ మాటలు విని శివసింగు అపరిమితానంద మొంది యా ఫకీరును గొనియాడెను. పిదప నయనపాలుఁడు ఫకీరుతో నేమేమో చెప్పుచు శివసింగుతోఁ గూడ నాతనిని గొంతదూరము వఱకుఁ గొనిపోయి యా ఫకీరుతో నిట్లు సంభాషించెను.

"అయ్యా! మీ రిచ్చటికేరాఁ గారణ మేమి?"

"నయనపాలా! రాజపుత్రులకుఁ దోడ్పడి యుద్ధము సేయ వలయునని బుద్ధి పుట్టినందున వచ్చితిని"

“అయ్యో! మే మందఱముండ మీకేటికీ ప్రయాస? ఇదిగాక మీరు యుద్ధముగూడఁ జేయఁగలరా?”

“ఓయీ! ప్రయాసకేమున్నది? మాయట్టివారికిఁ బరోపకారమే విధి. ఇంతియకాక లోకములోనున్న సౌఖ్యములన్నియు నే ననుభవించినందున ప్రాణములపై నాకసూయ జనించెను. యుద్ధములోఁ జచ్చినవారికి మోక్షము గల్గును గావున నే నిప్పుడు శత్రువులతోఁ బోరి నా ప్రాణములు విడిచెదను. మున్నొకసారి నేనోడుట కారణమున రిపులతో హోరాహోరిగఁ బోరి నా పరాక్రమ మంతయు లోకంబున వెల్లడి చేయవలయునని ప్రతిజ్ఞగూడఁ జేసితిని. కావున ఇప్పుడు మన మందఱమును గలిసి పోరొనర్చెదము రండు.” అని ఫకీరు యుద్ధసన్నద్ధుఁడై లేచి తాను ధరించిన పూసలపేర్లను పైనున్న కాషాయాంబరములను దీసి యట్టివేషములో డాఁగియున్న తన రాజపుత్ర స్వరూపమును వెలిపఱిచెను.

అంతలో ప్రచండ మార్తాండునివలె వెలుఁగుచు నాఁతఁడు యుద్ధరంగమునఁ జొరఁబడెను. అసహాయ శూరుఁడై యా ఫకీరు మొగలాయిలతో ఘోరముగ సమరము సలుపుచుండ వాని శౌర్యమును పరాక్రమమును జూచి శత్రువులనెల్ల నీతఁడొక్కఁడే నేఁడు నేల పాలొనర్చునా యని రాజపుత్రులును భిల్లులును ఆశ్చర్యమగ్న మానసులైరి. కాని యాతఁడెవ్వఁడో యచ్చటికి వచ్చుటకుఁ గారణమేమో యెవ్వరు నెఱుఁగరు అయినను ఇందిరా దుర్గాదాసులకుఁ బ్రాణదానముచేసిన ఫకీరాతఁడే యని మాత్రము వినినందున ఎల్లవారును వాని సద్గుణములఁ గొనియాడుచుండిరి.

# ముప్పదియొనిమిదవ ప్రకరణము

## బెబ్బులి పిల్లి యయ్యెను

ఆ మఱునాఁడు రాజపుత్రులకును మొగలాయిలకును బూర్వము కన్నఁ బోరు ఘోరమయ్యెను. నయనపాలుఁ డాగ్రహాతిశయమున నొడలెఱుఁగక పాదుషాపైఁ దన పగ సర్వమును దీర్చుకొనుచుండెను. ఎడతెఱపి లేకుండ భిల్లులను మఱింత ప్రోత్సాహపెట్టుచు నాతఁ డాదినమున నద్వితీయ పౌరుషమును శౌర్యమును వెల్లడించుచుండెను. మొగలాయీలు లోయలో నుండుటచేత పైనున్న భిల్లులకును రాజపుత్రులకును వారు విడుచు నాయుధములఁ దప్పించుకొనుట కవకాశము గల్గెను. అట్లని వారిలో నొక్కఁడును గూడ చావలేదని వ్రాయలేము. భిల్లులలోఁ గొందఱును రాజపుత్రులలో గొందఱును గూడ మొగలాయీలకుఁ దమ ప్రాణము లర్పించిరి. నయనపాలుఁడే తమకింత మోస మొనర్చెనని రోసము వహించి, ఆ లోయలోనుండి వీరభటు లనేకులు తమ యాయుధముల నొక్కుమా రాతనిపైఁ బ్రయోగించిరి ఆకస్మికముగ నందొక వాఁడికత్తి వానికంఠమును దెగనేసి తత్క్షణముననే నయనపాలుని వీరస్వర్గమున కంపి వేసెను. వెంటనే శివసింగును కొందఱు భిల్లులును వచ్చి యా కళేబరము చుట్టును మూఁగి నయనపాలుని మరణమునకుఁ జింతించిరి. కాని తొలుత దుర్మార్గుఁడయ్యుఁ బశ్చాత్తాప మొంది సన్మార్గుఁడై కడకు వీర పురుషోచితమైన మరణముఁ జెందెనని వా రందఱును నయనపాలునిఁ గొనియాడిరి. శివసింగు ఆ కళేబరమును భిల్లుల నెవ్వరిని ముట్టనీయక నలుగురు రాజపుత్రులను రప్పించి

ఆ శవమును వారిచే మోయించి యా పర్వతముపై దూరముగ నొక ప్రదేశమున నెంతో గౌరవముతో విద్యుక్త విధానంబున దహనక్రియఁ జేయించెను.

ఆనాఁడు మహమ్మదీయుల దీనావస్థను జూచి రాజసింహునకు జాలి జనించినను, పాదుషా మూర్ఖత్వ మాజాలిని దూరముగఁ దొలంగించి రోసమునే యంత కంత కధికము చేయుచుండెను. ఆహా! వాని సద్గుణము లెంత వర్ణనీయములు? అతని సత్యనిష్ఠకును, పరోపకార బుద్ధికిని దేశాభిమానమునకును దోడుగఁ బరాక్రమము బంగారునకుఁ బరిమళ మబ్బినట్లు రాణించుచుండెను. తనకుఁ బరమ శత్రువైన యౌరంగజేబు యొక్క భార్య తనకుఁ జేజిక్కినను నామె కెట్టి మోసమును గలుగకుండ రాజసింహుఁడు తన సహోదరివలెఁ గాపాడుచుండెను. తానెట్టి నైజగుణముగల వాఁడో యితరులు గూడ నట్టి నైజగుణము గలవారే యని భావించుట లోకంబున సహజమే కదా? ఉదయపురి కెట్టి భంగముగలుగఁ జేయుచుండిరో యని పాదుషా రాజపుత్రులపై ననుమానము వహించెను. కాని సంధి కొడంబడి చెఱఁ దప్పించుకొనుటకుఁ జిన్నతనమని యెంతకును సాహసింపఁడయ్యె. ఎప్పటికైనను రాజపుత్రులు తన్ను విడిచి పోయెదరేమో యని చూచుచుండెను. నిద్రయు నాహారమును లేక సైనికు లష్టకష్టములు పడుచుండిరి. ఆ ప్రకారముగ వారందఱును రెండు రాత్రులును రెండు పగలును నాలోయలోనే యుండిరి. కంటిపై రెప్ప వాల్చుటకైన నవకాశము లేక ఆ రెండు రాత్రులయందును మంచులో గడగడ వణఁకుచు నమితమైన చలి బాధ నొంది శుష్కించిరి. ఆ రెండు దినములలో నొక నిముసమైనను కూర్చుండఁ గల భాగ్యము వారిలో నొక్కరికిని లభింపలేదు. కాని కొందఱు సరదారులు కొంచెము ప్రక్క కొత్తిగిలి పాదుషాకు మాత్ర మొకచోఁ గూర్చుండుటకు సదుపాయము చేసి కూర్చుండఁ బెట్టిరి. బలహీనులై కాళ్లును

చేతులును గదల్ప లేక మొగలాయీ లెల్లరు క్షణ మొక యుగముగఁ బుచ్చుచుండిరి. మానవ కళేబరములు కుళ్లి దుర్గంధము గూడ జనించి నందున నా లోయ నుండుట వారికి మఱింత దుర్భర మయ్యెను.

ఇట్లు రెండు దినములు గడచి నంతనే మూడవనాఁటి యుద్ధమున నుజిల రాజపుత్రులు బోరఁ దొడఁగిరి. మొగలాయీలు తమశక్తి కొలఁది నా లోయలో నుండి కత్తులును తుపాకులును ప్రయోగించు చుండిరి. ఆనాఁ డుదయమునఁ దన పరాక్రమ మంతయు శత్రువుల మధ్య వెల్లడించుచున్న ఫకీరును రాజపుత్రు లెల్లరును జిత్రము జూచుచున్నటులు చూచుచుండిరి. రాజపుత్రులకు సహాయము చేయవలయునని మాఱు వేషము ధరించుకొని భూలోకమునకు వచ్చిన దేవ సేనాని యగు కుమారస్వామి యేమో యని యెల్లవారు నాతనిని జూచి భ్రమఁజెందు చుండిరి. శరీరమంతయు జల్లెడవలె కన్నములు వడి రక్త మోడుచున్నను ఆ ఫకీరు యుద్ధము మానఁడయ్యె. అందు వలన నాతఁడు తన ప్రాణములను యుద్ధ భూమిలో విడువ వలయునని కోరియే యంతటి సాహస మొనర్చుచుండెనని అందఱును భావించు కొనిరి. ఇట్లాఫకీ రనన్యసామాన్య పరాక్రమోపేతుఁడై యొకవంకఁ బోరుచుండ నా లోయలోనుండి శరవేగమున నొక కటారి యరుదెంచి యాతని శిరంబును గాఢముగఁ దాఁకెను. తోడనే పెద్దగాయము వడి యందులోనుండి రుధిరము ప్రవహించుచుండ నా ఫకీరు కొంత సేపటికి దన చేతిలోని ఆయుధమును క్రింద విడిచి యచ్చటనే మూర్ఛ బోయెను. ఆ సమీపముననే నిలిచి యుద్ధము సేయుచుండిన శివసింగు వానిగతిఁ దెలిసికొని పరుగు పరుగున వచ్చి వాని శిరముపైనుండి గాఱు రక్తమును ఒకవస్త్రము తోడ నొత్తి కొంతయుపచారము చేసెను. కాని పాపము ఫకీరుజీవనము వాని కనుమానాస్పదమే అయ్యెను. అయినను అచలేశ్వరునిపై భారము వైచి శివసింగు వానిని మెల్లగ నలువురుభిల్లులచే మోయించి ఆ పర్వతముపై నచలేశ్వ

రాలయమునకుఁ గొంతదూరమున నున్నయొక పెద్దవృక్షముయొక్క- చల్లని నీడయందు, ఒకచోట నాకులతోడను గడ్డితోడను మెత్తగనొక శయ్యవలె నిర్మింపించి యాఫకీరు నందుపై భద్రముగఁ బరుండఁ బెట్టించెను. శివసింగు తాను తొందరగ యుద్ధమునకుఁ బోవలసిన వాఁడగుటచే నాఫకీరువద్ద నొక భిల్లునిఁగాపుంచి వానికి జాగ్రత్తయని బోధించి తాను మఱలఁ దన పనిమీఁదఁ బోయెను.

అచ్చట లోయలో మహమ్మదీయులును పైనుండి రాజపుత్రులును బోరాడుచుండ నింతలో మార్తాండుఁడు నభోమండల మధ్యమునకు వచ్చి తీక్ష్ణముగఁ బ్రకాశించుచుండెను. సూర్యరశ్మిచే నాలోయలోనున్న రాలన్నియుఁ గ్రాఁగి కాఁగి ముట్టుకొనుట కగ్నిహోత్రమువలెఁ గడు తీవ్రముగ నుండెను. ఎండవేడిమిచే శిరములు కాఁగినందున నాబాధదుర్భరమై దోఁప మొగలాయీలు చిందఱవందర పడుచుండిరి. క్రమమును, ఆజ్ఞయు, అధికారులవలన భయమును బాటింపక సైనికులందఱు నొకరినొకరు లక్షింపక యెవరికిఁ దోఁచిన సదుపాయము వారుఁ జేసికొనుచుండిరి. కడకు వారందఱును దమ ప్రాణములు విసిగినందున భయమును విడిచి "సర్కార్! ఇంక రెండు ఘంటల కాలమిట్టులే యున్నయెడల మా ప్రాణముల మే మందఱమును విడుచువారమే! కావున మేమీలోయలో నింక నుండఁజాలము. పిదప మీచిత్తము" అని ఔరంగజేబుతోఁ గట్టిగా నొక్కి చెప్పిరి. అప్పుడు పాదుషాకు వారందఱిపై నపరిమితాగ్రహము జనించెను. కాని కడకుఁ గేకలు వేయుటకునుగూడ వానికి శక్తిలేకపోయెను. శరీరమునఁ బ్రాణములుండిన రాజపుత్రులపై నెప్పటికైనఁ బగఁ దీర్చుకొనవచ్చునని యెంచి, తన దీనావస్థను దలంచుకొనుచు అప్పటి కాసంధి కొడంబడి రాజసింహునకుఁ గబురంపెను. అప్పుడు రాజసింహుఁడు సంతసించి, మొగలాయీలెల్లరును దమ యాయుధముల నాలోయలోనే విడిచి నిరాయుధులై వెలుపలికి రావలయుననియు, ఢిల్లీనగరంబున కేగుచు మార్గమధ్యంబున

నరన్యాములంగల జంతువుల నకారణంబుగఁ జంపి జీవహింస సేయఁగూడ దనియుఁ బాదుషాను మఱలఁ గబురంపెను. ఆ పద్ధతులకుఁ గూడఁ బాదుషా యొడంబడెను. తోడనే రాజసింహుఁడు తన సైనికులను ద్వారముకడ్డముగ నుండక ప్రక్కకేగవలయునని యాజ్ఞాపింప రాజపుత్రులందఱును దూరముగఁబోయి మార్గమును విడిచిరి. మొగలాయి సైనికులందఱును దమ యాయుధములఁ గ్రిందఁ బడవైచి, బైటఁబడినఁ బ్రాణములు దక్కునని యొక్కొక్కరివలికి రాఁదొడంగిరి. వారిని జూచుటకై కొండలపైనుండి దుర్గాదాసును, శివసింగును, భిల్లులును, రాజపుత్రులును అచ్చటికివచ్చి మూఁడు దినములనుండి నిద్రాహారములు లేక సుష్కించి కొయ్యబొమ్మలవలె నోటమాటలేక నిలిచియున్న పాదుషా సైనికులఁజూచి, తమలోఁ దాము నవ్వుకొనసాగిరి. నున సామల్ పండితుఁడు గూడ నచ్చటికివచ్చి చిందులు ద్రొక్కుచు గంతులు వేయుచు, చప్పటులు చఱచుచు "కె—బ్బలి—పిల్లి—య—య్యెను. నేఁడు—" అని పాటపాడ నారంభించెను.

ఆతఁడు పాదుషా దీనావస్థనంతయుఁ జూచి నవ్వుచు నిట్లాక్షేపింపఁ దొడఁగెను.

సీ. పేరాసగల్గించి మూరాదు నాథుఁడు
  గూల్చిరాజ్యంబును గొనుటగాదు
మున్నా శివాజిని మోసంబు గావించి
  దుడుకునఁ జెఱలోన నిడుటఁగాదు
విషవస్త్రములనిచ్చి పృథివిసింగునునాఁడు
  కటకటాబల్మిఁ జంపుటయుఁగాదు
రహింజోధపురమహారాజ్ఞి చంద్రావతిన్
  మునికొని చెఱపట్టఁ గనుటగాదు,
గీ. విజయసింహుని కూతురౌవిమలనిటులఁ
  బలిమిఁ గొంపోయి పెండ్లాడఁ దలఁచినీవు

రూపనగరంబునందుఁ జేరుబయుఁగాదు
రాజసింహుని తోడవైరంబు నీకు,

అని గంతులు వేయుచుఁ బాడ నారంభించెను. వానినిజూచి రాజపుత్రు లెల్లరు పకపక నవ్వసాగిరి.

మొగలాయి సైన్యములన్నియు వెలుపలికి వచ్చినంతనే పాదుషా ఆ ప్రాంతమున నొకచోట గుడారములు వేయించి తన సైనికులనందఱను నాదినమున కంమఁడ నాజ్ఞాపించెను. పాదుషా తన గుడారమునను౦డ రాజసింహుఁడు ఆతని జనానా గడుభద్రముగఁ గొందఱు సేవకుల వెంటనంపి పాదుషా కప్పఁజెప్పెను. ఇంతియకాక సైనికుల కెల్లరకు సరిపడు భోజనసామాగ్రినంపి రాజసింహుఁడు వారందఱ నెంతో గౌరవించెను. సైనికు లెల్లరును నా పదార్థములు గడుపార భుజించి "ఆహా! ఏమి రాజసింహుఁడు? ఆతనికి శత్రువులును మిత్రులును నొక్కటియేకదా" అని వాని యౌదార్యమును వేనోళ్లఁ గొనియాడ సాగిరి. వారి పొగడ్తలన్నియుఁ బాదుషా విని తనలో నేమేమో గొణఁగుకొనుచుండెను. ఆపూటకు పాదుషా అచ్చటనేయుండి శ్రమఁ దీర్చుకొని తన సైనికుల కందఱకును విశ్రాంతిఁ గలుగఁజేసి పిదప ఢిల్లీ నగరమునకు బయలుదేఱఁ దనవారి కాజ్ఞాపించెను. సైనికు లెల్లరును వాని యాజ్ఞపైఁ బ్రయాణ సన్నద్ధులై ఢిల్లీనగరమునకు బయలుదేరిరి. పాదుషా తన సైన్యములతో బయలుదేఱి కొంతదూరము పోవునంతవఱకును రాజసింహుఁడు తన సైన్యములతో నచ్చటనే యుండెను.

# ముప్పదితొమ్మిదవ ప్రకరణము

## ఆ ఫ కీ రె వ్వఁ డు ?

"ఆహా! దైవమాయ యెంత చిత్రముగ నుండును! పావనంబగు రాజపుత్ర వంశంబునఁబుట్టి సౌఖ్యమెఱుఁగక నేఁటివఱ కెన్నియో కష్టములనుభవించుచుంటిని. సహజమగు పౌరుషమును బాయలేక మగఁడు యుద్ధములోనోడి వచ్చినంతమాత్రమునఁ జంద్రావతితో నేకీభవించి నగరద్వారములు మూయించి ఆయనను లోనికి రానీయక అనరాని మాటలాడి నే నేల పరాభవింపవలయు? ఆ మహామహుఁడు శౌర్యము దెచ్చుకొని జోధపురమున నుండక యెచ్చటికిఁ బాఱిపోయెనోగదా? పిదప నేను జేసిన యపరాధమునకుఁ బశ్చాత్తాప మొంది యెంత వెదకించినను ఎచ్చటను ఆయన జాడలేదయ్యె. నేఁటికిఁ బండ్రెండేండ్లు గావచ్చెను. ఇసీ! పతిలేని నాజీవనమజీవనమేగదా? స్త్రీలింతటి సాహసము వహించినఁ బురుషులు సహింతురా? జయాపజయము లెప్పుడు నొకరి స్వాధీనములా! ఈసంగతి నెఱింగియు నిష్కారణము దొందరపాటు వహించి ఆయనకవమాన మొనర్చి పాపము దెచ్చుకొంటిని. ఇదియే నా జన్మమునకుఁ గలిగిన ఫలము.

ఒక్కచోటయినను స్థిరముగ నుండక నాయునికి యింత చంచలముగ నుండుట నానామము నాకు సార్థకమైనది. ఇంక నన్యచింతలతో నాకేమియు నవసరము లేదు. మఱల నాపతిని గన్నులారఁ జూచెద నన్నమాట కలలోనివార్త. ఇన్నాళ్లవఱకుఁ గానరానివాని పైనింక ఆశయుంచుకొనిన నేమిలాభము? రాజపుత్రులకు జయంబుగల్గినదికదా?

మా చంద్రావతి కడుసౌఖ్యముగనున్నది. విమల తాను వరించిన వానిని జేపట్టినది. ఏవిధమైన విచారమును నాకు లేదుకావున నేనింక నీ సంసార సౌఖ్యములపై నాశవిడచి, మహానుభావుండైన వైకుంఠ యోగి యనుగ్రహమున భార్గవీమంత్ర ముపదేశ మొంది సన్యాసినినై వానితో నేను గూడ నీ పర్వతముపై తపముచేసికొనుచు కాలము గడుపుచుండెదను. ఇంతకన్న నాకింకేమి కావలయు ? ఆహా ! పతిభాగ్యము నాకీజన్మమున నింకలేనప్పు డీ సన్న్యాసినీ వ్రతమే యుచితము కదా ?"

అని యిందిర అజితసింగు నెత్తుకొని వాని వీపుపై జోకొట్టుచు ఆబూపర్వతముపై నిటు నటు, చల్లగాలిలోఁ బచారు సేయుచుఁ దనలో ననుకొనుచుండెను. అప్పటికి రెండుదినములనుండి వైకుంఠయోగి అంతర్ధానమొందినందున నా పర్వతముపై నాతనిజాడలేదు. యోగి వద్దఁ బ్రవేశించి నప్పటినుండియు నా సాధ్వి ప్రతిదినమును అరణ్యమునఁ గల పుష్పములును ఫలములును గొనివచ్చి కడుభక్తితో వైకుంఠ యోగికిని, ఆ కొండపై నచ్చటచ్చట తపముచేసికొనుచుండిన బైరాగులకును సమర్పించుచుండెను. ఆ కారణమున వారందఱు గూడ నామె శుశ్రూష కెంతయు సంతసించుచుండిరి. స్త్రీలు ఉపదేశమొందఁ దగిన మంత్రములామె మెల్ల మెల్లగా వారివలన నుపదేశ మొందు చుండెను.

ఒక్కొక్కప్పుడు బైరాగులందఱును నొకచోఁ గూరుచుండి తులసీరామాయణముఁ జదువుకొనుచుండ మన యిందిర అచ్చటికేఁ బోయి శ్రద్ధతో వినుచుండెను. అప్పుడప్పుడు వైకుంఠయోగి, ఇందిరకు సంసారమునఁగల చింత నివారించి మనసునకు సమాధాన కరమైన విషయము లామెకు బోధించుచుండెను.

ఇట్లు కాలముగడపుచు నిందిర ఆ నాటి సాయంకాలము వైకుంఠయోగి రానందుకుఁ గారణమేమోయని వానికై యెదురు

చూచుచు నా కొండపై సంచారముసేయుచు నాలయమును విడిచి కొంతదూరము పోవ నప్పుడొక ప్రక్కనుండి "ఊ-ఊ-ఊ" అని యొకవిధమైన మూలుగు ఆమెకు వినంబడియెను. తోడనే యామె దిగులుపడి ఆ కొండపై మూల్గుచున్నవా రెవ్వరో యని నలువంకలు వెదక నొకవృక్షముచెంతఁ బర్ణశయ్యపై నొకపురుషుఁడు కాయమెల్ల గాయములచే నిండిరక్తము గాఱుచుండ బాధపడుచు మూల్గుచుండుటఁ జూచి తత్క్షణమె యచ్చటికిఁబోయెను.

ఇందిర అచ్చటఁ గాపుండిన భిల్లునిఁజూచి "ఓయీ! యీ పురుషుఁడెవ్వఁడు ? పాపమిట్లు మూలుగుచుఁ బరుండుటకుఁ గారణమేమి ?" అని యడుగ నా భిల్లుఁడు "అమ్మా! ఈతఁడొక రాజకుమారునివలెఁ దోఁచుచున్నాడు. వీనిచరిత్రమంతయు నద్భుత ముగనున్నది. ఫకీరు వేషము వేసికొని వచ్చి రాజపుత్రులకుఁ దోడై ఘోరయుద్ధము చేసెను. ఆహా! ఏమి పౌరుషము! ఎంతపరాక్రమము! చూచి తీరవలయునుగాని వర్ణించుటకు శక్యముగాదు. పాపము యుద్ధములో శరీరమంతియు గాయములు పడినందున మూర్ఛిల్ల మా ప్రభువుగారు వీనినిచ్చటికిఁ దెప్పించి భద్రముగానుంపించి నన్నిచ్చటఁ గాపుండ నియమించి వెడలిపోయిరి." అని చెప్ప ఇందిర వాని చెంతకుఁ బోయి యాతఁ డెవఁడోయని పరికించెను. తోడనే ఆమె హృదయమున నేదియో సంగతి జ్ఞప్తికి వచ్చినందున నామె మీఁదివైపునకుఁ జూచి కనుబొమలు దరిఁజేర్చి ఏమో దీర్ఘాలోచనము చేసి, తనలో నేమని భావించెనో గాని "అయ్యో! నాకంత భాగ్యమా ? లోకమున మనుజునిఁ బోలిన మనుజు లెందఱుండరు ? ఇంతకు నీ యుద్ధమునకు వచ్చుటకు ఆయనకేమి యవసర మున్నది ?" అని లోలోన ననుకొనఁదొడఁగెను. ఆ రాజపుత్రునిబాధ నంతయుఁ జూచి ఇందిర జాలి వహించి, "అయ్యా! మీ కేమి కావలయు ?" అని వాని నడిగెను. పాప మా క్షత్రియవీరుఁడు కన్నులు దెఱవలేక

మూల్గుచు "దాహము ? దాహము" అని నీరు దెమ్మని సంజ్ఞచేసెను. తోడనే యిందిర బాలునచ్చట విడిచి వాని ముందఱనొక ఫలముఁ బడవైచి నీరుదెచ్చుటకై పోయెను.

ఆ బాలుఁడు తన రెండు చేతులతో నా ఫలమును బట్టుకొని నోటిలోఁ బెట్టుకొనుచు ఆడుకొనుచుండెను. ఇంతలో నొక మొగలాయిభటుఁడు తన చేతిలో నొక ఖడ్గమును ధరించి, అట్టహాసము సేయుచు "ఓరి దుష్టాత్మా! నిష్కారణముగ నా తమ్మునిఁ జంపి నందుకు నీకుఁదగిన శిక్ష అయినదా ? నిన్ను విడువక నీ చెంతనున్న బాలునితోఁగూడ నా కసిదీర నిన్ను ఖండించెదను జూడుము" అని బిగ్గరగా నఱచుచు నెంతో శ్రమపడుచు నా కొండపై నొక ప్రక్క నుండి యాతనిపైకి ఆతురతతో వచ్చుచుండెను. అప్పుడు రాజ కుమారునివద్దఁ గాపుండిన భిల్లుఁడు, ఆ కేకలు విని తటాలున లేచి యొకపటువైన దండాయుధము గైకొని పరుగున వచ్చుచున్న మహమ్మదీయుని నిముసములోఁ బోయి దాఁకి, వానిని బలవంతముగఁ గొంతదూరము జుట్టుపట్టి యీడ్చుకొనిపోయి యొకచాటునఁ గలహింపఁ బోడఁగెను. వారిరువురకుఁ గొంతసేపు పోట్లాట జరిగిన తరువాత, భిల్లుఁడు తన సాహసము విశేషముగఁ జూపెనుగాని కడకా తురకవాని చేతిలోఁ బ్రాణములు గోల్పోవలసిన వాఁడయ్యెను. ఆ భటుఁడు భిల్లునిఁ బరిమార్చి "ఓరి భీరువా : నాకడ్డముగా వచ్చెదవా ? వచ్చి నందులకు నీకుఁదగిన శిక్షయైనదిపో!" అని యా కళేబరమును జూచి రోషాతిశయమున నోడలెఱుంగక ప్రేలుచు, నచ్చటినుండి మఱలఁ బెద్దకేకలు వేయుచు నా రాజకుమారుని వంకకు వచ్చుచుండెను. గాయములచే బాధపడుచు మూలుగుచుఁ బరుండియున్న రాజ కుమారుఁడు వాని కేకలును, పౌరుషము-ను బుట్టించెడు మాటలను విని, అవి తనహృదయమున శూలములవలె నాటఁ దటాలునఁలేచి చెంతనున్న వాడియైన ఖడ్గమును దీసి యెదురుగ వచ్చుచున్న

భటునిపై మహారోషముతో విసరెను. ఆ దెబ్బ గాఢముగ మెడపైఁ దగిలినందున నేలపైఁ బడి కొన్ని నిముసముల కాతఁడు తానుగూడఁ దనతమ్మునిఁ గలిసికొనెను. ఆయాసము మఱింత యధికమైనందున నా రాజకుమారుఁడు తెలివిదప్పి క్రిందఁబడి మూర్ఛిల్లెను.

ఇందిర నీరముకై కొంతదూర మేగి యొకచెట్టునుండి కొనిచి యాకులను దీసి పెద్ద దొప్పయొకటిచేసి దానిలో నీరమును బోసి తిరిగి వచ్చుచుండెను. దూరముననుండియే ఆమె, అచ్చటఁ బడియుండిన మృతకళేబరమును రక్తమును జూచి తత్తరపడి బాలునికెట్టి యాపద సంభవించెనో యని పరుగు పరుగున వచ్చుచుండెను. ఆమెను జూచి మన యజితసింగు తన కాళ్లను చేతులును ఆడించుచు మందహాసము సేయుచు మెల్లగ నామె కెదురుగఁ బ్రాఁకుచుండెను. వానిని జూచి ఇందిర తన యాందోళనము గొంత తగ్గించుకొని ఆ రాజపుత్రుని సమీపించి, మూర్ఛిల్లి యుండినందున నాతని మొగముపైఁ గొన్ని చల్లని నీళ్లుజల్లి పిదప నోటిలోఁ గూడ నిన్ని పోసెను. ఆ యుపచారముల వలన నాతఁడు కొంతసేపటికి మూర్ఛనుండి తొలఁగి తనకడుపునిండ మఱింత నీరుద్రాగి యించుక బలము గలిగినవాఁడై పెద్దనిట్టూర్పు విడిచెను. తనకింత మహోపకార మొనర్చిన వారెవరోయని యా రాజవీరుఁడు కన్నులు తెఱచి చెంతనున్న యిందిర నా పాదమస్తకమును తెప్పవాల్పక జక్కఁగఁ దిలకించి తన యొడలంతయు నొక్క మాఱుగ జల్లుమన "హా! ప్రేయసీ! ఇందిరా! ఇందిరా! నీవు నన్నింకను బోల్చుకొనలేదా?" అని మరల మూర్ఛిల్లెను. ఆమాటలు విని యిందిర అద్భుతమొంది, అదివఱకుఁదాను గుర్తెఱింగియున్న యుంగరము వానిచిటికెన వ్రేలఁజూచి, తన మగఁడేయని తెలిసికొని, "హా! ప్రాణేశ్వరా! నేనెంత యవివేకురాల నైతిని? ఎన్నాళ్లకు మీదివ్యదర్శన భాగ్యము నాకు లభించినది?" అని వాని శిరమును దన తొడపయి నిడికొని పలువిధముల విలపింపఁజొచ్చెను. తన

భార్య కన్నుదోయినుండిగారు దుఃఖ బాష్పములలో రూప్‌సింగు మజ్జనమాడుచు, తెలివిఁ దెచ్చుకొని "ఇందిరా! యుద్ధములో నోడి పాఱిపోయి వచ్చినందులకు నా యపరాధమును ఇప్పుడైనను క్షమించితివా లేదా?" అని యడుగ ఇందిర "నాథా! ఇంక నిష్ఠురోక్తులాడక నా యవివేకమునకు క్షమించి నన్నాదరింపుఁడు." అని వగచుచు బతిమాలెను. అందులకు రూప్‌సింగు "ప్రేయసీ! విచారింపకుము! అచలేశ్వరునకు మనపై ననుగ్రహముగలదు. అంత్యకాలముననైనను నిన్నుఁ జూడఁ గల్గినందులకుఁ సంతసించితిని. నాకంతకంతకుఁ దాప మధికమగు చుండెను. ప్రాణములుండునని తోఁపదు నీవు ధన్యురాలవైతివి. నీరాజ విశ్వాసమంతయు వెల్లడించి జోధపురమును గాపాడి శాశ్వతమైన కీర్తివహించితివి. నీ సమాచార మంతయు నే నిదినఱకే విన్నాఁడను. నీ జన్మము సార్థకమైనది."

ఆ మాటలన్నియు నిందిరవిని, పెక్కు సంవత్సరముల నుండియుఁ గానరాని తన కాంతుఁడు గానవచ్చెనని యత్యానందమును, ఆతఁడు జీవించునో జీవింపఁడోయని యత్యంత విచారమును వహించి కలఁతఁ జెందుచుండెను. అప్పుడు రూప్‌సింగు,

"ఇందిరా! విచారింపక ధైర్యముఁ దెచ్చుకొనుము. నాఁడు నగరద్వారములు మూయించి నీవు నన్ను గెంటించి నప్పటినుండియు నే నెచ్చటనుంటినో యెఱుఁగవుగదా?"

"నే నేమియు నెఱుఁగను. నేను జేసిన యపరాధమును క్షమింపుఁడు. దేశమంతయు మీకై వెదకించితిని. యశవంతసింహ మహారాణాగారుకూడ స్వయముగ మీకైఁ బ్రయత్నించిరి. కాని యేమియును గార్యములేకపోయెను."

"ఇందిరా! నేనిన్నాళ్లవఱకు గోలకొండ నవాబువద్ద సరదారుగ నుంటిని. ఆతఁడు నన్ను మిక్కిలి గౌరవముచేసి మన్నించుచుండెను. ఔరంగజేబు సైన్యములు సిద్ధముచేసికొనుచుండెనని కొన్నిదినముల క్రిందట నొక బ్రాహ్మణుఁడు వచ్చి మాదన్నపంతులతోఁ జెప్ప నాతఁడారహస్యమేమియో కనుఁగొని రమ్మని నన్ను ఢిల్లీనగరమునకుఁ

బంపెను. నేను మాఱువేషములు వేసికొని ఢిల్లీనగరమున సంచరించుచు నచ్చటిసంగతులు గనుఁగొని, "ఔరంగజేబువలన మన కేమియుఁ దొందరలేదు గావున ఊఁరక తాపత్రయ మొందనవసరము లే"దని గోలకొండ కుత్తరమును వ్రాసి నేను గొన్నినాళ్లవఱకు ఢిల్లీ నగరమందే యుంటిని. జనానాలో సంచరించుచు ఒకనాఁడు నిన్నుఁ జూచితిని. రోషన్ఆరా బారినుండి నిన్నును మీ యన్నను నేనే కాపాడితిని. ఈ యుద్ధములో నాప్రతిజ్ఞఁ గొనసాగించుకొనవలయునని యిచ్చటికి వచ్చి నా పరాక్రమముఁ జూపితిని. నా శౌర్యమంతయు నీకుఁ దెలిసినదిగావున నేను బ్రతికినను సరే! చనిపోయినను సరే!"

అని తన వృత్తాంత మంతయుఁ జెప్పెను. ఇంతలో భగవాన్ వైకుంఠయోగి ఆ కొండపై నెత్తుగల భాగమున వృక్షముల మధ్యనుండి వచ్చుచుండెను. ఆతఁడు దూరముననుండియే ఇందిరను రూపసింగును జూచి తనలో నేమియో తలపోసి వారిని సమీపించి సంతోషముతో "వత్సా! రూప్‌సింగ్! నీవు విచారింపకుము. తనయా! ఇందిరా! నీవింక ధన్యురాలవు. ఈతఁడు నీ హృదయేశ్వరుండని యిదివఱకే నీకుఁ దెలిసి యుండును! నేను దివ్యజ్ఞానమువలన నంతయు గ్రహించితిని. నీవరుని గాయములన్నియు నేను త్వరలో మాన్పెదను. వీనికిఁ బ్రాణ భయములేదు. ఇంతకు నచలేశ్వరస్వామివారి యనుగ్రహముండ నేమి కొదువ? నే నెఱుఁగని ఔషధములులేవు." అనిచెప్పి కొన్ని యాకులను దీసికొనివచ్చి వానినుండి పసరుదీసి రూప్‌సింగు గాయము లకుఁ బట్టించి, కట్టుగట్టి పిదప నేదియో యొక వేరుగొని వచ్చి దాని రసము నాతనికిఁ ద్రాగనిచ్చెను. వైకుంఠయోగి యౌషధ ప్రభావము వలనఁ గొంతసేపునకు రక్తముగాఱుట యాఁగి మన రూప్‌సింగు బలముగ్గల్గి తెప్పిరిల్లెను.

ఇంతలో శివసింగును వెంటఁబెట్టుకొని దుర్గాదా సచ్చటికే వచ్చెను. ఇతఁడు తన చెల్లెలితొడపై శిరంబిడుకొని పరుండి యున్న వాఁడెవఁడోయని యోచించుచు వారిని సమీపించి, తోడనే యిందిర సిగ్గుపడి తలవంచుకొనెను. ఆచిత్రమంతయుఁ జూచి వెలవెలఁ బోవుచున్న